అట్టలోపలి వైపున అచ్చు వేసిన శిల్పచిత్రంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమబుద్ధుని తల్లియైన మహారాణి మాయా దేవి కన్న స్వప్నం గురించి జ్యౌతిషికులు వ్యాఖ్య చేస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువ వారి వ్యాఖ్యను వ్రాసుకొంటున్న లేఖకుడు కనిపిస్తారు. భారత దేశంలో లేఖన కళ చిత్రశిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీన తమమైనది.

నాగార్జున కొండ క్రి. శ. 2 వ శతాబ్దం.

జాతీయ పురావస్తు ప్రదర్శనశాల, న్యూఢిల్లీ, వారి సౌజన్యంతో.

# తెలుఁగు కావ్యమాల

సంకలనము
కాటూరి వేంకటేశ్వరరావు



సాహిత్య అకాదెమి. న్యూఢిల్లీ

*Telugu Kavyamala* (An Anthology of Telugu Poetry) Compiled and edited by Katuri Venkateswara Rao. Sahitya Akademi, New Delhi. Price Rs. 30/-

First Edition 1959, Second Edition 1976, Third Edition 1986



ప్రథమ ముద్రణ : 1959

ద్వితీయ ముద్రణ : 1976

తృతీయ ముద్రణ : 1986

**సాహిత్య అకాదెమీ**

ప్రధాన కార్యాలయం :

రవీంద్ర భవన్, న్యూ ఢిల్లీ–110 001.

ప్రాంతీయ కార్యాలయాలు :

29, ఎల్డామ్స్ రోడ్, తేనాంపేట, మద్రాస్–600 018.

బ్లాక్ V-బి, రవీంద్ర స్టేడియమ్, కలకత్తా-700 029.

172, ముంబయీ మరాఠీ గ్రంథ సంగ్రహాలయ మార్గ్, దాదర్, బొంబాయి-400 014

*Printed at :*



**Weldun Press, Offset Printers**

*2, Dr Radhakrishnan Nagar,*
*Ist Street, Madras-600021*
*PHONE 551658*

# నివేదనం

ఆంధ్రసాహిత్యస్రవంతి ఏ కొండకోనలలో, ఎప్పుడు పుట్టిందో — ఏ దుర్గమారణ్యాలలో పారాడి, ఏ గుట్టలను చుట్టి, ఏ లోయలను నింపుతూ నడయాడిందో — త్రోవలో ఏ యేళ్లతో కోళ్లతో చెలిమి చేసి, ఆడుతూపాడుతూ బలిసి, తుళ్లింతలాడిందో — కాని వేయేండ్లక్రితం చాళుక్యరాజరాజు ఆస్థానంలో సర్వాంగసుందరంగా దర్శనమిచ్చింది. అదిమొదలు నేటివరకు అడుగడుగు నిక్షేపంగా, క్రొత్తక్రొత్త రుచులతో సరసుల నలరిస్తూనే ఉంది. ఆ మహా తీరంలో పలువన్నెలతో విరిసి, తావులు వెదజల్లే శతపత్రాలను, సహస్రపత్రాలను, ముగ్ధమధురముకుళాలను పుణికితెచ్చి, మాలికారచనచేసి, శారదాచరణములం దర్పించే సత్కార్యభారాన్ని భారతసాహిత్యఅకాడెమీ నామీదపెట్టింది.

ఈ కావ్యమాలను నేను మూడుపేటలుగా గ్రుచ్చితిని. [క్రీ. శ. 11 వ శతాబ్ది మొదలుకొని 15 వ శతాబ్ది అంతంవరకు నడచినసాహిత్యం మొదటిపేట. 16 వ శతాబ్ది ఆదినుండి 1850 వరకు నడచింది రెండోది. 1850 మొదలు నేటి వరకు దొరకేది మూడోది.]

## 1. పురాణేతిహాసాలు 1000-1500

మొదటి 500 ఏండ్లలో సంస్కృతపురాణేతిహాసాలు, వానిలోని భాగాలు ఆంధ్రమున గద్యపద్యాత్మకంగా అనూదితమైనవి. ఉత్తరరామాయణ మొక్కటిమాత్రం నిర్వచనం. ఈ తెలుగుసేతలు మూలకథాప్రధానంగా నడచినవి కావడంవల్ల ఆంధ్రమున వెలసిన స్వతంత్రకావ్యాలవలె ఉంటవి. భారత కవులది ప్రసన్నగంభీరమైన శైలి. కథాకథనమందు, పాత్రచిత్రణమందు వీరు ప్రవీణులు. మర్త్యమున కవతరించే దివ్యులు, దివ్యలోకాల నధిరోహించే మర్త్యులు గలసిమెలసి చరించే కృతత్రేతాద్వాపరాలను వీరు మనకు ప్రత్యక్షం చేయగలరు. సురాసురయుద్ధసంక్షోభాలు, రాజకులకలకలం ఒకవంకా, హోమ ధూమావృతాలైన తపోవనభూములందలి పవిత్రజీవనసారళ్యం, ముగ్ధజానపద మాధుర్యం ఒకవంకా వీరి కావ్యములందు మనం దర్శించుతాము.

ఈ తెలుగుసేతలలో నన్నెచోడదేవుని కుమారసంభవం స్వతంత్రత వహించి, వర్ణనాబహుళమగు శైలీకవితలకు దారి త్రొక్కింది. పిమ్మట నాచన సోమన, శ్రీనాథుడు మున్నగువారు ఆదారి నింకను క్షుణ్ణమొనర్చి, సంస్కృత పురాణేతిహాసాలను తెలుగున చిక్కని కావ్యపాకాన దింపిరి. కథాకథనముపై కంటె అలంకారశిల్పముపై, ప్రసాదముపైకంటె ఓజోగుణముపై వీరి కెక్కువ మక్కువ. సంస్కృతకావ్యభాగాలను వలసినంతవట్టు స్వేచ్ఛగా తెనిగించు

కొంటూ కావ్యాలు నడపడం, సంస్కృతనాటకాలను శ్రవ్యకావ్యములుగా రచించడం సాగుతూవచ్చింది.

ఈ కాలమందే దేశీయమైన ఇతివృత్తాన్ని, ఛందాన్ని, వ్యవహారసిద్ధమైన భాషను గ్రహించి పాల్కురికి సోమనాథుడనే ఉద్దండకవి స్వతంత్రకావ్య రచనంచేసి శైవమతాన్ని ప్రచారంచేయడం జరిగింది. ద్విపదచ్ఛందంలో నడచిన సోమనికావ్యాలలో కథాగమనం, భక్త్యావేశం ఒండొంటి మించి సాగిపోవును. పోతనభాగవతంకూడ ఇట్టి భక్త్యావేశంతో రచితమైనదే. అద్భుత కథాకల్పనంతో, దానిని మీరిన సంవాదచాతురితో నడచిన భోజరాజీయమనే కావ్యంకూడ ఈ కాలంలోనే వెలసింది.

కాకతీయరాజధానియైన ఓరుగల్లునగరాన్ని, అచటి ప్రజల ఆచారవ్యవహారాలను, హాస్యరసంతో పొదిపి వర్ణించే క్రీడాభిరామ మనే వీథీ, పలనాటి వీరులకథను ద్విపదలలో చెప్పిన వీరకథాకావ్య మొకటీ ఈ కాలపు రచనలలో విశిష్టములుగా పేర్కొనదగినవి.

ఈ 500 ఏండ్లలో ఆంధ్రసాహితి నలంకరించిన ఈ మహామహులలో పెక్కుమంది సంస్కృతగ్రంథాలను తెలుగుచేసినవారే అయినా వీ రందరు ప్రతిభావంతులగు స్వతంత్రులు కావడంవల్ల మూలమందలి అనౌచిత్యాదులను పరిహరించి, దానికి మెరుగులుకూడా దిద్దుతూవచ్చారు. వీరిలో ఆద్యులందు కన్పించే భావసంయమం క్రమంగా కొరవడి, వర్ణనాబహుళములు, రీతిప్రధానములు అయిన కవితలకు ప్రాముఖ్యం కలుగుతూవచ్చింది. భారతకవులు రాజులకు గురుత్వం వహించిన ధర్మోపదేష్టలు. రామచంద్రైకజీవనుడగు పోతనను వదలిపెట్టితే తక్కినవా రెల్ల రాజబంధువులు, రాజమిత్రులు నై రాజభోగాల కలవాటు పడినారు. వీరి కావ్యములలో దివ్యులకు మానవలక్షణా లబ్బినట్లు కన్పిస్తుంది.

గేయకవితలకు ప్రథమాచార్యుడై, శ్రీవేంకటేశ్వరస్వామి వైభవాన్ని సహస్రముఖాల సంకీర్తనం చేసిన అన్నమాచార్యు లీకాలమువాడే. అన్నమయ్యా, ఆయనవంశీయులు దేశికవితాభేదములను పెక్కింటి రచించుటేకాక విన్నపములనే వృత్తగంధివచనములచేగూడ స్వామిని స్తుతించిరి.

## 2. క్రీ. శ. 1500—1850

మొదటిపేటలో ఆంధ్రీకరణాలవలె దీనిలో స్వతంత్రకావ్యాలు ఎక్కువ. సాహిత్యసమరాంగణసార్వభౌముడు, మూరురాయరగండడు అయిన కృష్ణరాయల చల్లనిఏలుబడిలో కవులకు రాజభోగాలు, ప్రజలకు సుఖశాంతులు లభించినవి. ఆ దివ్యముహూర్తాన సర్వలక్షణసంపన్నమైన స్వతంత్రకావ్యం ఆంధ్రభాషయందు ఆవిర్భవించుటేకాక 'దేశభాషలందు తెలుఁగులెస్స' అనే బిరుదం కూడా ఆంధ్రభాష ఆర్జించుకొన్నది. ఆద్యమో, ఉత్పాద్యమో, మిశ్రమమో అయిన ఇతివృత్తాన్ని గ్రహించి ఈకాలపుకవీశ్వరులు స్వోపజ్ఞామహితమైన కావ్యపరిష్క్రియ నిర్మించిరి. వస్తువునకు ఐక్యము, రసానికి అంగాంగీ

భావము కుదిరి, ఉపక్రమోపసంహారాలతో, రమణీయారసములతో, సంవాద చతురతతో నడచిన ఈ కావ్యానికి ప్రబంధ మనే నూతన సంకేతం ఏర్పడింది. వలసినంత భావనాసమృద్ధితో, అలంకారశిల్పముతో, రసభావనిరంతరంగా, గద్యపద్యాత్మకంగా రచితమైన ప్రబంధ మనే ఈ కావ్యపరిష్క్రియ ఆంధ్ర సాహితికి సొంతమని చెప్పదగును. అవేలమైన భావనకు రాయల ఆముక్తమాల్యదా, అద్భుతకథాకల్పనకు సూరన కళాపూర్ణోదయం నిదానములు. కావ్యానికి కావలసిన సకలలక్షణాలు సంపాదించుకొనుటేకాక, శ్రవ్యరూపాన ఉన్న ప్రథమాంధ్రదృశ్యకావ్యమని పేరుగన్నది ప్రభావతీప్రద్యుమ్నం. కవిరాజ శిఖామణి నన్నెచోడుడు, ఎఱ్ఱన, శ్రీనాథుడు, పినవీరభద్రుడు మున్నగువారి స్వతంత్ర కావ్యావిర్భూతికి బీజావాపం చేసినా, దీనికి ప్రత్యేకనామరూపాలు కల్పించిన మాన్యుడు అల్లసానిపెద్దన.

భారతాదులయందువలె కథాకథనము, ధర్మోపదేశము ఈ కావ్యములందు ప్రధానము కాదు. విభావానుభావాదులచే పరిపుష్టమగు రసనిష్పత్తియే ఇందు ప్రాధాన్యము వహించును. ఈ కాలపుగవీశ్వరులు తమయెదుట కన్పట్టు మహా రాజ్యవిభవాన్ని, అప్పటి రాగభోగాలను, నడతనాగరీకాలను మనసులందు నిల్పికొని వానికి రూపాంతరాలు కల్పించి, రసమయమైన గంధర్వలోకాన్ని సృష్టించారు. భువనవిజయం సుధర్మగాను, తుంగభద్ర మందాకినిగాను, విద్యానగరశృంగారవతులే కథానాయికలుగాను, ఆనాటి సాహసరసికులే నాయకులుగాను వీరికావ్యాలలో అందందు రూపాంతరం పొందిరేమో ! ఆనాటి కవులకు, ప్రజలకు హస్తప్రాప్యములైన రసభోగాలనుండి వంచితులమైన మనకు నేడా కావ్యసృష్టి వింతగా, విపరీతంగా కన్పించినా సర్వర్తుధర్మసంశోభితమై, అద్భుతరసస్యందియైన ఆరామంవంటిది ఆనాటిసాహిత్యం.

ఈ ప్రబంధకవులలో సహజశ్లేషలకు శయ్యాసౌభాగ్యానికి రామరాజ భూషణుడు, భక్తిపారమ్యానికి ధూర్జటి, ముద్దులొలుకు పలుకుబళ్ళకు తిమ్మన, అర్థభరితమైన పదబంధానికి రామకృష్ణుడూ—ఇలా ఒకరొకరే పేరుగాంచిరి. ఆంధ్రమున మొదటి ద్వ్యర్థికావ్యమూ, యక్షగానమూ ఈ కాలంలోనే పుట్టినవి. ఆత్మపరము, భక్తిభరితము అయిన శతకరచనం వెనుకటికాలంలోనే ఆరంభమైనా ధూర్జటి కాళహస్తీశ్వరశతకం అట్టిరచనలకు మకుటాయమానమయింది. మెట్టవేదాంతులను, దాంభికులను, మూఢమానవులను అధిక్షేపించి, పరిహసిస్తూ వేమనయోగి అలవోకగా చెప్పిన ఆటవెలదులకు లోకులనాలుకలే ఆకులైనవి.

విజయనగరసామ్రాజ్యం తల్లికోటయుద్ధంతో అస్తమించిన పిమ్మట చోళ పాండ్యదేశాలలో రాజ్యస్థాపనం చేసికొన్న నాయకరాజులు ఆంధ్రసాహిత్యానికి ప్రాపై నిలిచిరి. తంజావూరు, మధుర, పుదుక్కోటలందు విస్తరిల్లిన ఈనాటి వాఙ్మయ మంతా కేవలశృంగారపరమైనది. స్వయము కవియై, సర్వవిధాల కృష్ణరాయలకు దీటైన రఘునాథరాయల అనంతరమందు నాయకరాజులలోను, వారిపిమ్మట రాజ్యమేలిన మహారాష్ట్రప్రభువులలోను భోగపరాయణత

విస్తరిల్లినది. ఆంధ్రజాతి జవసత్వాలు ఉడిగి, పౌరుషప్రతాపము లస్తంగతములు కాగా, మిగిలిన కామపరతనుండి ప్రభవించిన ఆనాటికావ్యాలు బొత్తిగా సంయమం కోలుపోయి పరకీయాశృంగారానికి పట్టముగట్ట నారంభించినవి. ఈ 150 ఏండ్లలో పొడమినసాహిత్యంలో విజయవిలాసంవంటి ఒకటిరెండు కావ్యాలు పూర్వకావ్యగౌరవాన్ని కొంత అందుకొన్నవి. యక్షగానమనే నాటకరచనమొకటి ఈ కాలమందే వర్ధిల్లినది. నాయకరాజులలో పెక్కురు, మహారాష్ట్రప్రతాపసింహాదులు, నాయకరాజులసామంతులు, దండనాథులుగూడ యక్షగానాదికావ్యములు రచించుటొకటి, పెక్కురు విదుషీమణులు కవయిత్రు లగుట యొకటియు ఈకాలమందలి విశేషాలు. గేయకవితకు ద్వితీయాచార్యు డగు క్షేత్రయ్యయు, దాక్షిణాత్యశృంగారకావ్యభూషణమైన రాధికాసాంత్వనం రచించిన ముద్దుపళనియు, ఆనాటివారే.

కోకొల్లలుగా బయలుదేరిన యక్షగానాలు, శృంగారపదాలు అభిన యిస్తూ రాజసభలలో నాట్యంచేసే వేశ్యల పదమంజీరధ్వనులే అప్పటి కావ్యా లలో ధ్వనించుచుండును. రాజాస్థానాలలో తెరపిలేకుండా సాగే కామ దేవతారాధనమే నాగరులకు అనుకార్యమై, త్యాగభోగరాయుళ్ళయిన నాయక రాజులే శృంగారకావ్యనాయకులైనారా అనిపిస్తుంది. సకలేంద్రియసంతర్పణం చేసే కామపురుషార్థమహాఫలంకోసం రసికనరనారీలోకం నూటయేబదియేండ్లు ఇలా సాహిత్యసముద్రమథనం చేయగా చేయగా తుదకు రామనామామృత భాండం చేబూని వాగ్గేయకారసార్వభౌముడైన త్యాగరాజస్వామి అవతరించెను.

## 3. క్రీ. శ. 1850—1955

19వ శతాబ్ది పూర్వార్ధంలో రెండుమూడరాల కావ్యాలు, శ్లేషచిత్రబంధ కవిత్వాలూ బయలుదేరినవి. హాస్యనీతిశతకాలవంటివితప్ప స్వతంత్రకావ్యములు పొడమలేదు. దేశం క్రమంగా ఆంగ్లేయాక్రాంతమై, క్రిస్టియనుమతప్రచారము, ఆంగ్లవిద్యాభ్యాసం ప్రబలినవి. వీనికి దోడు భౌతికదర్శనములప్రభావంవల్ల విద్యావంతులు ప్రత్యక్షప్రమాణబుద్ధులు కాదొడగిరి. భారతీయధర్మము, సంప్రదాయాలు, ఆచారాలు పునర్విచారణకు పాత్రములై, స్వస్థానవేషభాషాభి మానం సడలుటతో, సంఘసంస్కారోద్యమాలు సాగినవి. సమష్టి చిర కాలంగా తనచుట్టు నిర్మించుకొన్నప్రాకారాలు శిథిలము లగుటయు, వానినుండి విడివడజూచే వ్యష్టి తనక్షేమం తాను విచారించుకోజొచ్చింది. భారతీయ ధర్మాన్ని నవీనకాలానుగుణంగా సంస్కరించుట కిట్లొకవంక యత్నం జరుగు చుండగా, మరొకవంక ఆంగ్లప్రభుత్వబంధనంనుండి విడివడాలనేకోర్కె బలీయ మయ్యెను. అంతట భారతీయపూర్వేతిహాసాన్ని, ధర్మప్రపంచాన్ని మథించి, స్వస్వరూపసాక్షాత్కారం పొందవలెననే కాంక్ష, అభిజనాభిమానము ప్రబలమయ్యెను. ఆంగ్లభాషాకళాశాలల్లో ఆంగ్లేయసాహిత్యాన్ని అవ గాహిస్తున్న పడుచువాండ్రు ఈ రెండు ఉద్యమాలచే ప్రేరితులై—ఆంగ్లమైన

అద్భుతరసదర్శనానికి, క్షుద్రమై, బంధనాగారసదృశమై కనిపించే బాహ్య లోకానికి పొత్తుకుదరక, తమవేదనలను చెప్పికొనుటకై మాటలను, మార్గములను వెదకుచుండిరి.

ఇంతలో తిరుపతివేంకటకవులు ఈకాలపువారి కష్టసుఖాలను చెప్పికొనుట కనువైన సులభసుందరశైలిచే కావ్యరచనం చేయనారంభించిరి. గురుజాడ అప్పారావు మానవధర్మాన్ని, దేశభక్తిని ముత్యాలసరమనే ఛందముచే గానము చేయదొడగెను. ఇట్లు దేశకాలానుగుణమైన కావ్యశైలియు, ఛందము దొరకి నంతట 20వ శతాబ్ది ప్రథమపాదమున తరుణవయస్కులు, గొంతులు విడివడినట్లై, ఆత్మనాయకములగు మధురకవితలను చెప్ప మొదలిడిరి.

పాశ్చాత్యసాహిత్యప్రపంచమును, రవీంద్రనాథగీతావళిని ఆరగ్రోలిన సంస్కారపుష్టిచే ఆరంభమైన ఈ మధురకవితలందు అలనాటి రాయల సాహిత్యంలో లభించే అద్భుతమైనరసదర్శనం మళ్లా లభించింది. అయితే ఆనాటి దర్శనం భోగభాగ్యములచే తులదూగే జీవనపౌష్కల్యమునుండి లభింపగా, ఈనాటిది ప్రతికూలపవనహతినుండి ఆత్మజ్యోతిని కాపాడుకొనుటకై వాయు మండలోపరిపథాన కెగిరి, అచట నిర్మించుకొన్న ఏకాంతజీవనంనుంచి పుట్టింది. అచట కవి నిజానుభవాలకు రూపాంతరం కల్పింపగా, ఇచట కవిమనోరథాలకు రూపకల్పన జరిగింది. కాగా, అందు సంయోగసుఖము, ఇచట తరచు విరహ పరిదేవనమాధురియు లభించినవి. మేఘదూతలోని యక్షులవంటి ఈ కవుల కా అలకానగరసుందరి దవుదవ్వులనే ఉండిపోయింది. పార్థివగంధస్పర్శలేని ఆసుందరి ఆరాధ్యదేవతయై, పూజాపీఠ మలంకరించింది. ఆదేవిని ప్రసన్న నొనర్చుకొనుటకై వీరు పాడిన మధురకవితలలో అద్భుతమైన భావస్ఫూర్తి, రమణీయార్థాలు కొల్లలుగా మనకు లభిస్తవి.

ఆత్మనాయకములైన మధురకవిత లొకవంక ఇట్లు చెల్లుచుండ రెండవ వంక పూర్వేతిహాసములను రసమయంగా ప్రత్యక్షంచేసే వీరకథాకావ్యాలు, పర దాస్యబంధనాన్ని సహించని దేశభక్తిగేయాలు వెలువడజొచ్చెను. స్వస్థాన స్వధర్మాభిమానములనుండి ఆవిర్భవించిన ఈజాతికావ్యములుగూడ గుణగౌరవ ముచే పొగడ్తకెక్కినవి.

ఇవి యిటులుండ ఇంకొకతెగ కవీశ్వరులు పామరజనజీవనమాధుర్యాన్ని పదకవితలందు అందీయసాగిరి. లోకానికి అన్నసత్రంపెట్టే కర్షకభాగ్యశాలిని, సంఘానికి సుఖభోగపరికరాలను సమకూర్చియిచ్చే మంటిపుట్టువుల వితరణాన్ని కీర్తించుతూ వీరు ఈశ్వరాంశను మానవత్వమందు ప్రతిష్ఠగావింపజొచ్చిరి.

ఈ వివిధకావ్యసృష్టి యిలా జరుగుచుండగానే గాంధిజీ భారతరాజకీయ రంగాన ప్రధానభూమిక వహించడం, స్వాతంత్ర్యేచ్ఛ జనసామాన్యానికిగూడా ప్రాకడం, భాషారాష్ట్రములకొరకు ఆందోళనచెందడం, స్వతంత్రభారతంలో సంఘస్వరూప మెలాఉండాలి అనే వాదోపవాదాలు చెలరేగడం, ద్వీపాంత

రాలనుండి అనేకనూతనోద్యమమారుతాలు దేశంలో వీచడం—వీని యన్నిటివల్ల భావుకుల చిత్తవీధులందు క్రొత్తఆలోచనలు పొడమినవి. దీనితో కాల్పనికమైన రసభావసృష్టి వెనుకబడి, దేశకాలాల యథాస్వరూపాన్ని చిత్రిస్తూ, నవసంఘ స్వరూపానికి రూపరేఖలు దిద్దేరచనలు బయలుదేరినవి. పరపీడనాన్ని, పరోప జీవనాన్ని శపించడం, కష్టజీవులందు అభిమానాన్ని ఉద్దీపింపజేసి ఆశాజ్యోతి వెలిగించడం—ఈకాలపుకావ్యములకు సామాన్యలక్షణా లని చెప్పవచ్చు.

భావస్రవంతి పలుపోకల పోతున్న ఈ నవీనకాలంలో తొల్లి ఎన్నడు లేనంత వైవిధ్యము, గుణబాహుళ్యం కావ్యసృష్టియందు కనిపిస్తున్నవి. భావానుగుణములైన నూతనచ్ఛందాలను కవులు వాడుతున్నారు. కొందరు వృత్తగంధి వచనరచన చేస్తున్నారు. సంస్కృతపురాణేతిహాసాలకు మళ్ళా కొందరు కేవలానువాదాలు చేస్తుంటే, కొందరు వానిని స్వోపజ్ఞంగా క్రొత్త వెలయిస్తున్నారు. జానపదగేయాలు, వీరకథాగేయాలు ఎక్కువగా ప్రజాదరం పొందుతున్నవి. దేశకాలాలను వ్యాఖ్యానించుటకు కొందరు శతకపద్ధతి నవలంబిస్తున్నారు.

ఏకాలమందైనా క్రొత్తదారి త్రొక్కేవా రొకరిద్దరే ఉంటారు. తక్కిన వారొక అడుగు అటూ యిటూగా ఆదారినే పోతూ, కొంత విలక్షణతనుగూడ చూపెట్టుతారు. కొందరిరచనలు ఉపజ్ఞామహితములు కాకున్నా, తత్కాల పరిస్థితులకు, ఉద్యమాలకు ప్రతిబింబాలుగా ఉంటవి. ఇలా వేయేండ్లనుంచి ఎప్పటికప్పుడు నవనవంగా వర్ధిల్లుతున్న ఆంధ్రసాహిత్యమందలి కావ్యభేదాలను, రీతులను ఇందు ప్రదర్శించుటకు యత్నించితిని. ఆంధ్రసాహిత్యంలో కేవలం మేలేర్చి కూర్చేయత్నం కాకపోవడంవల్ల, ఆంధ్రరసజ్ఞలోకానికి పరమాదర పాత్రములైన కొన్నికొన్ని రచనల నిందు చేర్చలేకపోతిని. రుచిభేదంవల్ల, పరిశీలనాలోపంవల్ల, స్థలసంకోచంవల్లకూడా ఈ కూర్పు కొంత అసమగ్రతకు పాల్పడిఉంటుంది.

నా యీలోపములను సహృదయులు మన్నింపవేడెదను. ఇతరభాషా ప్రాంతములందలి సోదరభారతీయులకు ఆంధ్రసాహిత్యసంపద నంతటిని, శృంగగ్రాహికగా కాకున్నా, స్థూలారుంధతీన్యాయంగానైనా ఈ గ్రథనం చూపెట్టగలదేని కృతార్థుడ నగుదును.

కాటూరి వేంకటేశ్వరరావు

# వి షయ సూ చి

## ప్రధమ భాగము

## ద్వితీయ భాగము

## తృతీయ భాగము

తెలుఁ గ దేలయన్న దేశంబు తెలుఁ, గేను
తెలుఁగునాయకుండఁ, దెలుఁగొ కండ ;
ఎల్ల బాసలందు నెఱుఁగవే బాసాడి
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

—శ్రీకృష్ణదేవరాయలు

శ్రీయన గౌరినాఁబరగు చెల్వకుఁ జిత్తము పల్లవింప, భ
ద్రాయితమూర్తియై, హరిహరంబగు రూపముదాల్చి, 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చమెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

కరుణారసము వొంగి తొరఁగెడు చాడ్పున
  శశిరేఖ నమృతంబు జాలువాఱ
హరినీలపాత్రిక సురభిచందనమున్న
  గతి నాభి ధవళపంకజము మెఱయ
గుఱియైన చెలువున నెఱసిన లోకర
  క్షణమన గరళంబు చాయ దోఁపఁ
బ్రథమాద్రి దోతెంచు భానుబింబమునా ను
  రమ్మునఁ గౌస్తుభరత్న మొప్ప
సురనదియును గాళిందియు బెరసినట్లు
కాంతిపూరంబు శోభిల్ల, శాంతమూర్తి
నామనంబు నానందమగ్నముగఁ జేయ
నెలమి సన్నిధిసేసె సర్వేశ్వరుండు.

—తిక్కన

# నన్నయభట్టు

[11-వ శతాబ్ది]

## కుమారాస్త్రవిద్యాసందర్శనము

ఒకనాఁడు ద్రోణుఁడు ధృతరాష్ట్రున కిట్లనియె :

ఘోరాస్త్రశస్త్రవిద్యల
నారూఢవ లందు నిపుణులైరి కుమారుల్ ;
వీరల యవిరలవిద్యా
పారము సను తెఱుఁగవలయు భవదీయసభన్.

అనిన నట్లు చేయుదునని ధృతరాష్ట్రుండు నతిమనోహారంబైన శాతకుంభమయప్రేక్షాగారంబున నున్న,

అందుఁ గర మొప్పి సుందరీబృంద మఖిల
రత్నరాజితకనకధరాధరేంద్ర
కందరాంతరమున నున్న సుందరామృ
తాశనాంగనాబృందంబు ననుకరించె.

సుతుల విద్యాప్రవీణతఁ జూచువేడ్క-
నెంతయును సంతసమ్మునఁ గుంతిదేవి
రాజసన్నిధి గాంధారరాజపుత్త్రి
కెలన నుండె నున్మీలితనలిననేత్ర.

వ్యాసపురస్కృతావనిదేవనివహంబుఁ,
  గృపశల్యశకునిగాంగేయవిదుర
సోమదత్తాదిభాసురగురుబాంధవ
  మిత్త్రవర్గంబు, నమేయమంత్రి
సామంతమండలేశ్వరసమూహంబును,
  గాయకవైతాళికప్రవరులుఁ

దమతమ నియమితస్థానంబులం దోలి
నుండిరి, బోరన నులిసె భేరు,.

లస్త్రదర్శనాగతాఖిలక్షత్రియ
వైశ్యశూద్రవివిధవర్ణజనుల
కలకలంబుఁ బ్రళయకాలసంక్షోభితాం
భోనిధిస్వనంబుఁబోలెఁ జెలఁగె.

అట్టి యవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణమాల్యానులేపనయజ్ఞోపవీతపలితకేశశ్మశ్రుశోభితదేహుండై, రంగమధ్యంబున నశ్వత్థామసహితుండై, విముక్తజలదజాలవియన్మధ్యంబున నంగారకసహితుండైన యాదిత్యుండునుంబోలె నున్న; నగణ్యభూసురవరేణ్యపుణ్యాహవాచనానంతరంబున.

ద్రోణాచార్యు పిఱుంద నొప్పి కృతహస్తుల్, బద్ధగోధాంగుళి
త్రాణుల్, మార్గణపూర్ణతూణులు, మహాధన్వుల్, కుమారుల్ తను
త్రాణోపేతులు రంగమధ్యమున నంతన్ నిల్చి రుద్యద్గుణ
శ్రేణీరమ్యులు ధర్మజప్రముఖులై జ్యేష్ఠానుపూర్వంబుగాన్.

అసిచర్మకౌశలం బమరంగఁ జూపెడు
వారును, దృఢసౌష్ఠవంబు లొప్పఁ
దమతమ నామాంకితములైన శరముల
నేర్పడ లక్ష్యంబు లేయువారు,
హయమదద్విరదరథారోహదక్షతఁ
బ్రకటించువారును, బ్రాసశక్తి
కుంతతోమరగదాకుశలత్వ మెఱఁగించు
వారునుగా నిట్లు వసుధలోన

రాజసుతులతోడ రమణఁ బాండవధృత
రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దఁ
దద్దయును ముదమునఁ దమతమ విద్యలు
మెఱసి రెల్లజనులు మెచ్చి పొగడ.

అంత ననంతబలపరాక్రములగు భీమదుర్యోధను లుద్యద్గదాహస్తులయి మహామత్సరంబుతో నేకశృంగసముత్తుంగశైలద్వయంబు ననుకరించుచు, వశానిమిత్తక్రుద్ధగంధసింధురంబులుం బోలె నొండొరులం దాఁకి, సవ్యాపసవ్యమండలమార్గంబుల గదాకౌశలంబు మెఱయునెడ

అవనీచక్రము పాదఘాతహతి నల్లాడంగ, నత్యుచ్చభై
రవహుంకారరవంబునన్ వియదగారంబెల్ల భేదిల్లఁ, బాం
డవకౌరవ్యగదాభిఘట్టన మహాకాండప్రోత్థమై, భావిపాం
డవకౌరవ్యరణాభిసూచనపటిష్ఠంబయ్యె ఘోరాకృతిన్.

ఆ రాజసుతుల విద్యా
పారగపటుచేష్టితములఁ బరువడి నగ్గాం
ధారీధృతరాష్ట్రుల కతి
ధీరుఁడు విదురుండు సెప్పి తెలుపుచునుండెన్.

అంత భీమదుర్యోధనుల గదాకౌశలంబు సూచుజనుల పక్షపాతజనితపరస్పరక్రోధవచనంబులు విని ద్రోణుండు రంగభంగభయంబున నశ్వత్థామం బంచి, వారి నిద్దఱ వారించి, వారాశియుంబోలె బోరన మ్రోయుచున్న వాదిత్రశబ్దంబు లుడిపి, ''నా ప్రియశిష్యుం డయిన యర్జును ధనుఃకౌశలంబు జూడుం'' డనిన ; నయ్యాచార్యు వచనానంతరంబున,

హరివిచిత్రహేమకవచావృతుఁ, డున్నతచాపచారుదీ
ర్ఘోరుభుజుండు, భాస్వదసితోత్పలవర్ణుఁడు, సేంద్రచాపశం
పారుచిమేఘమో యనఁగఁ బాండవమధ్యముఁ డొప్పి బద్ధతూ
ణీరుఁడు రంగమధ్యమున నిల్చె జనంబులు దన్నె చూడఁగన్.

''వీఁడె కృతహస్తుఁ డఖిలాస్త్రవిద్యలందు
వీఁడె యగ్రగణ్యుఁడు ధర్మవిదులలోన
వీఁడె భరతవంశంబెల్ల వెలుఁగఁ గుంతి
కడుపు చల్లగాఁ బుట్టిన ఘనభుజుండు.''

అని పలుకు జనుల పలుకులు
విని గొంతి యనంతహర్షవిస్ఫారితలో
చనయై నందను నృపసం
దనసంఘములోనఁ జూచి తద్దయుఁ బొంగెన్.

చారుమనస్సమ్మదరస
పూరము వెలివేర్చునట్లు పొలఁతికి విగళ
ద్వారి స్తనజనితపయో
ధారలు, నానందబాష్పధారలు నొప్పెన్.

అయ్యర్జును స్తుతివచనంబు లొక్కట జనసంఘంబువలన నెగసి, వియత్తలవిదళనం బయిన; సమ్మహాధ్వని విని యదరిపడి ధృతరాష్ట్రుఁ "డిదియేమి రభసం"బని విదురు నడిగిన నాతం డిట్లనియె.

"భూరిభుజుం డర్జునుఁ డతి
శూరుఁడు దనయస్త్రవిద్యఁ జూపఁగ రంగ
ప్రారంభుఁ డయిన నతని న
వారితముగఁ బొగడు జనరవం బిది యధిపా!"

అనవుడు ధృతరాష్ట్రుఁడు దన
మనమున సంతోషమంది "మానుగ వీనుల్
గనిన ఫలమునకు నిప్పుడు
వినఁగంటిని బాండుసుతుల విద్యాశక్తుల్."

అని పొగడుచుండ నర్జునుం డాచార్యు ననుమతంబున.

ఆగ్నేయశరమున నతిభీకరాగ్నియు
  వారుణాస్త్రమున దుర్వారజలము
ననిలబాణంబున నధికానిలంబును
  మేఘాస్త్రమున మహామేఘచయముఁ
బుట్టించు, మఱియును భూమిబాణంబున
  భూప్రవిష్టుండగు, భూరిఘోర

శైలబాణంబున శైలరూపము దాల్చు.
వీరుఁ డదృశ్యాస్త్రవిద్యపేర్మిఁ
దా నదృశ్యదేహుండగుఁ దత్క్షణంబ
హ్రస్వుఁ డగు, దీర్ఘుఁ డగు, సూక్ష్ముఁ డగు, రయంబు
తోడ రథమధ్యగతుఁ డగు, ధూర్గతుండు
నగు, మహీతలగతుఁ డగు నద్భుతముగ

ఇట్లస్త్రవిద్యావైచిత్ర్యంబు మెఱసి యర్జునుండు జనుల కాశ్చర్యంబు సేయుచున్నంతఁ గర్ణుఁడు నిజవిద్యాకౌశలంబు మెఱయ సమకట్టి రంగద్వారమున నిలిచి, భుజాస్ఫాలనంబు సేసిన.

జనులెల్లం గడు సంభ్రమింపఁగ నజస్రంబై భుజాస్ఫాలన
ధ్వని శైలప్రకరంబుపైఁ బడు మహాదంభోళిశబ్దంబయో
యన వీతెంచినఁ బాండవుల్ సనిరి ద్రోణాచార్యు డాయన్ సుయో
ధను వేష్టించిరి తమ్ములందఱును దద్ద్వారంబు వీక్షించుచున్.

సాలప్రాంశు, నిజోజ్జ్వలత్కవచు, శశ్వత్కుండలోద్భాసితున్,
బాలార్కప్రతిమున్, శరాసనధరున్, బద్ధోగ్రనిస్త్రింశు, శౌ
ర్యాలంకారు, సువర్ణవర్ణు, ఘనుఁ, గర్ణాఖ్యున్, జగత్కర్ణపూ
ర్ణాలోలద్గుణుఁ జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై రచ్చటన్.

కర్ణుండును జనుల నందఱ నదల్చి. చొత్తెంచి, రంగమధ్యంబున నిలిచి, కలయంజూచి కృపద్రోణాచార్యులకు నమస్కరించి సజల జలధరధ్వానగంభీరరవంబున నర్జును నాక్షేపించి యిట్లనియె.

"నీవ కడునేర్పుకాఁడవు
గా వలవదు, వీనిఁ గొన్ని గఱచితి మేమున్,
నీ విద్యలెల్లఁ జూపుదు
మే? వీరులు సూచి మేలుమేలని పొగడన్."

అనిన వినతనయు పలుకులు
జనులకు విస్మయము, సవ్యసాచికిఁ గోపం

బును సిగ్గును, మఱి దుర్యో
ధనునకుఁ బ్రీతియును జేసెఁ దత్క్షణమాత్రన్.

అంత ద్రోణుచేత ననుజ్ఞాతుండయి కర్ణుం డర్జునుచూపిన యస్త్ర విద్యావిశేషంబులెల్ల నశ్రమంబున జూపినఁ, జూచి దుర్యోధనుండు దానుం దమ్ములును గర్ణునిం గౌఁగిలించుకొని, "నాతో బద్ధసఖ్యుండవయి నాకును బాంధవులకును హితంబుసేసి, నన్నుం గురు రాజ్యంబు నుపయోగింపు" మనిన, "నట్లచేయుదు"నని కర్ణుం డొడంబడి, "యిమ్మూఁగిన రాజలోకంబును, నీవును జూడఁ బార్థుతో ద్వంద్వయుద్ధంబుసేయవలయు"ననిన, ధార్తరాష్ట్ర మధ్యంబున నున్న యక్కర్ణుం జూచి పార్థుం డిట్లనియె.

"పిలువంగఁ బడక సభలకు
బలిమిం జని పలుకు పాపభాగుల లోకం
బులకుఁ జన వేఁడి పలికెదు
పలువ! యెఱుంగవు పరాత్మపరిమాణంబుల్."

అనిన విని పార్థునకు ని
ట్లనియె నినాత్మజుఁడు "దుర్బలాయాసక్షే
పనిబంధమ్ములు వలుకక
ఘననిశితాస్త్రములఁ బలుకఁ గడఁగుము నాతోన్.

ఈరంగభూమి యస్త్ర వి
శారదులగువారి కెల్ల సామాన్యముగా,
కారయ వీరికిఁ జోరనగు,
వీరికిఁ గాదను విచారవిషయము గలదే!"

అని గర్వించి దుర్యోధనానుమతంబునఁ బార్థుతో ద్వంద్వ యుద్ధంబు సేయంబూని రణసన్నద్ధుండయి రవితనయుండు రంగ మధ్యంబున నున్నంత, నర్జునుండును నాచార్యభ్రాతృచోదితుండై యుగాంతకాలానలుండునుంబోలెఁ బ్రతిఘటించి నిలిచిన.

జనితామర్షణుఁ డంతఁ బార్థుపయిఁ బర్జన్యాస్త్ర మక్కర్ణుఁ డే
సె నపారం బయి భూనభోంతరముఁ దజ్జీమూతయూథంబు గ
ప్పినఁ దద్ధ్వాంతతిరోహితాపఘనుఁడై బీభత్సుఁ డుండెన్, విరో
చనుఁ డాత్మద్యుతి విస్తరించె సుతుపై సంప్రీతచేతస్కుఁడై.

అయ్యవసరంబున దుర్యోధనుం దొట్టి ధృతరాష్ట్రనందను లందఱుఁ గర్ణువలన నుండిరి, భీష్మద్రోణకృపపాండవులు పార్థువలన నుండి, రంత –

రవిసుతపార్థుల ఘోరా
హవమునకును వెఱచుచున్నయది కుంతి తదు
ద్భవఘనతరశరతిమిరా
ఘావృతాంగుఁ దనూజుఁ జూడఁగానక వంతన్.

ధృతి దఱిఁగి మోహమూర్ఛా
న్వితయైనను సంభ్రమించి విదురుఁడు ప్రత్యా
గతజీవఁ జేసె నప్పుడ
యతిశీతలచందనోదకాసేకమునన్.

అంత నర్జునుం డనిలబాణంబున నమ్మేఘపటలంబు పఱవ నేసి యాదిత్యసమతేజుం డయియున్న, విదురదర్శితులైన యక్కర్ణార్జునులం జూచి కుంతి సంతసిల్లె; నప్పుడు ధర్మవిదుం డఖిలద్వంద్వయుద్ధసమాచారనిపుణుండు కృపాచార్యుం డయ్యిద్దఱ నడుమ నిలిచి, కర్ణున కిట్లనియె.

“కురుకులజుండు, పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు, రాజధర్మబం
ధురచరితుండు, నీ వితనితోడ రణం బొనరించెదేని వి
స్తరముగ నీదు వంశమును దల్లిని దండ్రిని జెప్పు, చెప్పినన్
దొరయగుదేని నీకెదిరి దోర్బలశక్తి నితండు సూపెడున్”

అనిన విని కర్ణుండు దన కులంబును, దల్లిదండ్రులను జెప్ప సిగ్గుపడి, తల వాంచియున్నం జూచి దుర్యోధనుఁడు గృపున కిట్లనియె.

"కులము గలవాఁడు, శౌర్యము
గలవాఁడును, నధికసేన గలవాఁడును, భూ
తలమున రా జను నామము
విలసిల్లఁగఁ దాల్చు మూఁడువిధముల పేర్మిన్.

రాజవరుఁడైన పార్థుతో రాజుగాని
యీతఁ డని సేయఁగాఁ దగఁడేని వీని
నెల్లవారును జూడంగ నీక్షణంబ
రాజుఁ జేసెద నే నంగరాజ్య మిచ్చి."

అని యప్పుడ భీష్మధృతరాష్ట్రులకుం జెప్పి, వారి యనుమతంబున మహామహీసురసహస్రంబునకు గోసహస్రాయుతంబు దానంబు సేసి, 'యంగరాజ్యంబునకు వీఁ డర్హుండయ్యెడు' మను బ్రాహ్మణ వచనంబు వడసి, కర్ణుం గాంచనపీఠంబున నునిచి, యంగరాజ్యమున కభిషిక్తుం జేసినఁ, గర్ణుండు మణిమకుటకేయూరహారాది భూషణభూషితుండై, సకలరాజచిహ్నముల నొప్పి, పరమ హర్షంబుతోడం గురుపతి కిట్లనియె.

"బృహదబ్ధిమేఖలాఖిల
మహీతలక్షత్రివరసమక్షమున మహా
మహిమాన్వితుఁగా నన్నును
మహీశుఁగాఁ జేసి తతిసమర్థత వెలయన్.

దీనికి సదృశముగా మఱి
యేనేమి యొనర్తు నీకు నిష్టం?" బనినన్,
"మానుగ నాతోఁ జెలిమి మ
హీనుతముగఁ జేయు, మిదియె యిష్టము నాకున్."

అనిన విని దుర్యోధనుం డెంతయు సంతోషంబుగాఁ గర్ణుం డతనితోడి యిష్టసఖిత్వంబున కొడంబడియె; నంతఁ గొడుకు రాజ్యాభిషేకోత్సవంబు సూచి హర్షపరవశుండయి సూతుండు కర్ణునొద్దకుం బఱ తెంచినఁ గర్ణుండును వినయవినమితోత్తమాంగుఁడై న,

కడఁగి సూతుండు పుత్రకుఁ గౌఁగిలించి
కొని, తదీయ మూర్ధాఘ్రాణ మొనరఁ జేసి,
అంగరాజ్యాభిషేకార్ద్రమైన శిరముఁ
దడిపె వెండియు హర్షాశ్రుతతులఁ జేసి.

దానిం జూచి భీముఁడు కర్ణుని సూతకులసంభవునిగా నెఱింగి నగుచు నిట్లనియె,

"నీదు కులమునకుఁ దగఁగఁ బ్ర
తోదముగొని రథము గడపఁ దొడఁగుము, నృపధ
ర్మోదయుఁడగు నర్జునుతోఁ
గాదనక రణంబుసేయఁగా నీకగునే?...

ఉత్తమక్షత్రియప్రవరోపభోగ్య
మైన యంగరాజ్యంబు నీ కర్హమగునె?
మంత్రపూతమై, గురుయజమానభక్ష్య
మగు పురోడాశ మది కుక్క కర్హమగునె?"

అనిన, గర్ణుండు వెల్లనై..., దీర్ఘోష్ణనిశ్వాసవ్యాకులితవదనుండై ఆకాశంబువలననున్న యాదిత్యుం జూచుచు మిన్నకుండె; నంత, నంతర్జ్వాలులితుండైన కర్ణుంజూచి భ్రాతృపద్మవనమధ్యంబునుండి దుర్యోధనమదాంధగంధసింధురంబు వెలువడివచ్చి, యలిగి, భీమున కిట్లనియె.

"అనిలజ! నీ కిట్లని ప
ల్కను దలఁపను నగునె? లేడికడుపునఁ బులి పు
ట్టునె? యిట్టి దివ్యతేజం
బునవాఁ డధమాన్వయమునఁ బుట్టునె చెపుమా?

శూరుల జన్మంబు, సురల జన్మంబును,
నేఱుల జన్మంబు నెఱుఁగ నగునె?
మొగిని దధీచి యెమ్మునఁ బుట్టదయ్యెనే
వాసవాయుధమైన వజ్రమదియు?

గాంగేయుఁడన, మఱి కార్తికేయుండన,
నాగ్నేయుఁడన రౌద్రుఁడనఁగ, శరవ
ణోద్భవుండన, గుహుం డుద్భవిల్లఁడె? శర
స్తంబజన్ముఁడుగాఁడె ధర్మవిదుఁడు

కృపుఁడు? ఘటసంభవుఁడుగాఁడె కీర్తిపరుఁడు,
వరుఁడు ద్రోణుఁడు? విప్రులవలనఁ బుట్టి
రైరె సత్క్షత్రియ ప్రభు లవనిఁ గావఁ
గడఁగి? మీ జన్మములు నిట్లు కావె వినఁగ?

వానితోడి దేమి? సహజకవచకుండల మండితుం డితఁడు ప్రకృతి పురుషుండు గాఁడు; తన బాహుబలంబున నీయంగరాజ్యంబునకె కాదు, సకలమహీరాజ్యంబున కర్హుండగు'' ననుచుఁ...కర్ణుం దోడ్కొని నిజమందిరంబున కరిగె.

కుంతి యంత సహజకుండలకవచాభి
రాముఁ గర్ణుఁ జూచి, రవిసమానుఁ
బ్రత్యభిజ్ఞ నెఱిఁగి, ప్రథమపుత్రస్నేహ
మెఱుకపడక యుండ నింతి యుండె.

వినుతధనుర్విద్యావిదు,
ఘనుఁ, గర్ణ సహాయుఁ బడసి, కౌరవవిభుఁ డ
ర్జునువలని భయము సెడి, ఱొ
మ్మునఁ జేయిడి నిద్రవోయె ముదితాత్ముండై.

(ఆంధ్రమహాభారతము—ఆదిపర్వమునుండి)

# నన్నెచోడదేవ

[12-వ శతాబ్ది]

## మన్మథ దహనము

అంత రతిసమేతుండు, పుష్పాయుధుండు పుష్పరథారూఢుండై, హిమవంతంబున కరిగి పరమేశ్వరు తపోవనంబు సొత్తెంచి,

వలరా జామనిఁ బిల్చి "వేగమెయి నీ వాసంతికానందదో
హాల మీకాననలక్ష్మి కి"మ్మనుడు, నాహ్లాదంబుతో నెయ్యమ
గ్గలమైయుండ వసంతకుండుఁ దమపైఁ గన్నిడ్డఁ గారాకు గెం
దలిరాకయ్యెనొనాఁ దలిర్చె వడిఁ గాంతారాంతరోర్వీజముల్...

మలయసమీరణాభిహతి మ్రాఁకుల నాకులు డుల్లి డుల్లి, క్రొ
మ్మొలకలు సాగిసాగి, విరిమోసులఁ గెందలి రొత్తియొత్తి, కు
ట్మలములు గ్రమ్మిగ్రమ్మి, కుసుమంబులు వాసనకెక్కియెక్కి, గు
త్తులుగొని పండిపండి ఏనుతుల్ దగ నారములొప్పె నామనిన్...

వేదన విరహులు సేదలుసెడి సంధు
  లెడలంగ ఁ బల్లాకు లెడలెఁ దరుల
రాగిల్లుకవల మేఁదీఁగెలఁ బులకంబు
  లంకురింపఁగఁ దరు లంకురించె
సమ్మదంబునఁ గాముజనులచిత్తంబులు
  చిగురొత్తఁ దరులందుఁ జిగురులొత్తె
రతిదోహలముల దంపతుల ముఖాబ్జముల్
  విలసిల్ల విలసిల్లె విరులు దరుల

నెలమిఁ జిలుకపిండు దోలుమేనఁ జేసిన
తపము పండఁ బండెఁ దరువనంబు,
యువిద లింపు మిగుల నూయెలపాటలు
పాడ మధుమదమునఁ బాడె నలులు.

మదను తలిరెల్లులోయనఁ
బొదిగొని కెందలిరు లెసఁగు భూరుహములపై
నొదవెడు రాగాంబుధి బు
ద్బుదములునా నెసఁగె ముకుళములు తోరములై.

పొన్నలుపూచెఁ, బొన్నలొగి పూవకముందఱఁ బూచె గోఁగు, లా
పొన్నలుఁ గొండగోఁగులును బూవకముందఱఁ బూచెబూరువుల్
పొన్నలు గొండగోఁగులును బూరువులు న్నొగిఁ బూవకుండఁగా
మున్న వనంబునంగలయ మోఁదుగులొప్పగఁబూచె నామనిన్.

పలఁకెడు కారాకు లలితాస్థిచయముగా
  పోలుకొమ్మలు పలుకేలు గాఁగఁ
బాలపల్లవములు వ్రేలుకెంజడలుగాఁ
  బెనఁగు తీఁగలు దొడ్డఫణులుగాఁగఁ
గలకంఠనికరంబు గళమునకప్పుగాఁ
  బుప్పొడి మేని విభూతిగాఁగ
ఫలములు వరదానఫలములుగా నలి
  మాలికల్ రుద్రాక్షమాలికలుగ

శంభుమూర్తిఁ దాల్చి సహకారభూరుహ
చక్రవర్తి నవవసంతవేళ
నతిశయిల్లుచుండె నక్కడఁ గని, మది
నుదరిపడి మనోజుఁ డోసరింప...

నెలఁతల పరిమళనిశ్వాసపవనంబుఁ
  దలపించె దక్షిణానిలవిలాస
మింతుల దరహాసకాంతిసంభావన
  గావించెఁ జంద్రప్రభావిభాతి
రమణుల రక్తాధరభ్రాంతి నొదవించె
  లాలితాశోకప్రవాళలీల

వనితల మంజులస్వనశంకఁ బుట్టించెఁ
  గలకంఠమదకీరకలకలంబు

కామినీవిలోలకర్ణాంతవిశ్రాంత
లోచనప్రశంసలోలబుద్ధిఁ
బడసె దళితపత్రపద్మవిభ్రమము వి
యోగులందు మధుసమాగమమున.

సోలుచు, సమ్మదరసమునఁ
గ్రాలుచు వనపాలబాలికలు నవలతికాం
దోలముల వేడ్కఁ సలుపుచు
నాలతు లాఁగఁ జేసి పాడి రభినవలీలన్...

ఆమనికి నెలమి విపులా
రామంబుల పొల్పు సూచి రాగోత్కటమై
కాముఁడు రతిఁ గని తానును
గామాతురుఁడై మనోవికారము నందెన్.

లత్తుకరసమున జొత్తిల్లఁబదతల
  ముల వరచేతుల మోవిఁ బూసి
నవకుసుమంబుల నానావిధంబుల
  తొడవులు రచియించి తొడిపి వేడ్క
రాజీవపుష్పపరాగంబుఁ గబళించి
  విలసిల్లు సీమంతవీథిఁ బోసి
యరవిరి సురపొన్నయకఱవు వఱసతో
  నలకల జిన్నిపువ్వాలికి కలయ

సలలితంబగు పుప్పొడి దులిచి వీఁగు
జన్నుగవమీఁదఁ బోయుచుఁ జెన్నుమిగుల
సుదతి గై సేసి, ప్రీతితోఁ జూచుచుండె
భావజన్ముండు వచ్చిన పనియు మఱచి...

ఇట్లు తత్కాలోచిత క్రీడాపరవశుండై కంతుండు బెదరి, నిజగమన ప్రయోజనంబుఁ దలంచి, యాత్మగణంబ...సమరసన్నద్ధుండై, సకలజనంబులు......ననురాగరసపూరితహృదయులై పరవశులై యున్నం గని, హరగిరిజల కంతకుం దమయంతన సంగమంబగు, నా వచ్చిన కెలసంబు వసంతువలనఁ దీరకున్నె? యని...అనతిదూరంబుగాఁ జని, ముందట.

అమరఁగ నింద్రియాళి విషయంబులతో, విషయంబు లన్నియుం
గ్రమమున గాడ్పునందడఁచి, గాడ్పులఁగూర్చి మనంబునందు,సం
యమమతిఁ దన్మనంబొనర నాత్మునియందొడగూర్చి,యాత్మయో
గమునఁ జలింపకున్న శివుఁ గాంచె మనోజుఁడు దవ్వుదవ్వులన్.

హరుఁగని, ప్రాణము ఝల్లని
విరిసిన మెయిమఱచి పచ్చవిల్తుఁడు దగఁ జి
త్తరువున వ్రాసిన కాముని
కరణి నచైతన్యవృత్తిఁ గదలక నిల్చెన్.

ఇట్లు నిలిచి, రతిప్రబోధితుండై, త్రిణయను సమాధివైకల్యంబు సేయ నుపక్రమించి నిజమూలబలంబుల నవలోకించిన,

అలిఝంకారముఁ, గీచకస్వనముఁ, గీరాలాపముల్, మత్తకో
కిలనాదంబులు, శారికారవములుం, గేకీనినాదంబులుం
గలయం ఘోరన మంజుగానములతో గంధర్వగీతంబు ల
గ్గలమై ఘోరనమోసె నీశ్వరులతాగారంబు ఘూర్ణిల్లఁగన్!...

శంభుసమాధికి విఘ్నా
రంభములై యులియు వనచరములకు జిహ్వా
స్తంభ గతిస్తంభ మనః
స్తంభములుగ నంది హస్తసంజ్ఞ నదల్చెన్...

మృదుపై ముంగలి సని, తల
పడి మలయానిలుఁడు పోరుభరమై మదనుం
బడలువడఁ బఱచు క్రియఁ దడఁ
బడ ధూళియు గాడ్పు వీచెఁ బ్రతికూలంబై ...

తరు గుల్మాదుల మఱువునఁ
దరతరము చలించి గడికిఁ దారుచుఁ బురసం
హారు నెయిదఁ జొచ్చెఁ గాముఁడు
గరివైరికిఁ జొచ్చు వేటకాఁడును బోలెన్ ...

అంత నకాలవసంతలతాంతాపచయకేళీలాలసయై, ...

మెలపారు నెలమావి తలిరుల నొకకొన్ని
  రమణీయమగు చంపకములు వోదివి
లాలితాశోకపల్లవముల నొకకొన్ని
  కమనీయమగు గుర్వకములు వెట్టి...

చెలువలెల్ల నొండు చిగుళులు పువ్వులు
గలయఁ దాల్చి, పొల్చి బలసిరాఁగ
శైలరాజతనయ సనుదెంచె నందన
వనము గాఁపువచ్చు వడువవోలె...

అంతం బరమేశ్వరుండు తుర్యావస్థితంబులైన మనఃప్రాణంబులు జాగ్రదవస్థావ్యవస్థితంబులుసేసి, సుప్రసన్నుండైన కన్నెఱింగి గౌరి ...హారచరణసరసీరుహంబులకుఁ బుష్పాంజలి యిచ్చి, కృతాంజలియైన,

ఆ వనజాస్య హస్తతలజారుణదీప్తులఁ గూడివచ్చు పు
ష్పావలిమీఁద నీశుతనుజామలరోచులు గప్పి యొప్పె సం
ధ్యావిరళోద్గతప్రకటితారుణదీప్తులలోనఁ బొల్చు తా
రావళిమీఁదఁ బర్వు నమృతాంశుకరప్రకరాభిరామమై...

అంతం గంతుండు గౌరీహృదయంబు న్మదనాస్త్రంబున భేదించిన నాతుణంబ.

అలికాగ్రంబునఁ గ్రాలి యాడి బొమ లాహ్లాదింపఁ గన్గోనలం
దలఁకెన్ సమ్మదవారి, మోవి యదరెన్, దన్వంగిమై నొత్తె ము
త్పులకల్, గంపముఁగూడ నూర్పు లెలమిం బొందె, న్మనంబాత్మలో
నొలసెన్, రాగము మోమున బొలసె గండోల్లాసహాసప్రభల్.

ఆలలితస్మితాస్యలలితామలకోమలచంచలాలసా
లోలవిశాలసంస్ఫురితలోచనదృష్టిరసప్రవాహమం
దోలిన పర్వి, వెల్లిగొని, యొక్కటఁ గక్కున ముంచి మీఁదికిం
దేలఁగ నెత్తెఁ, జుట్టె, హరుఁ ద్రిప్పులఁ బెట్టె మనోజుఁ డుబ్బఁగాన్.

నగరాజతనయ పన్నగరాజధరుమ్రోల
నిలువుడు మదనుఁ డేటలవి నిలిచె
నెలనాగ గరిబొమల్ వొలయింప నెత్తుడుఁ
జిత్తజుఁ డించువిల్లెత్తికొనియె
హరిణాక్షి లసదపాంగాలోకనము నూలు
కొలుపుడు న మ్మరిగొలిపె మరుఁడు
పతినెఱి నూరఁ బార్వతి సూచుసుఱుచూడ్కు
లాడుడు నలరమ్ము లాడె నీశుఁ

గంతుఁ డేయఁదొడఁగె, నంత నీశ్వరునకు
నచలవృత్తి జలుపు నాత్మవిమల
యోగభావ మెడపి, రాగోత్కటంబున
గౌరియందు నిలిపెఁ గన్ను, మనము.

గిరిజ లలితాంగములు వారి
బొరిఁ గనుఁగొని సొగసి యిసుకబొమ్మలు జలముల్
దెరలఁగ విరిసినగతిఁ బొది
విరిసి మహేశ్వరు మనంబు వికలంబయ్యెన్...

ఎలరాజు కనుగవ వొలయించుఁ గ్రేవల
  నెఱిగొని మెఱుఁగులు దుఱఁగలింపఁ
గ్రొవ్విరి చిఱునవ్వు నవ్వు వాతెఱకాంతి
  రంగిల్లి సితరుచుల్ దొంగలింపఁ
గుదుటఁ గ్రక్కడరినఁ గదియించునుడువిల్లు
  సుడిసి ముత్తరఁగలు గడలుకొనఁగ
సోలంబు నెఱసూరు సాగియునుం జెమటపై
  వదలి మేఁదీఁగ మవ్వంబు మిగుల

నొత్తలించుఁ, దఱమ నూకించుఁ, దాలిమి
కగ్గలించు, నెఱయ నప్పలించు
మదనశరవిభిన్నహృదయాబ్జయై మహా
దేవుఁ జూచి గౌరిదేవి తివుట.

ఇట్లు మదనపరవశయగు పార్వతిం గని సాగిసి,...

పులకాంకురంబులు దలలెత్తి మేను గం
  పింపఁ గోమలిఁ గౌఁగిలింపఁ దలఁచు
రాగోత్కటమున సైరణలేక మానినిఁ
  గాయ్వానఁ బైపడి కవయఁదలఁచు...

తన మహత్త్వంబు దలఁపక తరుణిపొందు
వడయఁ గీడ్పడి తేఁకువ వాపఁదలఁచు
భావజాస్త్రాభిహతి మహాదేవుఁ డొక్క
వ్రేలిమిడి బెంపుసెడి కడు విరలిగొనియె...

నవతమాలలతాతతి నడుమఁ బుష్ప
చాపమండనహస్తుఁడై, శంబరారి
దనరె నీలాభ్రపటలమధ్యమున నింద్ర
చాపహస్తుఁడై వెలుఁగు పర్జన్యులీల.

అంత కాంతకుండు కంతుఁ గనుంగొని, కోపించి ... దహనాంబకంబు విచ్చిచూచిన.

పొగయక, రాజకొక్క మొగి భోరన మంటలు విస్ఫులింగముల్
నెగసి, రయంబునం గలయనిండి, ఛటచ్ఛటభుగ్భుగద్ధగ
ద్ధగయని మండి పంచశరు దగ్ధముసేయుచ, యాక్షణంబులో
మగిడి పురారి నేత్రశిఖ మల్చె మహాశనిపాతభీమమై.

నిటలాక్షువహ్ని గడును
త్కటమై తరతరమ మీఁదఁ గప్పిన మదనుం
డిట యట మెదలఁగ నేరక
పటుతరశిఖిశిఖలఁ గాలి భస్మంబయ్యెన్.

కని కోపించెనొ, కానక
మును గోపించెనొ, మహోగ్రముగ నుగ్రుఁడు సూ
చినఁ గాలెనొ, చూడక యట
మును గాలెనొ నాఁగ నిమిషమున నఱిగాలెన్.

గిరిసుతమైఁ గామాగ్నియు,
హరుమై రోషాగ్నియుం, దదంగజుమై ను
ద్ధురకాలాగ్నియు, రతిమై
నురు శోకాగ్నియును దగిలి యొక్కట నెగసెన్.

అనలశిఖాలిఁ గాంచి యభయం బభయంబని దేవతల్ నభం
బునఁ జెలరేగి చీరుటకు మున్న మనోభవు నీఱుచేసి పో
యినఁ గని దిక్పతుల్ సురలు నింద్రుఁడు శోకభయార్తులై మఱుం
బనవుచుఁ బాఱి రొండొరుల పట్టులు గానక భీతికారులై.

(కుమారసంభవము—చతుర్థ పంచమాశ్వాసములనుండి)

# పాల్కురికి సోమనాథుఁడు

[12-వ శతాబ్ది]

## రుద్రపశుపతి

వడిఁబాఱు జలమున కొడలెల్లఁ గాళ్లు
వడిఁగాలు చిచ్చున కొడలెల్ల నోళ్లు
వడి వీచు గాడ్పున కొడలెల్లఁ దలలు
వడిఁజేయు బసవన కొడలెల్ల భక్తి...
వ్యక్తంబెఱుంగ వే యయ్యాళయూర
భక్తుండు మును రుద్రపశుపతినాఁగఁ
బ్రథితమౌ నాదిపురాణమం దబ్ధి
మథనావసర మొక్కకథకుండు సదువఁ,
గమలజ కమలాక్షు లమితదైత్యాదు
లమరులు సెడి పాఱ నం దుద్భవించి
పొరి నజాండములెల్ల దరికొని కాల్చు
గరళంబు మ్రింగె శ్రీ కంఠుఁ డనిన —
నా రుద్రపశుపతి యాలించి, "భర్గుఁ
డారగించుట నిక్కమా విషం?" బనుడు
"ననుమానమా! త్రావె హరుఁడు విషంబు
బనుగొన నటమీఁదిపను లెఱుఁగ" మన,
విని యుల్కిపడి వీఁపు విఱిగి "హా! చెడితి"
నని, నేలఁబడి పొర్లి "యక్కటా! నన్ను
వెఱ్ఱిఁజేసిరిగాక విశ్వేశ! యెట్టి
వెఱ్ఱివారైన విషముఁ ద్రావుదురె?
బ్రతుకుదురె విషమ్ముపాలైన వార?
లిది యెట్లు వినవచ్చు, నేమిసేయుదును
నిక్క మెవ్విధమున నిన్నె కా కెఱుఁగ

ముక్కంటి ! నాకింక దిక్కెవ్వరయ్య ?
నాకొలకైనఁ బినాకి ! యివ్విషము
చేకొన కుమియవే నీకు మ్రొక్కెదను
కటకటా ! మేన సగంబున నుండి
యెట వోయి తవ్వ ! నీ వెఱుఁగవే గౌరి !
ప్రమథగణములార ! పరమాప్తులార !
సమసిన వెండి మీశక్యమే కావ ?
శతరుద్రులార ! యసంఖ్యాతులార !
క్షితిధరకన్యకాపతిఁ గావరయ్య !
వీరభద్రయ్యరో ! విషముఁ బ్రాణేశుఁ
డారగించె నిఁ కెట్లు లవునోకదయ్య !
ఓ పురాతనులార ! యొడయండు బ్రతుక
నోపునొకో ! విషం బొగి నారగించెఁ
జావు దప్పింపరే సద్గురునాథు
దీవన లీయరే, కావరే శివునిఁ,
దల్లి లేని ప్రజలఁ దలఁతురే యొరులు
తల్లి యున్న విషముఁ ద్రావనే లిచ్చు !''...
నని ప్రలాపింపుచుఁ బనవుచు, ''నొండు
వినఁజాలఁ, బ్రాణము ల్విడుతు నే'' ననుచుఁ
దడయక ఘనజలాంతరమున నుఱుకఁ ;
బడకుండ నా రుద్రపశుపతిఁ బట్టి
పార్వతీసహితుఁడై ప్రమథరుద్రాది
సర్వసురాసురసంఘుంబు గొలువ
హరుఁడు ప్రత్యక్షమై ''యడుగుము నీకు
వరమిత్తు నెయ్యది వాంఛితం'' బనుడుఁ
గడు సంభ్రమంబున మృదుపదాబ్జములఁ
బడి రుద్రపశుపతి భట్టారకుండు
''ఏమియు నే నొల్ల, నీ విషసేవ

నేమేమి పుట్టునో యే వినఁజాలఁ
గ్రక్కున నమియవే కాలకూటంబు,
నిక్కంబు నాకెక్క నీయావి'' యనిన ;
దశనకాంతులు దశదిశలఁ బర్వంగఁ
బశుపతి యారుద్రపశుపతి కనియె—
''ఇట లోకములలోన నెన్న నేకాక
యట మ్రింగ నమియంగ నది యెంత పెద్ద ?
యణుమాత్ర నాకంఠమందుఁ జిక్కినది
గణుతింప నున్నదే కాలకూటంబు ?
యింత సంతాపింపనేల నీ'' కనుచు
వింతన వ్వొలయంగ సంతరించుడును,
''నమ్మంగఁ జాలఁ బినాకి ! యివ్విషము
గ్రమ్మన నొక్కింత గడుపు సొచ్చినను
బెద్దయుఁ బుట్టునో, పిమ్మటివార్త
దద్దయు విననోపఁ, దా మున్న చత్తు,
సమయని, మ్మొండేనిఁ జావనీవేని
యుమియు మివ్విషమొండె, నొండు సెప్పకుము
తక్కినమాటలు దన కింప'' వనుచు
నిక్కంబు తెగువమై నిష్ఠించి పలుక ;
నుమియకుండినఁ జచ్చునో ముగ్ధ యనుచు,
నుమబోటి యాత్మలో నుత్తలపడఁగ,
నుమిసినఁ గొని కాల్చునో తమ్మ ననుచుఁ
గమలాక్షముఖ్యులు గడగడ వడఁకఁ,
బ్రమథు లాతని ముగ్ధభక్తికి మెచ్చి
యమితమహోత్సవులై చూచుచుండ,
నొక్కింత నవ్వుచు నుడురాజధరుఁడు
గ్రక్కున లేవత్తి, కౌఁగిటఁ జేర్చి,
''ప్రమథులయాన; నీపాదంబులాన

సమయ నిర్విషమున, సత్యమిట్లనిన
నమ్మవే, వలపలి నాతొడ యెక్కి
నెమ్మిఁ జూచుచునుండు నీలకంఠంబు"
నని యూరుపీఠంబునందు ధరించె.
మును గుడిచియున్న దే ముగ్ధత్వమునకు?
నదిగాక గుత్తుక హాలాహలంబు
కదలినంతటనె చచ్చెదఁగాక! యనుచుఁ
దన కరవాలు ఱొమ్మున దూసి మోపి
కొని, కుత్తుకయ చూచుచును తెప్పలిడక
పశుపతితోడమీఁదఁ బాయక రుద్ర
పశుపతి నేఁడును బాయకున్నాఁడు.

(బసవపురాణమునుండి)

## తిక్కన సోమయాజి

[13-వ శతాబ్ది]

### చంద్రికా వర్ణనము

పంబిన కెంపుఁ బాసి, దివిఁ బ్రాఁకి, దిశల్ వెలిఁగించి, చంద్రకాం
తంబుల నీరు సేసి, కుముదంబులఁ బండువు సేయఁ బంచి, య
బ్జంబుల నిద్రవుచ్చి, మరుసాయకముల్ గరసానఁ బట్టి, కో
కంబుల నేచి లోకముపొగడ్తలు సేకొని చంద్రుఁ డున్నెడన్.

బడి చేసిన చందంబునఁ
గడువేగం బొకటి నొకటిఁ గదిసి దివిని సం
దడిగా నెంతయు గుంపుగఁ
బడి వెన్నెలకుం జకోరపంక్తులు గవిసెన్.

మునుమును నెగడెదురశ్ముల
కొన లెల్లం బట్టికొని చకోరంబులు ద్రుం
చిన నచట నచటఁ దుఱఁగలి
గొని పెరిఁగెడుమాడ్కి దలముకొని ప్రభ లెగసెన్.

తివిచి నవకంబుదీప్తులు ద్రెంచి, యలఁతి
తునియలుగఁ జంచుపుటములఁ ద్రుంచి తల్లు
లాదరంబున నంది యీ నఱ్ఱులెత్తి
ప్రీతిఁ గముచుఁ జకోరంపుఁ బిల్లగములు.

చంచులఁ గాంతులు వెన్నెలఁ
జించి యమృతముట్ట నొసఁగుచెన్నునకును రా
గించుచుఁ జవిఁ జొక్కుచుఁ గబ
ళించుఁ జకోరికలు సమదలీలాలసలై.

క్రమ్మి పైఁ దొరఁగెడు కౌముదితీయంబు
సొంపునఁ దనుపునఁ జొక్కి చొక్కి
పచరించు చంద్రాతపంబు కాలువలలో
నడ్డంబుగా నిల్చి యూఁగి యూఁగి
వెల్లువపెల్లుసూపెడు సాంద్రచంద్రికా
పూరంబు గని మదిఁ బొంగి పొంగి
మిన్నులతో రాయు వెన్నెలకరదుల
నెఱకలు సడలించి యీఁది యీఁది

చెలఁగిచెలఁగి, మలఁగిమలఁగి, యల్లల్లన
క్రాలిక్రాలి, బిట్టు తూలితూలి
సమదవృత్తిఁ గేలిసలిపెఁ జకోరచ
యంబు సదలు దమమయంబు గాఁగ.

తడఁబడ నొండొంటికి ము
న్నడఁ గముచుచు, నొడిసికొనుచు, నేపునఁ బైపైఁ

బడుచు, నవులవుల నీసునఁ
గడచుచు వెన్నెలఁ జకోరగణ మానునెడన్.

తినుగమి నొల్లక యొకయెడఁ
దన యిచ్ఛకువచ్చు నిందుధామనికాయం
బున మవ్వమెక్కు నిగిడెడి
కొనలు గమిచి మేసె నొక చకోరము దివుటన్.

సమ్మదవారి కన్గడల జాలుగ, మై గరుపార, నిందుబిం
బమ్మున దృష్టినిల్పి, పయిఁ బ్రాఁకు మరీచుల నూఁగునూఁగులేఁ
గొమ్మలు వట్టి చంచుపుటకోటిఁ గదల్చి తెమల్చికొంచు సౌ
ఖ్యమ్మ విహంగమమ్మయినయాకృతినొందెఁ జకోర మొక్కెడన్.

కలయఁగ నూనునట్లుగ జగంబు సమస్తముఁ జాలఁ దోఁగెనో,
జలజభవుండు గోరి పెఱచాయల నెల్లను మాన్చి యొందునుం
దెలుపు ఘటించెనో, యమృతదీధితి వేడుక విశ్వరూపుఁడై
నిలిచెనొ నాఁగ నెల్లెడల నిండఁగ వెన్నెల పర్వె సాంద్రమై.

వెన్నెలపోఁతపనులొ యన,
వెన్నెలగండఱవుపనుల విధమున, మీఁదన్
వెన్నెల నీఱు వఱపిరనఁ
గన్నుల కింపొసఁగె నిల సకలరూపములున్.

అలసతఱుప్ప వల్లన రతాంతమునం బ్రియునొద్దఁ బాసి, నె
చ్చెలికడ కేగుదెంచు సరసీరుహనేత్ర విలోచనంబులన్
దలఁకెడు మందహాసమువిధంబున సొంపున మీఁటియున్న చెం
గలువలలోన నింపడరుకౌముది వేడ్కలొనర్చెఁ జూడ్కికిన్.

భరితసుధారసపాత్రంబులను కుము
దోత్కరంబులు దళుకొత్త మెఱసి
చంద్రకాంతోపలజలముల కాలువ
లివి యవి యని యప్పు డేర్పరించి

దెసలు సూడఁగ గుండె దిగ్గను చక్రస
మూహంబునకుఁ దలమునుక లగుచు
నీఁదుచకోరంబు లెగురవ్రేఁగై యీడి
గిలఁబడునట్లుగా దలముకొనుచు

నంతకంతకుఁ బొంగి, మిన్నంది, వెల్లి
మిగిలి, యెనిమిదిదిక్కులమీఁదఁ బొరలి
జనము లానందమునఁ దేల జగములెల్లఁ
దొట్టి నిండారు వెన్నెల నిట్టవొడిచె.

(నిర్వచనోత్తర రామాయణంనుంచి)

## పాంచాలీ భీమసేనులు

"నన్నుఁబరాభవించి సదనంబునకున్ జని కీచకుండు ము
న్నున్న తెఱంగు దప్పక సుఖోచితశయ్యను నిద్రసేయ నీ
కన్ను మొగుడ్చు నూఱటకుఁ గారణమెయ్యది భీమసేన! మీ
యన్న పరాక్రమంబు వల దన్ననొకో దయమాలితక్కటా."

అనుచు మందసంభాషణంబుల సంబోధించు పాంచాలిపాణి స్పర్శనంబున మేలుకని, 'యిదియెవ్వ' రనవుడు 'నే'నను నమ్మానిని యెలుంగెఱింగి భీమసేనుండు, యాజ్ఞసేని కీచకుదురాచరణంబు నాకుం బ్రకటించి వాని నిర్జింప నియోగించునదియై యరుగుదెంచెం గావలయు, నత్తెఱం గిత్తెఱవ తాన చెప్ప విందునని తలంచి.

"ఇంతప్రొద్దేల యిచ్చోటి కేగుదేరఁ
గారణంబేమి యెవ్వరు గానకుండ
నట్లుగాఁ జనుదెంచితె యంబుజాక్షి!"
యనిన నయ్యింతి యిట్లను నతనితోడ.

"ఎఱిగి యెఱింగి న న్నడుగ నేమిటి? కప్పుడెఱింగి యింతకు
న్మఱచుటగల్గెనే నది వినంబనిలే, దటుగాక యున్నరూ

వెఱఁగియు నేన చెప్ప విన నిష్టముగల్గుట చాలలెస్స, య
త్తెఱఁగెఱిఁగించెదన్ వినుము తెల్లముగా మొదలింటినుండియున్.

అధిపుమఱంది సింహబలుఁ డప్పుడు మ్రొక్కఁగవచ్చి, నన్ను న
త్యధికమనోజరాగమతియై కనుగొంచుఁ గడంగి యెన్నియున్
విధములఁ బల్కి, నాకుఁ దన విన్ననువొప్పఁగఁ జూపి, చేరి, మా
నధనవిహీనతం జెనకినం గడు నేవముపుట్టి యయ్యెడన్.

విడియంబలుకఁగ, వెండియు
నుడుగక కీచకుఁడు మన్మథోన్మాదము ద
న్నడరిన నన్నడుగుటకుం
దొడరినఁ గోపించి వానితో నిట్లంటిన్.

'దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతు
ల్గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా.'

అనిన విని వాఁడు గొన్ని ప్రల్లదంబులు వలికిన, నేనునుం దత్కాలోచితవచనంబులం ద్రోచిపుచ్చినం బోయెఁ; బదంపడి పాపాత్మయైన సుదేష్ణ దనకు మదిరారసంబు దేరం గీచకనివాసంబునకు నన్నుం బనిచినం, బోవుట కొడంబడక, యెన్ని సెప్పిన నన్నింటికి నన్ని సెప్పి, నిర్బంధించినం బెద్దపెనంగ నొల్లక, నామనంబున నన్నెవరికి నేమిసేయవచ్చునని మీలావు నచ్చి, సూతునింటికి సురకుం బోయిన.

కొన్ని వెడమాటలాడుచు
నన్ను నతఁడు సెట్టవట్టినం ద్రోచి, వెసం
జన్న, వెనుకొనుటయును మీ
యున్నెడ కే నపుడు సంభ్రమోపేతగతిన్.

పాఱుతెంచిన, నక్కులపాంసనుండు
గోపమడరంగ వెనుకన కూడముట్టె;

నట యెఱుంగుదు నీవు, మీయన్న పెద్ద
తనముఁ జూచితి, నేమందు ననిలతనయ!

మీసుభటత్వమున్, బలము మిన్నకపోవఁగ దుస్ససేనుఁ డ
ట్లాసభలో ననుంబఱిచె, నంతియకాక జయద్రథుండు సం
త్రాసభరంబులే కనుచితంబొనరించినఁ జెల్లిపోయె, నేఁ
డీసభికుల్ గనుంగొనఁగ నిట్లయితిన్ వగ నాకు వింతయే!

అకట ఆఁడుకూయు, నాలకూయును లాఁతి
వారికైన నరయువలయు ననిన,
నన్నుఁ గీచకుండు దన్నంగ నెట్టులు
సూడనేర్చె ధర్మసూనుఁ డపుడు?''

అనిన విని యతం డిట్లనియె.

''కీచకుఁ డట్లు మీఁదు పరికింపక నిన్నుఁ బరాభవింపఁగాఁ
జూచి, మహోగ్రకోపవివశుండగునన్నును జూచి, ధైర్యహే
మాచలుఁడైన ధర్మసుతుఁ డమ్మెయి వారణసేయకున్న నే
నీచత వాని, మత్స్యవిభునిం, బరివారము నుగ్గుసేసినన్.

ఆ సంరంభంబున సమయభంగంబుగా, జనంబులు మనల నెఱింగి రేని.

ముందటిభంగిన కానల
యందు వసింపంగవలదె? యది నీవును నే
నుం దెచ్చినయాపదగా
నిందింపరె యెల్లవారు నీరజవదనా?

కావున సత్యవ్రతనిష్ఠుండగు యుధిష్ఠిరుండు వొగడ్తకుం దగు వాఁడు గాని దూఱువడ నర్హుండుగాఁ''డని వెండియు నిట్లనియె.

''పరిభవకరుఁడగు కీచకుఁ
బరిమార్చుట కిపుడు గడవఁబడియెనె? యిమ్మై
దురపిల్లనేల వ్రేల్మిడిఁ
బొరిగొని నీమనము కలఁకవుత్తు లతాంగీ.

మనల నెవ్వరు నెఱుఁగకుండునట్టి తెలుంగు దలపోయవలయుఁ గాక, పగతుని భంజించుట యెంతటిపని" యనిన విని యమ్మానిని యిట్లనియె.

"గొంతికి నంత వెఱవ, మీ
కంత వెఱవ, దైవమునకు నంత వెఱవ, న
త్యంత కలుషాత్ము విరటుని
కాంతకు నే వెఱతుఁ బనులుగావించు నెడన్.

కినుకకుఁ జాల కెంతయును గీడ్పడి, నాపడుపాటు లెల్ల వ
మ్మునఁ గలయంగ నిట్టు లొకమూర్ఖునిచేఁ దుదిపోయి కోలుపో
యిన, నభిమానముం దగవు నేడ్తెఱ డెందముగొందలంబు బొం
దిన, ధృతిమాలి యేఁ బలికితిం దగ వెల్ల నెఱింగియుండియున్.

ఇట్టిద కాని సమస్తజనస్తవనీయుండగు పాండవాగ్రజు నిక్కంబ నిందించిన దానం గా" నని పలికి, మఱియును.

"ధర్మతనూభవుసంతత
ధర్మనిరతి మనము బ్రదుకఁదలఁచుట యరుదే?
నిర్మలుఁడగునాతని స
ద్ధర్మంబునఁగాదె బ్రదుకు ధాత్రికి నెల్లన్?

చనునె వేఱొకని కజాతశత్రుండను
పేర దిగ్విజయంబు పెంపుఁ దాల్ప
రాజసూయమహాధ్వరము గోరిచేయంగఁ
దీఱునే పెఱధరిత్రీపతులకు
ధర్మైకనిరతుఁ డాతం డొక్కరుఁడ చూవె
యనఁ జన నొరులకు నలవియగునె
నిత్యవ్రతంబుగా సత్యంబుపాలింప
వచ్చునె యొరుల కెవ్వరికినైన

నయ్యుధిష్ఠిరుగాంభీర్య, మతనిధైర్య
మరయ నొందెడఁ గలుగునె? యతఁడు కీర్తి
ధరుఁడుఁ గరుణోత్తరుఁడు మహీసురసమృద్ధి
కరుఁడు నిజవంశకరుఁ డుపకారపరుఁడు

ఎవ్వనివాకిట నిభమదపంకంబు
  రాజభూషణరజోరాజి నడఁగు
నెవ్వనిచారిత్ర మెల్లలోకములకు
  నొజ్జయై వినయంబునొఱపుఁ గఱపు
నెవ్వనికడకంట నివ్వటిల్లెడుచూడ్కి
  మానితసంపద లీనుచుండు
నెవ్వనిగుణలత లేడువారాసుల
  కడపటికొండపైఁ గలయఁ బ్రాఁకు

నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటితగర్వాంధకారవైరి
వీరకోటీరమణిఘృణివేష్టితాంఘ్రి
తలుఁడు కేవలమర్త్యుఁడె ధర్మసుతుఁడు!

అట్టిమహాత్ముఁ డొక్కనికి నాశ్రితుఁడై వెడగూడుఁ జీరయుం
బెట్టఁగ నిల్చి, వానిమదిప్రీతికి నీడగువృత్తిఁ బేరునుం
బుట్టునుమాలి, యిప్పు డిటు ద్రుంగుడువాటునఁ బొందఁజూచి, నా
కెట్టు మనంబు వట్టు, ధృతియెమ్మెయిఁ దూలకనిల్చుఁ జెప్పుమా!

నీవలమూఁపులావు మును నేలవహించిన నాగకూర్మగో
త్రావనిభృద్దిశాకరుల కారయ నూఱటపట్టుగాదె? సం
భావన భూజనంబులకుఁ బందువుగాదె? మహోగ్రకోపరే
ఖావిభవంబు వైరులకుఁ గాలముచేరువగాదె పావనీ!

బకహిడింబకిమ్మీరులబాహుబలము
నాజరాసంధునుగ్రదర్పాతిశయము

లోకభీకరములు విజయాకరములు
నైన నీకరములకు లోనయ్యెఁగాదె.

తొడరినహరునైన దోర్బలంబునఁ దన్ను
మిగులంగనీఁ డను మేటిమాట
యమరేంద్రునర్ధాసనమునకునైన న
ర్హుం డెంతయును నను రూఢిమాట
జమునిల్లుసొచ్చిన జంతువునైనను
గాచు నెమ్మెయి నను రాచమాట
దనుగోరి యూర్వశి దాన వచ్చిననైన
లోలుండుగాఁ డను మేలిమాట

శౌర్యవైభవప్రాభవశౌచములకు
నొరులకైనఁ గైవారమై యుల్లసిల్లు
నొక్కనికి నివియెల్లను నిక్కమట్టె!
యెందుఁ గలుగునె యర్జునునీడువాఁడు?

అరయ నతండు మానధనుఁ డక్కట రంగమునందు నిల్చి, సుం
దరులకు నాటసూపెడువిధం బతిదీనము దానిఁజూచి, యేఁ
బురపురఁబొక్కుదుం, గడుపుఁ బ్రోచికొనన్ లఘువృత్తి కిమ్మెయిం
జొరనగువాఁడె దేవపతిసూనుఁడు దైవముచేత సూచితే!

మగలకుమేటియైన బలమర్దననందనుఁ బేడిఁ జేయఁగాఁ
దగునె విధాత! నీకు నని దైవము దూఱుదు, నోర్వరానినె
వ్వగ దలకొన్న నెంతయును వందుదు, ని ద్దురవస్థయెన్నఁడో
తెగు టని సంతతంబును మదిం దలపోయుదు నేమిసేయుదున్?

తనయొప్పిదముగన్నఁ దగిలి యెవ్వారికైన
మలఁగి క్రమ్మఱఁ జూడవలయువాఁడు
దనవర్తనమువిన్న మునిజనంబులకైన
నలవరించికొనంగవలయువాఁడు

దనబంటుతన మ్రోజ గనినమాత్రకైనఁ
 బలుమాఱు నగ్గింపవలయువాఁడు
దన వితరణకేళి వినినగల్పకతరు
 వులకైనఁ దలయూపవలయువాఁడు
నకులుఁ డొరులకు నశ్వశిక్షకుఁడుగాఁగ
నగునె! యాతని దుస్థితి యనుదినంబుఁ
గాంచి, కన్నీ రడంచుచుఁ గడవరాని
దైవఘటనకు నోర్తుఁ జిత్తంబులోన.

ఆరూపం బవికార, మాభుజబలం బత్యంతనిర్గర్వ, మా
శూరత్వంబు దయారసానుగత, మా శుంభత్క్రియాజ్ఞాన మా
ర్యారంభప్రతికూలవాదరహితం, బాయీఁగి సమ్మాన వి
స్తారోదాత్తము మాద్రిపిన్నకొడు కేతన్మాత్రుఁడే చూడఁగన్.

సుకుమారుఁ డతఁడు గోపా
లకవృత్తి వహించి యడవులం గ్రుమ్మరుచు
న్కికి నాక కాదు, పగవా
రికైనను నకట మన మురియదే వగలన్.

ఏనును మీరు గానలకు నేగునెడన్ నను జేరి యెంతయున్
దీనతదోఁపఁ గుంతి సహదేవుని నిల్లడవెట్టి నాకు, 'న
మ్మా! నిను నమ్మి, చాలవిషమంబగు నివ్వనవాస మీతఁడుం
బూనఁగ నియ్యకొంటి'నని బోరన నశ్రులుగ్రమ్ముచుండఁగన్.

'కడుఁ బసిబిడ్డవీఁ డొకటి గా, దవునా నెఱుగండు, ముంద రె
వ్యేడ నొకపాటెఱుంగఁ, డెద యెంతయుఁగోమల, మెప్పుడైన నే
గుడువఁగఁ బిల్తుఁగాని తనకుంగల యాఁకటిప్రొద్దెఱుంగఁ, డీ
కొడుకిటు వోకకున్ మనము గుందెడు నిన్గని యాఱడిల్లెడున్'

అని యప్పగించె; నింక నా తెఱంగు వినుము.

"ద్రుపదభూవిభుఁడు పుత్త్రులకంటె నెంతయుఁ
 బెంపుసేయుచు గారవింపఁ బెరిఁగి
కుంతీమహాదేవి కోడండ్రలోపల
 నగ్గలంబుగఁ గొనియాడఁ బరఁగి
ప్రాణంబులకు నెల్లఁ బ్రాణంబుగా మీరు
 నెయ్యంబుతియ్యంబు నెఱప నడచి
మదిఁ దల్లిదండ్రుల మాఱుగాఁగొని జను
 లనిశంబు భక్తిసేయంగ నెగడి

రూపగుణవిక్రమంబుల రూఢికెక్కు-
నట్టికొడుకులఁ గని, భరతాన్వయంబు
నందు నాయిల్లయిల్లుగా నతిశయిల్లి
తగవుమై బాంధవులచేతఁ బొగడువడసి,

వినుతింపందగు రాజసూయమునఁ బృథ్వీదేవతాకోటి కె
ల్లను సంతృప్తియొనర్చి, వారిదయఁ గల్యాణాత్మనై, పుణ్యవ
ర్తన పాండుక్షితిపాలుకోడ లనఁగా రాజన్యమాన్యప్రియాం
గనలం దెల్లఁ బొగడ్తగంటి నతిలోకంబైన మీమన్ననన్.

ఏను మనంబుపెంపునెడి, యిప్పుడు నీచతరప్రచారముం
బూని నికృష్టనై యుదరపోషణకై తగవేది, యెంతయున్
దీనతబొంది, యిమ్మెయి సుదేష్ణపనుల్ గనుసన్నఁజేయుచున్
హీనతనున్కి- మీకు వగ పేమియుఁ జేయద, యేమిసేయుదున్.

పనివంపఁగాని, యొకతకుఁ
బనిసేయ నెఱుంగ, నన్ను బనిగొనునెడఁ బాం
డునియగ్రమహిషి గొంకుచుఁ
బనిగఱపెడుచందముననె పనుచు టెఱుఁగవే.

ఒల్లరు రాజు, దేవులును నొద్దులురాచిన చందనంబు, మే
నెల్లఁ జెమర్పఁగా నకట యేను శ్రమంపడి నిల్చినిల్చి, య

ల్లల్లన మార్దవం బొనరునట్లుగ నెట్టకునేని రాచి; మీ
తల్లికి భక్తి వెట్టెడు విధంబునఁ బెట్టుదు బ్రహ్మ దిట్టుదున్.

నున్నదనంబుగా నలుఁగు నూఁటియుఁ జందన మట్లు రాచియుం
బన్నుగఁ గ్రొత్తలైన కలపంబులు గూర్చియు నాసుదేష్ణకుం
గన్నులసన్నలం బనులు గైకొని, వారక చేయుచుండుటన్
మున్నటులున్న పాణితలముల్ బలుగాయలుగాచెఁ జూచితే.''

అనుచుం దొరఁగెడునశ్రుల
మునిఁగినమోము తనివక్షమునఁ జేర్చిన, న
వ్వనితయవస్థయ తాల్చుచు
ననిలసుతుం డడలె దేహ మలమటబొందన్.

అట్టియెడఁ దన్ను దాన యూరార్చికొనుచు
నంబుజానన నెమ్మొగ మల్లఁ దుడిచి
యనునయించి, తత్కరములు దన మొగంబు
గదియఁ జేర్చుచు నిట్టూర్పుగాడ్పు నిగుడ.

చింతాక్రాంతుండైన కౌంతేయున కయ్యింతి యిట్లనియె.

''ఇందఱును నిన్ని భంగుల నిడుమఁగుడువ
వలసె ధర్మతనూభవువలనఁ జేసి
దాయ లొడ్డిన మాయజూదంపుటురులఁ
బడి కులంబున కాతఁ డిప్పాటు దెచ్చె.

అక్కట మోసపోయి యడియాసలఁ జావక యున్నదాన, ము
న్నొక్కెడ నే దురంతదురితోత్కటబాధలఁ బెట్టియున్న నా
కెక్కడి దుఃఖశాంతి గర మేదుట యెమ్మెయిఁ గల్గనేర్చు? మీ
ముక్కున నూర్పుగల్గ నొక మూర్ఖుని చేఁ బడితిన్ సభాస్థలిన్.

మీ రేమి సేయుదురు, దై
వారంభముగాక శుభము నశుభంబును సం

సారులఁ దనతనతతి నని
వారణఁ బొందంగ మాన్పవచ్చునె దానిన్ ?

కావున మీర లభ్యుదయగౌరవ మొందుట యాత్మఁ గోరి యే
నేవిధినైన నాపదల కెల్లను నోర్చెద దాని కేమి, యీ
కావలుఁడైన కీచకుఁడు గామనిపీడితుఁడై యలంతులం
బోవక వేచి, పట్టుకొనఁబోయిన దూఱెదఁగాక యిమ్మెయిన్.

వానిఁ దెగఁజూడవైతేని వాయుపుత్ర!
నీవు గనుగొన నురినైన నీరనైన
నగ్నినైన విషంబుననైన నేను
మేను దొఱఁగుదు నెట్టు సేయుఁగాను సుమ్ము."

అనిన వృకోదరుండు చిఱునవ్వు నవ్వుచు నిట్లనియె.

"జలజదళాక్షి! కీచకుని జంపుట కిమ్మెయి ముట్టఁబల్కఁగా
వలయునె? యేను జూడ ననివారణ నిన్ను బరాభవించె వాఁ;
డిల మగలింక నాంద్రకును నెవ్వరు? భంగము నీఁగఁజాలువా
రలఘుమదీయబాహుబల మప్పుడు సూపనితప్పు సాలదే.

ఎల్లి యెల్లవిధంబుల నెందుఁ జొచ్చె
నేని, నాధర్మతనయుండు దాన వచ్చి
యడ్డపడెనేని, నీవ పెంపారుకరుణ
గాచితేని నాచేఁ బడుఁ గీచకుండు.

వానిదెసం జింతవలవ, దమ్మాటలు విడువు"మని యూఱడిల్లం బలికె.

(భారతము — విరాటపర్వము నుండి)

# ఎఱ్ఱాప్రగడ
[14-వ శతాబ్ది]
## గోకులము

పురిటిపాపనిఁ దొట్లెలోఁ బొందుగాఁగఁ
బెట్టి మోపించుకొని, తాను బ్రియసతియును
మేటి గుజ్జులఁ గట్టిన పాటబండి
యెక్కి, శీఘ్రుంబ మందకు నేగె నెలమి.

ఇట్లు చని, పుష్పితఫలితానేక తరుషండ మండితంబగు కాళిందీ తటంబున నలుదెసలం బొడవుగా నమర్చిన బలితంపుములు వెలుంగులం గరంబు జతనంబులై యొప్పు పెనుదొడ్లం,—ప్రబమో దంబున వేకువం బోకుమేసి వచ్చి, రోమంథవదనంబుల విహిత శయనలై సుఖయించు కదుపులలోనఁ బేరుపేరం బిలువం బంచి తిల్లుచు, నుల్లసిత హుంకారంబులగు వదనంబులతో నున్ముఖలగు తల్లులకు నభిముఖంబులై హర్షప్రతిధ్వనదంబులు వాదలం బొదుల నుండి యొండొంటి దాఁటుకొని కలయు బాలవత్సంబుల యుత్సవ సంచారంబులవలనను,—వెదయావుల వెనుకం దగిలి యొండొంటిం జేరనీక, కాల్దువ్వి క్రోడాడుచుఁ గఱకెక్కిన మెడలును వలుద మూపురంబులును వెడఁదవీఁపులునుం దోరంపు గంగడోళ్లునై క్రాలు వృషభంబుల దర్పవికారంబులవలనను,—మొదవుల నోరినురువులుం బెయ్యల రేణంబులుం, బాలకుండల మసలును దమయొడళులకు నెడపడని తొడవులుగాఁ బిదికి యురుద్రాళ్లుందలుగులు దలమొలలఁ జుట్టి, క్రేపుల నేర్పరించువారును, క్రేపులంగొనని యావులం దొలంగంగట్టి, పిల్లువెట్టియు మందులు సల్లియుఁ జాల దుఃఖపరచి చేఁపెఱింగించువారును, కావటి మోపులకతనం గంది కాయలు గాచి వంగిన వలుద మూఁపులును, పసుల కొమ్ములతాఁకుల నడవి

క్రంపయేట్ల మన్నియమ్రుచ్చులపోట్లఁ బెరసిన గంట్లం గఱకెక్కిన యవయవంబులు, ఎఱ్ఱసెరలతోడి కపిలకన్నుల వెడంగుచూపులును, గారుకెలుంగులుం గలిగి యెల్లయెడలం ద్రుళ్లు గొల్లల పిల్లు వలనను,—చనుకట్టులు గట్టి, భుజమూలంబుల జిగిసొంపులం గలసి మెఱసి నెఱయం జిలుమూరు నిత్తడి కడియమ్ములుం గంచుటుంగరమ్ములు సమరం, గొమరారు నాచుతీఁగలు కలయం బ్రాఁకినం బొలుచు కెందామరలం దెగడు చేతులం గడవలవాఁతులు పదిలంబుగా నూఁది, చెదరిన చికిచికి వెండ్రుకలు పొదువుటం జిఱుమొగులు మొలకలు బలిసిన కొఱనెలలకుం బాటియగు నెన్నుదురుల నున్న చెమరులు దురంగలింప...వడవడవడంకు చన్నుగవలును, బ్రేగుపసు పిఱుందులుం, బొలయు చ్వాడ్కులునై సరిత్తోయంబులం దెచ్చు జలవాహికలును,—కాంచన కంకణ ఝణత్కారంబుల, గంఠసూత్రవలనంబుల, బాహులతాందోళనంబులఁ, బయోధర సంఘర్షణంబుల, శ్రోణీసన్నహనంబుల, మృదుగీత మాధుర్యంబుల, మనోహరంబులగు దధిమథన వ్యాపారంబులఁ బారీణలగు బాలికలును, ఘృతతక్రవిక్రయంబు గృహసమ్మార్జనంబు శిశుసమాశ్వాసనంబు బాలకభృతకభుక్తిప్రదానంబు మొదలైన పనులం జిడి ముడిపాటు వెలయు మెలంగు గరిష్ఠ కుటుంబినులునైన గోపికల ఉదాత్త చేష్టితంబులవలనను,—సర్వప్రకారసుభగంబై, నవతృణచ్ఛన్న కుటీకవాటంబును, అనర్గళాలక్షితవాస్తుసీమంబును, విశంకట శకటనికటార్పితమంచకంబును, ఆజ్యపచనసుగంధియుఁ, దప్యమానదుగ్ధచూత్కారముఖరంబును, అర్భకకబళవిగళితమస్తుసిక్త కరీషస్థలంబును, దధిబిందుసుందరవేదికంబునునైన మహాఘోషంబు ప్రవేశించి.

## శైశవము

నోరం జేతులు రెండు గ్రుక్కికొనుచు, న్మోమెల్ల బాష్పాంజన స్మేరంబై తిలకింపనేర్చుచుఁ, బొరిన్ మీఁజేతులం గన్నులిం

పారం దోముచు, లేవఁజూచి పిఱుఁదొయ్యన్నీఁది కల్లార్చుచున్
శ్రీరమ్యాంఘ్రియుగంబు గింజుకొనుచుం జెల్వంబు రెట్టింపఁగన్,

పొలుపారఁగా బోరగిలి పాన్పు నాల్గుమూ
  లలకును వచ్చుచు మెలఁగి మెలఁగి
లలిఁ గపోలంబులు గిలిగిలింతలు పుచ్చి
  నవ్వింపఁ గలకల నవ్వినవ్వి
ముద్దులు దొలకాడ మ్రోఁకాలఁ గేలను
  దడవుచు నెందును దారితారి
నిలుచుండఁబెట్టి యంగుళు లూఁత సూపఁగాఁ
  బ్రీతి దప్పడుగులు వెట్టిపెట్టి
అన్నఁగంటి దండ్రినిఁ గంటి నయ్యఁ గంటి,
నిందు రావయ్య! విందుల వింద వనుచు
నర్థిఁ దను బిలువఁగ నడయాడి యాడి
ఉల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల.

ఎవ్వరుగన్న నెత్తికొని యెంతయు వేడుక ముద్దులాడఁగా
నెవ్వలఁ బాఱిపాఱి, తరళేక్షణ దీధితులొప్ప నొప్పమై
మువ్వలు గంటలు న్మొరయ, ముందటి కూఁకటిరావిరేకతో
నవ్వనజాక్షుఁ డాడుచెలు వర్మిలిఁ బెంచు జనంబుచూడ్కికిన్.

మన్నురొంపియుఁ, బెండయు, మసటువట్టి
పాంసుసంక్రీడఁ దనమేను భాసురముగ
హరి యనేకధాతుచ్ఛటావ్యక్తమైన
శైలకుంజరకలభంబువోలె నొప్పె.

"ఏలా యిందును నందుఁ బాఱెదవు? నీకే బ్రాఁతియే వెన్నలుం
బాలుం బాలక! చాలఁ జేఁపె నిదె నాపాలిండ్లు పెన్సోనలై
పా లొక్కుమ్మడిఁ గ్రమ్ముచున్నయవి నీభావంబునం దృప్తిగాఁ
గ్రోలంజాలవె యింతవట్టకట యీగోసేల చుట్టాలలోన్?"

అని యెత్తుకొని, యురంబునఁ
దనియఁగ నదిమికొని, చన్ను తన్ముఖమునకున్
ఘనదుగ్ధపిచ్ఛిలంబుగ
మన మలరఁగ నిచ్చుటయుఁ గుమారుఁడు ప్రీతిన్.

స్తనదుగ్ధామృత మారగించుచుఁ బొరిం జారుస్మితోల్లాస మా
ననబింబంబు నలంకరింప విలసన్నాళీకపత్రాభలో
చనదీప్తుల్ జననీముఖేందువుపయిన్ సంప్రీతిఁ బర్వంగ నొ
ప్పు నిజాభీప్సితకల్పశాఖ గనియెం బుత్రుం బవిత్రోదయున్.

## బృందావనమునకు వలసపోవుట

పెద్దకాలంబు నొక్కచో నునికి ప్రశస్తంబుకాదు;
ఎరువు తిప్పలుగాని యెల్లమందలు గొను
జెక్కి మేపుడుచోటు ద్రొక్కువడియెఁ
దరు లోలి నఱుక మొదళులు సిక్కంగ జొం
పము లేది జాడలువడియెఁ బొదలు
మడువులు పసులకాల్మడిఁ బుచ్చెఁ, దొరుగండి
స్రవంతలు పెనురొంపి స్రవంతలయ్యెఁ
బూరిపంటలు చెడిపోయె రాయిడిఁ గ్రంప
లోనుగా దవ్వులఁగాని లేదు
పులుఁగు పూరెడు పోపడి పొలములందు
మెలఁగి వెదకినఁ బుట్టదు, మెకము లడఁగెఁ,
గూరగాయ కట్టియ విల్చికొనఁగ వలసి
యునికి ప్రేపల్లె పీటిపట్టునకుఁ దొఱఁగె..

కావున నిచ్చో వసియింప దుఃఖావహంబు, బృందావనంబు బృందారకవనసుందరంబైన కాననం, బయ్యరణ్యంబునడుమ నమరనదియునుంబోలె గాళింది యొప్పారు, అవధూతసారంబైన యిక్కాంతారంబు విడిచిపోయి, యన్నెలవున సుఖంతము. మన

పల్లెలోని ముదుసళ్లు మచ్చిగ పేర్మి నిచ్చోటు విడువంజాలకున్న వారు...మన మీ ప్రొద్ద కదలవలయు...వల్లవముఖ్యాపనుపున సర్వజనంబులు పయనంబు సమకట్టుటయు వ్రేపల్లె నెల్ల కడల—

''బండ్ల మెట్టింపుపై బరువులెక్కింపుమీ
దళ్లను బూన్పు కావళ్లనునుపు
పదిలంబుగా నేఁతిపనఁటులు, క్రొత్తగో
నియల బియ్యము పడ్లు నెమిలి వడ్లు
నొాదివిరి ప్రాలును నొనరంగఁ బోసి, చా
పలు మంచములుమీఁద బలియఁగట్టు
దామెనలును వల్లెత్రాళ్లును దలుగులు
కవ్వము ల్గొాడవలి కత్తి సూడు
గొాడుపు వాఁదోళ్లు మొదలుగాఁ జెడకయుండ
వలయు ముల్లెల్లఁ దెమ్ము, కంటలపు టెడ్ల
నాయితము సేయు, ముదుసళ్ల నాడువారి
గంపమోపులు ముందరఁ గదలు మనుము.''

అని పెక్కుభంగుల మెలుంగుల గోలాహలం బెసఁగ, మంద యంతయు నొక్కపెట్టఁ గదలి, లావుమానుసులు కదుపులం గొాని ముందరం బోవ, పిఱుంద బండ్లును, బండ్ల జాడఁ దక్కిన ప్రజయు నడువం, దరుణతరుణీజనంబు లొండొరులతోడి మేలంపు టాలాపంబుల వినోదంబులఁ గడచి చనం, బంగ్వాంధజరఠప్రముఖులు గ్రుస్సి యొాలాకుపడం గావలివై తగువారు నడపింప బృందావనంబు బ్రవేశించి.

ఒక యామడ పఱపిదియని
సకలజనము చూడ నర్ధచంద్రాకృతియై
శకటావళి విడియఁదఁ గడు
వికటస్థితి నెల్లవారు విడిసిరి గలయన్.

గుడిసెలు వన్నియున్ ఘననికుంజములు లిండులుగాఁగ సొచ్చియున్
బెడఁగగు జొంపముల్గలిగి పేర్చిన మ్రాఁకులక్రింద నుండియుం,
గడక నెలర్ప దొడ్లకును గ్రంపలపై చియు న్నొక్కనాఁటిలో
నడరఁగఁ బ్రాఁతకాపులయి రక్కడ గోపకుటుంబు లందఱున్.

శృంగారంబులు సేసి గోపికలు భాసిల్లంగ, గోపాలు రు
త్తుంగాంగంబులతోడ నెల్లకడలం ద్రుళ్ళంగ, గోబృందముల్
మాంగల్యాకృతిఁ గ్రాల, నెంతయును సామగ్ర్యంబునన్ బంధులు
ప్పొంగం బల్లె సముజ్జ్వలోత్సవములం బొంగారె నానాఁటికిన్.

(హరివంశమునుండి)

## చంద్రోదయసమయోదధి

బిగియుల్లసిల్లెడు పగడంపుఁ గెమ్మోవి
  చెలువంపు బింకంబు చిగురులొత్తఁ
దనరారు పులిననితంబబింబమున నా
  కులితమై ఫేనదుకూలమమరఁ
గ్రమ్ము ముక్తాఫలఘర్మాంబుకణములు
  చెదరి యెంతయు సౌఖ్యపదవి నొసఁగ
ఎసఁగు నుద్వృత్త మీనేక్షణరోచుల
  పొలపంబు లొయ్యారములు దలిర్ప
లలితభంగుల నొప్పు వేలావధూటిఁ
గ్రమ్మ వీచికరంబులఁ గౌఁగిలించి
ఘనరసోల్లాస లీలలఁ గ్రాలి క్రాలి
యుదధి తోతెంచుఁ జంద్రోదయోత్సవమున.

## పుష్పాపచయము

మునికాళ్లు మోపి నిక్కినఁ బదచ్ఛవి నేల
  యును బల్లవించిన యొప్పు మెఱయ

వలువేది నతనాభి బెళసి యొక్కింతసా
  గిన మధ్యమెంతయు ఘనతఁ దీయ
మొగమెత్తి మీఁదికి నిగిడించు చూడ్కుల
  గన్నులవిప్పెల్లఁ గానఁబడఁగఁ
గడలొత్తు కరమూలఘనకాంతి చూపఱ
  డెందంబుతో నిక్కి డెక్కొనంగ
ఒయ్య డాకేల దవ్వులనున్న తీఁగఁ
దిగిచి నఖదీప్తులంతంత దీటుకొనఁగ
లీలఁ బెఱకేల నచ్చరలేమయొర్తు
గోసెఁ బువ్వులు ప్రమదవికాస మెసఁగ.

## సంగీతమాధుర్యము

అమృతంపుసోన పైనడరినట్లై పాట
  చెన్నున ప్రోడులు చివుళులొత్తె
మారుతాహతిపేర మ్రాఁకులు దలయూఁపఁ
  దొడఁగె మరందమాధుర్యమునకు
ఇంపులగమిమైన యీ రాగరసము దీఁ
  గలకుఁ గోరకపులకముల నొసఁగె
సెలయేఱులకు నశ్రుజలములు దొఱఁగించె
  గిరులును మంజులగీతిఁ గరఁగె
ననిన బోలుఁ బొసఁగు నగుఁ దగుననఁగ, స
చేతనంబులెల్లఁ జిత్రరూపు
నట్లు సోగి నిలువ నంగనయొక్కతి
పాడెఁ గలమనోజ్ఞభంగు లలర.

## ఘర్మసమయము

పగళు తెలదోఁటనీడలు బ్రాఁతియయ్యెఁ
బగళులును రేలు దనుగాలి బ్రాఁతియయ్యె
రేలు వెన్నెలబయళులు ప్రియములయ్యె
రేలుఁబగళులు నిద్రలు ప్రియములయ్యె.

ఎండకన్నెన్నఁడు నెఱుఁగని క్రొమ్మావి
  నీడలఁ దనుపారు నెలవులందుఁ
గలిగొట్టుపువ్వులందలి తేనియలవానఁ
  దడిసిన పొదరిండ్ల యెడములందు
విరియ నూకించు క్రొవ్విదపు మల్లియమొగ్గ
  తెలదావిఁ జొక్కించు నిక్కలందు
రాయంచ యెఱకల రాయిడిఁ దుప్పర
  సల్లెడు కొలఁకుల చలువలందుఁ
దిరిగి తిరిగి, పెక్కుదెఱఁగుల యాటల
మెఱసి మెఱసి, చెన్ను మిగిలి మిగిలి
క్రాలఁ, బ్రొద్దు మాపకడనయ్యెఁ గలువల
మ్రొక్కు దైవమునకు నెక్కనఁగ.

దెసలను కొమ్మలొయ్య నతిదీర్ఘములైన కరంబులన్ బ్రియం
బెసఁగఁగ నూఁది నిక్కి రజనీశ్వరుఁ డున్నతలీలఁ బేర్చునా
కసమను పేరి భూరుహము కాంతనిరంతరతారకాలసత్
కుసుమచయంబుగోయుట కొకోయనఁ బ్రాఁకె సముత్సుకాకృతిన్

(నృసింహ పురాణమునుండి)

## నాచన సోమన
[14-వ శతాబ్ది]

## సత్యభామ - శృంగార వీరములు

అరచందురు డెందములోఁ
జొరఁబాఱి వణంకు తోఁకచుక్కయపోలెన్
నరకుండేసిన బాణము
హరి నిటలతటంబు నాటి యల్లలనాడెన్.

కాఁడినయమ్ముచే సొలసి కంసవిరోధి శిరోధి వ్రేలఁ జే
యాడక మూర్ఛవోయె, భుజగాంతకుఱెక్కలనొక్కలాగునం
దోడుగఁ దాలవృంతములు దూఁకొని చల్లనిగాలిచల్లెఁ దో
డ్తోడనె సత్యభామ, విభుఁడుం గనుఱెప్పలువిచ్చెఁ జెచ్చెరన్.

అట్లు సేదదేఱి యరవిందనయనుండు
సత్యభామఁజూచి "చంద్రవదన!
శార్ఙ్గమింద, నీవు సమరంబె కోరుదు
వవసరంబువచ్చె" ననుచు నిచ్చె.

ఇచ్చినఁబొంగి యచ్చెలువ యింపునుదెంపును, లోనమానమున్
మచ్చరముం బెనంగ మురమర్దనుపై, నరకాసురేంద్రుపై
నచ్చపుఁ జాయలం, గువలయచ్ఛదగుచ్ఛవిషచ్ఛటావలిన్
మెచ్చనివానిఁ గీల్కొలిపె మేలపుఁజూపుల, వాడితూపులన్.

గనయంబున్ గొనయంబు నెన్నడుముతోఁ గర్ణావతంసంబుతోఁ
జనుదోయిం గనుదోయి సాయకముతో సంధానహస్తంబుతో
జెనకంజేయుచు నేయుచుండె సతి లక్షీభూతదైతేయత
ర్జనగర్జారవజర్జరాంగరుధిరాసారంబు తోరంబుగన్.

అరవిందనయన శరముల
సరవిం దనయనువు జూపఁ జాపము గుడుసై
పరివేషము గల చంద్రుని
సరివేషము దాల్చె మొగము జగము నుతింపన్.

కమలముఖీకటాక్షకటకాముఖపాణినఖోపకారి వి
భ్రమ మణిపుంఖరింఖదభిరామరుచుల్ గరమొప్పెఁ జెక్కులం
జెమటల బత్రభంగములు చిందఱవందఱలై నఁ దోన సం
భ్రమమున వీరలక్ష్మి సమరక్రమరక్షకు వ్రాసెనో యనన్.

సత్రాజిత్తనయాకరాంతరధనుర్జ్యారావ మైరావతీ
సూత్రానర్గళనిర్గతస్తనితమై, సుత్రామచాపప్రభా
పాత్రభ్రూలతికావిలాసముల కొప్పంగప్పె శార్ఙ్గాంబుము
క్తక్రూరమహాశనుల్ దనుజరాడ్గాత్రంబు గోత్రంబుగన్.

తంత్రీవినోదంబు తడవు సైఁపనిప్రేళ్ళ
  గొనయంబు తెగలపై గోరుకొనుట
అద్దంబుపిడి ముట్ట నలయుపాణితలంబు
  లస్తకం బిరియించు లావుకలిమి
చెలికత్తె నొత్తిలి చీరలేని యెలుంగు
  సింహనాదంబుచేఁ జెదరకునికి
ప్రమదనర్తనకేళి పరిఢవింపని పదం
  బైగుతాణంబుల నలఁతబడమి
సోయగపుఁ జిత్రరూపంబు జూచుచోట
వేసరు విలోచనంబులు విస్మితదైత్య
లక్ష్య మీక్షించుటయు మొక్కలంపుగెలుపు
గైకొనియె సత్యభామ సంగ్రామసీమ.

అరిజూచున్ హరిజూచు—సూచకములై, యందందమందారకే
సరమాలాంమకరందబిందుసలిలస్యందంబు లందంబులై

దొరఁగం, బయ్యెదకొంగొకింత తొలఁగం, దోడ్తోశరాసారమున్
దరహాసామృతపూరముం గురియుచుం దన్వంగి కేళీగతిన్.

గొడుగుకామయు విల్లును బడగతోన
తుమురుసేసి రథ్యంబులఁ దునిమి వైచె
నతివ, యతఁ డొండుకోదండ మందికొన్న
నఱకె, వేఱె విల్లెత్తిన విఱుగనేసె.

సతి దైతేయపతిన్ నిశాతవిశిఖాసారంబులన్నొంప దే
వతలున్ సంయములు న్నుతించిరి, మఱిన్వ్యామాత్షి తత్సూతు ను
ద్ధతినేసెం దల నేలఁగూల నొకటన్, దైత్యాంతకుం డిచ్చె లా
లితకంఠాభరణంబుతో నతివకున్ లీలాపరీరంభమున్.

(ఉత్తరహరివంశము—౧ ఆ.)

## శ్రీనాథుఁడు

[15-వ శతాబ్ది]

### వింధ్యగర్వభంగము

రేవాతరంగశీకర
సేవాహేవాకపాకశిశిరమరుత్ప్ర
స్తావపరికంప్యమానజ
టావలియగు చతఁడు వింధ్యమల్లనఁ జేరెన్.

తాపసకులాగ్రగణ్యా
శ్రీపాదాంభోజయుగళచిహ్నశ్రేణీ
నైపథ్యపరమపుణ్యశి
లాపట్టంబగుచు నయ్యిలాధర మొప్పున్.

కర్పూరకదళికాకాంతారపవనంబు
లధ్వనీనులశ్రాంతి నపనయింప

మదురంగఁబండిన మాలూరఫలములు
  చెంచుకన్యలకుచశ్రీలఁ జెనయ
సురగవల్లీగాఢపరిరంభణంబులఁ
  బోఁకప్రసూఁకులకెంపు పొదలుకొనఁగఁ
బాటలీవకుళచంపకసౌరభముతోడ
  విచికిలామోదంబు వియ్యమంద
గమియ నామ్రాలచూడంబుగా ఫలించి
యంబరము మోచియున్న యుదుంబరములు
లీల బ్రహ్మాండభాండమాలికల భూష
లవధరించిన వృషభాంకు ననుకరించె.............

నలినప్రోద్భవసూతి కన్గొనియె వింధ్యక్షోణిభృత్కందరా
బలవద్గండశిలాభిఘాతవిలుఠత్పాథస్తరంగచ్ఛటా
స్ఖలనారంభవిజృంభమాణసటుఝుంకారస్ఫుటాంతర్మదన్
గలనాతత్పరభక్తలోకపరిరక్షాశర్మదన్ నర్మదన్.

దివిజముని నర్మదానదిఁ దీర్థమాడి
విమలభస్మంబు నిఖిలాంగకములఁ నలఁది
యమిత రుద్రాక్షమాల్యంబు లనువుపఱచి
భవుని నోంకారనాథుని బ్రస్తుతించె.

స్థావరంబైన రూపంబు జలదవీథి
నావరించుచు మొదల నున్నట్లయుండ
జంగమంబైన రూపంబు సవదరించి
యెదురుగా వచ్చె వింధ్యమహీధరంబు.

అతిథి కడునల్పుఁడైన, నత్యధికుఁడైన
నింటి కేతేరఁ బ్రియమందు నెవ్వఁడేని
వాని గౌరవ మది గౌరవంబుకాని
కాదు గౌరవ మాకారగౌరవంబు.

మొగులు ముట్టిన మహోన్నతాగ్రంబు శిరమోవఁ
 బాదాంబుజములకుఁ బ్రణతిఁ జేసి
అంతరంగమునం దెలి సత్యోన్నతంబైన
 సమధుహేమపీఠంబు వెట్టఁబంచి
దధ్యాజ్య మధుపుష్పదర్భాదికములైన
 యష్టాంగములతోడి యర్ఘ్యమిచ్చి
యాత్రాసముత్థితాయాసఖేదము వాయ
 సంఘ్రిసంవాహనం బాచరించి

క్రాంతిదీఱుట మెఱిఁగి. హస్తములు మొగిచి
వినయవినమితగాత్రుఁడై వింధ్యశిఖరి
తన గుహారంధ్రములు ప్రతిధ్వనుల సీన
వేల్పుదపసికి నిట్లని విన్నవించె.

"మహానుభావా! భవదీయ కటాక్షవీక్షారసప్రసారంబున... ప్రాగ్జన్మకృత పుణ్యంబులు ఫలించె. విశ్వంభరాభరణ దీక్షా ధురంధరంబులగు నాకులంబువారిలో మాన్యుండనైతి, ధన్యుండ; నొక్క విన్నపం బవధరింపుము. నీకు సేవాంజలిపుటంబు. నీ చూడని మహీధరంబులు లేవు. కొండలు లెక్కకుఁ బెక్కు కలుగుం గాకేమి, దిక్కుంజరంబులకు దిక్కై, కూర్మంబున కర్మిలియై, క్రీడాక్రోడంబునకుఁ దోడై, పాపఱేనికిం బ్రాపై యేనుబోలె నీ సర్వంసహాచక్రంబు భరింపఁగలయదియే? ఇప్పాట నాతోడం బ్రతిఘటింపగలది సురగరుడాశ్రయంబును, విబుధవేదండశుండా దండ చుళుకితోద్గీర్ణ స్వర్ణదీకాండగండూషితబ్రహ్మాండగోళంబగు సుమేరుశైలంబ; మా యిద్దఱ తారతమ్యం బెఱుంగుదు. నాకు నగ్గిరికి నిప్పు డీరసంబు వెరుగం గఱకటి నెట్టుకొని సాగుచున్న, దింక నెట్టుండు భట్టారకా! పక్షపాతం బుడిగి యానతిమ్ము."

అని యవష్టంభసంరంభ మతిశయిల్లఁ
బలుకుటయు నాత్మ గర్హించి నలువపట్టి

యొం డనాక, యొక్కింతసే పూరకుండి
యుస్సురనుచును వేడి నిట్టూర్పుపుచ్చె.

పదంపడి ఆ కలహప్రియుండు త్రిభువనోపద్రవకారణంబైన ఆ మహీధరసంఘర్షణమునకు సమ్మతించి యిట్లనియె.

"నాతో నీ విపు డెట్టులాడితి ప్రధానత్వం బపేక్షించి ప్ర
స్ఫీతాటోపమహాప్రతాపగుణగంభీరార్థయుక్తంబుగా
నాతో నిట్లని యాడె మేరువు ప్రధానత్వం బపేక్షించి ప్ర
స్ఫీతాటోపమహాప్రతాపగుణగంభీరార్థయుక్తంబుగాన్.

నీ వెఱుంగుదు నీలావు నిక్కువముగ
నెఱుఁగుఁ దనలావు తా నమ్మహీధరంబు
తప్పకుండ మీయిద్దఱతారతమ్య
మెంతవారును దెలియంగ నెంతవారు!

శ్రీశైలవేంకటాహోబిలాదిపర్వతంబులు మహానుభావంబున మీయిద్దఱకంటె నధికంబులు. మీ గర్వాలాపంబు లోర్వవచ్చునే? మాబోఁటి తీర్థయాత్రాపారీణుల కిది యేటి చింత? మీకు మే లయ్యెడు పోయివచ్చెద"నని నారదుం డరుగుటయు.

విబుధ మునిమాట చెవికిఁ గ్రొవ్వేఁడియగు, డ
వంధ్యగర్వోదయుండైన వింధ్యశిఖరి
చాల నుద్వేగమంది విచారపరత
నాత్మగతమునఁ దాను ని ట్లనుచునుండె.

[శాస్త్ర మాచార్యసన్నిధి జదువఁడేని
ఇద్ధబోధంబు మది సంగ్రహింపఁడేని
దెగువమీఱి ప్రతిజ్ఞ సాధింపఁడేని
జ్ఞాతిజయ మందఁడేని తజ్జనుఁడు జనుఁడె?]

కంటికి నిద్రవచ్చునె? సుఖంబగునే రతికేళి? జిహ్వకున్
వంటక మిందునే? యితరవైభవముల్ పదివేలు మానసం

బంటునె? మానుషంబుగలయట్టి మనుష్యున కెన్నఁడేనియున్
గంటకుఁడైన శాత్రవుఁడొకండు తనంతటివాఁడు కల్గినన్.

ఎవ్వనితో నెచ్చోటం
జివ్వకుఁ జేసాచవలదు, చే సాచినచో
నివ్వాల నవ్వాల నెవ్వరు
నవ్వకయుండంగఁ బగ సనన్ దీర్పఁదగున్.

ఉప్పరమెగసి యజాండము
చిప్పలురాలంగ మేరుశిఖరమ్ములపై
గుప్పించి దాఁటుకొందునొ
తప్పక నామనసులోని తహతహ దీఱన్.

ఒక్కఁడు మాకొలంబున సముద్ధతి జూపిన జాతరోషుఁడై
ఱెక్కలుద్రెంచి వేలుపులతేఁ డటు పాపముచేసెఁగాక, యా
ఱెక్కలు నేఁడుగల్గిన నెఱింగి జవంబునఁ బాఱుతెంచి బి
ట్టెక్కనె కూటకోటితటులెల్లను నుగ్గులుగాఁగ మేరువున్.

అడుసులోపలఁ దాటిపం డదిమినట్లు
లదుముదునెగాక పాతాళమంటికొనఁగ
వేల్పులెల్లను విభ్రాంతి విహ్వలింపఁ
బాదములు మెట్టి నాదాయ బసిడికొండ.

ఈయైశ్వర్యము జూడఁజాలుదునె నేనిప్పాట నానాఁటికిన్
రే యిందుగ్రహతారకంబులు, పగల్ నీరేరుహాప్తుండు సే
వాయోగంబు మెయిం బ్రదక్షిణముగా వర్తిల్లఁగా నిర్భరా
సూయామానపరీతచేతసుఁడనై శూన్యోద్యమప్రక్రియన్.

అడ్డపెట్టెదఁగాక తీవ్రాంశురథము
ప్రహరి దిరుగకయుండఁగ భర్మగిరికిఁ
దరతరమ్మా యజాండకర్పరముదాఁక
ఘనశిరశ్శృంగశృంగాటకములు పెంచి.

అవరోధించెను వింధ్యభూధరము ప్రభ్వధ్వంబు దర్పోద్ధుర
వ్యవసాయోద్భటరౌద్రభంగి నురులింగాకారుఁడై యీశ్వరుం
డవరోధించిన గర్వరేఖ, బలిదైత్యధ్వంసినారాయణుం
డవరోధించినతేవ మూర్ధ మొగి నూర్ధ్వాండంబుతో రాయఁగన్

విసృమరధ్వాంతౌఘవిధ్వంసనక్రియా
  పరమదీక్షారంభగురుమయూఖ
దశశతపరిషదాధారమండలుఁడైన
  చండభానుని కక్ష్యాస్థానమగుట
భారంబు భరియింప బరువు పడ్డదివోలె
  మూఁపుమూఁపుననుండి మొక్కలమున
ననిలంబు లేదును నంచెలంచెలు గట్టి
  యాకాశవీధి నందంద నడవ

నడచు రవితేరు మింటినెన్నడిమిచక్కి
బ్రగ్గనఁగఁదాఁకె వింధ్యపర్వతము చఱులఁ
గఠిననిర్ఘోషనిర్ఘాతఘట్టనమునఁ
బంకజాతభవాండకర్పరము పగుల.

తగులుపడి యపుడు పడిసెడి
గగనమణి రథంబు దొరగలువడి నిలిచెఁ
బాగరుమొగకడలి యక్కలి
దగిలి నిలువఁబడిన ఘనవితతియుంబోలెఁ.

ఒక్కనిమేషము రాహువు
పుక్కిటిలోఁ దగులువడకపోయెడు భానుం
డిక్కొండప్రక్కఁ జిక్కం
బెక్కుఁడులు విధివశంబు పెంపెట్టిదియో!

పూచినకొరవిపూఁబొదరింటిచందానఁ
  గత్తెర యొక్కచోఁ గదలకుండె

నొకచోఁ దగుల్పడె నుపకారికొఱటికిఁ
దరమైన రోహిణీతారకంబు
నొకచోఁ బునర్వసు వ్రాఁగె వృక్షముకొమ్మ
సుడివడ్డ ముత్యాలసోఁగువోలె
శయనించె నొకచోట శ్రవణనక్షత్రంబు
గుంటిమీఁదటి ప్రత్తికొడుపువోలె
స్వాతిచిత్తలు తోరణస్తంభయుగము
ననుకరించుచు నొక్కచో నత్తమిల్లెఁ
జిఱుతవోయిన మూఁకుటిచెలువుదాల్చి
హత్తె నొకచో విశాఖ వింధ్యాద్రియందు.

నేత్రంబు లున్మేషనిస్పృహత్వమునొంద
శ్రుతిపుటంబులశక్తి చొక్కుమడఁగ
ఘ్రాణేంద్రియజ్ఞానకళ యారుసొరుగా
జిహ్వా వివేకంబు చిఱుతవోవ
నంతరంగమున మోహాంధకారము గ్రమ్మఁ
దనువు చేష్టాదరిద్రతవహింపఁ
బ్రాణముల్ శ్వాసమాత్రమునఁ బర్యవసింపఁ
దలచీర యెఱుఁగని దశఘటిల్లఁ

బాముగఱచిన మూర్ఛిల్లిపడినయట్లు
పడిరి పాశ్చాత్యదేశంబుపంచ జనులు
తరణిదీధితిలేమిఁ జైతన్యమెడలి
వితతనిద్రాసమావేశవిహతులగుచు.

ఇవ్విధంబున నకాండప్రళయంబు సంభవింప మునులును దేవతలును బ్రహ్మనిదేశంబున కాశీనగరవాసియగు నగస్త్యమహామునిం బ్రార్థింప, నాతండు కాశీవిరహాసహిష్ణు వయ్యు లోకహితార్థం బియ్యకొని, ఆ నగరంబు వెడలి ప్రతిదినప్రయాణంబుల వింధ్యాచలంబు డాయం జనుదెంచి విషమదృషత్ఖండవిలసనస్థలంబును,

జరత్తరుకోటరజఠరలుఠదజగరగళగుహానిష్ఠ్యూతనిష్ఠురపవన సంధుక్షమాణదవదహనశిఖాకలాపంబును, క్రీడచ్చిక్రోడశిశుచరణనఖశిఖరవిశీర్యమాణశిఖరశేఫాలికాకుసుమకేసరరజః ప్రసరధూసరవాసరకరకరవ్రాతంబును, పరుషతరుపవనబిలపతితపచేళిమదధఫలభక్షణఫుల్లగల్లభల్లూకప్రకరంబునగు గహనంబు జొచ్చి,

నలి వింధ్యాచలకాననాంతరమున న్వారణాసీత్యాగవి
హ్వాలభావంబున నిల్చినిల్చి హర! నీహారాంశుమూర్ధన్య! ని
ర్మల! కాశీశ్వర! నీలకంఠ! యనుచుం బ్రమోఁగన్నువాటిల్లఁ ద
త్కలశీసూనుఁడు మూర్ఛగైకొనుఁగ్రమత్సౌమాత్సురోల్లాసియై.

అల్లనల్లన వచ్చు కుంభసంభవు దవుదవ్వులంగాంచి కాంచనశిరశ్శృంగశృంగాటకంబులం గమలభవాండకటాహంబు లుద్ఘాటించు తన మేనిపొడవు నేల సపాటంబుగా వంచి వింధ్యం బమ్మహానుభావు నెదుర్కొనె. అపు డర్కునిరథంబు చక్కఁ జాయ నడచె. కాలంబు లేర్పడియె. ఆ జగతీధరంబు కొన్ని యజ్జలం బ్రత్యుద్గమించి,

ప్రణవపంచాక్షరోపనిషత్ప్రపంచంబుఁ
  గడదాఁక నెఱిఁగిన కఱదలాని
వాతాపిదైత్యు నిల్వలునితోఁగూడంగ
  జఠరాగ్ని వేల్చిన సవనకర్త
గోపించి నహుషుని కుంభీనసంబుగా
  హుంకారమిచ్చిన యుగ్రతేజు
వానకాలమునాఁడు వండువట్టిన నీటి
  కాలుష్య ముడిపెడు కతకఫలము

పాండుభసితత్రిపుండ్రాంకఫాలభాగు
భద్రరుద్రాక్షమాలికాభరితవక్షు
భార్యయును దాను నేతెంచు పరమశైవుఁ
గాంచె వింధ్యాచలేంద్రంబు కలశభవుని.

కాశీనగరవియోగ
క్లేశభవక్రోధవహ్నికీలల నాశా
కాశధరిత్రీవలయము
లాశుగతిం గాల్పఁగడఁగునట్టి మహోగ్రున్.

కాంచి, అతిథిసత్కారసంభావనావిశేషంబులఁ బరితోషంబు సంపాదించి, కరాంబురుహంబులు మోడ్చి "మహానుభావా! నీ యాజ్ఞాప్రసాదభావంబున నను గృతార్థుం జేయు"మనిన.

"వింధ్యాచలేంద్ర! పృథ్వీభృత్కులశ్రేష్ఠ!
  దక్షిణాపథము తీర్థంబులాడఁ
బోవుచున్నార మీపువ్వుఁబోఁడియు నేను
  బెద్దకాలమునాఁటి పెరువఁగాన
లావు చాలదు, జరాక్లైబ్యంబు కతమునఁ
  బాడవెక్కునప్పుడు డిగెడునపుడు
అభ్రంకషములైన యానీశిరశ్శృంగ
  శృంగాటకములిట్లు చిఱుతపఱచి

అనఘ! నే గ్రమ్మఱఁగ వచ్చునంతదాఁక
నుండవలయు ధరిత్రిలో నొదిఁగి నీవు
చేయు నా యాజ్ఞ లెస్సయాఁ, జేయకున్న
నెఱిఁగెదవుగాక రజ్జాడనేల యిపుడు"

అనిన వింధ్యంబు "మహాత్మా! చరాచరంబైన జగంబునందు నీయాజ్ఞ జేయనివారునుంగలరె? నీవు మరలి విచ్చేయునంత దాఁకను నిట్ల యుండెద" ననినఁ గుంభసంభవుం డతని దీవించి, నిజపాదాంభోరుహవిన్యాసంబుల విశ్వంభరాభాగంబు భాగ్యవంతంబు గావించుచు దక్షిణదిశాభిముఖుండై చనియె.

( కాశీఖండమునుండి )

## మేదరవాడ

ఎకసక్కెముగనాడు నేదైన నొకమాట
 పాడునొయ్యనఁబాట పాటపాట
అలఁతియద్దపుబిళ్లయలవోక వీక్షించుఁ
 గొనగోరఁబదవిచ్చి కురులుదీర్చుఁ
బయ్యెద దిగజార్చి పాలిండ్లు పచరించు
 దిస్సువాఱగనవ్వు దీఁగనవ్వు
ధవళతాళపలాశతాటంకములు ద్రిప్పుఁ
 గలికిచూపులఁ జూపు గర్వరేఖ
కటకుటీద్వార వైణవకాష్ఠపీఠ
మధ్యభాగనిషణ్ణయై మదముమిగిలి
వీటి పామరవిటుల తంగేటిజున్ను
కాము బరిగోల మేదరకర్ణవేశ్య.

## ఓరుగల్లు

సప్తపాతాళవిష్టపమహాప్రస్థాన
 ఘంటాపథంబైన గనపపరిఖ
తారకామండలస్తబకావతంసమై
 కనుచూపు గొనని ప్రాకారరేఖ
పుంజీభవించిన భువనగోళముభంగి
 సంకులాంగణమైన వంకదార
మెఱుఁగుటెక్కెలతోడి మేరుశైలముబోలు
 పెనుబైడి తలుపుల పెద్దగవని
చూచెఁ జేరెఁ, బ్రవేశించెఁ, జొచ్చెఁ బ్రీతి
సఖుఁడు దానును రథఘోటశకటకరటి
యూథసంబాధముల కొయ్య నోసరిలుచు
మందగతి నోరుగల్లు గోవిందశర్మ.

అదిగో యెత్తినవారు పట్టనము మధ్యక్షోణి సింహధ్వజం
బదిగో కట్టినవారు నింబదళమాల్యతోరణవ్రాతముల్
విదితంబయ్యె మహోత్సవంబు నెఱయ న్వీధీవిటంకంబులం
దదిగో నిల్పినవారు పూర్ణకలశం బాబాలవృద్ధాంగనల్!

అదె! భైరవస్థాన మటమీఁద నల్లదె
  చమదేశ్వరీమహాశక్తినగరు
వీరభద్రేశ్వరాగారమంటపమదె!
  అదె! బౌద్ధదేవు విహారభూమి
అదె! ముద్దరాల్మసానమ్మ నివాసంబు
  నల్లదె! కొమరుసామయ్యనగరు
అదె! పాండవులగుడి యట దక్షిణంబున
  గర్తారుడుండు తురకలమసీదు

కొంతదవ్వుల నదె! మహాగోపురములఁ
బైడికుండలు రవిదీప్తిఁ బ్రజ్వలించి
కానవయ్యెను మేరుశృంగములబోలెఁ
గేశవశ్రీ స్వయంభూని కేతనములు.

## వంటపూటిల్లు

ఉడువీథిన్ శిఖరావలంబియగు నంధ్రోర్వీశుమోసాలపై
గడియారంబున మ్రోసె రెండెనిమిదుల్ ఘంటాఘణాత్కారముల్
సడలెన్ భానుఁడు పశ్చిమంబునకు వైశ్యా! పూటకూటింటికిన్
గుడువంబోదమె రొక్కమిచ్చి కడు నాఁకొన్నార మిప్పట్టునన్.

సంధివిగ్రహయానాదిసంఘటనల
బంధకిజారులకు రాయబారియగుచుఁ
బట్టనంబున నిత్యంబు పగలు రేయుఁ
బూటకూటింట వర్తించుఁ బుష్పశరుఁడు.

కప్పురభోగివంటకము కమ్మని గోధుమపిండివంటయున్
గుప్పెడు పంచదారయును గ్రొత్తగఁగాఁచిన యాలనే పెస
ర్పప్పును గొమ్మునల్ల నఁటిపండ్లును నాలుగునైదు నంజులున్
లప్పలతోడఁ గ్రొంబెరుఁగు లక్ష్మణవజ్ఝలయింట రూకకున్.

## మైలారభటులు

ఱవఱవమండు నెఱ్ఱని చంద్రమల్లెల
  చోద్యంపుగుండాలు చొచ్చువారు
కరవాడి యలుఁగుల గనపపాఁతర్లలో
  నుట్టిచేరలుగోసి యుఱుకువారు
గాలంపుగొంకి గంకాళచర్మముగ్రుచ్చి
  ఉడువీథి నుయ్యేల లూఁగువారు
కటికహొన్నాళంబు గండగత్తెరవట్టి
  మిసిమింతులునుగాక మ్రింగువారు

సందులను నారసంబులు సళుపువారు
మెడమకుడిచేత నారతు లిచ్చువారు
సాహసము మూర్తిగైకొన్న సరణివారు
ధీరహృదయులు మైలారవీరభటులు.

వీర మైలారదేవర వీరభటులు
గొండ్లి యాడించుచున్నారు గొరగపడుచు
నాడుచున్నది చూడు మూర్ధాభినయము
తాను నెట్టికసీలంతగాని లేదు.

వెనుకకు మొగ్గవ్రాలి కడు విన్ననువొప్పఁగ దొట్టెనీళ్లలో
మునిఁగి తదంతరస్థమగు ముంగర ముక్కునఁగ్రుచ్చుకొంచు లే
చెను, రసనాప్రవాళమున శీఘ్రముగ్రుచ్చెను నల్లపూసపే
రనుపమలీల నిప్పుడు చుపాయము లిట్టివి యెట్టునేర్చెనో.

## శ్రీకాకుళపు దిరునాళ్లు

జవరాలి బోడగన్న సన్యాసిపై నేయుఁ
  దులసి లేఁజిగురాకుదూపు మరుఁడు
వేదవిప్రునిగన్న విధవపై ఝళిపించు
  దర్భపల్లవహేతి దర్పకుండు
కటకారకులకన్య గన్న హాలికుమీఁదఁ
  బొడుచుఁ బూములుకోల పుష్పశరుఁడు
నాడింధమునిగన్న నాతిపై నేయును
  నలరు జిచ్చుఱకోల నంగభవుఁడు

బెరసి వెన్నెలగాయంగఁ బేరకమ్మ
పులినతలముల నాయూయి కొలములెఱిఁగి
తాల్చు శస్త్రాస్త్రములు జారదంపతులకు
నసమబాణుండు తిరునాళ్ల నన్నినాళ్ల.

## పాముల మెంగడు

కడగోరదీర్చిన కస్తూరిగీర్బొట్టు
  నెక్కసక్కెంబుగాఁ జుక్క మెఱయ
అడ్డంబు ద్రికటంబునై యురస్థలమున
  గంధసారస్థాసకములు మెఱయ
చాలనిగ్గులుగుల్కు పాలపెక్కలకుచ్చు
  వామకర్ణంబుతో వక్కళింపఁ
పెనచి వెండ్రుకలతోఁ బెనవెట్టి చుట్టిన
  ప్రాఁతచెంద్రికవన్నెపాగ యమర

జన్నిదంబుగఁ బెనుబాము సవదరించి
అంఘ్రికటకంబు ఘల్లుఘల్లనుచు మొరయ
ఆహితుండికగరళవిద్యాధిరాజు
వచ్చెఁ బాముల మెంగఁడు వదరులాఁడు.

ఫూత్కారపవనంబు పూరించుఁ బుక్కిళ్లు
  మునిడిపండులతోడ ముద్దుగురియ
సందిటి సంకుపూసలసద్దు కటుతుంబి
  నాదస్వరోజ్జృంభణముల నడఁప
నేఁడు రంధ్రమ్ములు నిరుగేలఁ వ్రేళ్లను
  వివృతిసంవృతిలీల వి స్తరింప
ఆలాపతాళాంతరాంతరంబులయందు
  వికనుశబ్దముల్ చొక్కటముగ

నాగసింధుప్రభేదనానావరాట
రాగగంధర్వలహరికారంభణముల
మిహిపదంబుగఁ బాములమెంగఁ డూఁదె
భోగిరాజులు వర్తింప నాగసరము.

## మేష యుద్ధము

. . . రెండు మేషకంఠీరవంబులు. . .కంఠగ్రైవేయఘంటికా టంకారంబులును, విషమవిషాణకోటిఘటితకపాలాయసాశ్వత్థపల్లవగుళుచ్ఛరింఛోళికాఘుణఘుణాత్కారంబులు చెలంగ యుద్ధక్రీడాసన్నద్ధంబులై వచ్చుచున్నయవి.

ఉభయము భావవీధి జయమొందినభంగి భయంబొకింత లే
కభిముఖమయ్యె, వెన్వెనుకకై యటకొన్ని పదంబులేగుచున్
రభసముతో దువాళిగొని భ్రగ్గనఁదాఁకెడు చూడు సెట్టిటి
ట్టిభ! దిఢిఢీయనంగను గడింది నదభ్రము లీయురభ్రముల్.

నిటలమ్ము లవిసి నెత్తురు
సొటసొట వడియంగ సమరశూరోత్తములై
కటుకునను మొండు తగరులు
చటులాటోపమున రెండు సరిబడఁ బోరెన్.

వట్టి వెదురుమోపు వైచినచందాన
గుండు గుండుమీఁదఁ గూలినట్లు
కడిఁది(వ్రాఁత మేషకంఠీరవంబులు
తాఁకి తాఁకి తస్సి తట్టువాఱె.

హాహా! నృపాలసింహాసనాధిష్ఠాన
రత్నకంబళకాభిరామరోమ!
మజ్ఝా! కృపీటసంభవమహాదిక్పాల
హేలావిహారవాహ్యాళివాహ!
మాయురే! ప్రవిలంబమానాండసంపాత
కుతుకానుధావితక్రోష్టురాజ!
అహహా! శ్రీ వీరభద్రావతారమహేశ
నిహతదక్షకబంధనిహితవదన!

బళిర! మేంఠరాజ! బాపు హురభ్రేశ!
ఔర! యేడకేంద్ర! యరరె తగర!
సుమ్మ! హుంక్రియాభిమానాదరిద్రాణ!
మేలుమేలు గొఱ్ఱెమిండగీఁడ!

## కోళ్లపోరితము

పారిజాతపుఁబూవునాఁబరగుఁ జూడు
తామ్రచూడంబు చూడాపథంబు జొత్తు
దర్పభరమున బ్రహ్మరంధ్రంబు నడుము
జించి వెడలిన క్రోధాగ్నిశిఖయుఁబోలె.

ఈజగజెట్టి కోడిపుంజులు మెడలు నిక్కించుచు, ఱెక్క లల్లార్చుచు కొక్కొక్కొ యని కాల్దువ్వి, క్రొవ్వుమిగిలి, తరళతార కోద్వృత్తరక్తాంతలోచన మండలంబులై, ఒండొంటిం గదిసి, చుఱు చుఱుఁజూచి కోపాటోపంబున నుప్పరం బెగసి, చరణాంగుళీకుటిల

నఖశిఖాకోటికుట్టనంబులఁ జిరుదోగడులెగయ వక్షస్థలంబులు వ్రచ్చి వందఱలాడియు,...నడునెత్తి జొత్తిలునెత్తురు వఱ్ఱుగాఁ గఱచియు, ...సవ్యాపసవ్యంబుల నోహరిం బక్షవిక్షేపంబుల బడలువడ నడిచియు, నొడిచియు, నడికినడికి దప్పించుకొని సడిచప్పుడుగాక యుండం గాళ్లక్రిందికి దూరియుఁ, జీరియు, మాటిమాటికి 'ఘాట ఘాటఘాట' యని కృకాటం బుక్కుదంటసంబులంబోని ముక్కులం జెక్కులం జిక్కగానొక్కి యిట్టట్టనక బెట్టూనిపట్టి, ...వంకలగు కొంకికత్తులం గడుపు లొడిచికొని చించిచెండాడి, ...అమోఘ పరాక్రమంబు నెరపి, వీరవ్రతం బేపార, వాహ్యాళీమండలంబునఁ దమకుఁ దార పాయగిలఁబడి పోటుగండ్లరొప్పు రుధిరంబులం దొప్పఁ దోఁగి మూర్ఛాంధకారంబున మునుఁగుచున్నయవి.

హా! కుమారస్వామి యాపవాహ్యములార
  హా! మంత్రదేవతాస్వాములార
హా! కాలవిజ్ఞానపాకకోవిదులార
  హా! భూతభుక్తికుంభార్హులార
హా! అహల్యాజారయభయహేతువులార !
  హా! బలాత్కారకామాంధులార
హా! నిరంకుశమహాహంకారనిఘులార
  హా! కామవిజయకాహళములార

హా! ఖగేంద్రములార! కయ్యమున నీల్గి
పోవుచున్నారె దేవతాభువనమునకు
మీరు రంభాతిలోత్తమా మేనకాది
భోగకార్యార్థమై కోడిపుంజులార!

(క్రీడాభిరామమునుండి)

## భట్టు నలగామరాజుకు చెప్పిన రాజనీతి

మలిదేవభూపతి మన్నించి యిటకు
నన్నుబుత్తెంచెను నరనాథ వినుము.
పగ వృద్ధిబొందించు భ్రష్టులెకాని
అడఁగించునేర్పరు లవనిలో లేరు...
పోరు మంచిదికాదు భూమినెక్కడను
పాడౌను దేశంబు పగ మించెనేని
ప్రజలెల్ల నశియించి పాఱిపోవుదురు
బండారమునకును పైకంబు లేదు
రాణువ లందుచే రహి చెడియుండు
చేజీతగాండ్లెల్లఁ జెలఁగి కోపించి
ఈగలజీతంబు లిమ్మందురపుడు
పతిబంటుమేరలు పరిహృతమగును
పంపినపనిచేయ పాలుమాలుదురు
తెలిసినశాత్రవుల్ ధీరతతోడ
భూమినిగొనుటకు బుద్ధిపెట్టుదురు
మేకొని మీలోనమీరు పోరాడఁ
జూచెడువారికిఁ జులకనయౌను.
పలువలు మిముఁజేరి పగ జావనీక
చెప్పుచునుందురు చెనఁటివాక్యములు
ఐకమత్యమ్ముచెడు, నద్దానితోడఁ
జెడును బలంబును, చెడును భాగ్యంబు
చెడును యశంబును, చెడును శౌర్యంబు
చెడును రాజ్యంబులు చెడ్డపిమ్మటను
దేశంబు పరనృపాధీనమౌసుమ్ము.
పారతంత్ర్యంబు మీపైఁబడఁగలదు
పరతంత్రజనములపాలి కష్టములు
చెప్పంగ నలవియే శివునకునైన.

పంజరంబుననున్న పక్షులరీతి
బంధించి బుట్టలోఁ బాములవాఁడు
వదలక పెట్టిన ఫణులచందమున
గంగిరెద్దులవాఁడు కావరమణఁచి
ముకుఁద్రాడు పొడిచిన పోటెద్దులట్లు
బోనులోనుంచిన పులులవిధంబు
స్వాతంత్ర్యహీనతఁ బడియుండవలయుఁ
బరికింపఁగా మనోవాక్కాయములను
ప్రథమంబు పట్టగారానిదిగాని
వాక్కాయములు రెండు బంధింపఁబడును.
మనసులోఁబుట్టిన మంచితలంపు
లాచరణమునందు నలవికాకున్న
జన్మఫలంబేమి చచ్చుటే మేలు
అవ్యక్త కీట తిర్యగనేకహీన
యోనులలో నెన్నియోమార్లు పుట్టి
పడయక పడయక పడసినయట్టి
దుర్లభనరజన్మ దూషితంబగును
పార్థివా! యిటువంటి పారతంత్ర్యంబు
కటకటా పగవారికైనను వలదు.

( పలనాటి వీరచరిత్రనుండి )

## పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

[15-వ శతాబ్ది]

### శకుంతలా కల్యాణయాత్ర

అవి ప్రసంగవశంబునం గొన్ని కులకన్యాకాధర్మంబు లెఱిం గించి యనసూయాప్రియంవదలు మున్నుగాఁ గొందఱు వృద్ధతపస్వినీ జనంబులను, జతురమతులగు నిద్దఱు శిష్యులం దోడువెట్టి శకుం తలన్ దుష్యంతుపాలి కనుప సమకట్టి,

ఘొమ్మనఁజూచుఁ, జూచి మదిఁబుట్టినప్రేమము పేర్మి బాష్పముల్
గ్రమ్మినఁ గ్రమ్మఱం బెడమొగంబయి కన్నులనీరు ద్రింగుచున్
గ్రమ్మఱఁ దా శకుంతల మొగంబగు, నశ్రులునించుఁ గొంతసే
పమ్ముని జాలిఁబొంది ధృతియంతయు నిల్వక విచ్చిపాఱఁగన్.

ఎంచ మునీంద్రులందు విజితేంద్రియుఁడైన తపస్వి కూర్మిగా
వించి శకుంతలం బెనిచి విస్మృతి నొందిన మోహపాశముల్
ద్రెంచుకొనంగలేక తియతీపులఁ జిత్తము గాసివెట్టె; శీ
లించిన నెవ్వఁడింక వదలింపఁగ నోపెడు మోహబంధముల్ ?

క్రకచధారాకఠోరంబైన కర్కుల
 గ్రొవ్వాఁడి కొడవంటఁ గోయరాదు
కూలాయసోద్దామ కుద్దాలములఁ ద్రవ్వి
 వ్రేళ్లతోఁ బెకలించి వేయరాదు
సమిధాజ్యముల నగ్నిసమకొల్పి దారుణ
 శిఖలఁ గాలిచి నీఱుసేయరాదు
ఘనముష్టిఁ గబళించి కవట లుద్ధతిఁబట్టి
 తెగఁ జేతితోడ రాఁ దీయరాదు
హృదయమను పాదులోపల నుదయమంది
తల్లిదండ్రులమీఁద సోదరులమీఁదఁ

దనయబంధుకళత్రమిత్రకులమీఁద
మూరివోవంగఁ బ్రాఁకిన మోహలతను.

ఇట్లు బంధురంబగు మోహలతాబంధంబున నమ్మునిసింధురంబు కట్టువడి ప్రకృతిజనంబుకై వడి శకుంతలాభిముఖుండై ......

"నాపయి కూర్మి తద్గురుజనంబులపై నిడి, మానికన్యకా
స్థాపితవృత్తి బంధువనితాతతియందు ఘటించి, యిష్టస
ల్లాపములందు నిచ్చటుఁదలంపక నిచ్చలుఁ బ్రాణనాథసే
వాపరతంత్రవై యెటుల వన్నియఁదెచ్చెదో నాకుఁ బుత్రికా!

ఎన్నఁడు నామది న్మఱతు నే నిటఁబుత్రిక! పూఁటపూఁట యా
పన్నసరోవరంబునను సంస్మరణం బొనరింప సంతత
స్విన్నమరందసిక్తసరసీజముఁ జూచి మదంతికంబునం
గన్నులు నీటితోడఁ గుళికంబగుచున్న భవన్ముఖాబ్జమున్.

కొంత సుఖంబునుం గలదు కోమలి! నాకిటఁ బర్ణశాలికా
ప్రాంతమునందు నీవు పెనుపం బరువొందిన మాలతీలతా
క్రాంతమనోజ్ఞమైన సహకారముఁ గన్గొనునప్పుడెల్ల దు
ష్యంతుఁడు మాశకుంతలయు సంగడి నుండుటగాఁదలంపఁగన్.

అని ప్రేమాతిశయంబున లతాతరువితానం బవలోకించి

అలసెఱుంగక తావకాలవాలములకు
నెమ్మితో నిరవొంద నీరువోసి
క్రమవృద్ధిఁబొందు మార్గంబు లారసివచ్చి
పూఁటపూఁటకుఁ జాలఁ బ్రోదిచేసి
ప్రేమాతిరేకత ప్రియమండనమునకుఁ
జిగురాకుఁ గొనగోరఁ జిదుమవెఱచి
పరిపాటి నల్లనఁ బ్రసవోద్గమంబైన
సఖులుఁ దానును మహోత్సవమొనర్చి

తల్లియై పెంచె మిమ్మును దలిరుఁబోఁడి
యత్తవారింటి కరిగెడు నా లతాంగి
క్షితిరుహములార! పుష్పితలతికలార!
యనుమతింతురు గాక కల్యాణయాత్ర!

తోడునీడయుఁబోలె నీ తోయజాక్షి
పెరిఁగె నిన్నాళ్లు మీలోనఁ బెద్దయయ్యెఁ
బురుషునింటికి ననుపక పుట్టినింట
ననుచుకొనరాదుగా'' యంచు, నుస్సురనుచు,

ఎట్టకేలకు ధైర్యంబు వట్టుకొని శకుంతలం దోడ్కొని యగ్నిహోత్రంబునకు దండంబువెట్టించి మునులకు నమస్కారంబుఁ జేయించి పుణ్యతపస్వినీ జనంబులకు మ్రొక్కించి తదీయాశీర్వాదంబులతోడఁ దానును దీవించి యనుపుటయుఁ, దండ్రి పాదంబులకుఁ బ్రణామం బాచరించి,

జనకుఁడుండెడు ననుష్ఠానవేదికఁ జూచుఁ,
జూచి, క్రమ్మఱఁబోయి, చూడవచ్చు
స్నానార్థనియమితజలజాకరముఁ జూచుఁ
జూచి, క్రమ్మఱఁబోయి, చూడవచ్చు
నిజహస్తపోషితకుజవల్లికలు చూచుఁ,
జూచి, క్రమ్మఱఁబోయి, చూడవచ్చుఁ
గుంజకోటరకుటీక్రోడ వీథులు చూచుఁ,
జూచి, క్రమ్మఱఁబోయి, చూడవచ్చుఁ

దండ్రిఁ బాయంగలేని సంతాపజలము
నత్తవారింటి కేగెడు హర్షజలము
గోరువెచ్చన పాలిండ్లకొనలు దడుప
నెడపఁదడపనఁ బయ్యెదఁ దుడిచికొనుచు,

కదలు నాలుగుమూఁడుఁ బదములు, క్రమ్మఱి
తండ్రిపాదంబు లొందల ఘుటించుఁ

గొంతదవ్వేగు, నేగుచువచ్చి కణ్వుని
  కడుపులోఁ దలమోపి కౌఁగిలించు
నరుగుఁ గొండొక, వేగఁదిరిగి మానులకు 'మా
  యయ్యసుఁడీ' యని యప్పగించు
గమనించుఁ, బెడమర్లి కాశ్యపు దెసఁజూచి,
  'నేఁ బోదు' నంచుఁ గన్నీరునించు
జనకుఁ డుపలాలనముసేయ, సంయమీంద్ర
భామ లదలింప, ననసూయ పట్టితిగువ,
నిగిడి యడుగిడె నొకభంగి మగిడిమగిడి
చూచుకొంచు శకుంతలాసూనగంధి.

మునిభామలు నలువంకలఁ
జనుదేఱఁగ నిర్మలోర్మిసంగతయగు న
య్యనిమిషనది రత్నాకర
మున కేగెడుభంగిఁ గదలిపోవుచు నెదురన్.

**పిల్లలమఱ్ఱి** (శాకుంతలమునుండి)

అమృతాంశుమండలం బాలవాలముగాఁగ
మొలిచె నొక్కటి జగన్మోహనముగఁ
జిగురించె విలయసింధుగతకైతవడింభ
శయనీయవరపలాశములతోడఁ
బితృదేవతలకు నంచితసత్రశాలయై
చెట్టుగట్టెను గయాక్షేత్రసీమ
నిలువనీడయ్యె నిందీవరప్రియకళా
కోటీరునకు భోగికుండలునకు
మఱ్ఱిమాత్రంబె పిల్లలమఱ్ఱిపేరు
పేరువలెఁగాదు శారదాపీఠకంబు
వారిలోపలఁ బినవీరు వాక్యసరణి
సరసులకునెల్లఁ గర్ణరసాయనంబు.

(జైమినీభారతమునుండి)

# బమ్మెర పోతన

[15-వ శతాబ్ది]

## గోపికా గీత

ఇట్లు హరి కనుమొఱంగి చనినం గానక, కరింబాసి తిరుగు కరేణుల పెల్లున నుల్లంబు తల్లడిల్ల వల్లవకాంతలు తదీయగమనహాస లీలావిలాసవీక్షణవిహారవచనరచనానురాగంబులం జిత్తంబులు గోల్పడి...కృష్ణగుణావేశంబులం జరియించుచు,

భూతములలోన వెలి బ్ర
ఖ్యాతుండగు నట్టివానిం గాంతలు కాళిం
దీతీరవనాంతరముల
బ్రాంతి న్వెదకంగం జనిరి పాడుచు నధిపా!

"నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, కృపారసంబు పైఁ
జల్లెడివాఁడు, మౌళిపరిసర్పితపింఛమువాఁడు, నవ్వు రా
జిల్లెడుమోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీపొదలమాటున లేఁడుగదమ్మ చెప్పరే!

అంగజునైనఁ జూడ హృదయంగముఁడై గరగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు, మధురంబగు వేణురవంబువాఁడు మ
మ్మంగజు పువ్వుదూపులకు నగ్గముసేసి లవంగలుంగనా
రంగములార! మీకడకు రాఁడుగదా, కృపనున్నఁ జూపరే."

ఇట్లు తరులతాదుల నడుగుచు విపినమార్గంబుల హలకులిశ కలశాంకుశాది శుభలక్షణలక్షితంబులయిన హరిచరణంబుల చొప్పు గని...తమలో నిట్లనిరి.

"కొమ్మకుఁ బువ్వులుకోసినాఁ డిక్కడ
మొనసి పాదాగ్రంబు మోపినాఁడు

సతి నెత్తికొని వేడ్క జరగినాఁ డిక్కడఁ
దృణములోఁ దోపదు తెలివజాడ
ప్రియకు ధమ్మిల్లంబు వెట్టినాఁ డిక్కడఁ
గూర్చున్నచోటిదె కొమరుమిగులు
నింతికిఁ గెమ్మోవి యిచ్చినాఁ డిక్కడ
వెలఁది నిక్కిన గతి విశదమయ్యె
సుదతితోడ నీరు సొచ్చినాఁ డిక్కడఁ
జొచ్చి తా వెడలిన చోటు లమరెఁ
దరుణిఁ గాముకేళిఁ దనిపినాఁ డిక్కడ
ననఁగిపెనఁగియున్నయంద మొప్పె.

ఒక యెలనాఁగచే యూఁదినాఁ డిక్కడ
సరస నున్నవి నాల్గుచరణములును
నొక నీలవేణితో నొదిఁగినాఁ డిక్కడ
మగజాడలో నిదె మగువజాఢ
యొక లేమ ప్రొక్కిన నురివినాఁ డిక్కడ
రమణిప్రొక్కినచొప్పు రమ్యమయ్యె
నొకయింతి కెదురుగా నొలసినాఁ డిక్కడ
నన్యోన్యముఖములై యంఘ్రులొప్పె
నొకతె వెంటఁ దగుల నుండక యేఁగినాఁ
డడుగుమీఁదఁ దరుణియడుగు లమరె
నబల లిరుగెలంకులందు రాఁ దిరిగినాఁ
డాఱుపదము లున్నవమ్మ! యిచట.

ఈచరణంబులే యిందునిభానన!
సనకాదిమునియోగసరణి నొప్పు
నీ పాదతలములే యెలనాఁగ! శ్రుతివధూ
సీమంతవీధులఁ జెన్నుమిగులు

నీ పదాబ్జంబులే యిభకులోత్తమయాన!
పాలేటిరాచూలి పట్టుఁగొమ్మ
లీ సుందరాంఘ్రులే యిందీవరేక్షణ!
ముక్తికాంతామనోమోహనంబు
లీ యడుగుల రజమె యింతి! బ్రహ్మేశాది
దివిజవరులు మౌళిదిశలఁ దాల్తు''
రనుచుఁ గొంద ఱబల లజ్జాత్ముఁ డేఁగిన
క్రమముఁ గనియు నతనిఁ గానరైరి.....

అని యిబ్భంగి లతాంగులందఱును బృందారణ్యమం దీశ్వరున్
వనజాక్షుం బరికించి కానక, విభున్ వర్ణించుచుం బాడుచున్
మనముల్ మాటలుఁ జేష్టలుం గ్రియలు నమ్మానాథుపైఁ జేర్చి వే
చని రయ్యామునసైకతాగ్రమునకున్ సంత్యక్తగేహేచ్ఛలై.

చని గోపికలు హరి నుద్దేశించి యిట్లనిరి.

నీవు జనించిన కతమున
నో వల్లభ! లక్ష్మి మందనొప్పె నధికమై
నీవెంటనె ప్రాణము లిడి
నీవారరసెదరు చూపు నీ రూపంబున్.

శారదకమలలోదరరుచి
చోరక మగు చూపువలన సుందర! మిమ్ముం
గోరి వెల యీని దాసుల
ధీరత నొప్పించు టిది వధించుటగాదే.

గోవులవెంటఁ ద్రిమ్మరుచుఁ గొల్చినవారల పాపసంఘముల్
ద్రోవఁగఁజాలి శ్రీఁ దనరి దుష్టభుజంగఫణాలతాగ్రసం
భావితమైన నీ చరణపద్మము చన్నులమీఁద మోపి, త
ద్భావజపుష్పభల్లభవబాధ హరింపు వరింపు మాధవా!

నీ నగవులు నీచూడ్కులు
నీ నానావిహారణములు నీ ధ్యానంబుల్
నీ నర్మాలాపంబులు
మానసముల నాఁటి నేఁడు మగుడవు కృష్ణా!

ఘోషభూమి వెడలి గోవుల మేపంగ
నీరజాభమైన నీ పదములు
గసవు శిలలుఁ దాఁకి కడు నొచ్చునో యని
కలఁగు మా మనములు కమలనయన!

మాపటివేళ నీవు వనమధ్యము వెల్వడి వచ్చి, గోష్పద
ప్రాపితధూళిధూసరితభాసితకుంతలమై, సరోరుహో
ద్దీపిత మైన నీ మొగము ధీరజనోత్తమ! మాకు వేడ్కతోఁ
జూపి మనంబులన్ మరునిఁ జూపుదుగాదె క్రమక్రమంబునన్.

నీ వడవిం బగల్ దిరుగ నీ కుటిలాలకలాలితాస్య మి
చ్ఛావిధిఁ జూడకున్న నిమిషంబులు మాకు యుగంబులై చనుం
గావున రాత్రులైన నినుఁ గన్నుల నెప్పుడుఁ జూడకుండ ల
క్ష్మీవర! ఱెప్ప లడ్డముగఁ జేసె నిదేల విధాత క్రూరుఁడై.

అరవిందంబులకంటెఁ గోమలములై, యందంబులై యున్న నీ
చరణంబుల్ కఠినంబులై మొనయుమాచన్నుంగవల్ మోపఁగా
నెరియంబోలునటంచుఁ బొక్కుదుము నీయీకర్కశారణ్యభూ
పరిసంచారము కృష్ణ! నీప్రియులకుం బ్రాణవ్యథం జేయదే.''

అని యిట్లంగన లంచితస్వరముతో నంకించుచుం, బాడుచుం
దను రావే యని చీరి యేడువ జగత్త్రాణుండు త్రైలోక్యమో
హనుఁడై మన్మథమన్మథుండయి మనోజ్ఞాకారియై, హారియై
ఘనపీతాంబరధారియై పొడమెఁ దత్కాంతాసమీపంబునన్.

అబల యొక్కతె భక్తినంజలి గావించి
ప్రాణేశుకెంగేలు వట్టికొనియె

నింతియొక్కతె జీవితేశ్వరు బాహువు
మూఁపున నిడికొని ముదమునొందె
వనిత యొక్కతె తనవల్లభు తాంబూల
చర్వితమాత్మహస్తమునఁ దాల్చెఁ
బడఁతియొక్కతె ప్రియపదములు విరహాగ్ని
తప్తకుచంబుల దాఁపుకొనియె
భామయొకతె భ్రుకుటిబంధంబు గావించి
ప్రణయభంగరోషభాషణమున
దష్టదశన యగుచు దండించుకై వడి
వాఁడిచూడ్కిగముల వరునిఁ జూచె.

ఒక్కలతాంగి మాధవుని యుజ్వలరూపము సూడ్కితీవలం
జిక్కఁగఁబట్టి, హృద్గతము జేసి వెలింజనకుండ నేత్రముల్
గ్రక్కునమూసి, మేనఁ బులకంబులు గ్రమ్మఁగఁ గౌఁగిలించుచున్
జొక్కములైనలోచవులఁ జొక్కుచునుండెను యోగికైవడిన్.

ఆసమయంబునన్ విభుఁ డనంతుఁడు, కృష్ణుఁడు చిత్తమూర్తియై
చేసెను మండలభ్రమణశీలపరస్పరబద్ధబాహుకాం
తాసువిలాసమున్, బహువిధస్ఫురితాననహస్తపాదవి
న్యాసము, రాసముం, గ్మతవియచ్చరనేత్రమనోవికాసమున్.

(భాగవతము దశమస్కంధమునుండి)

## భీష్మస్తవము

త్రిజగన్మోహన నీలకాంతితను వుద్దీపింపఁ, బ్రాభాతనీ
రజబంధుప్రభమైన చేలము పయిన్ రంజిల్ల, నీలాలక
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.

హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేతమై
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో

జయముం బార్థునకిచ్చు వేడ్కననినా శస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్

నరుమాటల్ విని నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరులీక్షింప రథంబు నిల్పి, పరభూపాలావళిం జూపుచున్,
బరభూపాయువులెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై.

కుప్పించియెగసినఁ గుండలంబుల కాంతి
 గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
ఉఱికిన నోర్వక యుదరంబులోనున్న
 జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబు చేపట్టి చనుదెంచు రయమునఁ
 బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయకు
 మన్నింపుమని క్రీడి మరలఁ దిగువఁ
గరికి లంఘించు సింహంబుకరణి మెఱసి
"నేఁడు భీష్ముని: జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున!" యనుచు మద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

పలుకుల నగవుల నడపుల
నలుకల నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి
కొలుకులు వదలించు ఘనుని గొలిచెద మదిలోన్.

## వితరణవీరము

బలిచక్రవర్తి వామనున కిట్లనియె.

"వడుగా! యెవ్వరివాఁడ, వెవ్వఁడవు; నీవాసస్థలం బెయ్యది
య్యెడకున్నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మమున్

గడు ధన్యాత్ముఁడనైతి, నీమఖము యోగ్యంబయ్యె, నాకోరికల్
గడ తేఱెన్, సుహుతంబులయ్యె శిఖులుం గల్యాణ మిక్కాలమున్.

వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విశిష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీఖండమొ కాక యేమడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా!''

అనిన సంతోషించి యీశ్వరుం డిట్లనియె.

''ఇది నాకు నెలవని యేరీతిఁ బలుకుదు
  నొకచో టనక యెందు నుండనేర్తు
ఎవ్వనివాఁడనం చేమని నుడువుదు
  నాయంతవాఁడనై నడవనేర్తు
ఈ నడవడియని యెట్లు వక్కాణింతు
  పూని ముప్పోకలఁ బోవనేర్తు
అదినేర్తు నిదినేర్తునని యేల చెప్పంగ
  నేరుపు లన్నియు నేన నేర్తు

ఒరులు గారు నాకు, నొరులకు నే నౌదు,
నొంటివాఁడఁ, జుట్ట మొకఁడు లేఁడు,
సిరియుఁ దొల్లిగలదు, చెప్పెద నాయంకి
సుజనులందుఁ దఱచు చొచ్చియుందు.

ఒంటివాఁడ, నాకు నొకటిరెం డడుగుల
మేరయిమ్ము, సొమ్ము మేరయొల్లఁ,
గోర్కెదీఱ బ్రహ్మకూఁకటి ముట్టెద
దానకుతుకసాంద్ర! దానవేంద్ర!''

అనిన బలి యి ట్లనియె.

''వసుధాఖండము వేఁడితో, గజములన్ వాంఛించితో, వాజులన్
వెసనూహించితొ, కోరితో యువతులన్ వీక్షించికాంక్షించితో

పసిబాలుండవు, నేర వీ వడుగ, నీభాగ్యంబు లీపాటిగా,
కసు రేంద్రుండు పదత్రయంబడుగ నీయల్పంబు నీనేర్చునే?''

అనినఁ జిఱునగవున వామనుం డి ట్లనియె.

గొడుగో జన్నిదమో కమండలువొ నాకున్మౌంజియో, దండమో
వడుగే నెక్కడ? భూములెక్కడ? కరుల్వామాశ్వులశ్వంబు లె
క్కడ? నిత్యోచితకర్మమెక్కడ? మదాకాంక్షామితంబైనమూ
డడుగుల్ మేరకుఁ ద్రోవ కిచ్చుటది బ్రహ్మాండమ్ము నాపాలికిన్.

ఆశాపాశము తాఁ గడుం బొడవు, లే దంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృతమేదినీవలయసామ్రాజ్యమ్ము చేకూరియున్
గాసింబొందిరిగాక వైన్యగయభూకాంతాదులున్ అర్థకా
మాశన్ బాయఁగ నేర్చిరే మును? నిజాశాంతంబులన్ జూచిరే!

సంతుష్టుఁ డీ మూఁడుజగములఁ బూజ్యుండు
సంతోషి కెప్పుడు జరుగు సుఖము .........

నీవు రాజవనుచు నిఖిలంబుగోరుట
తగవుగాదు; నాకుఁ దగినకొలఁది
ఏను వేఁడికొనిన యీ పదత్రయమును
చాలదనక యిమ్ము, చాలుఁజాలు.''

(శుక్రాచార్యుండంతట కపటవటురూపంబున నున్న యీతండు విష్ణుండనియు, ఈ దానమున సర్వనాశమగుననియు వారింపగా బలి చక్రవర్తియు ''మీరునిజ మానతిచ్చితిరి. కాని అర్థలోభంబున మాట తప్ప నేర; అదియుంగాక)

ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ, దనువుపై, నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ, గపోలతటిపైఁ, బాలిండ్లపై నూత్నమ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట, మీఁదై నాకరంబుంట మే
ల్గాదే? రాజ్యము గీజ్యమున్ సతతమే, కాయంబు నాపాయమే?

బ్రదుకవచ్చుఁగాక, బహుబంధనములైన
వచ్చుఁగాక, లేమి వచ్చుఁగాక
జీవధనములైనఁ జెడుఁగాక, పడుఁగాక
మాట దిరుగలేరు మానధనులు''

(అని మాయావటుని పాదంబులుగడిగి మూడడుగులనేలయు బ్రహ్మప్రీతమ్మని ధారవోయుటయు)

ఇంతింతై వటుఁడింతయై, మఱియుఁ దా నింతై, నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రునకంతయై, ధ్రువునిపైనంతై, మహర్వాటిపై
నంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంతసంవర్ధియై.

రవిబింబం బుపమింపఁ బాత్రమగు—ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై, గళాభరణమై, సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంటయై, నూపుర
ప్రవరంబై, పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండమున్నిండుచోన్.

(భాగవతము అష్టమస్కంధమునుండి)

## అనంతామాత్యుడు

[15-వ శతాబ్ది]

## గోవ్యాఘ్ర సంవాదము

ఒక విప్రవర్యుని హోమధేనువు నిత్య
  సత్యవర్తిని సదాచారమూర్తి
కలహంబునకుఁబోదు, కలిగినంతనె తుష్టి
  నొందు, సందడికోర్చు, నుఱ్ఱువేయ
వలవదు, పిదుకుచో వరవృష్టిధారల
  చెలువునఁ జన్నులుచేపి కురియుఁ,

దెవులెఱుంగదు, ఆమ్మ్రతీంద్ర సొలగఁగల్గి
కుఱుమట్టమై చాలఁ గూడియుండు
నిట్టి గోరత్న మొక్కనాఁ డేకతంబ
పోఁకుమేయుచునుండ, బెబ్బులియొకండు
దాని గని పొంచి, యొడలెల్ల దాఁచి, వాల
మవనిఁ దాటించుచును వ్రేయనడరుటయును.

కళవళము లేక, 'యోహో,
నిలు నిలు'మని సురభి యిట్లనియెఁ జయ్యన న
స్ఖలితో "నా కొకచన వి
వలయు వివేకించి నాదువాక్యము వినుమా."

అనినఁ బులి గోవుపై నె
త్తిన కేలును, భీషణాకృతియుఁ బటమువ్రా
సినచిత్తరురూపువిధం
బున ఖచరుల కద్భుతంబు పొదలగనుండెన్.

పులియటె! దీపనానలము పొంగున మ్రోగుచునున్కియట్టె! యి
మ్ములనొక పాఁడిగో వపుడు ముందటికిం జనుదెంచునట్టె! హా
నిలుమనినం బయింబడక నిల్చి కనుంగొనునట్టె! బాపురే
కలఁగకయాడుమాట లయకాలునినైన శమింపఁజేయదే.

ఇట్లు నిల్చి యప్పుండరీకం "బామిషార్థినై వచ్చు నన్నిట్లు వారింపఁ గారణంబేమి? నీవేమిచెప్పెదు? చెప్పు" మనిన గో పిట్లనియె.

మునుమునుబుట్టె నాకు నొకముద్దులపట్టి, యతండు పుట్టి యే
డెనిమిదినాళ్లపాటిగలఁ, డింతియ పూరియు మేయనేరఁ, డేఁ
జని కడుపార జన్గుడిపి చయ్యన వచ్చెద, నన్నుఁ బోయిర
మ్మని సుకృతంబుగట్టికొనవన్న! దయాగుణ ముల్లసిల్లఁగన్.

అని వల్కుచుఁ దనలో నిట్లని విచారించుచు

రేపు చనుగుడిపివచ్చితి
నేపున నందంద పరువులిడి యంతటిలో
నాపుడిసెఁడు నఱిగినఁ గోడు
కేపాటులఁ బడునో, వాని కెయ్యది గతియో.

ఏ నట్టు నాకుచుండఁగఁ
దా నను నండగొని చెవులు దాలవయిచుచున్
మేనెఱుఁగకయుండెడు నా
కూనకు నెవ్వారు దిక్కొకో యిటమీఁదన్.

అంతఁ, దనయంతరంగం బెఱింగిన నప్పులి సంశయించునోయని చిత్తంబాక్రాంతచేసికొని, వైవర్ణ్యంబు దోఁపనీక యమ్మొదవిట్లనియె.

"గుమ్మెడుపాల నాసుతునకుం బరితృప్తి జనించుఁగాని మాం
సమ్ము సమస్తముం గొనకచాలదు నీయుదరాగ్ని, కైన ని
క్కమ్ముగ నిందులోఁ బ్రథమకార్యవినిర్గతి నీ వెఱుంగవే
పొమ్మనవన్న! వ్యాఘ్రకులభూషణ! చయ్యనఁబోయివచ్చెదన్."
అనవుడుఁ బుండరీక మపహాస్యముచేసి "యిదేమిగోవ! యి
ట్లనియెదు, నన్ను బేల్పఱచి, యాత్మజుఁడున్నెడ కేగి, సత్వరం
బునఁ జనుదెంతునంటి, విదిపోలునె! చెప్పెడువారు చెప్పినన్
వినియెడువారి కించుక వివేకముపుట్టదె, యింతయేటికిన్.

ఎట్టికష్టజంతు వేనియు దేహంబు
విడుచుచోటఁ బెనఁగఁబడునకాదె
సమ్మతించి చావఁజాలదు......

అటుగాన సురభి! విను నీ
వటుపోయి, 'యుపాయయుక్తి నడకించితిఁబో
కుటిలనఖచటులదంష్ట్రో
త్కటశార్దూలంబు' ననుచుఁ గౌతుక మెసఁగన్.

గుండె నిమురుకొనుచుఁ గొడుకుపాలికి నేగి
కడుపునిండఁ జన్ను గుడిపి నీవు
నెమరువెట్టుకొనుచు నెమ్మదినుండుగా
కిచటి కేల వచ్చె దెటేఁగి యెటేఁగి.

ఆఁకొని యఱచెడిఁ గ్రేపులు
నేఁకటవో నమలవలయు నీమాంసము న
ట్లాఁకయిడి యివ్విధంబునఁ
దేఁకువచెడి పల్కఁదగునె ధేనువ నాతోఁ."

అనిన నప్పుండరీకంబునకు వివేకంబు లేదుగదే యని శోకంబు నొందుచు నాగోరత్నంబు......"నే నిన్ను బ్రమోషించిపోయి క్రమ్మఱ రాకుందునని నమ్మనేర, విది సాధులక్షణంబె? యే నసత్య వచనురాలనె?

అచ్చటికేగి మత్సుతుని నర్థి గనుంగొని కుక్షినిండఁ జ
న్నిచ్చి, మనంబునంబొదలు నేఁకటిఁ బాపి, శరీరమంతయుఁ
ముచ్చటవోవ దువ్వి, తగుబుద్ధులు చెప్పి, కృతార్థనై వెసఁ
వచ్చెదఁ, గాదుకూడదనిన న్మఱి యడ్డము చెప్పనేర్తునే.

అతిథిసత్కారమునకంటె నధికమైన
ఫలము లేదండ్రు పెద్ద లీపట్టునందు
నీవ యతిథివి నాకు, నిన్నిచట డించి
పోయి రాకున్నఁ బాపంబు పొరయకున్నె?

కన్నకడుపుగానఁ, గడుబిన్నగాన, నే
నతనిఁ బాసి దూరమరుగునట్టి...
వేళగాన, వాని వీక్షించిరాకున్న
వగపుమాన దనిన వదలవైతి.

నీకిష్టమైనఁ జాలుం
గా కట్టులుసేయు"మనినఁ గారుణ్యారసో

త్సేకంబై తనచిత్తము
వే కరఁగుడుఁ బుండరీకవిభుఁ డిట్లనియెన్.

'కొడుకుఁ దలంచి నీవు గడు గొందలమందఁగఁజూచి గోవ! ని న్విడిచిన నాఁకటం దనువు నిల్వదు నాకు, గృహంబుఁజేరి యే తడవుకుఁగాని రావొ? శపథంబులు పల్కక నమ్మఁజాల'' నా వుడుఁ బులిజూచి గోవు ''వినవో మదిలో ననుమాన మేటికిన్.

అపరాహ్ణవేళయం దతిథి యాఁకొనివచ్చి
యడిగినఁ బెట్టక కడపువాని
గతికి, నర్థాపేక్షఁ గన్నియఁ గొనిపోయి
ముసలికి నిచ్చు తామసునిగతికిఁ,
బాపంబులేకయె పత్నిఁ బరిత్యజిం
చినవానిగతికి, నాశ్రితచయంబు
గ్రాసంబులేక దుఃఖముల నొందఁగ నస
ద్వ్యయమాచరించినవానిగతికి
ధారవోసినధన మీక తప్పితిరుగ
హీత బలుమాఱు నడిగించుదాతగతికిఁ
బోవుదాన నింటికిని నే బోయి మరలి
రాకతక్కితినేఁ బుండరీకవర్య!''

అని శపథంబులుపలికిన
విని వ్యాఘ్రము ''నీవు ధర్మవిదురాలవు నీ
కెన యెవ్వరు ధేనువ! యే
నిను నమ్మితిఁ బోయిర''మ్మనినఁ బటుబుద్ధిన్.

పులికిఁ బ్రదక్షిణించి, తలపుంబలుకున్ సదృశంబుగాఁగ స స్ఖలితవిలాసయాన మెసగం బురి కేగెఁ, జతుస్స్తనంబులుం బలసి పొదుంగు వ్రేఁగుపఱుపంగ గభీరరవంబుతోడ వీ థుల నడయాడు బాలకులు దోరపుభీతిఁ దొలంగిపాఱఁగన్.

ఆయతరీతిఁ దద్ధ్వని రసాయనమై చెవిసోఁక, నప్పు డం
బే యనుచుం బ్రతిస్వనము పెల్లుగఁ జూపుచుఁ బాఱి, ధేనువుక్
డాయఁగఁబోయి, వేడుక నొడల్గదలింపుచు, వాలమార్చుచుం
బాయక గుప్పుచుంగుడిచె బాలవృషంబు నిజాంశదుగ్ధముల్.

కొడుకు చనుగ్రోలుచున్నంతదడవు దల్లి
యడుగుదిరుగక, కదలక, యన్యచిత్త
గాక, పై నీఁగసోఁకినఁ గదలకుండె
నెమ్మిఁ బాషాణధేనువు నిలిపినట్లు.

పొట్టపొంగునఁ దల్లిపొది వాసి, వీథికిఁ
బాఱి క్రమ్మఱుఁ బెద్దపరువుతోడఁ
దలయెత్తి చూచుచుఁ బలుమాఱుఁ దను దల్లి
పిలువంగ నిటనటఁ బొలసియాడు
నిలమీఁద మోమిడి యేమేని మూర్కొనుఁ
బసివెట్టికొనుచుఁ దత్ప్రాంతమందు
నంతంతఁ బసిబిడ్డ లడ్డంబుసుడిసిన
జంకించి మిన్నంటఁ జౌకళించు
నిట్లు శైశవక్రీడల నెసఁగుచున్న
కొడుకు దెసఁజూచి, కన్నీరు గ్రుక్కుకొనుచుఁ
గటకటా! యిట్టి నెత్తురుగందు నిచట
వైచిపోవంగవలసె నే నీచగతికి.

తల్లు లరుగు దేఱఁ దనయీడు కోడెలు
సదమలానురక్తి నెదురువాఱఁ
దానుగూడఁ బాఱి, తనమాతృహీనత
దెలిసి బిడ్డఁ డంతఁ దలఁగకున్నె?

ఏఁ దను బాసిపోవుతెఱఁ గెద్దియుఁ గానఁడు వీఁడు నెమ్మదిం
దాఁ దిరుగందొడంగెఁ, బులి తద్దయునాఁకొని యోర్వలేక నా

మీఁద నసత్యదోష మిడి మిన్నకపోవునొ యింక నాకు ని
చ్చోఁ దడయంగరాదనుచు సూనుని డగ్గఱి ధేను విట్లనున్.

"నిన్ను గని యిన్నిదినములు
చన్నిచ్చితి నేను ఋణవశంబున నిఁక నీ
వెన్నఁడు నన్నుఁ దలంపకు
మన్న! మమత్వంబు విడువు మన్న! మనమునన్.

ఒంటిఁ జరింపకు పొలమున
నింటికిఁ గడు ప్రొద్దుగలుగ నేతెంచుచురా
వెంటఁబడి పోడుచుగోవుల
జంటఁ జనకు క్రయ్యఁబడకు సందడియగుచోఁ.

నూఁతుల దరులను, లోఁతగు
పాఁతటి కసవులను నెట్టిపచ్చిక యున్నన్
బ్రాఁతిపడి మేయఁబోకుము
మూఁతి నిడకు ముగ్రసత్త్వములు గలనీటన్.

చులుకన జలరుహాతంతువు
చులుకన తృణకణము దూది చుల్కనసుమ్మీ
యిల నెగయుధూళి చుల్కన
చులుకన మఱి తల్లిలేనిసుతుఁడు కుమారా!"...]...

అని తగ బుద్ధిచెప్పెడు నిజాంబ గనుంగొని తత్తనూజుఁ డి
ట్లను "నిది యేమి తల్లి! యిటులాడెదు విప్రుఁడు నిన్ను నర్థకాం
క్ష నొకని కమ్మెనో? తనదు గాదిలిపుత్రికి నీఁదలంచెనో?
యెనయఁగఁ బుణ్యకాలమున నెవ్వరికేనియు ధారవోసెనో?"

అనినఁ గ్రేపుమాటలకు...నగ్గో విట్లనియె.

"ఇవ్విప్రవరేణ్యుఁడు నను
నెవ్వరికిని నొసఁగఁ డేన యేగెద విను"మం

చవ్విధవరము సర్వంబును
నవ్వత్సముతోడఁ జెప్ప నది కడుభీతిన్.

పిడుగడిచినక్రియ, నీ మెం
బొడిచిన గతి గుండె పగిలి భూస్థలిమీఁదన్
బడి పొరలుఁ దన్ను కొను ను
గ్గడువుగఁ గన్నీరునించుఁ గడగడ వడఁకున్.

'ఛే' యనుఁ, 'దల్లీ! నీ వెట
పోయెద?' వను, 'నన్ను డించి పులివాఁతఁబడన్
బోయెదవే?' యనుఁ, 'జెల్లం,
బో?' యను 'నింకేటిబ్రతుకు పో నాకు' ననున్.

ఇవ్విధమున శోకింపఁగ
నవ్వత్సశిరంబుమీఁద నానన మిడి, "నీ
వెవ్వరికిఁగాఁగ వగచెద
వివ్వలవని జాలిపడగ నేటికిఁ బుత్రా!

అరుదుగ సత్యవాక్యము సహాయముగాఁ బులితేనివక్త్రగ
హ్వరమను పెద్దత్రోవను రయంబున స్వర్గసుఖంబుఁ జూఱకో
నరుగుచునున్న దాన నిది హర్షమునొందెడివేళగాక దు
స్తరమగుశోకముం బొరయుదానికిఁ గారణ మేమి చెప్పుమా.

పుట్టిన పిమ్మటఁ జావును
గట్టి; వృథామరణ మొందుకంటె బుధులకున్
దట్టమగుకీర్తి సుకృతము
లిట్టలముగఁ గల్గుచావు లింపులు గావే......

ఇంకఁ బెనఁగవలవ దిచట నేఁ దడసిన
నచట నన్నృతదోష మావహిల్లు
దానఁ జేసి యగు నధమలోక; మంత నే
యంగ నేల పనుపవయ్య! నన్ను".

అని యిటు లెట్టకేలకు నిజాత్మజు శోకదవాగ్నికీల లో
య్యాన వచనాంబువర్షమున నాఱఁగఁజేయుచు దాని నచ్చటం
గొనకొనియుండఁగా నిలిపి, కూరిమితోఁ బులియున్నయట్టియ
వ్వనమునకున్ రయంబెసఁగ వచ్చుచునుండఁగ నంతనక్కడన్.

అప్పులి యిట్లని వితర్కించు.

పాటిగలదె పసరమునకు
వ్రేటలవిం గదిసినపుడె విఱువక నేన
మ్మాటల బేలుపడితి మొగ
మోట దరిద్రత్వమునకు నొగిఁ బొత్తయ్యెన్......

పులిచేతఁ జిక్కి, యొక యి
మ్ములఁ విడివడిపోయి, దానిముందటి కేగో
వులు మరలివచ్చు? నేలా
తలపోఁతలు, నోరికండ తప్పెందప్పెన్.

ఏ దానితోడి చలమున
నేదినముననైన నొక్కయెడ నడరి గళ
చ్ఛేదముసేయక యూరక
పోదునె యిటుగాకయున్నఁ బులినే నేనున్.

అని యుదరాగ్నిచేఁ బరవశాత్మకమై, ధృతిమాలి, నెమ్మనం
బునఁ దలపోయుచున్న పులిముందటి కప్పుడు వచ్చినిల్చెనో
యనఁగ మహాద్భుతంబగురయంబునఁ దాఁ బఱతెంచి ధేను వి
ట్లను "నిది ప్రొద్దుదాఁకఁ గడు నాఁకొని యేక్రియ నుండితోకదే.

ఇంతతాల్మి లేక యిల నిట్టి సుకృతంబు
లెట్లు సంభవించు నేరికైన
నీనిమిత్తమెకదా నాతనూజుని
బుజ్జగింపఁగంటిఁ బురికి నేగి.

నామన సొక్కటి యయ్యెను
నీమనసారఁగ భుజింపు, నీ కే నధిక
ప్రేమమున సమర్పించితి
నామే నిదె పుణ్యగతికి ననుఁ బుచ్చవనా!''

అనినదాని తెగువ కద్భుతస్వాంతుఁడై
పుండరీక ''మేను బుట్టి పెరిగి
యింతవాఁడ నైతి, నింత నిష్కపటుల
నిట్టి ధీరమతుల నెఱుఁగ నేను.

ఇట్టి మహానుభావులకు హింసయొనర్చి దురంతదోషముల్
గట్టికొనంగఁజాల, మఱికల్గవె మాంసము లొండుచోట? నీ
పుట్టువునందు నన్ను మును పుట్టఁగఁజేసిన యట్టిదైవ మీ
పట్టునఁ బూరిమేపెడినె? ప్రాణము లింతనె పోవుచున్నవే?''

అని, యాధేనువుఁ జూచి ''నీవిమలసత్యప్రౌఢికిన్ మెచ్చువ
చ్చె, నినుంజంపఁగఁజాల, నీదుతలఁ గాచెన్ ధర్మ మీప్రొద్దు పొ
మ్ము నిజావాసము చేర, నీసఖులు సమ్మోదంబునుంబొంద నీ
తనయుం డత్యనురాగముంబొరయఁ జిత్తప్రీతి మైనొందఁగన్''

అనిన నప్పులికి నమ్మొద విట్లనియె.

''మెత్తనిమనసే నాయది
యొత్తి యిటులఁ జూడనేల యోపుణ్యుఁడ? నే
నిత్తనువు నీకు మును వా
గ్దత్తముచేసినది కాదె కథ లేమిటికిన్?

ఉదరాగ్ని పెల్లున నొడలెల్ల శుష్కమై
వాతెఱ వఱువట్లు వట్టఁదొడఁగె
సకలేంద్రియంబులు వికలభావంబు చే
కొనియె, వీఁపున నంటుకొనియెఁ గడుపు

ప్రాణంబు లాతురపడఁజొచ్చె, నిట్లూర
కుండుదే ప్రొద్దు భానుండు గ్రుంకఁ
బగలింటి యుపవాసభారంబు దీఱ మ
ద్రక్తమాంసముల నక్తమ్ము సేయు
మంతఁ బుణ్యారాలనై యేను దివ్యవి
మానయానమున ననూనమహిమ
దనర నిన్నుఁ దలఁచుకొనుచు నెమ్మదిఁబోదు
నూర్ధ్వలోకమునకు నోమృగేంద్ర!”

అని గంగడోలు బిగియఁగఁ
దనమెడ యెత్తుకొని కపిల దగ్గఱఁ జనుదెం
చినఁ జూచి పుండరీకము
వెనువెనుకకె పోవుఁగాని విఱువదు దానిన్.

కుడువంగరమ్మని తోడరి చుట్టము బిల్వ
నాఁకలిగా, దొల్ల ననుచుఁ బెనఁగు
నతఁడునుబోలె, నాతతశోభనాంగివై
తనకు నా ధేనురత్నంబు దన్ను
భక్షింపుమని పట్టుపఱుప సద్యోజ్ఞాన
శాలివై పరగుశార్దూలవిభుఁడు
దా నొల్లనని పల్కఁ, దమలోన నొకకొంత
దడవు ముహుర్భాషితంబు లిట్లు
జరుగుచుండ గోవుసత్యవాక్శుద్ధికిఁ
బులి కృపాసమగ్రబుద్ధికిని బ్ర
సన్నులైరి సురలు, సాధువాదము లుల్ల
సిల్లె గగనవీధి నెల్లయెడల.

(భోజరాజీయము 4, 6 ఆశ్వాసములనుండి)

# నందిమల్లయ ఘంటసింగనలు

[ 15, 16 - శతాబ్దులు ]

## సాయంసంధ్య

అకరువుల మచ్చులగుది, క
ర్ణికాసువర్ణంబు. మధుపనికరముగల త
మ్మికవిలసించి దివస వై
శ్యకులాగ్రణి వాయిగట్టె సంధ్యావేళన్.

ఎడపనికూర్మితోడ రమియించి, వృథా కలహించి ‚సిపో
యెడుతఱిఁ గామినీకరగృహీతపటాంచలుఁడైన భర్తకై
వడి మునుమాపుదాఁక మధువారి యథేష్టముగాఁగనాని వె
ల్వడుచుఁబెనంగెఁ దేఁటి ముకుళత్కమలగ్రసితాగ్రపక్షమై.

## తారకోదయము

కడు నధికప్రతాపనిధి కాలవశంబున నస్తమింప న
ల్లడఁ దలలెత్తు హీనులప్రకారమునన్ రవిగ్రుంకఁ దారకల్
పొడిచె; నిశావిలాసిని విభుంగయుం గవయిసేయుచో నెఱుల్
గడిగి విదల్ప, వారికణికల్ గగనస్థలి నిండెనోయనన్.

దీపించె గగనమున రజ
నీపికవాణీశిరోజనికురుంబముపైఁ
బాపటచందమునన్ ఛా
యాపదము సమస్తచక్షురభిరామంబై.

## చంద్రోదయము

మదిరారసమదరాగము
వదలఁ బ్రసన్నతవహించు వనరుహానయనా

వదనమువలె విధుమండల
ముదయారుణ్యంబు తొలఁగ నొప్పె విశదమై.

తోఁచె హరిణాంకబింబంబు నాచుతోడి
దొరువుగతి, నంబరము మడికరణి నుండె,
ననుపమొక్కలవలెఁ జుక్క లమరెఁ, జిలుప
చిలుపనీరువిధాన వెన్నెలలు మొనసె.

మిను కళ్లము, తారలు చి
క్కినగింజలు, పూర్ణతుహినకిరణుఁడు తూర్పె
త్తిన కొలుచురాశిగా, లాం
ఛనము మహీరచితముద్రచందము దాల్చెన్.

సరసీమధ్యస్థలముల
విరిసిన నీలోత్పలములు విలసిల్లె నిశా
కరకరములు దఱుమఁ దమః
పరంపరలు వెఱచి నీళ్లఁ బడియె ననంగన్.

కమిచి పరస్పరంబు ధవకాంతలు పాండురనాగవల్లిప
త్రముల ముఖంబులం గొనువిధంబున వెన్నెల లప్పళించి ము
క్కు మొనల నించుచు న్మదచకోరయుగంబులు మించె రాత్రిక
న్య మగనిఁజూచువేడ్క నయనంబులు పెక్కులు దాల్చెనోయనన్

( వరాహపురాణమునుండి )

## తాళ్లపాక అన్నమాచార్యులు

[1408—1503]

### వైరాగ్యకీర్తనలు

ఎవ్వరి గాదన్న నది నిన్ను గాదంట
ఎవ్వరి గొలిచిన నది నీకొలువు ॥పల్లవి॥

అవయవములలో నదిగా దిదిగా
దవిమే లివిమే లననేలా
భువియుఁ బాతాళము దివియు నందలిజంతు
నివహ మింతయును నీదేహమేకాన ॥ఎవ్వరి॥

నీవు లేనిచోటు నిజముగఁ దెలిసిన
ఆవల నది గాదనవచ్చును
శ్రీవేంకటగిరిశ్రీనాథ! సకలము
భావింప నీవె పరిపూర్ణుఁడవుగాన ॥ఎవ్వరి॥



దేవ! యీ తగవు తీర్చవయ్యా
వేవేలకు నిది విన్నపమయ్యా ॥పల్లవి॥

తనువునఁ బొడమిన తతి నింద్రియములు
పొనిఁగి యెక్కడికిఁ బోవునయా
పెనఁగి తల్లికడ బిడ్డలు భువిలో
మొనగొని యెక్కడి కేగుదురయ్యా? ॥దేవ॥

పొదుగుచు మనమునఁ బొడమిన యాసలు
అదన నెక్కడికి నడుగునయా
వొదుగుచు జలములనుండు మత్స్యములు
పదపడి యేగతి బాసీనయ్యా? ॥దేవ॥

అలి నొకటొకటికి లంకెలు నీవే
అలరుచు నేమని యందునయా॥
బలుశ్రీవేంకటపతి నాయాత్మను
గలిగితి వెక్కడి కలుషములయ్యా! ॥దేవ! యీ తగవు॥

(వైరాగ్య కీర్తనలనుండి)

## శృంగార కీర్తనలు

విరహపురాజదె విడిదికి రాఁగా
సిరులఁ జేసె నిదె సింగారములూ॥ పల్లవి॥

నెలఁతనుదుటిపై నీలపుగురులనె
తోలుతనె కట్టెను దోరణము
మొలక చెమటలనె ముత్యపుముగ్గులు
అలరిచె మదనుం డదె చెలిమేన॥

దట్టముగాఁ జింతాలతనే వడి
బెట్టెఁ జప్పరము పెనగొనఁగా
పట్టినమైతాపుల పరిమళములు
కట్టించెను చెంగట వలరాజు॥

విందగు వేంకట విభునిప్రేమచేఁ
బొందుగఁ బెట్టెను బోనాలు
ఇందువదన కీ యిందిరావిభుని
కందుదేర నలుకలు చవిచేసె ॥విరహపురాజదె॥

---

నీకు వలచిన సతికి నెగులు గలదా మీఁద?
నీకరుణ మఱవ కింతియుచాలును ॥పల్లవి॥

నీవంటి చతురునకు నిక్కంబుగా వలచి
జీవంబు విడిచినా సేగి గలదా?
భావమున నిను దలఁచి పడఁతి యిట్లాయెనని
ఆవేళ నను దలఁచు మంతె చాలు ॥నీకువలచిన॥

తగిలి నినుబాసి సంతాపదావాగ్నినిటు
నొగిలినా నాకిందు నొప్పిగలదా?
పగదేర మరుని పూబాణములఁ దెగిన పొం
దుగ నప్పుడైన వగతువుగా నీవు ॥నీకు వలచిన॥

కూరుముల నిటు నిన్ను గూడిన లతాంగికిని
వేతె యిక మరుచేతి వెఱపుగలదా ?
సారమతి వేంకటేశ్వర నన్ను నలయించి
యీ రీతినైనఁ జనవిత్తుగా నీవు ॥నీకువలచిన॥

( శృంగార కీర్తనలనుండి )

## తాళ్లపాక పెద తిరుమలాచార్య
[ 1460—1548 ]
### వచనగీతాలు

దేవదేవా, నిన్ను నే బలుమాఱుఁదలంచిన వీఁడేమిగోరి తలంపు చున్నవాఁడో యని చిత్తంబున నుండునని వొకానొకపరి నిన్నుఁ దలంతును.

మఱియును దేహంబు బడలించి తపంబుసేసిన నంతరాత్మవైన నిన్ను బడలికసోఁకునో యని యూరకుండుదును.

పేరుకొని మె నిన్ను బిలిచిన నన్నిపనులు విడిచివత్తువో యనుచు మౌనముననే యుండుదును.

జగత్తున నీవుండుట భావించి చూచిన నిన్ను సోదించుట య్యేదునో యని పరాకుసేసుకుందును.

నీచరిత్రలు సారెకు వినంగడంగిన నీరహస్యంబులు బయలుపడునో యని యాలకింపను.

నీకొలువుసేసి నీపాదములకు మ్రొక్కఁగా మందెమేల మయ్యెదునో యని యంతటనింతటనుండి సేవింపుదును.

ఇది యెఱింగి నీవే నన్నుంబాయకుండుము, శ్రీ వేంకటేశ్వరా!

( వేంకటేశ్వర విన్నపములనుండి )

## వేమన
[15-వ శతాబ్ది]

## వినుర వేమ!

గంగిగోవుపాలు గంటెడైనను జాలు
కడవెడైననేమి ఖరముపాలు
భక్తిగలుగుకూడు పట్టెడే చాలురా
విశ్వదాభిరామ, వినుర వేమ!

ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా? విశ్వదాభిరామ...

నీళ్లలోన మొసలి నిగిడి యేనుఁగు దీయు
బైట కుక్కచేత భంగపడును
స్థానబల్మి గాని తనబల్మి కాదయా...విశ్వదాభిరామ

పెట్టిపోయలేని వట్టినరులు భూమి
బుట్టనేమి వారు గిట్టనేమి
పుట్టలోనఁ జెదలు పుట్టవా గిట్టవా... విశ్వదాభిరామ

ఆశచేత మనుజు లాయువుగలనాళ్లు
తిరుగుచుంద్రు భ్రమను ద్రిప్పలేక
ముఱికిభాండమందు ముసురు నీఁగలభంగి...విశ్వదాభిరామ

చంపఁదగిన యట్టి శత్రువు తనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుటేచాలు... విశ్వదాభిరామ

అనువుగానివేళ నధికుల మనరాదు
కొంచెమైన నదియుఁ గొదవకాదు
కొండ యద్దమందుఁ గొంచెమైయుండదా...విశ్వదాభిరామ

విత్తము గలవాని వీఁపు పుండైనను
వసుధలోనఁ జాల వార్తకెక్కు
పేదవానియింటఁ బెండ్లైన నెఱుఁగరు...విశ్వదాభిరామ

చెప్పులోనిఱాయి చెవిలోనిజోరీఁగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోనిపోరు ఇంతింతగాదయా...విశ్వదాభిరామ

వేషభాష లెఱిగి కాషాయవస్త్రముల్
కట్టగానె ముక్తి కలుగఁబోదు
తలలు బోడులైనఁ దలఁపులుబోడులా...విశ్వదాభిరామ

వ్రాఁతకంటెహెచ్చు వరమీఁదు దైవంబు
చేఁతకంటెహెచ్చు వ్రాఁతకాదు
వ్రాఁత కజుఁడు కర్త చేఁతకుఁ దాఁగర్త...విశ్వదాభిరామ

బొందెలు గనవేఱు భువిప్రాణమొక్కటే
అన్నము లిలవేఱు ఆఁకలొకటె
దర్శనములె వేఱు దైవంబునొక్కటే...విశ్వదాభిరామ

(వేమన పద్యములనుండి)

## అల్లసాని పెద్దన

[16 శతాబ్ది]

### వరూధినీ ప్రవరులు

మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపుఁ దెలుపు నొక్క మారుత మొలసెన్.

అతఁ డావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ, జంచరీకచికురం, జంద్రాస్యఁ, జక్రస్తనిన్
నతనాభిన్, నవలా, నొకానొక మరున్నారీశిరోరత్నమున్.

అమలమణిమయనిజమందిరాంగణస్థ
తరుణసహకారమూలవితర్దిమీఁద
శీతలానిల మొలయ నాసీనయైన
యన్నిలింపాబ్జముఖియు నయ్యవసరమున.

తతనితంబాభోగధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావిరంగువలన
శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁ గాయ
లుత్తుంగకుచపాళి నత్తమిల్లఁ
దరుణాంగుళీధూతతంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుఁ గనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ
బ్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకుఁ
గ్రమకరపంకరుహారత్నకటకఝణఝ

ణధ్వనిస్ఫూర్తి తాళమానములు గొలుప
నింపు దళుకొత్త వీణ వాయింపుచుండి,

అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ, గాంతి పె
ల్లుబ్బ కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బ మెఱుంగుఁ జన్గవ గగుర్పొడువన్, మదిలోనఁ గోరికల్
గుబ్బటిలంగఁ జూచె నలకూబరసన్నిభు, నద్ధరామరున్.

చూచి, ఝుళంఝుళత్కటకసూచితవేగపదారవిందయై
లేచి, కుచంబులుం దుఱుము లేనడు మల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్క పోఁకనునుబోదియఁ జేరి, విలోకనప్రభా
వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్.

మునుమున్ బుట్టెడుకొంకు లౌల్యమునిడన్, మోదంబు విస్తీర్ణతం
జొనుపం, గోర్కులు గ్రేళ్లుద్రిప్ప, మదిమెచ్చుల్ చెప్పలల్లార్ప, న
త్యనుషంగస్థితి చిచ్చుపాటొసఁగ, నొయ్యారంబునం జంద్రికల్
దనుకంజూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్రపద్మంబులన్.

తొంగలిరెప్పలం దొలఁగఁద్రోయుచుఁ బైపయి విస్తరిల్లు క
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రునటంచుఁ బోవనీ
కంగజుఁ డానవెట్టి కదియన్ గుబ్రవాసెననంగ జాటి సా
రంగమదంబు లేఁజెమటఁ గ్రమ్మె లలాటము డిగ్గి చెక్కులన్.

ఇట్లతని రూపరేఖావిలాసంబులకుం జొక్కి...యాత్మగతంబున,

ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంతవసంతకంతులం
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడువాఁడు, మహీసురాన్వయం
బెక్కడ, యీ తనూవిభవ మెక్కడ! యేలనిబంటుగా మరుం
డక్కఁగొనంగరాదె యకటా! నను వీఁడు పరిగ్రహించినన్.

వదనప్రభూతలావణ్యాంబుసంభూత
 కమలంబు లన వీని కన్నులమరు

నిక్కి వీనులతోడ నెక్కసక్కెములాడు
  కరణి నున్నవి వీని ఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీఠికవోలె
  నెడఁదయై కనుపట్టు వీని యురము
ప్రతిఘటించుచిగుళ్లపై నెఱ్ఱవాఱిన
  రీతి నున్నవి వీని మృదుపదములు

నేరెకేటెయసల్ తెచ్చి నీరజాప్త
సానఁబట్టిన రాపొడి చల్లి, మెదిపి,
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁ, గాకున్నఁ గలదె యీ మేనికాంతి!

అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్తనారాచదుర్దినసమ్మూర్ఛితమానసాంబురుహయై దీపించు పెందత్తఱంబునఁ బేర్చెత్తిన లజ్జ నంగ్రోథికటకంబుల్ ద్రోయ, నడ్డంబు నిల్చిన నయ్యచ్చరఁజూచి చేరఁజని పల్కెన్ వాఁడు విభ్రాంతుఁడై.

"ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ! యొంటి జరించె దోటలే
కివ్వనభూమి? భూసురుఁడ, నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవతప్పితిం
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి, పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ, దెల్పఁగదవే తెరువెద్ది శుభంబు నీకగున్."

అని తన కథ నెఱిఁగించినఁ
దన కనుఁగవ మెఱుఁగు లుబ్బఁ దాటంకములుం
జనుఁగవయు నడుము వడఁకఁగ
వనిత సెలవిఱాఁ నవ్వి వానికి ననియెన్.

"ఇంతలు కన్నులుండఁ దెరువెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే
కాంతమునందు నున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియ కాక, నీ వెఱుఁగవే మునువచ్చిన త్రోవ చొప్పు? నీ
కింత భయంబు లేకడుగ నెల్లిదమైతిమి మాటలేటికిన్.

చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
 బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్ట జంత్రగాత్రముల రాల్ గరఁగించు
 విమలగాంధర్వంబు విద్య మాకు
ననవిల్తుశాస్త్రంపు మినుకు లావర్తించు
 పని వెన్నతోఁడఁ బెట్టినది మాకు
హయమేధరాజసూయము లనఁ బేర్వడ్డ
 సవనతంత్రంబు లుంకువలు మాకుఁ
గనకనగసీమఁ, గల్పవృక్షముల నీడఁ
బచ్చరాచట్టుగమి రచ్చపట్టు మాకుఁ
బద్మసంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర!

పేరు వరూథిని, విప్రకు
మార! ఘృతాచీతిలోత్తమాహరిణీహే
మారంభాశశిరేఖ లు
దారగుణాఢ్యలు మదీయలగు ప్రాణసఖుల్.

భూసుర! కైతవకుసుమశ
రాసన! మాయింటి విందవైతివి, గైకొ
మ్మా! సముదంచన్మణిభవ
నాసీనత సేవదేఱి యాతిథ్యంబుల్.

కుందనమువంటి మేను మధ్యందినాత
పోష్మహతిఁ గందె, వడదాఁకె నొప్పులొలుకు
వదన, మస్మద్గృహంబు పావనము సేసి
బడలికలు వాసి చను'' మన్న బ్రాహ్మణుఁడు,

''అండజయాన! నీవొసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె, నిం
నుండగరాదు పోవలయు నూరికి, నింటికి నిప్పుడేను రా

కుండనొకండు,వచ్చి మఱియొండునె? భక్తియచాలు,సత్క్రియా
కాండముఁ దీర్ప వేగ చనఁగావలయుం గరుణింపు నాపయిన్.

ఏనిఁక నిల్లుసేరుటకు నెద్దియుపాయము ? మీ మహత్త్వముల్
మానిని! దివ్యముల్, మదిఁదలంచిన నెందును మీకసాధ్యముల్
గానము గానఁ దల్లి!ప్రజలన్ ననుఁ గూర్పు''మటన్న లేఁతన
వ్వానవసీమఁ దోఁప ధవళాయతలోచన వాని కిట్లనున్.

''ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁ బోయెదనంచుఁ బల్కెదీ
వక్కట ! మీకుటీరనిలయంబులకున్ సరిరాకపోయెనే
యిక్కడ రత్నకందరము, లిక్కడి నందనచందనోత్కరం
బిక్కడి గాంగసైకతము, లిక్కడి యీలవలీనికుంజముల్.

నిక్కము దాఁపనేల ధరణీసురనందన ! యింక నీ పయిం
జిక్కె మనంబు నాకు, ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో,
చొక్కి మరందమద్యముల చూఱలఁ బాటలపాడు తేంట్ల సొం
పెక్కినయట్టి పూవుఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో ?''

అనుటయుఁ బ్రవరుం డిట్లను
''వనజేక్షణ ! యిట్లు వలుక వరుసయె ? వ్రతులై
దినములు గడపెడు విప్రులఁ
జనునే కామింప ? మది విచారమువలదే !

వేలిమియున్ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె, భుక్తికిన్
వేళ యతిక్రమించె, జననీజనకుల్ కడు వృద్ధు లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురుసూచుచునుందురు, రాహితాగ్ని నేఁ
దూలు సమస్తధర్మములుఁ దొయ్యలి! నేఁ డిలు సేరకుండినన్''

నావుడు విన్నఁబాటు వదనంబున నించుక దోఁపఁ బల్కె ''నో
భావజరూప! యిట్టి యెలప్రాయము వైదికకర్మనిష్ఠలం
బోవఁగ, నింక భోగములఁబొందుట యెన్నఁడు? యజ్ఞకోటులం
బావను లౌటకున్ ఫలము మాకవుఁగిళ్ల సుఖించుటేకదా !

సద్యోవినిర్భిన్నసారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు
కసటువో బీఱెండఁ గరఁగి కఱ్ఱలనంటి
గమగమ వలచు చొక్కపుజవాజి
పొరలెత్తి ఘనసారతరువులఁ దనుఁదాన
తొరఁగిన పచ్చకప్పురపుసిరము
గొజ్జంగి పూఁబొదల్ గురియంగఁ బటికంపు
దొనల నిండినయట్టి తుహినజలము
వివిధకుసుమకదంబంబు, దివిజతరుజ
మృదులవసనఫలాసవామేయరత్న
భూషణంబులు గల విందు, భోగపరుఁడ
వయి రమింపుము నను గూడి యనుదినంబు.

ఎన్నిభవంబులంగలుగు నిత్యుశరాసనసాయకవ్యథా
ఛిన్నత వాడి వత్తలయి, కేలఁ గపోలములూఁది, చూపులన్
విన్నఁదనంబు తోఁపఁ గనువేఁదుఱునం బయిగాలి సోఁకినన్
వెన్నవలెం గరంగు నలివేణులఁ గాఁగిటఁ జేర్చుభాగ్యముల్.

కుశలతయే వ్రతముల నగు
నశనాయాసమున నింద్రియనిరోధమునం
గృశుఁడవయి యాత్మ నలఁచుట
సశరీరస్వర్గసుఖము సమకొనియుండన్.''

అనినఁ బ్రవరుండు ''నీవన్న యర్థమెల్ల
నిజము కాముకుఁడైనవానికి, నకాముఁ
డీది గణించునె జలజాక్షి! యెఱిఁగితేని
నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్ము.''

అనిన నత్తెఱవ యక్కఠినోక్తి పలుకుల కులికి, చంచలదృగంచల ప్రభ లతని ముఖాంబుజంబునం బొలయ, వలయమణిగణ చ్ఛాయాకలాపంబు లుప్పరం బెగయఁ గొప్పు చక్కంజెక్కుచు,

గబ్బిగుబ్బలం జొబ్బిల్లు కుంకుమరసంబునం బంకిలంబులగు హార ముక్తాతారకంబుల నఖకోరకంబులన్ గీఱి తీరువడం జేయుచుఁ, బతితవనతరుకుసుమకేసరంబులు రాల్చు నెపంబునం బయ్యెద విదల్చి చక్క సవరించుచు... నిట్లనియె.

"ఎందే డెందము గందళించు రహిచే నేకాగ్రతన్ నిర్వృతిం
జెందుం గుంభగతప్రదీపకళికాశ్రీ దోఁప, నెందెందుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁగను నాయింపే పరబ్రహ్మ'మా
నందో బ్రహ్మ'యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి నూహింపుమా"

అనుచుఁ ద న్నొడఁబఱచు నయ్యమరకాంత
తత్తఱముఁ జూచి యాత్మ నతండు దనకు
సిగ్గు వెగటును బొడమ నిస్పృహతఁ దెలుపు
నొక్క చిఱునవ్వు నవ్వి యయ్యువిద కనియె.

"ఈ పాండిత్యము నీకుఁదక్క మఱి యెందేఁగంటిమే కామశా
స్త్రోపాధ్యాయినినా వచించెదవు మేలోహో! త్రయీధర్మముల్
పాపంబుల్, రతిపుణ్యమంచు నిఁక నేలా తర్కముల్? మోక్షుల
క్ష్మీపథ్యాగమసూత్రపంక్తి కివె పో మీ సంప్రదాయార్థముల్.

తరుణీ! రేపునుమాపు హవ్యములచేతం దృప్తుఁ డౌవహ్ని స
త్కరుణాదృష్టి నొసంగుసౌఖ్యము లెఱుంగన్ శక్యమే నీకు? నా
కరణుల్ దర్భలు నగ్నులుం బ్రియములైన ట్లన్యముల్గా వొడల్
తిరమే? చెప్పకు మిట్టితుచ్ఛసుఖముల్ మీసాలపైఁ దేనియల్"

అనుటయు మాటలేక హృదయాబ్జము జల్లన, మోము వెల్లనై
కనలుచు, నీరు దేఱు తెలిగన్నుల నాతనిఁ బుల్కుపుల్కునం
గనుఁగొని, మాటలం బొదువుగద్గదికం దలయూఁచి "యక్కటా
వనిత తనంతఁ దా వలచివచ్చినఁ జుల్కనగాదె యేరికిన్.

వెతలం బెట్టకు మింక న"న్ననుచు నీవీబంధ మూడన్, రయో
దతి నూర్పుల్ నిగుడన్, వడిన్ విరులుచిందం, గొప్పువీడం, దనూ

లత తోడ్తోఁ బులకింపఁగా, ననునయాలాపాతిదీనాస్యయై
రతిసంరంభము మీఱ నిర్జరవధూరత్నంబు పైపాటునన్.

ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ, బై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింప 'హా! శ్రీహరీ'
యంచున్ బ్రాహ్మణుఁ డోరమోమిడి, తదీయాంసద్వయంబంటి పొ
మ్మంచుం ద్రోచెఁ, గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్

త్రోపువడి నిలిచి ఘనల
జ్జాపరవశ యగుచుఁ గొప్పు సవరించి, యొడల్
దీపింప నతనిఁ జుఱచుఱఁ
గోపమునం జూచి క్రేఁటుకొనుచుం బలికెన్.

"పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోటఁ భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొను" మంచుఁ జూపి, య
ప్పాటలగంధి వేదననెపం బిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందఁగన్.

ఈ విధమున నతికరుణము
గా వనరుహనేత్ర కన్నుఁగవ ధవళరుచుల్
కావిగొన నేడ్చి వెండియు
నా విప్రకుమారుఁ జూచి యలమటఁ బల్కెన్.

"చేసితి జన్నముల్, దపము చేసితి నంటి, దయావిహీనతం
జేసిన పుణ్యముల్ ఫలముసెందునె? పుణ్యము లెన్ని యేనియుం
జేసినవానిసద్గతియె చేకుఱు భూతదయార్ద్రబుద్ధికో
భూసురవర్య! యింత దలపోయవు నీ చదు వేల చెప్పుమా!

వెలివెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళి తప్పఁ జేసి,
కులములో వన్నె తక్కువయయ్యెనే గాధి
పట్టికి మేనకచుట్టఱికము,

ననుపుకాఁడై వేల్పునాగవాసముఁ గూడి
  మహిమ గోల్పడియెనే మాందకర్ణి
స్వారాజ్య మేలంగనీరైరె సుర లహ
  ల్యాజారుఁడైన జంభాసురారి
వారికంటెను నీ మహత్త్వంబు ఘనమె
పవనపర్ణాంబుభక్షులై నవసి, యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చు లెల్లఁ
దామరసనేత్రలిండ్ల బందాలుగారె!"

అనిన నేమియు ననక యవ్వనజగంధి
మేన జవ్వాదిపస గదంబించు నొడలు
గడిగికొని, వార్చి ప్రవరుండు గార్హపత్య
వహ్ని నిట్లని పొగడె భావమునఁ దలఁచి.

దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడనేని, భవత్పదాంబుజ
ధ్యానరతుండనేనిఁ, బరదారధనాదులఁ గోరనేని, స
న్మానముతోడ నన్ను సదనంబున నిల్పు, మినుండు పశ్చిమాం
బోనిధిలోనఁ గ్రుంకకయమున్న రయంబున హవ్యవాహనా!

అని సంస్తుతించిన నగ్నిదేవుం డమ్మహీదేవు దేహంబున సన్నిహితుండగుటయు నమ్మహాభాగుండు పావకప్రసాదలబ్ధంబగు పవనజవంబున నిజమందిరంబున కరిగె.

## వీరవరాహము

ఎగుచుకూఁతలు ముట్టెయెత్తి బిట్టాలించి
  గమికిఁ గన్నాకయి గాలి యరయు
వడిఁ గుక్కలంటంగవచ్చిన మెడద్రిప్పి
  ఘుర్ఘురించుచు బయల్ గొమ్ముజిమ్ముఁ

దారసించినచోట దారునం జోరంబాఱి
యొకటిరెంటిని దొబ్బ లురల నడుచుం
బాలచేరులు వట్టి తూలింప బలిమి నీ
డ్చుకొని డొంకలం దూఱి చుట్లబెట్టు
నీఱుపోటులం బడి ప్రేవు లీంచులాడం
బోయి, పోలేక దగదొట్టి, పొదలు సొచ్చి
బెండువడియును, జొరనీదు పీటవెట్టి
చూపులన యేర్చు ప్రజ నొక్క సూకరంబు.

## పల్లవోద్గమము

సానదేఱి, పొటమరించి, నెఱెవాసినయట్టి
యాకురాలుపుగండ్లయందుం దొరంగి,
అతిబాలకీరచ్ఛదాంకురాకృతిం బొల్చి,
కరవీరకోరకగతి క్రమమున
నరుణంపుమొగ్గలై, అరవిచ్చి, పికిలియీం
కలదండులట్లు గుంపులయి, పిదప
రేఖలేర్పడంగ వర్ధిలి వెడల్పయి, రెమ్మ
పసరువాఱుచు నిక్కం, బసరుకప్పు

పూంటపూంటకు నెక్కం, గప్పునకుందగిన
మెఱుంగు నానాంటికిని మీంద గిఱికొనంగ
సోగయై యాకుప్రాలంగ జొంపమగుచుం
జిగురు దళుకొత్తెం దరులతాశ్రేణులందు.

(స్వారోచిష మనుచరిత్రమునుండి)

## నంది తిమ్మన

[16-వ శతాబ్ది]

## సత్యాసాంత్వనము

అరదము నెక్కి కేతనపటాంచలచంచలమైనతాల్మితోఁ
దురగజవంబు మున్నడవఁ ద్రోచి కడంగెడుతత్తఱంబుతోఁ
దిరిగెడు బండికండ్లపగిదిన్ భ్రమియించుమనంబుతోడ నా
హరి సనుదెంచె సత్యసముదంచితకాంచనసౌధవీధికిన్.

వచ్చి యరదంబు డిగ్గి తద్ద్వారసీమ...
కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి,
అలబలములేనినగ రెల్ల నరసిచూచి.

కనకపంజరశారికలకుఁ జక్కెర వెట్టి
  చదివింపరేలొకో సకియ లిపుడు
కరతాళగతుల మందిరమయూరంబుల
  నాడింపరేలొకో యతివ లిపుడు
క్రొవ్వాఁడిగోళ్ళఁ దంత్రులు మీటి వీణియ
  ల్వాలికింపరేలొకో భామ లిపుడు
కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
  నడిపింపరేలొకో పడఁతు లిపుడు

ఇన్నిదినములవలె నుండ దేమి నేఁడు
చిన్నబోయిన దీమేడ చెన్నుదఱఁగి
పద్మముఖితోడ నెవ్వరేఁ బారిజాత
పుష్పవృత్తాంత మెఱఁగింపఁబోలునొక్కొ.

అని యనుమానించుచు నా
య్యనఁ గోపగృహంబు సేరి, యా సత్రాజి

త్తనయ ముసుంగిడియుండఁగ
ననువుమెఱయఁ జొచ్చి, మాయ యచ్చుపడంగన్.

కొందఱు మంతనంబులను, గొందఱు జంకెనవాఁడిచూపులం
గొందఱుఁ జేతిసన్నలఁ దగుల్పడఁజేయుచుఁ జేరబోయి, మ
ధ్యందినభానుమండలకరావళి హావళి వాడియున్న తీ
వం దలపించు నమ్మగువఁ గన్గొని యెంతయు విస్మితాత్ముఁడై.

ఈ లలితాంగిచంద మొక యించుక చూచెదనంచు ధూర్తగో
పాలుఁడు తాలవృంత మొకభామిని సత్యపిఱుందనుండి మం
దాలసలీలమై విసర నాదటఁ గైకొని వీచెఁ దద్వపుః
కీలితపంచసాయకశిఖం దరికొల్పుచునున్నకై వడిన్.

అంతటఁ బారిజాతకుసుమాగతనూతనదివ్యవాసనల్
వింతలుసేయఁ దావియిది విస్మయమంచు ముసుంగుద్రోచి య
క్కాంత గృహంబు నల్గడలు నారసి, సంభృతతాలవృంతునిం
గాంతునిఁ జూచి, బాష్పకణికాతరళీకృతలోచనాంతయై.

తలవాంచి మగుడ ముసుఁగిడెఁ
గొలుకుల డిగజాఱి జాలుకొను బాష్పంబుల్
పలుచని చెక్కుల లవలీ
దళపతితమరందబిందుతతిఁ బురుడింపన్.

ఓర్పొకయింత లేని వికచోత్పలలోచన చిత్తవీథిఁ జ
ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వేచనుదెంచెనంచుఁ గం
దర్పహుతాశనుణ్ వెలికిఁ దార్చుసఖుండునుబోలె వేఁడిని
ట్టూర్పు దళంబుగా నిగిడె నున్నమితావరణాంశుకాంతమై.

వనితకుచద్వయంబుపయి వ్రాసినకుంకుమపత్రభంగముల్
జనితనితాంతఘర్మకణజాలముచేతఁ గరంగి, మెల్లమె
ల్లన వెలిపట్టుపయ్యెదకెలంకుల జాఱుట యొప్పె మానసం
బున నెలకొన్న క్రోధరసము న్వడవెట్టుచునున్నకై వడిన్.

మానవతి యిట్లు మానని
మానక్రోధములచేఁ గుమారిలి, చింతా
ధీనగతి నుండ, మదిలో
నూనినప్రేమమున నంబుజోదరుఁ డనియెన్.

"ఇందునిభాస్య! మైతొడవు లేల ధరింపవు? సన్నగావు లీ
వెందును నూనలేవు, తెలు పేటికిఁ గట్టితి? వీటికారుచుల్
కెందలిరాకుమోవి దులకింపఁగఁ జేయక యున్కి యేమి? నీ
చందము వింతయయ్యెడు నిజంబుగ నా కెఱుఁగంగఁ జెప్పుమా?

పలుకులఁ దేనె లుట్టిపడఁ బల్కవు నేఁ డిది యేమి? క్రాలుగ
న్నుల నునుసిగ్గు నాల్కొనఁగ నుంగొనవేల? యురఃస్థలంబుఁ జ
న్నుల నెదురొత్తి మక్కువ ననుం బిగికౌఁగిటఁ జేర్పవేటికే?
చిలుకలకొల్కి? యెవ్వ రెడసేసిరి, నీ కిటు లేల చింతిలన్?

మనముల మాటలం ప్రియుల మన్నన లీ నొకనాఁడు నెట్టికా
మినులకు, గారవంబు మెఱమెచ్చులకై పచరింతుఁగాని, పా
యనియనురక్తి నీయెడల నగ్గలమై కనుపట్టు నాకు, నీ
పనిచినపంపు సేయుటయ ప్రాభవ మాటది నీ వెఱుంగవే?

పడఁతీ! నీ మధురాధరామృతము నీ బాహాపరీరంభముల్
బడయన్ ధన్యుఁడఁగాక యుండిన, ననుం బాటించి యొక్కింత నీ
నిడువాలుంగడకంటఁ జూడు" మనుచున్ శిల్పోపమిం బైచెఱం
గొడియం, జేవిరిదమ్మి వ్రేయుటకునై యుంకించి జంకించినన్.

పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబుఁ దీర్ప నె
ప్పాటను బాటుగామి, మృదుపల్లవకోమలతల్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియవెట్ట నా జగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్

జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధుకన్నతండ్రిశిర మచ్చో వామపాదంబునం

దాలఁగంద్రోచె లతాంగి; యట్లయగు నాథుల్ నేరముల్సేయఁ బే
రలుకం జెందినయట్టికాంత లుచితవ్యాపారముల్ నేర్తురే!

కోపనపదహతికుహనా
గోపాలుఁడు గాంచి, మెయి గగుర్పొడువఁగ ను
ద్దీపితమన్మథరాజ్య
ప్రాపితుఁడై పలికెఁ గూర్మి బయలుపడంగన్.

'నను భవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁ బూని తాఁ
చిన, యది నాకు మన్ననయ; చెల్వగు నీ పదపల్లవంబు మ
త్తనుపులకాగ్రకంటకవితానము నాటిన నొచ్చునంచు నే
ననియెద, నల్క మానవుగదా యికనైన నరాళకుంతలా!''

అన విని మానినీతిలక మప్పుడు మే యఱదోఁప నిక్క, వీ
డినకచపంక్తిఁ బల్మఱు ముడి న్వడదోఁపుచుఁ బైచెఱంగు గ్ర
క్కునఁ జనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమరంకురింప, జం
కెననెఱిచూపుఁ జూచి పలికెం జలితాధరపల్లవాగ్రయై.

''ఈనయగారపుంబ్రియము లీపస లీమొగమిచ్చుమాట లే
లా, నిను నమ్మియుండిన ఫలం బిదె తోడన కల్గె, నీకు నా
యానసుమీ! ననుం జెనకి యాఱడివెట్టిన, నవ్వువారలం
గాన, వెఱుంగునే పసులకాపరి భావజమర్మకర్మముల్.

ఇంకిటు నిన్ను నమ్మ; నను నేమిటికిం గెరలించె? దెంతయుం
బొంకముగాని యీవలనిబొంకులు మాచవిగావు, రుక్మిణీ
పంకజపత్రనేత్రకును బ్రాణపదంబులుగాని వల్లవీ
కింకర! చాలుఁజాలు నడకింపకు, నింపకు లేనికూరుముల్.

గట్టివచేతలుం బసలు గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన, వెందులేనిపలుపోకలమాయలు నీకు వెన్నతోఁ
బెట్టినవౌ ఱెఱింగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ గోల్పడిపోయితి, నేమిసేయుదున్.

మునిపతి వచ్చి పూవొసఁగి మోదముతోడ భవత్ప్రియాంగన
న్వినుతియొనర్పఁగా వినినవీనుల మా చవిగానిమాటలన్
వినవలసెంగదా, యిపుడు నీ విట వచ్చుట పారిజాతవా
సనఁ బ్రకటించి నాకు నెకసక్కెముసేయనకాదె చెప్పుమా?

మానంబె తోడవు సతులకు,
మానమె ప్రాణాధికంబు, మాన మఖిలస
మ్మానములకు మూలంబగు
మానరహితమయిన బ్రదుకు మానినికేలా?

తనదుకోడండ్రలోనఁ బెద్దయుగ నన్ను
దేవకీదేవి మన్నించు, నీవు నాకుఁ
జనవులిచ్చుటఁజేసి, యాసాధ్విసేవ
సేయఁబోవంగ నా కింక సిగ్గుగాదె?

ఉవిద యెవ్వతె నోఁచియున్నదో యీ శమం
 తకరత్న మింక నౌదల ధరింప?
ఈరైవతకశైలచారుకూటవిటంక
 కేలి కిం కెవ్వతె పాలుపడునొ?
ఎవ్వతె కబ్బునో ఈవసంతారామ
 కర్పూరకదళికాగారవసతి?
లీల నీమణిసౌధజాలకంబుల నిన్ను
 గూడి యెవ్వతె వార్ధి జూడఁగలదొ?
అకట! నేఁ బెంపఁ బెరిఁగనశుకమయూర
శారికాబృంద మెవ్వతె జేరునొక్కొ?
నన్ను నాతోడిసవతులు నగకమున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁగాన.

నను నెవ్వతెగాఁ జూచితి?"
వని యంతర్బాష్పయగుచు నవనతముఖియై

ఘనతరగద్గదికాని
స్వనమున మఱి మాటలాడ శక్యముగామిన్.

ఈసునఁ బుట్టి డెందమున హెచ్చినశోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్.

ఆరమణీలలామ మది నంటినకోపభరంబు నిల్పఁగా
నేరక నవ్వగం బాగుల నీరజనాభుఁడు నిండుకౌఁగిటం
జేరిచి బుజ్జగించి, నును జెక్కుల జాలుకొనంగజాఱు క
న్నీరు కరంబునం దుడిచి, నెయ్యముదియ్యము దోఁప నిట్లనున్.

"ఓలలితేంద్రనీలశకలోపమకైశిక! యింతవంత నీ
కేల లతాంతమాత్రమున కేఁ గలుగన్? విను, నీకు దేవతా
కేలివనంబుఁ జొచ్చి, యనికిన్ బలసూదనుఁ డెత్తివచ్చినన్
దీలుపడంగఁ దోలి, యిటఁ దెచ్చెద నిచ్చెదఁ బారిజాతమున్.

వామలోచన! నీకేలివనములోనఁ
జలువ వెదజల్లు చెంగల్వకొలనికెలన
సరసకర్పూరకదళికాతరులనడుమఁ
బెరటిచెట్టుగ నాటింతుఁ బెంపుగనుము."

అని పలుకు నంబుదశ్యా
మునిగర్జితమధురవాక్యముల సత్యామా
నిని నీపలతికవోలెం
గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁగన్.

(పారిజాతాపహరణమునుండి)

## ధూర్జటి

[16-వ శతాబ్ది]

### భుజంగమాతంగములు

త్రేతాంతంబున నొక్క కాలఫణి భక్తిన్ దివ్యమాణిక్యముల్
పాతాళంబుననుండి తెచ్చి దినమున్ బాలేందుచూడార్చనల్
ప్రాతర్వేళలఁ జేయు; ద్వాపరయుగప్రారంభమైనన్ గుణా
తీతున్, శంకరుఁ గొల్వవచ్చె నొక హస్తిశ్రేష్ఠ మచ్చోటికిన్.

వచ్చి, కేతకినది వారిలోపలఁ దోఁగి
కానలు గొలఁకులు కలయఁదిరిగి
మాలూరశాఖలు నాళీకకహ్లార
కుముదపుష్పంబులు గోసి తెచ్చి
ఫణి సమర్పించిన మణులెల్లఁ బోఁద్రోచి
తొండానఁ గ్రోలిన తోయములను
దక్షిణకైలాసధరణీధరావాసు
సద్భక్తితోడ మజ్జనముసేసి
పూజలొనరించి యేనుఁగు పోవుటయును
భవుని దర్శింప మఱునాఁడు పాఁపఱేఁడు
నిజఫణాగ్రసమగ్రమాణిక్యదీప్తి
తపనునకుఁ దో డుషఃకాలతమము సెఱుప,

డగ్గఱి, యెవ్వఁడో కటకటా శివలింగముమీఁది రత్నముల్
గగ్గులకాటఁ గప్పి, ములుకంపలు దీవలు వెట్టి నేఁడు, నా
కెగ్గొనరించి పోయె, నిఁక నేమననేర్తు? మదీయభాగ్య మి
ట్లగ్గిబెడంగఁ జేసిన మదాంధుని''నంచు విషాదచిత్తుఁడై,

అల్లన యేనుఁగువెట్టిన
వెల్లం బోఁద్రోచి, యెడఁద నీసును భక్తిన్

మల్లాడ. మణుల గౌరీ
వల్లభుఁ బూజించి చనియె వాతాశనమున్.

అంతటఁ గొంతసేపునకు నగ్గజరాజును వచ్చి, రత్నసం
క్రాంతశరీరు, నీశ్వరునిఁ గన్గొని, "యెవ్వఁడొ నేఁడు నజ్ఞతా
సంతమసంబుగప్పి, యెకసక్కెపుఁబూజ లొనర్చెఁగాక, యే
భ్రాంతులు పెక్కువర్ణములతాలు కపర్దికిఁ బెట్టఁజూతురే!"

అని చింతించుచు నెప్పటి
యనువున శివపూజచేసి, యడవికిఁ జనియెన్
దనయిచ్చ దంతి; పామున్
బనివడి మఱునాఁడు దాఁ బ్రభాతమునందున్.

శివుఁ బూజింపఁగవచ్చి, బిల్వవిటపశ్రేణీసనాళాబ్జభే
దవిలీనాంగము దివ్యలింగము సఖేదస్వాంతమై చూచి, "నా
ది వృథాజన్మముగాదె! నాతపము, భక్తిం బాడుగాకున్నె, యే
ల విచారింపఁగ నెల్లియున్ వ్రతము కొల్లంబోయినంజూచెదన్.

ఎక్కడి దుర్మదుండొ! తన కే నొనరించిన రత్నపూజనల్
దిక్కులఁ బాఱఁజల్లి జగతీరుహశాఖలు దమ్మికాడలున్
బెక్కులు గొంచువచ్చి పయిబెట్టిన నూరకయుండె శంకరుం;
డక్కట! యేమిసెప్ప నహహా! పగవారినిఁగూడె దైవమున్.

కంటకమెట్లు నాక, సుముఖత్వమునొందితివయ్య? పార్వతీ
కంటకితాంగ! బాహులతికాయుగసంగతిఁబోలె దుఃఖకృ
త్కంటకబిల్వకాకమలకాండము లెత్తిన మోచిమోచి ము
క్కంటి! యెఱుంగవే నొసలికంటిమహత్త్వము నీకుఁ గల్గుటన్"

అని దుఃఖించుచు నెట్టకేలకు దృఢంబై చిత్త మాత్మేశు న
ర్చనసేయం దలపోయ, దంతికృతపూజల్ ద్రోచి, పైదుమ్ము భ
స్మనఁబోనూఁది, యనర్ఘ్యరత్నములఁజక్షుశ్శ్రోత్రమర్పించి, యా
త్మనివాసంబు తదంతరాయజనితోన్మాదంబునన్ దూఱుచున్.

భోగవతీఝురంబునఁ జొచ్చి, బోటుల
  తోడ నాడెడు జలక్రీడ లుడిఁగి
పువ్వుఁబోణులు దాను బొత్తుల భుజియించు
  మధురసుధాహారవిధి దొఱంగి
బహువిధతానసంపన్నగానంబుల
  నిక్కిచొక్కెడు తననేర్పు వదలి
ప్రాణనాయికతోడఁ బర్యంకసీమల
  మసకానఁ బెనఁగు సంభ్రమము విడిచి
నిద్రవోయెడుసుఖ మెల్ల నేలఁగలిపి
ప్రతిదినంబును దాఁజేయు రత్నపూజ
శివునిపై నుండకుండినఁ జింతనొంది
రాత్రి శివరాత్రిగా జాగరమ్ముజేసె.

తా నర్చించి తొలంగినట్టి తరువాతన్, శంభుఁ బూజింపఁగా
దానానేకప మేగుదెంచి, శివుమీఁదన్ నిన్న మొన్నం బలెన్
నానారత్నము లుండఁజూచి, కడుఁజిన్నంబోయి, ‘‘నాతోఁజలం
బో! నేఁ డీశిల విశ్వనాయకునిపైఁ బొందించినాఁ డెవ్వఁడో.

అచ్చపు నీలవర్ణదృషదావళి నల్లనికల్వలే? కడుం
బచ్చనిరాలు బిల్వనవపత్రములే? యరుణాశ్మభంగముల్
ఇచ్చిన యెఱ్ఱదామరలె? విశ్వపతీ! విరసోపలంబు లె
ట్లచ్చుదలయ్యె నీకు? నవి యందునె గంధమృదుత్వశైత్యముల్.

ఉనికి శిలోచ్చయంబు, నిజయోష శిలోచ్చయరాజపుత్రి! నీ
ధనువు శిలోచ్చయంబు, పురదాహ! రథీకృతరత్నగర్భ! నీ
మనమున కీశిలాశకలమండన మెట్లు ప్రియంబుజేసె? నే
మనఁగలవాఁడ నిన్ను, వ్రతహానియొనర్చు దురాత్ముఁడుండఁగన్

పోనీ, నేఁటికి నాయెఁబోయెఁ, గడుదుర్బుద్ధిన్ విచారింపనే
లా, నిత్యంబును నీశ్వరుం గొలుచువేళంగాక రేపాడి రాఁ

గా నర్చావ్రతహంతఁ గన్న నదిభాగ్యంబే వివేకింప; వాఁ
డా, నేనా నొకజాడఁ బోయెదము, లేదా జీవ మింకేటికిన్.

ప్రాణము లిచ్చువాఁడ నిఁక భర్గున కెల్లియుఁ బూజవోయి పా
షాణము లున్న, నిందునకు సందియమేల, విచారమేటికిన్
బ్రాణముమీఁదఁ దీపుగల ప్రాణులకున్ బిరుదున్ వ్రతంబు క
ళ్యాణకరంబులే'' యనుచు నర్చనసేసి మదేభరాజమున్,

పిడియేనుఁగులవెంటఁ బడిపోక యుడుఁగని
వెడవిల్తువేఁడిమి విడుపుజూపఁ
గరమున నుదకంబు కడుఁజల్లుకొనకున్నఁ
దెమలని మిహిరదాహము దొలంగ
సరసునఁ జొచ్చి తామరతూండ్లు మెసఁగక
మానని యాఁకటిమంట లేక
సింహపోతములు ఘోషింపఁ బుట్టినభయా
తంకాగ్నితహతహ గ్రుంకఁబాఱ

కెట్టివెట్టలు దనమీఁద నెక్కలేక
పంచబంగాళమై పోవఁ, బ్రాణలింగ
పూజనావిఘ్నమునయందుఁ బుట్టినట్టి
చింతయన్ వేఁకి దనలోను చేసికొనియె.

ఏమి సేయుదునని యాత్మసీమమునకుఁ
బోయి, తనలోనఁ దలపోఁత బ్రుంగుడయ్యె
నెపుడు పడమటికొండపై నెక్కు భానుఁ,
డెప్పు డుదయించు, నేఁ బోదు నెప్పు డనుచు.

అయ్యవసరంబున,

ప్రాగ్వధూమణి చిమ్మఁ బశ్చిమదిక్కాంత
పట్టినచెంగల్వబంతి యనఁగఁ

గాలవిష్ణుం డంధకారదైత్యుని ద్రేయఁ
  జరమాద్రిఁ బడిపోవు చక్రమనఁగ
దినమహీరుహమునఁ దేజోమయంబుగాఁ
  బండిరాలిన పెద్దపం డనంగ
దివినుండి దేవదానవయుద్ధరక్తార్ద్రి
  మై నేలఁ గూలురథాంగ మనఁగఁ
బద్మినీసంగమక్రాంతిఁ బరిహరింప
నపరజలనిధి జలకంబులాడఁబోవు
కరణి నెఱసంజచందురుగావిపచ్చ
డంబు ధర బెట్టి భానుబింబంబు గ్రుంకె.

ఉదయగ్రావము పానవట్ట, మభిషేకోదప్రవాహంబు వా
ర్ధి, ధరధ్వాంతము ధూపధూమము, జ్వలద్దీపప్రభారాజి కౌ
ముది, తారానివహంబు లర్పితసుమంబుల్గాఁ దమోదూరసౌ
ఖ్యదమై శీతగభస్తిబింబశివలింగం బొప్పెఁ బ్రాచీదిశన్.

గగనాహార్యమృగేంద్రశాబకము, నక్షత్రాంబుజారణ్యమ
ధ్యగహంసంబు, నిశావధూకరతలోద్యన్మల్లికాగుచ్ఛ, మ
ధ్వగబాధావహచిత్తభూకటకయాత్రామాక్తికచ్ఛత్ర మొ
ప్పుగతిం జంద్రుఁడు దోఁచె దంపతులకింపుల్మీఱఁగాఁదోడ్దైసన్

గరుడానీతసుధాఘటంబుఁ గొనిపోఁగా నిర్జరశ్రేణివెం
ట రయంబాఱఁగఁబాఱునాగ్నముల చూడారత్నసందోహ మం
బరవీథిం బరగింపఁ జంద్రుఁ డుదయింపం, దోఁచెఁదోడ్తో నుడూ
త్కరముం జిందమృతంబు బిందువులశంకం గ్రమ్మగం జేయుచున్

కుముదవనాళికిన్ బలుపు, కోకములాటకు నిల్పు, దిగ్వధూ
సమితికిఁ బూఁత, మేఁత నవశాబచకోరకరాజి, కిందుకాం
తములకు ద్రావకంబగుచు దర్పకశాస్త్రనిరూపితౌషధ
క్రమములఁ బండువెన్నెలలు గాసి ధరాస్థలి మోహవంబుగన్

అప్పుడు పాము నేనుఁగు మహావ్రతవిఘ్నవిషాదవేదన్
ముప్పిరిగొన్నచింతఁ గనుమూయ నెఱుంగక, నెమ్మనంబులో
నెప్పుడు తెల్లవాఱును, సహింపఁగరాని విరోధవహ్ని నే
చొప్పున నార్తు మొక్కొయనుచుం దమలోఁదలపోయుచుండఁగన్

నిర్నిద్రపూర్వాద్రినీపప్రసూనాభి
  రామాంబురాశితరంగ మనఁగ
భానుభిల్లగభస్తిభల్లభగ్నతమోచ్ఛ
  భల్లనిర్యద్రక్తపంక మనఁగ
రజనీసుధాకరరతివియోగనిధాన
  కామప్రతాపాగ్నిధామ మనఁగ
సంధ్యాధిదేవతాచారుపీఠవ్రాత
  పద్మరాగప్రభాపటల మనఁగఁ
గాలరసవాది బ్రహ్మాండగోళ మెల్లఁ
జిత్రబుద్ధి సువర్ణంబుసేయఁ దలఁచి
ద్యుమణిశిఖిమీఁదఁ జల్లు సిందూరరాజి
యనఁగ నొప్పారె నరుణశోణాంశురాజి.

పన్నగంబు గజము బలమునఁ జలమునఁ
బోరుటెట్లో, శివుని బొందుటెట్లో
చూడవలయుననుచు వేడుకతో వచ్చు
కరణి నంతఁ దోఁచెఁ గర్మసాక్షి.

భానుఁడు పూర్వపర్వతముపై నుదయింపకమున్నె లేచి, కుం
భీనసవల్లభుండు మదిఁ బేర్చినరోషభరంబున్ నిజ
స్థానము నిర్గమించి, పగఁ జంపఁగవచ్చు కటారుకానిచం
దాన మహేశ్వరుం గదిసి, తా నొనరించినపూజ లేమికిన్.

కటకటబడి యిఁక నెటువలె
నటుకానీ, వానిఁ దీర్తు, నటు కాదేనిన్

నిటలాక్షున కర్పింతుం
జటులగతిం బ్రాణములు నిజంబుగ ననుచున్.

పిన్నరూపమగుచు బిల్వశాఖాంబుజ
నాళమధ్యసీమఁ గాళనాగ
మడఁగియుండ, దంతి యతివేగమున వచ్చి
శివునిపూజఁ జూచి చిత్తమలర.

ఈ సకలేశ్వరుండు కరుణేక్షణుఁ డయ్యెనో? విఘ్నకర్త సం
త్రాసమునొందెనో? వ్రతము ధన్యతనొందెనో? పూర్వజన్మవే
ళాసుకృతంబు పండెనో? కళానిధిశేఖరమౌళి నేఁడు నే
జేసినపూజ నిల్చెనని శీఘ్రమున న్ముదమంది, క్రమ్మఱన్.

డాఁగియున్నపాము డాయకపోయెఁగా
దాయ యనుచు రోషదహనశిఖలు
కన్నుఁగొనలఁ గ్రాలఁగా నుండ నాకీడు
గాన, కిభవరుండు గాన కేగి.

నీరరుహామాలూరదళభరంబులు కరంబునఁ జుట్టిపట్టుకొని,... గారుణ్యరసతరంగంబగు శివలింగంబుఁ జేరఁజను దెంచి, పాపహృదయశల్యంబగు నిర్మాల్యంబు దుడుపం దలంచి.

శుండాలంబు కరంబు సాఁప, ఫణిరాజు న్మెచ్చి, నాపూజ భ
ర్గుం డీవేళ ననుగ్రహించెనని ముక్కుంగోళ్లలో నెక్కి యు
ద్దండక్రీడఁ దదీయకుంభకుహరస్థానంబునం ద్రిమ్మరన్
గొండ ల్గూలఁగ నెత్తి మొత్తుకొని దిక్కు ల్మ్రొట్ట గీపెట్టుచున్.

మొగలేటి మడుఁగున మునిఁగి తుండమ్మున
నుదక మాకర్షించి యూఁది యూఁది
కడు గపాలము దాఁకి గలగంగఁ జక్కఁగాఁ
జేసాఁచి జిట్టునఁ జీఁది చీఁది

యిలమీఁదఁ దల దాఁక నీప్రక్క నాప్రక్కఁ
  బెడమర్లగాఁ బొడపెట్టిపెట్టి
యుడివోనివేదన నున్నచో నుండక
  పనిలేని పరువులు పాఱిపాఱి

పెద్దమ్రాఁకులతోఁ గుంభపీఠయుగము
దోముకొనుచును, జెట్టులు దూఱితూఱి
పాముసేసిన దుఃఖంబు సామజంబు
దీర్చుకొనువెర వెఱుఁగక ధీరబుద్ధి.

ఏనా చచ్చుట తప్ప దిప్పుడు, నుమాధీశోపకంఠంబునన్
దానుం జావక చంపనోప దుర గేంద్రం, బెక్కు డీ దుఃఖ మే
లా నాకున్ ? సరి, చంపిచచ్చుట జనాహ్లాదంబుగాదా, యవా
చీనస్థాణునగంబె వధ్యశిలగా సేవింతుఁగా కింతటన్.

అని మత్తేభము చిత్తజాహితుని దిక్కై, మ్రొక్కి, యిక్కాళ మే
కనుమం బోవునో యంచుఁ దుండ మిఱియంగాఁ జుట్టి, వక్త్రస్థలం
బునఁ గీలించి, పిఱిందికిం జని, శిరంబు న్వంచి, యక్కొండ భ
గ్గునఁదాఁకె న్వడిఁ గుంభము ల్వగులఁదత్ఘాటంబు లూటాడఁగన్

కొండ కొండతోడ గుండులు గూలంగఁ
దాఁకినట్లు దోఁచె, దళితకుంభ
సీమ నున్నపాము చిదిసె, నేనుంగును
బడియె, నెత్తు రచటఁ బడియగట్టె.

తదీయమరణస్థానంబు నవాచీనకైలాసనికటంబును, సువర్ణ ముఖరీతటంబు నగుటంజేసి కాద్రవేయభద్రగజంబులు రుద్రగణా కారంబులు దాల్చిరి. అమ్మహాలింగమధ్యంబునందుండి...చంద్ర చూడామణి ప్రత్యక్షంబై, మీ కభీష్టంబు లెయ్యవి యని యాన తిచ్చుటయు, సాష్టాంగదండప్రణామంబులు గావించి సన్నుతించి,

ఈ సంసారపయోధిలోనఁ బడి, మే మీఁదీఁది దేహంబుపై
నాస ల్మానక తేలుచు న్మునుఁగుచుం, బ్రాణప్రయాణోన్ముఖా
యాసంబుల్ శతసంఖ్య లోర్చితిమి దేవా! మమ్ము రక్షించి, మి
థ్యాసౌఖ్యంబులు చాలు, నిత్యసుఖమిమ్మా యంచుఁ బ్రార్థించినన్
డాయంబిల్చుచు వారి నిద్దఱ నఖండజ్ఞానరూపంబునన్
వ్యాయామంబు నదృశ్యవస్తువు నమాయాకారముం బుష్కర
ప్రాయంబున్ విమలంబునైన తన సర్వవ్యాపకజ్యోతిలో
సాయుజ్యం బొనగూర్చె దేవతల కాశ్చర్యంబు సంధిల్లఁగన్.

( కాళహస్తీశ్వర మహాత్మ్యమునుండి )

## కాళహస్తీశ్వరా!

నీకున్ మాంసము వాంఛయేని కఱవా నీచేత లే దుండఁగా
జోకైనట్టి కుఠార ముండ, ననలజ్యోతుండ, నీరుండఁగాఁ
బాకం బొప్ప ఘటించి, చేతిపునుకన్ భక్షింప, కాబోయచేఁ
జేకొం టెంగిలిమాంస మిట్లు దగునా? శ్రీకాళహస్తీశ్వరా!

పదునాల్గేలె మహాయుగంబు లొక భూపాలుండు, చెల్లించె న
య్యుదయాస్తాచలసంధి నాజ్ఞ నొకఁ డాయుష్మంతుఁడై, వీరియ
భ్యుదయం బెవ్వరు చెప్పఁగా వినరొ? యల్పుల్మత్తులై యేల చ
చ్చెదరో రాజులమంచు నక్కటకటా శ్రీకాళహస్తీశ్వరా!

కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు, వక్షోజముల్
రాయన్ రాపడె ఱొమ్ము, మన్మథవిహారక్లేశవిభ్రాంతిచేఁ
బ్రాయంబాయెను, బట్టకట్టెఁ దల, చెప్పన్ రోఁత సంసార మేఁ
జేయంజాల విరక్తుఁ జేయఁగదవే శ్రీ కాళహస్తీశ్వరా!

ఒకపూఁ టించుక కూడు తక్కువగునే నోర్వంగ లేఁ, డెండకో
పక నీడ న్వెదకున్, జలిం జడిసి కుంప న్మెత్తుకోఁ జూచు, వా
నకు నిండ్లిండ్లును దూఱు నీతనువు, దీన న్వచ్చుసౌఖ్యంబు రో
సి కడాసింపరుగాక మర్త్యు లకటా శ్రీ కాళహస్తీశ్వరా!

సంతోషించితిఁ జాలుఁజాలు రతిరాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందితిఁ జాలుఁజాలు బహురాజద్వారసౌఖ్యంబులన్
శాంతిం బొందెదఁ జూపు బ్రహ్మపదరాజద్వారసౌఖ్యంబు ని
శ్చింతన్ శాంతుఁడ నౌదు నీకరుణచే శ్రీ కాళహస్తీశ్వరా!

(కాళహస్తీశ్వరశతకమునుండి)

# శ్రీకృష్ణదేవరాయలు

[16-వ శతాబ్ది]

## విలుబుత్తూరు

శయపూజాంబుజముల్ ఘటిం దడఁబడన్, జన్దోయి లేఁగౌనుపై
దయదప్పన్ బసపాడి, పాగడపుఁబాదం బొప్పఁ జెంగల్వడి
గ్గియనీ రచ్యుతమజ్జనార్థము కటిం గీలించి దివ్యప్రబం
ధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతు రుద్యానంపులోఁద్రోవలన్

కలయన్ నీలమయంపుఁ దల్లియొఱదాఁకం దేటనీ రొప్పు గ
ధ్యలకూపంబుల మీలఁ జూచి, వలభీవ్యాసంగితుంగద్రుశా
ఖలలోఁ డాఁగి గుభాలనన్ లకుముకుల్ క్రిందై పడున్, లేచు మ్రు
చ్చిలి, గేహేందిర ద్రావిడీపరిచితిన్ జెండాడుచందంబునన్.

వేవిన మేడపై వలభివేణికఁ జంట వహించి విప్పఁగాఁ
బూవులు గోట మీటుతఱిఁ బోయెడు తేఁటుల మ్రోఁత కామిశం
కావహమౌఁ గృతాభ్యసన లౌటను దంతపుమెట్లవెంబడిం
జేవడి వీణె మీటుటలుఁ జిక్కెడలించుటలు న్సరింబడన్.

తలఁ బక్షచ్ఛటఁ గ్రుక్కి బాతువులు కేదారంపుఁ గుల్యాంతర
స్థలి నిద్రింపఁగఁ జూచి యారెకు లుషస్నాతప్రయాతద్విజా
వళిపిండీకృతశాటులన్ సవిఁ దదావాసంబుఁ జేర్పంగ రే
వుల డిగ్గన్, వెసఁ బాఱువానిఁ గని నవ్వున్ శాలిగోప్యోఘముల్

## గ్రీష్మము

నులివాఁడు నాఁచువల్వుల గొంతొగర్చి లేఁ
బాలవల్చుగాలి వేఁబోక యొదిఁగి
కడకు వెళ్లఁగ నొక్కకడనుండి త్రొక్కుచు
నులుచలఁ జిఱుతగుల్లల నమలుచు
నెండ్రికా లిఱికిన నెగసి యొక్కించుక
తొలఁగి శితత్రోటిఁ దూఁటి తినుచుఁ
దడియింకు నిలఁ జేమమడివోని తమ్మిగుం
పులను జీలుగల నెండలు గడపుచుఁ
దనరు బకపంక్తులకు జానుదఘ్నమయ్యెఁ
జెఱువుగమి, యుడుములన రేల్ దిరిగెఁ గుక్క
వసికి బావులఁ బడుటకుఁ బసులయెరవు
కొఱలకు మొసళ్లు, మలుఁగుమీ నొప్పెఱియుఁ దూఱె.

సెగ కుల్కి మఱుఁగు సొచ్చిన జహ్నురవిజల
సరణి మల్లెలతోడి జడలు మెఱయ
వలిచన్నుకొమరు మ్రుచ్చిలిన ది మ్మనుతెఱం
గున ముంచు గరిగ కాఁగుల మునుంగ
ధారలోఁ దోఁచు కన్దళుకులు వాసిత్రో
త్పలపత్రపతనసంభ్రాంతి నొసఁగఁ
దెలిమోముపస మెచ్చి తలయూఁచు కెఱిఁగి మా
నక నవ్వునేర్పు డెందములఁ గరఁపఁ
దెఱవ లిటు నీరువోయు పందిరియ చేరి
యవలఁ గొఱగాక పిచ్చుగుంపై యనంగుఁ
డనుపుగొనఁజొచ్చెఁ గల్లగుట్టమర వారి
కధ్వగులు లాఁచి యిడు విడియములపేర.

ఎసఁగు కట్టావిక్రియ నావి రెగయఁ బగటి
యొండయుడు కొఱకుండు భూమండలమునఁ

బాలిచె మాపటిపండువెన్నెల చకోర
పోతవితతికిఁ జూఁపట్టు వోసినట్టు.

పవలెల్ల దీర్ఘికాంబువు చల్లుపోరాట
నలసి మృణాళికాజడములైన
బాహువుల్ తమదు కూర్పరముల కెదురుగా
మలఁచి, మూఁపులఁ గరతలము లునిచి
ప్రాల్మాలి మిగుల నార్పమిఁ గమ్మక్రొమ్ముడిఁ
దనిమొగ్గ విరవాదిదండ విరియ
ఘాతగంధామోదశీతల స్తనములు
వాండఁ గాఁగిళ్లతోఁ బోరగిల్లి

నారికేళాసవపుఁదీపుటూరు పొలయ
వలిపె యొంటాల్లెతో నురఃస్థలులఁ గూర్కు-
ప్రియల వేకువఁ దొడ లెచ్చరించి కలసి
రెలమి ధన్యులు దఱపివెన్నెలబయళ్ల.

తరుణుల్ దల్లియొఱ స్తుచంబు లునుపం దచ్ఛైత్యముల్ దీములై
పెరరేఁపం జనుదెంచెఁగాక రవిదీప్తిం గ్రుంకి పాతాళగ
హ్వరముం దూఱినవారి నీయదుకుఁద్రాళ్లా తెచ్చునా, దీర్ఘత
చ్ఛిరకృష్టిం గనునట్టిశైత్య మలరించెఁ నూఁతులం దత్తఱిన్.

తారుణ్యాతిగచూతనూత్న ఫలయుక్తైలాభిఘారస్వన
ద్ధారాధూపితశుష్యదంబుహృతమాత్స్యచ్ఛేదపాకోద్ధతో
ద్గారంపుంగన రార్చు భోగులకు సంధ్యావేళలం గేళికాం
తారాభ్యంతరవాలుకాస్థితహిమాంతర్నారికేళాంబువుల్.

తోఁటఁ బగ లుండి మల్లెలు దుఱిమి, కావు
లమర మాపైన నిత్తుయంత్రముల కొయ్యఁ
జేరుప్రజ వాల్చె భావివృష్టికిని గ్రుడ్డు
తో మధురిమేచ్చ డిగు నెఱ్ఱజీమ లనఁగ.

## వర్షర్తువు

పుట్ట వెడలి నభోభిత్తిఁ బట్టు శక్ర
కార్ముకపుఁ బెద్దపలువన్నె కట్లజెత్తి
దైన నడచెడు కాళ్లగుం పనఁగ గాలి
గార్కొని దిగంతముల వానకాళ్లు నడచె.

ఎలగోలు జల్లు మఱి బెళపెళ నేటవా
  ల్పడి గాలి నట్టిండ్లఁ దడిపి చనఁగ
నట్టె తో వడగండ్లకట్టావులు దుమార
  మావులు రేఁచి రెండవదియుఁ జన
మఱి మూఁడవది నిల్చి మెఱసి బిట్టుఱిమి శీ
  కరవారిసృష్టిఁ జీకటిగ నలమ
నుయ్యెలచేరులయోజఁ బైపై వెండి
  జల్లుపై జల్లు పెల్లల్లుకొనఁగ
భూభిదాపాదిదుర్భరాంభోభరంపు
వడి మరుజ్ఝంఝ దెరలక. కడవ వంచి
నట్లు హోరని ధారౌఘ మైక్యమొంది
విన్నుమన్నును నొకటిగా వృష్టి బలిసె.

తడితల డిగ్గి ముంప జడతం దుదఱెప్పలఁ గన్నువిప్పి పు
ల్పొదుచుచు నీరు ముంగరలపోలిక ముక్కునఁగూడ నోటఁగాఁ
తోడియుచు గూఁటికఱ్ఱ సగ మొత్తుచు ఱెక్కవిదిర్పు మున్నుగా
వడఁకుటకాక చేష్టుడిగె పక్షులు పక్షము జానువుల్ చొరఁ.

ఇల్లిల్లు దిరుగ నొక్కిం తబ్బు శిఖి, యబ్బె
  నే నింటిలోఁ బూరి యిడి విసరక
రాఁజదు, రాఁజిన రవులుకొ ల్పొసలె
  కాని కల్గదు కూడు దానఁ, గలిగె
నేని కూ రగుట మం, దైనఁ బెన్పొగ సుఖ
  భుక్తి సేకూర, దా భుక్తి యిడినఁ

ప్రాగ్భోక్తలకె తీఱు, బహుజనాన్నము దీఱ
  నారుల కొదవుఁ బునఃప్రయత్న
మాజ్యపటముఖ్యులయ మెన్న, రాలయాంగ
దారులయు మెన్న రంతిక కారజనిక
పచన నాంధోగృహిణి రామిఁ బడక మఱఁడు
వెడవెడనె యూర్వ నొగిలి రజ్జడిని గృహులు.

దవుల జల్లని తూఱు, నంతకుమునుపటి
జల్లునీ రూని, వచ్చునాజల్లు మొదలి
గాలి యెలగోలుచేఁ గొమ్మ గదలి జల్లు
దలపడకమున్న వంగుళ్లఁ దడిపెఁ దరులు.

గురుగుం జెంచలిఁ దుమ్మి లేఁదగిరి సాకుం దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావి కుట్టారికో
గిరము ల్మెక్కి, తమింగొఱల్పొలముఁబోఁ గ్రేపు ల్మెయుల్నాక మేఁ
కెరువుంగుంపటి మంచ మెక్కిరి ప్రభుత్త్వైకాప్తి రెడ్లజ్జడిన్.

మణియష్టిఁ గేళిబర్హిణషడ్జసుధ వీను
  లోలాడఁ బ్రొద్దెక్క మేలుకాంచి
ఘుమఘుమవత్సమగంధరాజాంగమ
  ర్దనపైఁ జిరోష్ణమజ్జనములాడి
మిసిమిదువ్వలువ బన్నసరంబు మొగలిఱే
  కులఁ దాల్చి జామెక్క కొలువొసంగి
జాంగలామిషముతో శాల్యన్న మధికహ
  య్యంగవీనంబుగా నారగించి
మృగమదముమించు తములంపుటెరులు మోవి
దళముగా, సాగరుహాసంతి వెలుఁగ, సౌధ
శిఖరవాతాయనాగతాచిరరుగంశు
నతదృగవరోధములతోడ నగిరి నృపులు.

(ఆముక్తమాల్యదనుండి)

# రామరాజభూషణుఁడు

[16-వ శతాబ్ది]

## శుక్తిమతీకోలాహలము

రత్నభూషితమైన యారాజధాని
యతులిత సురుచిరముక్తాఫలాభిరామ
దామకం బనఁజాలి నిద్దంపుఁజవులఁ
బరగు శుక్తిమతీనామభవ్యతటిని.

జీవన మెల్ల సత్కవినిషేవిత, మాశయ మెల్ల నచ్ఛతా
పావనతాగభీరతల పట్టు, ప్రచారము లెల్ల విశ్వధా
త్రీవలయత్రికాలఫలదేశికముల్, నవకంబు లెల్ల ము
క్తావళివిభ్రమాస్పదము లా నదిపెంపు నుతింప శక్యమే.

అనుకూలఖేలనాయత్తజీవనమైత్రి
నడరి నర్మద బోటియై భజింప
నూర్మికాకంకణద్యుతికలాపము దోఁప
బాహుద కైదండఁ బరిఢవింప
సముదితారావసంభ్రమసాంద్రయై సారె
సారె వేత్రవతి హెచ్చరిక దెల్ప
గంభీరరసగుంభసంభృతప్రౌఢిమ
తో సరస్వతి బల్కుఁదోడుగాఁగఁ

గులములోఁ బెద్దయు నమూల్యగుణమణిప్ర
కాండపరిపూర్ణయునుగాన గౌరవమున
నఖిలనదులును దనుగొల్వ ననుదినంబు
నలువకొలువున కేగు నన్నది యతీంద్ర.

ఆలీల నమ్మహానది
నాళీకజుఁ. గొల్చి యొకఁనాఁడు ప్రియాళీ

కేళీసంభ్రమవినుతమ
రాళీగతు లడర మరలిరా నొక్కచోటన్.

సుమనోధివాసభాసురశిఖోన్నతివాఁడు
  ఘనసారతిలకవాసనలవాఁడు
ఘనసంకుమదసాంద్రగండభాగమువాఁడు
  నవపద్మరాగదంతములవాఁడు
కలితోపకంఠనక్షత్రమాలికవాఁడు
  హరిచందనచ్ఛాయ నమరువాఁడు
తపనీయమేఖలాధాళధళ్యమువాఁడు
  మణిపాదవలయధామంబువాఁ డ
నర్ఘ్యరత్నావళీవిచిత్రాంబరాభి
రామశృంగారములవాఁడు, హైమగర్భ
గేహమున కేగువాఁడు, కోలాహలాఖ్యుఁ
డొక ధరాధీశుఁ డెదురయ్యె నువిద కపుడు.

అనుపమభాగ్యశాలి కచలాధిపమౌళికిఁ బుత్రుఁడై, జగ
జ్జనని కనుంగుదమ్ముఁడయి, శంకరు ముద్దుమఱందికుఱ్ఱయై
మను తన భాగధేయమహిమంబున మిన్నులు ముట్టివచ్చు ధ
న్యుని నతనిన్ భజించి నదియున్ వినయంబున నోరమైచనన్.

బాలకూర్మవిలాసపదములు కాంతరం
  భాప్రతిబింబోరుభవ్యరుచులు
సరసనైకతసారజఘనసౌభాగ్యంబు
  నతనాభిరూపవనభ్రమంబు
బెడఁగారు దరుల యొప్పిదమును నామీఁదఁ
  జనుజక్కవల నిక్కుచక్కదనము
కమలకోమలముఖకామనీయకము ను
  త్పలమంజులాలోకవిలసనంబు

ఘనఘటానీలవేణియుఁ గల తరంగి
ణీరమణి నిత్యనిర్మలాకారకాంతి
ధార ధారుణ నెదిరినంతనె నగేంద్రు
గాఢతరధైర్య మువ్వెత్తుగా హరించె...

అలఘుశ్రీనిధి యానగేంద్రతనయుం డాసైకతశ్రోణియొ
ప్పులు దెప్పార్పక చూచి చన్నమొదలుం బొంగారి పైపై రసం
బులు జృంభించు,భ్రమించునాశయము,కూర్ముల్మించదీపించును
త్కలికాచాపలము ల్మనోనిబిడచింతాతన్మయత్వంబునన్.

అకటకట మంచుమలపట్టి యతనుతాప
వహ్నిపాలయ్యె ఝరబాష్పవారి యగుచు
నిత్యశుక్తిమతీధ్యాననిశ్చలాత్ముఁ
డగుచు నంచితగహనరోమాంచుఁ డగుచు.

కులగిరిరాజనందనుఁడు కూరిమి నా భువనాభినందితం
దలఁపఁ, దలంపులోపలనె దర్పకకేతనవల్గనంబు, లం
చలమెలగోలు నంచల విశాలశిలీముఖతాడనంబు, లు
త్పలదళమండలాగ్రములు పైకొను నెట్టివొ తత్ప్రభావముల్...

రుచిరాజితమణిభూషా
రుచిరాజి వెలుంగ దివ్యరూపోజ్జ్వలుఁడై
యచలాధీశ్వరుఁ డొకనాఁ
డచలామణిహార మగు మహానదిఁ జేరెన్.

చేరన్ రా, నదియుం దటోద్గతఝరీసీమాదికోదగ్రసం
చారశ్రీ నెదురేగి, యూర్మిమయహస్తన్యస్తరాజీవరా
జీరాజన్మణిభాజనంబుల రజశ్శ్రీగంధకింజల్కరే
ఖారక్తాక్షతము ల్వహించి వరుసం గావించెఁ బూజావిధుల్.

గిరియును దదంతికోత్తుంగతరచిరత్న
రత్నతటపీఠి జెందె గౌరవమువఱల

వరలలితవాహినీవైభవంబుఁ గాంచి
కాంచె బహుపద్మనిధిలాభకౌతుకంబు.

అప్పు డప్పుణ్యతరంగిణి నగాగ్రణితో నిట్లనియె.

''అతులశైవలవతీశతము లేనెడు మీకు
నాయిచ్చు విమలార్ఘ్యతోయ మెంత
ప్రాలేయనిలయసంభవము గాంచిన మీకుఁ
బన్నీట నొనరించు పాద్య మెంత
సరసమందారమంజరుల రంజిలు మీకుఁ
బెనచి పూదండ లర్పించు టెంత
గోరత్నదోహనగురులక్ష్మిఁగల మీకు
నుపదగా మణివర్గ మొసఁగు టెంత

అనఘ! యెవ్వారలైనఁ గొండంతవారి
కవనిఁ గొండంతపూజ సేయంగఁగలరె?
భక్తి నే నిచ్చు నీపుష్పపత్రతోయ
మాత్రములు గైకొనుటెకాక గోత్రతిలక.''

అన విని గట్టురాకొమరుఁ డాననగహ్వరరోచమాననూ
తనతరదంతహీరరుచిధారలు వెల్వడ నొక్కలేఁతన
వ్వు నగి''నిజంబ పల్కితి వవుర్ భువనాశయసన్నివేశవే
దిని సరసాగ్రగణ్యవుగదే'' యని యన్నదిఁ బల్కె నెంబడిన్.

''పరమామోదములో నశేషతటినీపద్మాస్యలం గూడి నీ
వరవిందోద్భవుఁ గొల్చి యేగుతటి నీయచ్ఛాచ్ఛభావంబు, నీ
సరసత్వంబును, నీగభీరతయు, నీసర్వంకషప్రౌఢి, నీ
పరిపూర్ణత్వముఁగాంచి మెచ్చి మదిలో భావింతు నిన్నెప్పుడున్.

నావలనం బ్రియం బెటేఁగి, న న్నొకమాఱును బల్కరింప కీ
వే వెస నోరఁజేసికొని యేగుదుగాని సరిల్లలామ! ని

న్నేవగఁ జేరవత్తు, మది కింపగు నీదునవోదితామృతం
బేనగఁ గ్రోలఁగాంతు నని యే నెపుడుం దలపోయుచుండుదున్.

చెప్పెడిదేమి నాకుఁగల జీవన మంతయు నీకుఁ గూర్చి, యె
ల్లప్పుడు నిన్నుఁ బాయక ప్రియాచరణం బొనరింప నేర్తు, నీ
చొప్పున కీవు నియ్యకొని చొక్కపుజక్కవగుబ్బలాఁడి! మేల్
దప్పక యంతరంగమునఁ దారిచి నన్ను నదీను జేయవే.''

అన విని నగరాజు ఘన
ధ్వనిగరిమకుఁ గలఁగి ముకుళితకరాంబుజమై
వినయము నయంబు భయమును
మనమునఁ బెనగొనఁగ శుక్తిమతి యిట్లనియెన్.

''నిలువెల్ల నీచాతినీచోపసర్గంబు
  ప్రకృతియెల్లను జాడ్యపరిణతంబు
పెంపెల్ల నియతగాంభీర్యమానవిహీన
  మంతరంబెల్లఁ బంకావిలంబు
జీవనం బెల్ల నంచితబుద్బుదప్రాయ
  ముదయ మెల్లను దుర్దినోన్ముఖంబు
గతు లెల్ల కుటిలప్రకారకారణము లు
  త్సేకంబు లెల్ల భంగాకులములు
నిలుకడ హుళిక్కి, తావులు పొలసువల్చు
నిట్టి మాబోంట్లతోఁ జెల్మి యెట్లు పొసఁగు?
నచలితోత్తుంగధైర్యున, కలఘుమతికి
ననఘగతికి, నభంగశీలునకు నీకు''...

నా విని గట్టుఱేఁడు వదనంబున విన్నదనంబు దోఁప ''నో
శైవలినీశిఖామణి! నిజంబు భవత్కమనీయకాంతిధా
రావళిలో మునింగితి దయామతిఁ బ్రోవక సుళ్లఁబెట్టెదో,
నీ విఁక గ్రుచ్చియెత్తి ఘననిర్వృతి దెప్పలఁ దేల్చెదో?'' యనన్

వెలవెలఁబాఱి శుక్తిమతి వెండియుఁ గొండలఁజేసిఁ బల్కె "న
గ్గలమగు పంచసాయకవికారమునన్ నిజగౌరవోన్నతుల్
దలఁపవుగాని మాదృశజడస్థితిఁ దెప్పలఁ దేలుచున్న మీ
కులగిరికోటిలోఁ గడు లఘుత్వముగాదె తలంచిచూడుమా.

మతి గ్రీడారతి కర్గెనేని సకలక్ష్మాపుణ్యదేశాళిఁ గాం
చి,తపస్స్ఫూర్తిమెయిం గృశించి వనరాశిం జెందు మాబోంట్ల న
ద్ధతిచేఁ గమ్మఁగనేల? నీకుఁ గలవే తారుణ్యలావణ్యజృం
భితరంభాదినిలింపభామ" లన భూభృన్మౌళి రాగాంధుఁడై,

"అతనుభూతి ఘటింపదయ్యోనే చదలేరు
  సికదాల్చు నింధానచిత్రకునకు
వరవంశవైఖరి వదలెనే రవిసుతా
  పతియైన దైతేయభంజనునకు
వసులాభసంపత్తి మసలెనే జాహ్నవిం
  జేకొన్న శంతనుక్షితిపమణికిఁ
గమలోదయఖ్యాతి దెమలెనే నానాన
  దీకాంతుఁడైన రత్నాకరునకు
వారి కేలాఘవము వచ్చె? వనిత యెంత
మాఱుమసలెదు, వట్టినేమములు చాలు,
నేలు న"న్నని సతికమలాళిపట్టు
ప్రబలతరదీర్ఘభుజశాఖఁ బట్టుటయును.

వేణి చలింపఁ, గంపితనవీనమృణాలభుజాగ్రకంకణ
శ్రేణి నటింప, లోలశఫరీనిబిరీసకటాక్షకాంతి వి
న్నాణముజూప, హంసకగణక్వణనంబులు మీఱ, సైకత
శ్రోణి వివర్తితాబ్జముఖశోభితయై కడు సంభ్రమించినన్.

నిలువెల్ల న్నిరపాయశంబరమయోన్మేషంబునం బొంగురాఁ
గల కూలంకషగాఢగర్వనిధులం గాంతానుకూల్యంబుచేఁ

దలమే నిల్పఁగఁ బ్రాతికూల్యపరుషోద్యత్ప్రౌఢిగా' కంచు న
య్యలఘుం డాస్యము జేవురింప నిజమాపాటోపసంరంభియై.

...తమిగొలుపు వలపునం...బొడముడగ్గుత్తికఁ దడఁబడు నుడువుల వడువున మొరయు సరయచంక్రమణచలదుపలఫలకమిళదలఘుతరఘుమఘుమార్భటి నికటతటవిటపివిటపచ్ఛటారటదపార కీరకిన్నరమిథునాదులం జదల మెదలం జేయుచు,...అబ్బోటిపదంబులఁ బడినవడువున నడుగున వ్రాలి, యడ్డగించి, యలముకొని, చెంగల్వతావులు చెదర వేణి దెమలించుచు, విశదాంశుకాంతస్థితి దొరలంగ నతివిపులపులినజఘనారోహంబుల నుత్పలపత్రంబులు నెఱపుచుం దనివిలేక...అమ్ముద్దరాలి నిరోధించు సమయంబున.

(వసుచరిత్రమునుండి)

## పింగళి సూరన

[16-వ శతాబ్ది]

### కందుకక్రీడ

ద్వారకానగరబాహ్యప్రదేశంబున వాహ్యాళివిహారసారస్యంబునఁ దగిలియున్న ప్రద్యుమ్నుండు,

తన హృదయంబు వెంబడిన తప్పక ఘోటక మంతనంతనే
పనుపడ నిల్చి, ముందటికిఁ బాఱి, కెలంకులకుం దొలంగి, తా
వెనుకకు నేగుదెంచి, కడువేడ్క యొనర్పఁగ బంతియాడ నె
మ్మిని గనకంపుఁగోల నడిమింటనె త్రిమ్మరఁ దారికొట్టుచున్.

ఎగురఁగవైచి కొట్టు టది యెంత భరంబని బంతి యగ్రగా
మిగ వడిఁ బాఱవైచి, పుడమిం బడనీకయె దాని మీఱి చి
త్రగతి హయంబు దోలుచును గ్రమ్మఱ మీఁదికిఁగొట్టియాడె విం
తగఁ దనచేతిరత్నమయదండము కాంతులు గాడిపాఱఁగన్.

వెండియు మండలగతులఁ దురంగంబుఁ దోలి యాడె నప్పుడు,

తొలుదొల్త నయ్యేకతురగంబు మండల
గతిచారియగుచు నిక్కంబ తోఁచె
నావెనుకను సరూపాశ్వాలి చెదరక
చక్రాకృతిని బర్వసరణి తోఁచె
నంతట ననతిస్ఫుటావయవంబుగా
నెనసి యేకాంగవేష్టనత తోఁచెఁ
దుదఁ దద్విభూషణద్యుతిరాజిమాత్రంబు
కొఱవిత్రిప్పినరీతి మెఱసి తోఁచె
నంతకంతకు గతివేగ మగ్గలింప
రాఁగ 'వాగె యెచ్చరిక పరాకు జియ్య!'
యను జనులు తెచ్చువడి తమపని మఱవఁగఁ
బరగు నమ్మేటినెఱరాతు ప్రౌఢిఁ తన.

నానావీధిగతిప్రభేదవిఖ్యాతిన్ సంతృప్తుఁడై కంతుఁ డిం
పూనన్ వాగె గుదించినన్, బురుషకప్రోన్నమ్రపూర్వాంగమై
కానంగాఁబడియెన్ మరుజ్జవన మాగంధర్వ మర్కాశ్వసం
తాన స్పర్థను మిన్ను ప్రాఁకెడు క్రియన్ దా నెంతయుం జూడ్కికిన్

సముపలాలనయుతస్కంధాంతికాస్ఫాల
దమిత తేజోమహాద్ధత్యకంబు
దంతాళికానియంత్రణసమున్నామితా
కుంచితగ్రీవాసమంచితంబు
దందన్యమానశబ్దాయమానఖలీన
కషణజర్జరితసృక్కద్వయంబు
ఘనఘర్మడిండీరఖండపాండురితప
ల్యయనవర్ధోభయప్రాంతకంబు
నగు హయము డిగ్గెఁ బ్రద్యుమ్నుఁ డంకవన్నె
యొకటి సాహిణి యవ్వల నూఁది పట్టఁ

దనయనుఁగుచెలికాఁడు నై దండ నొసఁగఁ
బ్రజ సురాళించి మణులు వస్త్రములు నైవ.

## హంసావతరణము

(అపుడు గగనసరణి నంచపదువుతో నరుగుశుచిముఖియను హంసి ప్రద్యుమ్నుం గాంచి 'అల్లయతం డితండ కావలయు, నితనితో మాటలాడిచనుట మేలు' అనుచు, నాపలుకుల కతఁడు వెఱగంద ధరణికి డిగియె.)

మరు నశ్వగతి మెచ్చి సురలు వైచిన పైడి
 వ్రాఁతక్రొమ్మడుఁగుదువ్వాలువ లనఁగ
దర్పకు నెఱరౌతుతనము పేర్మికిఁ గ్రమ్ము
 కొను సతేజఃకీర్తిఘనము లనఁగ
హయఫేనధావళ్యయాచ్నార్థమై వ్రాలు
 తటిదనుగతసితాబ్దంబు లనఁగ
వాజివిభ్రమజితావర్తతఁ దొలఁకు ది
 వ్యులయేటి సాబ్జరేణూర్ము లనఁగఁ
గనకరేఖలతోడి ఱెక్కలబెడంగు
చూపఱకుఁ గనుపండువై సొంపుమీఱ
జలదపథముననుండి భూస్థలికి డిగ్గు
హంసములు వర్ణనాసీమ నతికరించె.

ఇట్లు గన్పట్టుచు నేతెంచి యంచలు
 వసుధ చేరువ నేటవాలుగాఁగ
నతినిశ్చలప్రసారితపత్రంబులై
 డిగుచుఁ గామునిముందటికిని గొంత
సరి గడవఁగఁ బాఱి, మరలి బోరలు దెట్ట
 గిల నొక్కకడ వంచి మలుపుదిరిగి

యెఱుక లంతట రెండు నెఱియఁ జక్కఁగఁ జాఁచి,
  యవనిఁ గాల్మోపి, ఱెక్కార్చి ముడిచి,
మొగము లోకవింత యొయ్యారముగ మలంచి,
యీఁకను విదిర్చికొనుచు నొక్కింతతడవు
హైమరేఖావిచిత్రనిజాంగరుహావి
నిర్మలతఁ జూడ్కులకు నింపు నింపుచుండె.

## ప్రభావతీ వృత్తాంతము

''ఇంతకుముందు వజ్రపురి కేగుచునుండుదు మేము కావునన్
గాంతతరాంగి నద్దనుజకన్యక నే నొకనాఁడు గంటి శు
ద్ధాంతసరఃప్రకాండసముదంచితకేలిఁ జరించుచుండి తత్
ప్రాంతలతాగృహంబున వయస్యయుఁదానునుముచ్చటాడఁగన్

తిర్యగ్వనితను నన్ను న
మర్యాదానందమగ్నమతిఁ జేసె మహా
శ్చర్యముగఁ దద్వధూసౌం
దర్యం బపు డేమిచెప్ప నలినాక్షసుతా!

చంద్రభీతఘనధ్వాంతసంచయమున
కభయ మొసఁగి వేణీభరంబను నెపమునఁ
దన వెనుక వేసికొన్నది తరుణిమొగము
చంద్రుఁ గైకొనమి కిదియ సాక్షి కాదె.

కాంతతరఫాలసంజ్ఞిత
కంతువిజయలేఖపట్టికావిన్యస్తా
ద్యంతశ్రీకారములన
నెంతయు నాయింతిపీను లింపెసలారున్...

తిలకము సంహితోర్ధ్వముఖతీక్ష్ణశరాగ్రముగాఁగ నాసికాం
చలవిలసత్ప్రికోష్ఠసుమసాయకముష్టిగృహీతమధ్యశా

ర్గలత యనం బొమల్దనరఁగా నిరుగొమ్మల ౘ్రేలు వెల్లజ
ల్లులగతి నవ్వుడాలు పొదలు న్మదిరాక్షి మెఱుంగుజెక్కులన్.

కలయ నాపాదమస్తకాంగములయందు
మించి పటలీలఁ దరళతోఁదంచితమగు
యువతిలావణ్యమును, గన్నుగవయు నతను
దంటమీఁలకెక్కెయమనఁ దనరుఁ జూడ...

సౌవరమాధురీస్పృహాపసం బికమో శుకమో తదీయజి
హ్వానిలసత్స్వరస్వాతి నుపాసనచేయుచు నగ్రభూమి నిం
పావహిలంగ నేర్చి, యుపహారముగా నిడినట్టి పల్లవం
బో, విమలంపుబింబఫలమో యన వాతెఱ యొప్పు నింతికిన్.

చెలువపలు కమృతరసములు
గులుకుట వీనులకె కాదు, కోమలదంతా
వళిరుచి యను శీకరపుం
దెలినిగ్గునఁ గన్నులకును దెల్లమ చూడన్...

సుకవులు క్రిందుమీఁదరసిచూడక యీడని యాడుకొన్న హా
టకకదళీవిలాస మకటా విపరీతముగాక సాటియే
అకలుషరామణీయకసమంచితకోమలతద్వధూరుల
క్ష్మకి సరిగావ యెంత తలక్రిందయినన్ గరిరాజహస్తముల్.

శృంగగ్రాహికఁ జెప్ప వేఱె తెరువుల్ సిద్ధింపమింజేసి చి
త్రాంగశ్రీనిధి నవ్వధూమణిని స్థూలారుంధతీన్యాయమా
ర్గాంగీకారమునన్ వచించితిని, చంద్రాదోపమల్ సూచనా
భంగు ల్గాని యదస్సహస్రగుణసౌభాగ్యంబు లాయంగముల్.

వెన్నెలతేట నిగ్గు, నరవిందపుఱేకు మృదుత్వముం, బదా
ర్వనియ జాళువాపసిడిరంగు, మెఱుంగుల ధాళధళ్యమున్
గన్నియరూపుగా గరువుగట్టి మనోజుఁడు పోఁతబోయఁబో
లు న్నెఱనేర్పుతో ననుట లోకుల పల్కెది చాల దేమియున్

ఎమ్మెయిఁ బ్రజ్ఞ మీఱ వచియించెదనన్న వచింపలేన యా
కొమ్మబెడంగులోన నొకకోటితమాంశమునైన, నంతమా
త్రమ్మ మదుక్తిశక్తి యనరా; దతివాఙ్మహిమాఢ్య నేను, మా
యమ్మ సరస్వతీసతి తనంతటిదానిగ నన్ను దిద్దుటన్.

మన్ముఖంబు శబ్దసంస్కారపూతం బనుబుద్ధి నద్దేవియ నాకు శుచిముఖియని పేరిడియె.

నలినజురాణివాస మొకనాఁడు ననుం దనచేతిప్రోదిరా
చిలుకను వాదుకుం గవితచెప్పఁగఁ దా నియమించి, అందు నా
పలుకులఁ గొంతవాసి గని, భావమునం గడు మెచ్చుచు, న్నఖాం
చలమున నాదు ఱెక్కనులి చక్కగ దువ్వుచు గారవించుచున్.

ప్రబలములైన కౌతుకకృపారసవత్సలతాదరంబులన్
శబలితచిత్తయై యపుడు నా కుపమాతిశయోక్తి కామధే
నుబిరుద మిచ్చి, తల్లిఖితనూపురమున్ భువనైకమాత య
య్యబల మదంఘ్రి దాఁదొడిగె, నాబిరుదంబిది చూడుమేర్పడన్

అని నిజనూపురగతవ
ర్ణనికాయము త్రిప్పి చూపి, "నారాయణనం
దన! యిట్టి నాదుపలుకుల
కు నగమ్యము దనుజకన్యకోమ రూపింపన్.

ఆజగన్మోహనాంగిని ఫలకంబున వ్రాసిచూపెద నంటేని,

ఏయంగకమును భావన
చేయక వ్రాయంగరాదు, చేసిన నానం
దాయత్తత మది చొక్కఁ, బ
రాయత్తపుబుద్ధిఁ జెలువ నలవియె వ్రాయన్ ?

అత్తరుణీమణిరూపము
జిత్తరువున వ్రాయనేర్పు చేకుఱునేనిన్

దత్తుల్యవనిత నెందే
నత్తొలువేలుపు సృజింపఁడా తనసృష్టిన్ ?
వినుము ప్రభావతియన న
వ్వనితామణినామ మర్థవంతమ్మగుచున్
దనరారుచుండు ననయం
బును యదుకులకలశజలధిపూర్ణశశాంకా..."

అని పలికి, మా కింకఁ దడయరాదు, పోయివచ్చెదమని తోడి యంచలుం దాను నప్పురవీధి కెగసె; నప్పు డమ్మరాళంబులు ప్రడీనోడ్డీనసండీనయానభేదంబుల రోదోంతరం బంతయుం గలయ మలయు తమ యమలంపుఁదెలిదళుకు జిలికి, యది మలయజంపుఁ గలయంపిచెలువునలవరింప, నంద్రుఁ గుందనంపురంగవల్లికల యుల్లాసంబు వెల్లిగొలుపు గరుదంతకాంతివల్లరులచే నతిశయిల్లుచు, నొక్కొకచోట, నొండొంటిసందున సందర్శనీయంబులగు నభోవిభాగంబులవలన నస్థానభానుసంభవాసంభేదసంభృతశబలతావిలాసభాసురసురాపగాప్రవాహాసందేహాకందళనంబున కనుగుణం బగు పరపున నిడుపౌజులుగట్టి చెదరక నడచుచు వజ్రపురంబుఁ జేరె.

## ప్రద్యుమ్నుని విరహము

ప్రద్యుమ్నుండు ప్రభావతీరుచిరరూపబ్రహ్మమున్ హంసయోషిద్వ్యాధార్థ్యధురీణవాగుపనిషత్సిద్ధాంతమార్గానుసారోద్యత్ప్రజ్ఞను బల్మఱున్ మననసంయుక్తంబు గావించుచున్ హృద్యంబై యది యంతకంత కలరన్ నిల్పెం గడుం జిత్తమున్.

కనఁ డొద్దనున్నవారిని వీరువారని
కనినఁ దదర్థవర్తనలు మఱచు
వినఁడు చెప్పినపల్కె వేమఱు చెప్పక
వినిన నేమేమంటి రనుచు నడుగుఁ
జనఁ డెత్తులిడక మజ్జనముఖ్యవిధులకుఁ
జనినఁ దబ్బిబ్బుగాఁ జలుపుఁ గ్రియలు

కొనఁడు నానాసేవకులసేవ లెవ్వియుఁ
  గొనిన వీడ్పాటుగాఁ బనులుపనుచు
శుచిముఖీవాక్యదర్పణస్ఫురితనిరుప
మానదనుజేంద్రకన్యకామణిమనోజ్ఞ
రూపరేఖావిలాససంరూఢమైన
యాత్మ మరలింపనేరక హరిసుతుండు.

ఉద్యదపేక్షఁ బక్షివనితోక్తులవెంబడిఁ జంచరీకచం
ద్రాద్యుపమానశోభకు సహస్రగుణంబుగ హెచ్చఁ, గేశవ
క్త్రాద్యఖిలాంగలక్ష్మి మదికందినయంతయునున్ నయించి, యా
హృద్యతరాంగిరూపుసొబఁ గెల్ల నొకింతగఁజూచు నాత్మలోన్

మది గొనినంతమేరయును మాన కతం డుపమానకోటి యొ
ప్పిద మఖిలంబు నిట్లు గడుబెక్కుమడుంగులుగాఁ దలంచి, త
త్తదవయవత్వసుస్థితికిఁ దార్పఁగ, నమ్మదిరాక్షిరూప మె
య్యది యదియే కనంబడియె; నచ్చపుబుద్ధికి లేవగమ్యముల్.

ఆరూపు మదిఁ జాల హత్తించు, హత్తించి
  యతివ యిట్టిదికాక యనుచు మెచ్చు
మెచ్చి కన్గొనుకోర్కి హెచ్చించు, హెచ్చించి
  యంతమే లెట్లబ్బు ననుచు వగచు
వగచి, నిట్టూర్పులు నిగిడించు, నిగిడించి
  తదవలోకములేని బ్రదుకు రోయు
రోసి, దాని కుపాయ మాసించు, నాసించి
  కలఁక నేమియు దొరకమికిఁ గుందుఁ
గుంది, తలపోఁతలకు మదిఁ గొల్లవిడుచు
విడిచి, దరిదాపులేమిఁ బెన్వేతల మునుఁగు
మునిఁగి యెవ్వరు పిలిచినఁ గినియు మిగుల
హరిసుతుండు ప్రభావతీవిరహవశత.

( ప్రభావతీప్రద్యుమ్నమునుండి )

# తెనాలి రామకృష్ణుడు 4c

[16-వ శతాబ్ది]

## చిలుక విష్ణుసాయుజ్యమందుట

శుక మొకటి చంచుజితకిం
శుకమై, హరిహయశరాససురుచిరవపురం
శుకమై, కుసుమాకరకిం
శుక మానందమున నందసుతుగుడిఁ బెరుఁగున్.

అలమి త్రిలోకముల్ గెలుచున త్తఱిఁ దేరువహించు తోడిచి
ల్కలు దగదొట్టి ముందఱికి లాగకయుండినఁ, దాన తద్భరం
బెలమి వహింపమెచ్చి మరుఁ డిచ్చు మణీమయమాలికాత్రయిన్
గళమునఁ దాల్చుఁ జిత్రశుకనాథుఁడు రేఖలపేర నిచ్చలున్.

కీర మది యొక్క హరిపరి
చారిక చేరిక వసించుఁ జదివింపఁగ మే
పారసి యొసఁగ, భవనమా
ర్జారాదులవలనఁ దన్ను రక్షింపంగన్.

దేవాలయమునఁ గొన్ని, ని
జావాసమునందుఁ గొన్నియహములు దగఁ బై
చే వదలక పాటించుచుఁ
బూవుంబలెఁ బువ్వుఁబోఁడి పులుఁగుం బ్రోచున్.

పసుపార్చుం దడియొత్తు నెండసెకఁ గంపం బాఁగి మైదువ్వుచున్
వసయున్ వెన్నయు మేపు, మేపు నొసఁగున్, వల్లించు శ్రీరామనా
మసుధామాధురి సాధురీతిఁ గుచకుంభస్థాయిగాఁ జేయుచున్
బిసపుష్పప్రియవాసరాగమములన్ బింబోష్ఠి రాచిల్కకున్.

కనకమణిపంజరంబుల నునిచియునిచి
చక్కెరయు నుక్కెఱయు సారెఁ గ్రుక్కిక్రుక్కి

యొఱపుఁబలుకులు పలుమాఱు గఱపి కఱపి
కలికి చిలుకలకొలికి రాచిలుకఁ బెనుచు.

కలహంసోపమయానఁ జక్రకుచఁ బ్రేంఖత్కాంజరీటాక్షిఁ గో
కిలసారస్వర బర్హిబర్హచికురం గీరప్రియాలాపఁ దా
య్యలిఁ జాలఁ మరగె శుకం బది గరీయఃప్రేమగావించుచున్
బులుఁగుంబొందున నందిపొందినగతిన్ బొత్తొత్తులన్ హత్తుచున్

ఆశుకద్విజరాజున కంతఁ గొంత
కాల మరుగంగ నొకనాఁడు కలిగె బంధ
మోక్ష మాకస్మికంబ, నిర్ముక్తికలిమి
యాశుకద్విజరాజున కద్భుతంబె?

జనియించెనొకొ పచ్చనిమొల్క యనుబుద్ధి
  గ్రుచ్చిన పచ్చలకొమరువలన
సమకూరెనొకొ దాడిమఫలోద్భవబీజ
  మతి పద్మరాగసామగ్రివలనఁ
బొడకట్టెనొకొ జంబుఫలంబులను మనో
  భ్రమ మింద్రనీలవిభ్రమమువలనఁ
దోతెంచెనొకొ మధూకపుష్పములను
  నాస హుర్మంజిముత్యములవలన
దాసి యిటువెట్టి పసుపాడఁ దలఁగిచనుడు
బరణిమూఁకుట నెలకొన్న బన్నసరముఁ
గఱచికొనిపోయెఁ జిల్క, ప్రగల్భవిటుఁడు
బాలికామానసము గొనుపగిది నపుడు.

బారాదిసొమ్ము లుండఁగ
హారమునే కొనుచుఁ జనియె నండజము ప్రియం
బారఁగ, ఫలకాముకులగు
వారలు గుణవత్ప్రసక్తి వదలవిడుతురే?

ఆధవళకిరణముఖికి న
సాధుశుకాచరణ మపు డసహ్యాంబయ్యెన్,
గోధుక్కృతిసతికి మనో
బాధకమగు కృష్ణధూర్తబాల్యముఁబోలెన్.

కటిఁ జేలార్ధము చుట్టి, చిక్కనది వేగం జుట్టి పాలిండ్లమీఁ
దట సంధించుచు, నార్ద్రదేహలత మాద్యద్వర్ష ధారావల
త్తటిదాకారముఁజూపఁ,దోఁపికొనుచున్ ధమ్మిల్లబంధంబు ముం
గిటికిన్ సుస్తని వచ్చె గోస్తనహరత్కీరగ్రహవ్యగ్రయై.

వర్షధారావశేషావ్వాయయుక్తి
వాయువశమునఁ దెరలు మువ్వన్నెవిల్లు
వేడ్క వెన్నాడు శశివోలె వెలఁది చాప
లమున సర మాహరించు కీరముఁ దవులుచు.

గుహమాతృస్ఫటికాక్షసూత్రము సితేక్షుచ్ఛేదగుచ్ఛచ్ఛటా
స్పృహఁగైకొన్న శుకంబొ, యేమఱుతటిన్ జీరాడుపూవాఁగెతోఁ
బహిరుడ్డీనత నొడ్డి నిల్చు రతిరాట్పట్టాశ్వమోనాఁగ న
మ్మహిళావిభ్రమకీర మొప్పె ముఖసీమాగామిముక్తాళియై.

ఈచందంబునఁ గందర్పస్యందనంబు వినిందితుండన మందమంద ప్రచారంబును, నవివేకియన శిథిలీకృత స్వపక్షంబును, నున్మత్తపోలికం జంచుచుంబిలలంతికావ్యాజంబున లాలఁ గ్రక్కుచు, ... శశాంకశిలాసౌధవిటంకంబులను నుంకువగొన్నతతి శరన్నీరద వళంవదంబగు సునాశీర శరాసనశకలంబన మెలంగుచు, నంతరిక్షమహాప్లక్షంబునకు నక్షామచంచూపుట ప్రవాళఖండ ప్రభాహిండనంబునం దొరలి సఫలవిటపలక్ష్మి నావహించుచుఁ, బ్రమాదవిగళితంబగు నగవిరోధికోలువువీవన యచ్చరల పచ్చలకడియంబు వడువున నిరాలంబనస్థలంబునఁ బలుమఱు చక్రచంక్రమణ చమత్కారంబుఁ జూపుచు,...అందంద జాతిపులుఁగులు మనుజగంధ ధురంధరం బగుటకు జగడంబు దిగిచినం గినిసి విస్మృమరతనూరుహ

దంతురకపోలాంతరంబును, విఘూర్ణన వికృత వీక్షణంబునునై క్షణంబు మణివలయ వలయితంబగు రతియువతి ముంజేతిరీతిం జెలువడరు మెడ నిగిడించి, మగుడంబడి కాకుప్రకార వికారస్వరంబుగ వాని నిరాకరించుచు, నప్పుడచ్చుఁ జిలుక కలిగినయదివో తెనయ్యన్ను వెన్నాడం, బోటికత్తియ లుత్తుంగకుచోత్సంగ సంగత కురంగలాంఛన కళావలోకనంబున ముసిముసినగవు లొలయ "గోరువంక కానవచ్చెంగాని కీరంబు దూరంబయ్యెఁగదే" యని గర్భోక్తి వైదర్భిం గూడియాడుచుం బాడుచుం, బంజరంబును జిలుకచాలు తెరయును జేరికచేసి యెలయింప నలయించుచు, నడి తెక్క గ్రిక్కిరించుచు నొక్కయెడం గాలువాడిచి, ముక్కున నక్కంఠహారతరళంబు నొక్కుచు, "జిక్కెం జిక్కె, నిక్కడ నిక్కడ, నక్కయక్క!" యని చేటికానికరంబు పొలసినఁ బులుఁగెటింగి, మెఱుంగు మెఱసి తొలంగిన తెఱంగునఁ బోవంబోవ దూరంబగుచునుండు నెండమావులమాడ్కి, ప్రచురరయంబున ఖచరపుర ప్రాసాదంబులు మోవం బూఁపున నెగసి, తిరిగి పెఱతెరువునం బఱతెంచి, పాండురంగాయతనంబు మధ్యరంగంబు చొచ్చి, యచ్చటఁ దన యిచ్చ నుండుదడియంబుపై వ్రాలఁ నిచ్చట.

మదఘూర్ణదురుసంకుమదమలీమసకుచ
  ద్విపమహోద్ధతిఁ గానుదీఁగ నులియ
ఘనసారపుండ్రకగ్లాబింబనికటఘు
  ర్మహిమాప్తి మోముదామర చలింప
నాసికానూత్నగంధఫలి యూరుపుఁదావి
  నధరదంతపదమత్తాళి విరియఁ
గింకిణీక్వణనశంకితగర్జితత్రస్త
  కాంచిచంచలగతి యంచ జడియ

బంధనిర్ముక్తశుకసక్తభావయగుచు
నల పరాశరసుతుచంద మధిగమించు

మించుననబోఁడిచందంబు మేలుకనిన
వాఁడు తలపోయుకలలోనివార్త యయ్యె.

కక్కసపు వంకగోరులఁ ద్రొక్కి త్రొక్కి
కఱకుముక్కున నందంద కఱచికఱచి
పూస యొకటియుఁ బోఁగునఁ బొందనీక
చెరిపె ముత్యాలపేరు విచ్చికపుఁబులుఁగు.

బహువిధరచనోజ్జ్వలమగు
మహిళామణి మణిసరంబు మణు లన్నియు న
య్యహిశయనుసదనశరధికి
నహీనరత్నాకరత్వ మనుసంధించెన్.

శుకమున కొదవె నయత్న
ప్రకటితమణిరంగవల్లిపరికల్పనకో
రకితసుకృతానుకృతి, దా
నికి మెచ్చెన్ బౌండరీకనిలయుం డాత్మన్.

## గార్హస్థ్యవైభవము

పరిణతయగునింతి ప్రతికూల గాదేని
తనయుండు తనయాజ్ఞ దాఁటఁడేని
నిజసహోదరులు వినతులయి మనిరేని
కోడ లోరుపుదక్కి గొణఁగదేని
కూఁతు రీలువునందుఁ గొదవచూపదయేని
ఋణమను పాతకం బెనయదేని
తేజోగరిమ పరాధీనతఁ జెడదేని
నిందాంధకారంబు నెఱయదేని

న్యాయమున మొల్లములపెల్లు డాయునేని
అతిథిసంతర్పణం బింట నమరునేని

సముచితాచారమును గొనసాగునేని
కలదె గృహమేధిధర్మంబుకంటె మేలు ?

కీలారముననుండి పా లింటి కేతేర
  బహుధాన్యములు చేలఁ బండి యొఱగ
నెడనెడఁ బెండ్లిండ్లువడుగులు వొడమఁ గృ
  తార్థులై యర్థించునర్థు లలరఁ
బరిచారికాకోటి పనిపాటు పాటింపఁ
  జుట్టంపుసందడి నెట్టుకొనఁగ
గ్రామ మెంతయు నిజప్రాభవంబున మన
  సత్యనిష్ఠకుఁ దన్ను సాక్షిగోర
నిత్యనైమిత్తికములు నిర్నిద్రబుద్ధి
నాచరించుచు, హరిభుక్త మాత్మభార్య
భక్తినిడ భుక్తిగొనుచున్కి ముక్తిగాని
నిదురవంటిది, ఱాలివంటిదియుఁ గాదు.

## పంటచేలు

మారుతాహతిరాలు నారికేళఫలాళి
  నిడిసి జల్లించు పుండ్రేక్షురసము
చిలుకపోటులచేతఁ జిరిఁగిన సహకార
  ఫలములఁ దొరఁగెడిపచ్చితేనె
చిక్రోడదంష్ట్రలు చెక్కు సుగంధియ
  నంటిపండ్లను గాఱునవ్యసుధయుఁ
బాకవేళారంభపరిపాటిఁ దమయంతేఁ
  బగిలిన పనసక్రొంబండ్ల బేస
మేకమై, కాలువలుగట్టి యేకహేలఁ
బఱవ, నందలిక్రియ్యాటపసిమి తేటఁ
బండు నవ్వీట ముక్కారుఁ బసిఁడిగాఱు
సరసధాన్యంబు మంచిరాజనపుఁజేల,

## మట్టమధ్యాహ్నము

పద్మినీపద్మాతపత్రంబు శిథిలప
 త్రాగ్రమై రాయంచ యాశ్రయించెఁ
దాలుస్రవత్ఫేనజాలంబుతో ఘోణి
 పంచలరొంపి గలంచియాడె
దూరోద్గమద్దావధూమ మంబుదబుద్ధి
 నెమ్మి లోపొదనుండి నిక్కి చూచె
జఠరస్థజలము నాసానాళమునఁ బీల్చి
 సామజం బిరుప్రక్కఁ జల్లుకొనియె
సరసిపై నీరు సలసలఁ దెరలె, విపిన
సకలవీథులు నిర్మనుష్యము లయ్యె
మట్టమధ్యాహ్న మిది సుధామధురవాణి!
యర్హ మిచ్చోఁ బథశ్రమ మపనయింప.

## భ్రమరవిహారము

మరువంపువలపుఁ బల్మఱు క్రోలిక్రోలి కఱ
 ద్రమ్మి యూరక మేనుమఱచుఁ గొన్ని
యరవిచ్చు తెలిమొల్లవిరులు మూతులు సాఁచి
 పొదిగూడి తెక్కలఁ బొదువుఁ గొన్ని
గురువింద పూఁదేనెపెరలకై తమలోనఁ
 బొత్తువోవక సారెఁ బోరుఁ గొన్ని
పక్వంబులగుదాఁకఁ బాటించి మల్లికా
 కలికానికాయంబుఁ గాచుఁ గొన్ని
భోగివశమైన గేదంగిపువ్వునకును
వగచు మదిఁ గొన్ని, బంధుజీవకలతాంత
గుచ్ఛములలోన నొకకొన్ని కొలువుసేయుఁ
దేఁటు లఖిలర్తుమయవనీవాటిఁ గమిచి.

పూవుఁ దేనియఁ దడిసిన మావిచిగురు
మీఁద నంటిచరించు తుమ్మెద దలిర్చు
సమయమాటయు మసినెయ్యి సమరి మరుఁడు
త్రుప్పుపోఁ దోము నీలంపుఁదునుక యనఁగ.

గంధవిరహిత మని బుద్ధిఁ గనక తేఁటి
మాతివిచ్చిన మొదుగుమొగ్గఁ దగిలి
సౌరభాకాంక్షఁ జొచ్చి చెన్నారెఁ గీర
తుండవశమైన నేరేడుపండుబోలె.

ఖరకరకరహతి సలసలఁ
దెరలెడు మల్లీమరందదీర్ఘికఁ జుట్టున్
దిరుగు నళి యనుభవమునకుఁ
జొర దతిలోభాంధబుద్ధి సామ్మరయుక్రియన్.

(పాండురంగమాహాత్మ్యమునండి)

## కందుకూరి రుద్రయ

[16-వ శతాబ్ది]

**జనార్దనా!**

సిరులు మించిన పసిమిబంగరు జిలుగుదుప్పటి జాఱఁగాఁ
జరణపద్మముమీఁద, దేహము చంద్రకాంతులు దేరఁగా
మురువుచూపఁగ వచ్చినావో మోహనాకృతి మీఱఁగా
గరుడవాహన! దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

ఆనపెట్టిన రాకపోతివి ఆమెఁబో అటుమొన్ననూ
పూని పిలువఁగ వినకపోతివి పొంచిపోవుచు మొన్ననూ
నేను చూడఁగఁ గడచిపోతివి నీటుచేసుక నిన్ననూ
కానిలేరా, దనుజమర్దన! కందుకూరిజనార్దనా!

నిన్నరాతిరి చవికెలోపల నీవుచెలి కూడుంటిరా
ఉన్నమార్గము లన్నియును నే నొకతెచేతను వింటిరా
విన్నమాత్రము కాదురా నిను వీధిలోఁగనుగొంటిరా
కన్నులారా, దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

దబ్బు లన్నియుఁ దెలిసికొంటిని తప్పుబాసలు సేయకూ
మబ్బుదేరెడి కన్నుగవతో మాటిమాటికి డాయకూ
ఉబ్బుచేసుక తత్తఱంబున నొడలిపైఁ జెయివేయకూ
గబ్బితనమున దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

బిత్తరంబున మొలకకెంపులు పెదవి నెవ్వతె ఉంచెరా
గుత్తమైనమిటారిగుబ్బలగువ్వ యెవ్వతె మెచ్చెరా
చిత్తగించక జీరువారను చెక్కు లెవ్వతె నొక్కెరా
కత్తిగోరుల, దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

అండబాయక కూడియుంటిమి ఆయెఁబోయెను నాఁటికి
ఖండిమండిపడంగ నేటికి? కదలు మెప్పటిచోటికి
ఉండరా నీమాటలకు నే నోర్వఁజాలను మాటికి
గండిదొంగవు దనుజమర్దన! కందుకూరి జనార్దనా!

అలుక లన్నియుఁ దీఱ నివు నాయండ కెప్పుడు వస్తివి
పిలిచి నవరత్నాలసొమ్ములు ప్రేమతో నెపు డిస్తివి
వలచి వలపించియును గూరిమి వదల కెప్పుడు మెస్తివి
కలసి వేడుక దనుజమర్దన! కందుకూరిజనార్దనా!

జంటనేత్రము లంటి చూచితె జాజిపూవులు పూచెరా
మింటత్రోవను జూచుచుండఁగ మేఘవర్ణము గప్పెరా
కంటిలో నొకపండువెన్నెల కాయుచున్నది యేమిరా
కంటిలేరా! దనుజమర్దన! కందుకూరిజనార్దనా!

(జనార్దనాష్టకమునుండి)

## ఆతుకూరి మొల్ల

[16-వ శతాబ్ది]

### అశోకవనములో జానకి

పతిఁ బాసినట్టి యాపదకంటెఁ బలుమాఱు
  వివిధమాయలచేత వేఁగివేఁగి
ఘోరదానవకోటివికృతవేషంబులు
  కనుఁగొని చిత్తంబు క్రాఁగిక్రాఁగి
తన దిక్కు లేమికై తల్లడిల్లుచు నాత్మ
  లోపల మిక్కిలి లోఁగిలోఁగి
కర్ణకఠోరంబుగా నాడుమాటలఁ
  దొరఁగెడు కన్నీట దోఁగితోఁగి
రాముఁ దలఁచుకొంచు, రామునిఁ బేర్కొంచు
రామ! రామ! యనుచు రమణి వలుక
కపివరుండు సూచి, కామినీరత్నంబు
సీత యనుచుఁ బొంగెఁ జిత్తమందు.

నిడుదపెన్నెఱివేణి జడలుగా సవరించి
  మలినజీర్ణాంబరం బొలియఁగట్టి
భూమీరజంబు విభూతిపూఁతగఁ బూసి
  తనదివ్యమూర్తి జిత్తమున నిలిపి
నిరశనస్థితితోడ నిలిచి భూశయ్యను
  బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారకబ్రహ్మమంత్రమ్ముఁ బఠింపుచుఁ
  గఠినరాక్షసదుర్మృగములలోన
అహితలంకామహాద్వీపగహనసీమ
తపము సేయుచునున్నాను దన్ను గూర్చి
నాకుఁ బ్రత్యక్షమగుమని నాథునకును
విన్నవింపుము సత్త్వసంపన్న! నీవు.

(రామాయణమునుండి)

## రఘునాథనాయకుడు

[17-వ శతాబ్ది]

### ఋశ్యశృంగానయనము

రోమపాదుని పనుపున నావేశ్యలు,
రా కళావతి! రమ్మ, చంద్రముఖి! రావె,
బాలకోకిల! రాఁగదె, పద్మగంధి!
యనుచు నొండొరుఁ జీరుచు నతిరయమున
వెంట నుడిగంపులేమలు వేడ్కఁ గొలువ....

బంగరు పల్లకు లెక్కి, మృ
దంగహుడుక్కాదికంబు లగు వాద్యంబుల్
ముంగల మొరయఁగ నభినవ
శృంగారము మెఱయఁ జనిరి చెలువలు వేడ్కన్,...

ఇట్లు రాజమార్గంబు గడచిచని మన్మథాదులఁదలంచి.

"ఒంటిగాకుండ మావెంటనే నడువుమీ
సుమచాప! చాపబాణములు పూని
వనమార్గములను కావలిగాఁగ నిలువుమీ
సంతతంబు వసంత! సంతసమున
పవనమా! ప్రాణంబుప్రాణమై యుండుమీ
హా యన మది నెడఁబాయ కెపుడు
వడదాఁకకుండ మాకడనె చరించుమీ
చంద్ర! వెన్నెలతేట చల్లుకొనుచు"......

అనుచుఁ బ్రార్థనలుచేసి, ఆవారాంగనలు......తేటమిటారి తెలిచూపులు క్రేళ్ళుదాఁట నిట్టట్టు కనుంగొనుచు, మేఘూఁతల పరిమళంబు లతిదూరంబు పేరెంబులువాఱ సారెకుం జిలుగుపయ్యె దలు గదల సురఁటులుగొని విసరుకొనుచు, నెడనెడం బన్నీరుచిలికిన

చేపావడల మొగంబులు దుడిచికొనుచు, ఉడిగంపుఁజేడియలచేతి నిద్దంపుటద్దంపుబిళ్ళలఁ గొని యప్పటప్పటికి సింగారంబులు చెదర కుండఁ జూచికొనుచు...విభండకాశ్రమంబున కనతిదూరంబున బల్లకు లునిచి, పాదచారంబున నరిగి...నలుదిక్కులు జూచుచుండ,

ఆ ఋశ్యశృంగమౌనియు
మూరెడుగడ్డంబు, నెత్తిమొలచినకొమ్ముం
జాలలమెకంబుతోలు వి
కారము దెలుపంగ నెదురుగాఁ గనిపించెన్...

"ఇ మ్మానిసిమెకము న్మది
నమ్మఁదగదు, చేర గొబ్బునం జనకుఁడు, పై
గ్రమ్మి తలవంచికొని వడిఁ
గొమ్మున నటు చిమ్మెనేని కొదవగుఁజుండీ...

తెలిగందవొడియు మంత్రించి మై నటుచల్లి
వెంటరా మరపెద వీనిఁ గొమ్మ!
మొలనూలు తిగిచి కొమ్మున నుచ్చు దగిలించి
చేపట్టి కొని తెత్తుఁ జిగురుబోఁడి!"...

అనుచు నీరీతి పంతంబు లాడికొనుచు
నొకట నందఱు కస్తురిమెకము లట్టు
లంగనలు మేనితావు లుప్పొంగుచుండఁ
జేరఁజను దెంచి యా ఋశ్యశృంగుకడకు.

"వలలుగా మనకొప్పువలలు నల్లడఁ దీర్చి
తగిలించుకొనవచ్చుఁ దరుణులార!
గంటల సరిపెణ గంటవేటలు వన్ని
పట్టుకొనఁగవచ్చుఁ బడఁతులార!
వలకారి జిలుగుదువ్వలువలఁ దెరవారి
చిక్కించుకొనవచ్చుఁ జెలువలార! ...

ఇవియుఁ దానేల, మనచూపు లెనయ, వేట
యిట్టివెనువెంటఁ జనుదెంచు నిట్టికరణి
వచ్చు మచ్చికపచ్చిక నిచ్చుదగిలి
మునిమృగము వేడుకలు మీఱ ముదితలార!''

అని చనుదెంచు వనితలం గని ఋశ్యశృంగుండు...

కులుకుగుబ్బెతలచూపులు కల్వవిరు లంచు
 దేవతార్చనకుగాఁ దివియఁబూను
మగువ లందుకు నవ్వ, నగవు వెన్నెలలోన
 మినువాఁక జలమంచు మునుఁగఁబోవు
'హోమకుండిక లెట్టు లెద మోచికొన్నార'
 లని కుచంబులు కేల నంటి యంటి
'యీ తెల్లరుద్రాక్ష లేడఁ గల్గె' నటంచు
 హారము ల్వలుమాఱు నలమి యలమి
హోమరక్షలఁ బరిమళం బున్నదనుచు
మేలి కస్తూరితిలకముల్ ఫాలసీమ
మోము దార్కొన మూర్కొని మునికుమారుఁ
డిట్లు భ్రమయంగ నంగన లెల్లఁ జూచి.

నేఁడు మనచేతఁ జిక్కెఁబో వీఁ డటంచు
పాదముల గెల్పుబిరుదులు పదిలముగను
గట్టుఁడిఁక నంచుఁ, జంకలు దట్టుకొనుచు
నొండొరులఁ జూచి చిఱునవ్వు లుల్లసిల్ల...

కుందకందుకముల చందానఁ జంద్రఖం
 డములట్లు ఫేనపండములచాయ...
తెలి చక్కెరలును వెన్నలుగూర్చి...చేసిన
 కజ్జముల్ కొన్ని కైకొన్న లిచ్చి
''మునినాథ! మావనంబులపండు లివికొన్ని
 చవిచూడు'' మనినఁ గేల్సాఁచి యంది

త్రుంచి భక్షించుచునె, కొమ్మతుద మొకింత
కదలఁ దలయూఁచి...నవ్వుచుఁ జెలులఁ జూచి''

''ఎంతదూరంబు మీవన మిచటికి?''కనిన
''దూర మేడది? గడియెడు త్రోవయింతె...ఒడలు
గదలకుండంగఁ దొడుకపోయెదము నిన్ను...

తళుకు బంగరుద్రాఁత వలిపచేలలు వన్నె
నవతేరుపడఁ జాల హావణు మించఁ
గాసెలతీరుగాఁ గట్టి, యాపై నల్ల
పట్టుదట్టులలీలఁ బరగ జడలు
నడుములఁ జుట్టి, యందముగాఁగ నందుపైఁ
బలుకెంపుమొలనూళ్లు పరిఢవించి
అవికెలు ముడులుజాఱక యుండ బిగియించి
ముత్తెలజన్నిదంబులు ఘటించి
మేలిచందురుకావిరుమాలు లొక్క
వింతగా నాల్గుచుంగులు వెడలఁగట్టి
ఒడలు నిండంగ బలుగందవొడులు చల్లి
పల్లవాధర లెల్ల సంభ్రమముమెఱయ.

తరళాక్షు లిద్ద ఱొండొరులచేతులు గూర్చి
పొడవుగా నెత్తి యిర్గడలఁ గొమ్మ
వగ హస్తములుసాఁచ, వారివెన్నులఁ జన్ను
గవ హత్త నిద్ద ఱంగనలు నిలచి,
దంతపుగొడెలచందానఁ గంకణకరం
బులు నిగిడింప, వారలకు నడుమ
భామ లిద్దఱు నిల్చి, పటముపోలికఁ గరా
బ్జాతంబు లుయ్యెలపట్టుగాఁగఁ
బట్టి, ఆచుట్టు మునసాబుపస పొసంగఁ
గుడిబుజంబులక్రిందట జడలు దెచ్చి

యొండొరులరొండిఁ జెక్కి, పసిండిసరిగ
చేల పన్నాగముగ వైచి లీలమెఱయ,

అంధలమురీతి నందఱు
నందంబుగఁగూడికొనుచు నందు మునీంద్రుం
బొందుగ నిడికొని పదరక
మందగతులు మెఱయ హరిమార్గమునందున్.

బటువుబిగిగుబ్బబటువులపై నొకింత
యొఱగి, యొర గింతయును లేక యొప్పుచుండు
వనజనయనాభుజాందోళికను వసించి
తేజరిలె నప్పు డమ్మునిరాజు మిగుల.

''అడుగు జాఱకయుండ నడువుమీ యిచ్చోటఁ
బూఁదేనెజీఱుకు పువ్వుఁబోఁడి!
ఎలమావిబలుకొమ్మ లిచట నడ్డమువచ్చె
నటపోయి తిరుగుమో యంబుజాక్షి!...

కలిగెఁ జిన్నారిమోపు, బంగారుమోపు
బాపురే'' యంచు మేలంపుఁబలుకు లమర
నొండొరుల నెచ్చరించుచు నిండువేడ్కఁ
గూడినడచిరి మునిపుత్రుఁ దోడికొనుచు.

వనజవిలోచనల్ మెఱుఁగువాలికచూపులు గ్రేళ్లుదాఁట న
మ్మునిసుతు సారెఁ గన్గొనుచు ముద్దులవేడుకజింక చిక్కెఁబో
యనుచు లసద్విలాసపరిహాసవచఃక్రమముల్ సెలంగఁగాఁ
జని రటసాగి యంగనృపచంద్రునిపట్టనపద్ధతిం దగన్.

(రామాయణమునుండి)

## చేమకూర వేంకటకవి

[17-వ శతాబ్ది]

### సుభద్రార్జునులు

అన్నరుండంత శ్రీకృష్ణుఁ డున్ననగరి
సరసఁ గన్నియరాణివాసమున నమరు
కేళివనిలోన నవరత్నకీలితంపు
బవిరిటాకుల చిన్నియుప్పరిగలోన.

మృగనాభితిలకంబు బుగబుగ ల్గల లలా
  టముపై మృదూర్ధ్వపుండ్రంబు దీర్చి
తపనీయకౌశేయధౌరేయ మగు కటీ
  రమునఁ గాషాయవస్త్రము ధరించి
శరణాగతాభయసందాయకంబైన
  దక్షిణపాణిఁ ద్రిదండ మూని
రణచండకోదండగుణకిణాంకంబైన
  డాకేల నునుగమండలువు దాల్చి
యుండెఁబో శాంతరస మెల్ల నుట్టిపడఁగ
నంగనలపొందు రోసి సన్యాసియగుట
కద యుచిత మెందు, నా నవమదనమూర్తి
యంగనామణిఁ గోరి సన్యాసియయ్యె.

చేసె జప మతఁడు కడు వి
శ్వాసము చెలి చూపుబేడిసలపై నిగుడన్
చేసినయది జపమున్ మఱి
వేసినయది గాలమనుట వృథగాకుండన్.

వెలఁదికెమ్మోవిఁ గని జపావృత్తి మఱచెఁ
గగణిలేఁగౌను గని హరిస్మరణ మఱచెఁ

గడమయనవేల వేస మొక్కుటయె తక్కు
మఱచె నన్నియు నా కృత్రిమత్రిదండి.

ఈరీతి నుండ నొకనాఁ
డా రాజకుమారి యతని కాహార మిడఁగ
జేరెఁ దదారామంబునఁ
గూరిమినెచ్చెలులు వెంటఁ గొని తేరంగ ...

రమణియొయ్యారములపైఁ బరాకుచేతఁ
జవి యెఱుంగఁడు, వడ్డించునది యెఱుఁగఁడు
భోజనముచేసి లేచె నారాజసుతుఁడు
తృప్తి యేరీతి నుండెనో తెలియరాదు.

నిగనిగని చంద్రకాంతపు
జగతిపయిం గూరుచుండ, జవ్వని వెనుకన్
బగడపుఁగంబపుఁజాటున
మొగ మించుక గానిపింప మురువు నటింపన్.

"మీ రింద్రప్రస్థము గని
నారా? పాండవులఁ జూచినారా? సుఖులై
వా రందఱు నొకచో ను
న్నారా? వీరాగ్రగణ్యు నరు నెఱుఁగుదురా?
తడవాయె భూప్రదక్షిణ
మడరింపఁగఁబోయి యా మహామహుఁడు, పదం
పడి పుణ్యస్థలముల నె
న్నఁడు మీ రందందు నరుగ నరుఁ గానరుగా?"

అన విని "సమస్తభూములు
గనినారము, తీర్థయాత్ర గావించునెడన్
గనుఁగొనినారము సంక్రం
దననందను" ననిన, ముద మెదం జెన్నొందన్.

‘‘ఎచ్చటఁ గంటిరో విజయునిక్కువ నిక్కువమౌనె, రాఁడుగా
యిచ్చటి’’కంచుఁ గోరికలు నీరికలెత్త రసోక్తిఁ బల్కఁగా
నొచ్చెములేని బీర మెద నూరఁగ నూఱఁగసాగె వెంటనే
పచ్చనివింటివాఁ డపుడు పైదలిపైఁ దలిరాకుగైదువుల్.

కోమలి యీగతిన్ మది దగుల్పడఁ బల్కిన నవ్వి, ‘‘నిర్జర
గ్రామణిసూను మీరెచటఁ గంటిరొ యంటివి, కన్నమాత్రమే
యేమని చెప్పవచ్చు, నొక యించుక భేదములేక యాయనే
మేమయి యున్నవారముసుమీ, వికచాంబుజపత్రలోచనా!

వేమాఱు గ్రుచ్చిగ్రుచ్చిపు
డేమీ వడిగెదవు, మన సొకించుక నీ కా
భూమీశుమీఁదఁ గలదో
తామరసదళాక్షి! నాకు డాఁపక చెపుమా?

ఆ కవ్వడి యతివేషము
జేకొనియున్నాఁడు, నీకుఁ జెంతనె యెన్నా
ళ్ళో కలఁడు వచ్చి, యింకన
నీ కీలక మించుకైన నీ వెఱుఁగవుగా?

నీకై తపంబుఁ జేసెద
నీకై వడి డాఁపనేల యే నర్జునుఁడన్
లోకోత్తరశుభలగ్నం
బో కోమలి! నేఁడు కోర్కులొనఁగూర్పఁగదే!’’

భామిని యావినీలకచ నవ్వుమొగం బటుకొంత వంచి, యెం
తే వెఱ నివ్వెఱన్ మునిఁగె, యీతనిఁ బార్థునిగా నొకింత సున్
భావమునం దలంచియును నమ్మక యమ్మకచెల్ల యూరకే
సేవలొనర్చుచుంటి నని సిగ్గున దిగ్గున లేచిపోవఁగన్.

‘‘ఏల పోయెదు? నిలునిలు బాల!’’ యనుచుఁ
జిఱునగవు నెమ్మొగమ్మునఁ జెంగలింపఁ

దమకమున లేచి, మరులేచి, తత్కారాంబు
జం బాడిసిపట్టె చేసాఁచి సవ్యసాచి.

ఆరీతిం జేపట్టి వ
రారోహణ్ వేదిమీఁదికై రాఁదిగువణ్
దూరము వెస నరుగక యొ
య్యారముగా నమ్రవదనయై యుండంగణ్,

"చిలుకలకొలికిది నాతోఁ
బలుకంగాఁ గొంతసిగ్గువడియెడు ముంజే
చిలుకా! నీతోనైనను
బలుకంగారాదె, పలుకు బంగారటవే?"

అని కేళిశుకముఁ బలికిన
మన మలరం గలికి వలికె మాటలతియ్యం
దన మింతింతనగూడని
తన యధరసుధాసమగ్రతం దెలుపంగణ్.

"మేరలా యివి మీయంతవారలకును?
పెద్ద లున్నా, రెఱిఁగి వారె పెండ్లి సేయఁ
గలరు, వేగిరపా టెంత వలదటంచు
విన్నపముసేయరాదె యో చిన్నిచిలుక!"

అని యుచితరీతి వెలయఁగ నాడు నాతి
రసికముద్రకు మిగుల మానసము గరఁగఁ
బైపయిం బ్రేమ మగ్గలంబై పెరుంగ
నవ్వుధూటి నొడంబడ ననుఁ గిరీటి.

"మీవా రెఱుఁగుట యెన్నఁడు?
కావించుట యెన్నఁ డింకఁ గల్యాణంబుణ్?
నీవేల జంపు నడపెదు
రావే! మారాడ కిందు రాకేందుముఖీ!

నేఁడు గాదుగదే ప్రేమ నీకునాకు
నాటియున్నది మది( జిన్ననాఁటినుండి
ఇటుల నేకాంతసమయ మెన్నఁటికి దొరకు
నేల తప్పించుకొనియెదవే లతాంగి!''

అని యనేకప్రకారంబుల మనోనురాగంబు తేటపడంబల్కినఁ, జిఱుచెమట గ్రమ్మ మొగంబు మకరందబిందుకందళితారవిందంబు చందంబునఁ దనర, నొక్కింత జాఱుపయ్యెంట జక్కంజేర్చుచు, నొక్కింత వదలువేనలి నలవరింపుచుఁ, జక్కెరవిల్తుఁ డెక్కడ వెన్నాడునో యనుభయంబునంబోలె నించుక తిరిగిచూచుచు, నివ్వెఱవు సకియలకుం జెప్పుకుమని రాచిల్కకుఁ బ్రియంబు జెప్పుచు, మగతేఁటి యంటియంటని ప్రసూనకలికపోలిక నరవిరి బాగుతో పోలి, కప్పురంపుటనంటుల నంటు ద్రాక్షపందిళ్ళ తెరువునఁ బూఁదేనెకాలువలు దాఁటి, చెంగలువబావులడగ్గఱ వట్టివ్రేళ్ళ చప్పరంబులనీడ వ్రీడాభరం బీడిచికొనిపోవ,

ఆ ఘనుని బాసి, మంజీ
రాఘోషము మెఱయ నరిగె నంతఃపురికిన్
వే ఘనజఘన తళుక్కన
మేఘము నెడబాసిపోవు మెఱపో యనఁగన్.

ఎటువంటినేర్పరి నిశా
విటునల్లుఁడు! నడుమ నిల్చి, వెడసింగిణిచే
నటుచూ పిటు, నిటుచూ పటు
పటురయమున నేసె నాసుభద్రార్జునులన్.

(విజయవిలాసమునుండి)

## శేషము వేంకటపతి
[18-వ శతాబ్ది]

### బృహస్పతితో తార

"తెలుప! మీ శీల మెల్లను దివ్యదృష్టి
జూచినాడను నీ వింక దాఁచవలదు
నీవె చెనకితివో? లేక నిన్ను వాఁడె
చెనకెనో? తెల్పు, తెలిసి శిక్షింతు"ననిన.
బొటఁబ్రేల నేల వ్రాయుచుఁ
గటకటపడి మేను వడఁకఁ, గనుఁగవ నశ్రుల్
పొటపొట రాలఁగ నేడ్చుచు,
గుటిలాలక శిరము వంచికొని యి ట్లనియెన్.
"ఏమని యుత్తరం బే నీయఁగలదాన
నెందునఁ దీఱు మీ సందియంబు
ఇంక నాపయి దయ యెట్లు గల్గును మీకు
సైపకయున్న నా జన్మమేల
పాపపుదైవంబు పాపెనో మనలను
తలను వ్రాసినవ్రాలు తప్పదింకఁ
దప్పొనర్చినవారి దండింతు నంటిరి
తప్పొనర్పనివారు ధరణిఁ గలరె?
అబ్జభవుకూఁతు రైన యహల్యమొదలు
నేరమొనరించె నన్నచో నేర్చి నడువ
నోకరి తరమౌనె? మగవార లోర్వవలయుఁ
గానిచో వట్టి నగుబాటుకాదె మీకు?"

### మూగవలపు

పెనిమిటివెన్క నిల్చి, నను బిత్తరిచూపుల నీవు చూడ, నే
మునుకొని ముద్దుబెట్టుటకు మోమటు లొగ్గఁగ నీవు వేళగా
దని తలయూఁచి నే నలుగ, నందుకు కన్నుల నీవు మ్రొక్క, నే
నిను మదిఁ గౌఁగిటం బొదువ, నీవఱగన్నులు మోడ్పవా చెలీ!

(తారాశశాంకవిజయమునుండి)

## ముద్దుపళని

[18-వ శతాబ్ది]

### తీఱితీ అని సిగ్గు

మో మొకించుక యెత్తి, మోవియానఁగనొత్తి,
  అదియిది చాలించి యట్టెయుండుఁ
గాఁగిలించగఁజూచి, కరపద్మములఁ జాఁచి,
  అందుకిందుకుఁ బోక యట్టెయుండుఁ
జనులఁ గ్రుమ్మఁగఁగోరి, సరస మెల్లనఁ జేరి,
  అవలకీవల కేగ కట్టెయుండు...
ముద్దులిడ వచ్చి, యందందుఁ బ్రొద్దుపుచ్చుఁ
బలుకఁగామీఱు నెలుఁగెత్తి పలుకబాఱు
విడె మొసఁగఁబోవు, సగ మాకుమడచి మానుఁ
దీఱితీఅనిసిగ్గునఁ దెలవ యపుడు.

### చిననాఁటి చౌరవ

మురువుగా దాఁగిలిమూఁత లాడెడువేళ
  యదురాయలకుఁ బల్మ యెదురుపడును
రీతిగా గుజగుజరేకు లాడెడువేళ
  మదనగోపాలుని గదిసినిలుచుఁ
గొమరుగా వెన్నెలకుప్ప లాడెడువేళ
  మురవైరిచేఁ-గను ల్మూయనిచ్చు
గుములుగా గుజ్జెనగూడు లాడెడివేళఁ
  గంసవిద్వేషిచెంగట వసించు
ఎట్టులైనను దేవకిపట్టికరము
గరము తను సోఁకఁగాఁ గనికరముచేత

సుదతి యలనాఁడె సైగగాఁ జూచుఁ, బ్రోడ
లమ్మచెల్ల యిదెంత చిత్రాంగియనఁగ.

## దివ్యదృష్టి

పద్మాక్షుఁ డెవ్వతెపైఁ గన్ను వేసెనో
  పలుమాఱు వలకన్ను పదరె నిదిగో
శౌరి యెవ్వతె మోవిచవులకు మరగెనో
  వదలక కెమ్మోవి యదరె నిదిగో
వనజారి యచట నెవ్వతెఁ జెట్టఁబట్టెనో
  విడువక భుజము కంపించె నిదిగో
ఫణిశాయి యెవతెను బైకొని యేలెనో
  మించి పెందొడ సంచలించె నిదిగో
చిత్తజునితండ్రి యెవతెచేఁ జిక్కు-కొనెనొ
మించుసంచున మై తత్తఱించె నిదిగో...

చెలువుఁడు వేఱొక చెలియను
దలపునఁ దలపోసినపుడె తనకుండానే
తలనొచ్చుఁ గనకవినక యె
కలికిరో! యేమందు, వలపు గానిదిసుమ్మీ!

అరయఁగఁ బ్రాణనాయకుల నవ్వుల నివ్వలఁ బాయలేమ లా
విరిశరు నంపతంపరల వేఁగునఁ బొర్లగ న్యాయ మక్కటా!
హరి యిదొ నాదు లోవెలి సహస్ర శముం గనుపట్టుచుండెడిన్
విరహ మిదేలనో మిగుల వేదనబెట్టు దురాగతంబునన్.

## ప్రేమపరాకాష్ఠ

మేనుమే నానిన మేను సోఁకదటంచుఁ
  గలపంబు లొల్లఁడో కలువకంటి!

పరులు వచ్చిన రిత్తపలుకనయ్యీ్యానని
తెర యెత్తసీయఁడో శరదవేణి!
అలమి కౌఁగిటఁ జేర్ప నడ్డమయ్యీ్యానని
హారంబు లొల్లఁడో హంసగమన!...

మణిగుణంబులదారిని నసఁగిపెనఁగి
కుసుమగంధంబులట్టులఁ గూడిమాడి
చెలఁగి తిలతైలములరీతిఁ గలసిమెలసి
యున్నవిభుఁ డిట్లు చేసెనో సన్నుతాంగి!

కనకాంగికట్టువర్గమె వల్లెవా టాయెఁ
గొమ్మపావడ చుట్టుకొనుట యాయె
నలివేణి నెమ్మోము నిలువుటద్దం బాయెఁ
జెలిగోటిలత్తుక తిలకమాయెఁ
దరుణిలేనును నోడ త్తలగడదిం డ్లాయె
వెలఁదిగుబ్బలు చెంపబిళ్ళ లాయె
లలితాంగిచెమ్మట ల్చలువపన్నీ రాయెఁ
కలికిమేనునలుంగు కలపమాయె

బోటిపడకిల్లు జిగికొల్వుకూట మాయె
లోలలోచనతోడిదే లోకమాయె.

(రాధికాసాంత్వనమునుండి)

## పాలవేకరి కదిరీపతి

[18-వ శతాబ్ది]

### కాఁపుటిల్లాండ్రు

"దివస మంత వితాపోయె నవుర రారె
గుంపునంపును లేకుండ గుండుపోఁగు
గాఁ బదాఱింటితరమునుగాఁగ నూలు
వడకరే" యంచు నొండొరుల్ నొడివికొనుచు.

వడిదారము చెవులుం ద్రొ
క్కుడుపలకయు దిండు కదురుగుంజలునుం ద్రొ
క్కుడుబొమ్మయునుం ద్రిప్పుడు
పుడకయునుం గలుగురాట్నములు గైకొనుచుఁ

ఎడమదెస దొడ్డుగా వైచి యేకులెల్లఁ
గెలనఁ బలువగ వేఁపుడుగింజ లునిచి
చేవపీఁటలమీఁద నాసీనలైన
వారలై వావివరుసలు వదరుకొనుచు.

గుంపునంపును లేక కొనసాఁగఁ బ్రోఁగు వెం
ట మెఱుంగుజూపు పేరెములువాఱఁ
"బ్రాయంపుపడుచులఁ బనిగొంటివే దూది"
యనెడిపాటలు దేనెచినుకు లీన
ఏకుతోఁ జెలగు కే లెత్తుచో భుజమూల
కాంతులు బయలు బంగారుసేయఁ
బుడుకద్రిప్పెడు రయంబునఁ బైఁటజాఱుచో
మినుకుగుబ్బలు తళుక్కని రహింప
ముడిచికొన్నట్టి తెలిగంజిమడతచీర
లరిదితొడనిగ్గుచేఁ బసుపంటినట్లు

పోసఁగఁ జరణాభ ద్రొక్కుడుబొమ్మమీఁద
బచ్చెన ఘటింప వడికి రప్పద్మముఖులు.

ఎన్నికలు పట్టి, పుంజంబు లేర్పరించి
పంటికఱ్ఱలు, మఱి తోడుపడఁగ, లూచ
కండె లొనరించి, చాలించి కాఁపుటింతు
లున్న యవ్వేళ నద్భుతం బుట్టిపడఁగ.

## పెద్దకాఁపు

మొలకు సగంబును, దలకు సగంబుగాఁ
  గట్టిన యయగారికరలచీర
పై నల్లకమ్ముల పచ్చడమ్మును దోలు
  పావలు చేతిలోఁ బట్టుకఱ్ఱ
కత్తెఱగడ్డంబు కఱకుజుంజురుమీస
  ములు రోమశంబైన పలుకఱొమ్ము
మొలయుంగరము వ్రేల నలముగాఁ దీర్చిన
  నాభినామము బీదనరము లమరు

గడుసుబిక్కలు గలిగిన మడమ లమర
వెంట నిరువంకఁ బెంపుడువేఁపు లరుగఁ
గెలనఁ దగు నెడ్లకొట్ట మీక్షించుకొనుచు
నింటివెలుపలి తిన్నియ కేగుదెంచె.

దుసికిలబాఱు కోరసిగ, నుప్పటినీటు, లలాటపట్టికం
బూసగు విభూతిపైఁ బసుపుబొట్టును, దొట్టిన కల్లుచొక్కు, వె
క్కసముగ నెఱ్ఱవాఱిన వికారపుఁజూపులుగాఁ గనంబడన్
వెసఁ జనుదెంచె నొక్క బవనీఁడు తదీయసమీపభూమికిన్.

ముదుక దలపాగయును బాహుమూలమందుఁ
గవిలె, చర్మపుటొఱలోని కత్తిగంట

మలఁతి నీర్కావిదోవతు లమర గ్రామ
కరణ మేతెంచి రెడ్డిచెంగట వసించె.

## బాపనయ్య

అఱుతఁ గీల్కొన్న ముత్తరముల ధావళి
  యంసాగ్రమున గోనెయసిమిసంచి
కట్టిన ముతకనీర్కావిదోవతియు నాపై
  బిగించిన యది ప్రాఁతబట్ట
తలచుట్టుకొన్న చింపులబైరవాసంబు
  చెమటచేఁ గరఁగెడు సేసబొట్టు
మారేడుబుఱ్ఱలో మంత్రాక్షతంబులు
  పదముల విజ్జోడు పాదరక్ష
లొడిసి పంచాంగ మొకకేలఁ, బొడుపువ్రేల
వెండియుంగరమును, మెడవ్రేలు ముఱికి
జందెములు, నవ్యయాచ్యుతస్మరణ మాస్య
సీమఁ గనిపింపఁ బఱతెంచెఁ జేనికడకు.

## ఆభీరసుందరి

మైనిగ్గుల్ తెరయెత్తఁగా, నమృతకుంభం బంది యేతెంచు మా
యానారాయణిలీలఁ దక్రఘటదీవ్యన్మస్తయై, చూపు ల
జ్జానమ్రత్వము జెందఁ, జల్లగొనరో! చల్లంచు నేతెంచుచో
దానిం జూచినకంతుఁడైన రతిమీఁదం దప్పుగల్పింపఁడే?

## బాలెంతపొలపము

బెడగుజూపెడు నూనెముడిలోనుగా నంట
  గట్టిన వాసెనకట్టుతోడఁ
గస్తూరిపసుపుచొక్కడపుఁ జల్లనితావి
  వెదజల్లు పుక్కిటివిడెముతోడ

నిసువుపై పసుపునూనియజిడ్డులంటిన
  చిటికమ్మికుఱుమాపుచీరతోడ
నొసట నందంబుచిందు విభూతిరేఖపైఁ
  బొంకంబుగను చుక్కబొట్టుతోడఁ
గాన్పుసంతసమందు మొగంబుతోడఁ
నడరు మురిపంబుగులుకు నెన్నడలతోడఁ
గాంతిమతి 'వీఁడె నీముద్దుగాఱుతనయుఁ'
డనుచుఁ జేతికి నీయఁగా నవ్విభుండు.

( శుకసప్తతినుండి )

## కంకంటి పాపరాజు

[18-వ శతాబ్ది]

### సీతా వివాసము

ఇట్లు సుమంతచోదితంబగు రథంబున సీతాలక్ష్మణు లడవులు గడచి, పర్వతంబు లతిక్రమించి, పక్కణములు గడచి, చనిచని ముందట గంగానదిం గాంచి,

అరదముడిగ్గి యచ్చతురుఁ డచ్చట సారథినుంచి, యోడపై
ధరణిజ నెక్కఁబంచి, వెతదార్కొనఁ దానును నెక్కి, తత్సరి
త్తరణ మొనర్చి, వేగఁ దటధారుణిఁ జేరియు శోకవార్ధిలోఁ
దరళమనస్కుఁడై మునిఁగి ధారగఁ గన్నుల నశ్రులొల్కఁగన్

జనకజమోము దీనతమెసంగ గనుంగొని, యూరెలుంగుతో
"జననిరో! పాయ దీహృదయశల్యము, శోకదవాగ్నిగ్రాఁగుకం
టెను మరణంబుమేలు, జననిందితకృత్యముబూనివచ్చితిన్
నను శపియింపు" మంచుఁ జరణంబులచెంగటవ్రాలి యేడ్వఁగన్

ఎదపడిపెదవులు దడుపుచు
నదవద నెదతాల్మివదల నంగము గదలన్

దుదమొదలు లేని దీనత
గదురఁగ జనకసుత యతనిఁ గనుగొని యనియెన్.

''అన్న! యనేక దీనదశలానినవేళలనైన నీవు ము
న్నెన్నఁడు నంతవంత వహియింపవు, ధైర్యము డింప, వేల నేఁ
డిన్నిగులొంది కుందెద? వహీనగుణాంబుధివంచు నీగుణం
బెన్నుదు రంద, ఱెవ్వరికి నెగ్గుదలంచితి? వుగ్గడింపవే.

మన్నన దొలంగినిను మీ
యన్న నిరాకరణచేసి యాడెనొ? నీ కా
యన్నపయి భక్తి దొలఁగెనొ?
కన్నాయమ నేమియైనఁ గారించితివో?

రామాజ్ఞ లేకయే నను
దీమసమునవిందుఁ దోడితెచ్చితొ? నాపై
స్వామిమతి యెడసియున్నదొ?
యేమిటి కడలెదవు తండ్రి! యెఱిఁగింపఁగదే.

సౌమిత్రీ! భయమయ్యెడిన్ నుడువు మాతన్మాదేవిజామాత, యా
శ్రీమత్పద్మదళాక్షుఁ, డారవికులక్షీరాబ్ధిపూర్ణేందుఁ, డా
హేమత్క్ష్మాధరధీరుఁ, డాయసురమత్తేభేంద్రహర్యక్షుఁ, డా
శ్యామాంగప్రభుఁ, డామహాప్రభుఁడులెస్సైయున్నవాఁడేపురిన్

మనుమార్గనిరతుఁడనఁగా
మను మానవపతి, దయాబ్ధి, మానచ్యుతుఁడై
నిను మానెనో? నను మానెనో?
యనుమానముమాని తెల్పు''మన మానినితోన్.

తెలుపుటకుఁ గొంతచింతిలి,
తెలుపక పోరాదటంచు దృఢనిశ్చయతన్
దలఁచుచు, వడి లేచి, కృతాం
జలియై యతఁ డశ్రులొలుక జనకజ కనియెన్.

"ఇంతకుఁ బూనివచ్చి, వచియింపకపోదునె, విన్ము తల్లి! దు
శ్చింతులు 'దైత్యుచేఁబడిన సీతను గ్రమ్మఱ నేలుచున్నవాఁ
డెంత విమోహి రాముఁ'డని యెగ్గులు వల్కఁన, నాలకించి భూ
కాంతుఁడు నిందఁజెంది, నినుఁ గానలలోపల డించిరమ్మనెన్.

క్షుల్లకజనదుష్టవచో
భల్లకదంబముల హృదయపద్మ మగల భూ
వల్లభుఁ డోరిచె భవదా
యల్లకభర మేమి వినియె దమ్మరో! యింకన్...

జననీ! నీవు మహాపతివ్రతవు, నీసౌశీల్య మిల్లాండ్ర కె
ల్లను మేల్బంతి, రఘూద్వహాంఘ్రియుగళీలగ్నాత్మవై యుండుమీ
యని నే నెవ్వఁడ విన్నవింపఁ బతిఁబాయఁగన్ జేసి, నిన్నొంటి డిం
చిన పాపాత్ముఁడ, నూరికేగుమనుచున్ సెల్విచ్చెదే" నావుడున్

అల్లలన యతని వచనము
తెల్లన్ విని, మొదలు నఱుక నించుకవడిలోఁ
ద్రెళ్లెడి కదళికవలె 'హా
తల్లీ!' యని బెట్టుసొరిగి ధరపైఁబడియెన్.

...ఒడ లెఱుంగక రెండుగడియ లుండి, కొండొక తెలిసి, వెండియు నలసి, యవశయై యాకృశాంగి మరలఁ గన్నుదామరలు విచ్చి, విచ్చలవిడి వెడలెడి యశ్రుధారాప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలువాఱి పయ్యెదచెఱంగుమీఁదికి జాఱ...... దురిమినవిరులసరులతో నొఱవిన కొప్పుపెన్నెఱు లంసభాగంబులం బొరలిపడ, నెమ్మేను గడగడవడంక,...పరితాపదవానలంబునఁబడి పురపురఁబొక్కుచుఁ,...లేచికూర్చుండి, శోకరసం బాకారంబు దాల్చినచందంబున,...నూరక వెక్కి వెక్కి యేడ్చుచు, నేడుపువిడిచి మౌనంబుపూనుచు, మౌనంబుమాని తనలోఁ దానగుచు, నగ వుడిగి తలయూఁచుచుఁ, దలయూఁచుట విడిచి ముక్కుపై వ్రేలు గీలు

కొలుపుచు,...'దలఁపనితలఁపు లివిగో చూచితే లక్ష్మణా!' యని యతనిదిక్కు చూడ్కులు నిగిడించి యిట్లనియె.

''అడలకు మన్న! నీకు వసుధాధిపునానతి దాఁటవచ్చునే?
యిడుమలఁ జెందుమంచు విధి యీధర నన్ను సృజించియుండఁగా
గడవఁగ నెవ్వ రోపుదురు? కానల కేగిననాఁడె యాపదల్
గడచితినంచు నుంటి, నెఱుఁగన్ దుది నిట్లగునంచు నామదిన్.

ఎడపక పూర్వజన్మముల నేమిథునంబులఁ బాయఁజేసి, వా
రడలఁగ నవ్వుచుండితినొ యాయఘ మూరకపోనె? నాఁడు కా
అడవుల రామపాదజలజాప్తి వసించితి, నేఁడు నాథుపాం
దెడసి,యనాథనై ,యిచట నేగతి మేన భరింతుఁబ్రాణముల్...

కళవళమంది తెల్పితివొ? కాక పరాకునఁ దప్పవింటివో?
కలనయినన్ రఘూద్వహుఁడు కానలలో నను ద్రోయఁబంచునే?
తెలిసి గణింపు లక్ష్మణ! మతిభ్రమమైనదొ, హా! సహింపు మి
ప్పలుకు లెఱుంగ కంటి, వెతబాటిలె, నీకొక భ్రాంతి యున్నదే?

ఎన్నటికిన్ రఘూద్వహుని నేనును,నన్నిఁక రామచంద్రుఁడున్
గన్నులఁజూడఁగల్గదొకో? కల్గక యుండినఁ బ్రాణ మేల పో
దన్న! రఘుప్రవీరు చెవులారఁగ నింతయుఁ దెల్పు, నాకు మే
నున్నది, చెంత గంగమడుఁ గున్నది, యైనటులయ్యెడిన్ దుదిన్

పతి మతి నెంచెనేమొ తనుబాసి యశోకవనంబులోపలన్
బ్రతుకదె పెక్కునాళ్లనుచుఁ,గ్రమ్మఱఁ దాఁ జనుదెంచి శత్రునిన్
హతునిగఁజేయు, నేలు నను నాసగదా బ్రతికించె నాఁటి; కా
గతి నిఁక నేమి యాసగొని కాయమునిల్పుదుఁ దెల్పు లక్ష్మణా?

ఎఱుఁగనిమూఢు లాడుకొనునెగ్గులకున్ భయమంది యప్పుడే
కఱకుమనంబుతో విభుఁడు కాననసీమకుఁ బంచెఁగాక, య
త్తెఱఁ గొకసారి నన్ బిలిచి తెల్పి, మనోవ్యథ తీర్చి, 'నిన్ను నే
మఱ'నని పంపఁడయ్యె,నభిమానము గూర్మియు నెందుఁబోయెనో

ఆకరుణ, యాప్రసన్నత
యాకూరిమి, యాప్రియోక్తి, యాగౌరవమున్
గాకుత్స్థుఁడు మఱచెఁగదా
యాకస్మికముగ జనించు నపవాదమునన్.

ఆకర్ణాయతనేత్రమై, మణిమయోద్యత్కుండలద్వంద్వశో
భాకీర్ణాంచితగల్లమై, సురదనంబై, సుందరభ్రూయుతం
బై, కమ్రస్మితచంద్రికావిలసితంబై యొప్పు శ్రీరాముమో
మీకాయంబునఁ జూచుభాగ్య మిఁక లేదేమో సుమిత్రాత్మజా!

అవని నయోనిజనయి పుట్టి మిథిలేంద్రు
 వీట నేఁ బెరిగినవిధము వినరో
యంగరాగము లిచ్చి యనసూయ మొదలైన
 సతు లెంచుకొన్నది చాల వినరో
యా లంకలోఁ దొల్లి త్రైలోక్యము నుతింప
 వహ్ని నేఁ జొచ్చినవార్త వినరో
'యీసీత నిర్దోష యేలుకొ'మ్మని రాము
 బ్రహ్మాదు లపు డన్న పలుకు వినరో
వినియుఁ గనియుఁ బ్రజలు నను నిందసేసిన
యంతమాత్రమునకె యధిపుఁ డులికి
యింత తెగువసేయ నిచ్చగించుట నా య
భాగ్య మింతె, యొకరిఁ బల్కనేల?

'వనమున కేలవచ్చితివి? వల్లభునిన్ బెడబాసి, యొంటిగా'
నని మునిపత్నులెల్ల గుమియై యడుగన్, ధృతిమాలి వారి కే
మని వివరింతు? నింక విపదంబుధి నేకరణిన్ దరింతు? నే
యనువున నీప్రతిక్షణమహాయుగముల్ క్రమియింతు లక్ష్మణా?

అని పెక్కువగల నమ్మగువ వాగిలి...బహిర్లిఖితచిత్రంబు
కొమరొందియున్న యమ్మఱఁదితో మఱియు నిట్లనియె.

వగపునఁ దోఁచినన్నియు నవారణఁ బల్కితిఁగాక భర్తకుఁ
జగదపవాదమున్ గడువశక్యమె? నేను వియోగమగ్నతఁ
దెగువకుఁ జొచ్చి రాము జననిందితుఁ జేయుదునే. తదాజ్ఞ యె
ల్లగతులఁ బూని, కానల మెలంగెద, మేనుగలంతకాలమున్.

అన్న! లక్ష్మణ యింక నాలస్య మేటికిఁ
జను మయోధ్యాపురంబునకు నీవు
మువ్వుర త్తలకును మ్రొక్కితి నని తెల్పు,
మచటిబంధుల నెల్ల నడిగితి నను
మతికృపాళునకు రామావనీంద్రునకు నా
మ్రొక్కుగా నతిభక్తి మ్రొక్కు మీవు
తనయాజ్ఞ దలఁదాల్చి జననింద తను జెంద
నీక కానలఁ జరియింతు ననుము

భూజనుల బాంధవుల లెస్స ప్రోవుమనుము
తలఁప నా కేడుగడయును దానె యనుము
భావ మెప్పుడుఁ దనమూర్తి బాయ దనుము
నెమ్మి యొకయింత నామీఁద నిల్పు మనుము.

పోయిరమ్ము; శుభంబులు బొందు నిన్ను
నన్ను మఱవక యుండుమా యన్న'' యనుచుఁ
గన్నుఁగవ నశ్రుధారలు గ్రమ్ముకొనఁగ
నన్నెలంతుక దీనయై యడలుచున్న.

చనఁ గాళ్లు రాక, చన కిఁకఁ
జనదని ధేనువును బాయఁజాలని వత్సం
బునుబోలి జాలిగొని, ''యో
జననీ! జననాథు గొలువఁ జనుదునె?'' యనుచున్.

అల్లన మ్రొక్కి, కాళ్లు వడకాడఁ బ్రదక్షిణమాచరించి, మే
నెల్లఁ జలింప హోరుమని యేడ్చుచుఁ బెద్దయెలుంగుతోడ ''మా

తల్లిని డించిపోయెదను దాపసకామినులార! కూర్మిసం
ధిల్లఁగఁ బ్రోవరే''యనుచు దీనత లక్ష్మణుఁ డేఁగె నయ్యెడన్.

ఏగి, నావయెక్కి, యెడఁద దల్లడపడఁ
దిరిగితిరిగి సీతదిక్కు గనుచు
'దిక్కు కలిగి నీకు దిక్కు లేదాయెఁగా
తల్లి' యనుచు నవలితటముఁ జేరి.

చనుచుండె; నిచట సీతా
వనజాక్షియు నతఁడు మరలివచ్చునో యని యా
యనచనినత్రోవ పలుమఱు
గనుచున్ విధి దూఱుకొనుచుఁ గటకట యనుచున్.

రమణి మఱికొంతవడిదాఁక రథముఁ జూచుఁ
దరుణి మఱికొంతసేపు కేతనముఁ జూచుఁ
గాంత మఱిమీఁద రథపరాగంబుఁ జూచుఁ
బడఁతి మఱియంతటను వట్టిబయలు సూచు.

చూచిచూచి, చొక్కి స్రుక్కి, తాలిమిదక్కి
వగలఁ బొగిలి, యూర్పుసెగల నొగిలి,
దిగులు దగులఁ గుంది, వగజెంది, బెగడొంది
యలసిసొలసి, మూర్ఛ లొలసి తెలిసి.

''ఒడిమీఁద నిడుకొని యురముపైఁ జేర్చుట
 చేరిక కది కడసారియేమొ?
చెక్కు జెమ్మట చేలచెఱఁగునఁ దుడుచుట
 చెలిమికి నది తుదిచీటియేమొ?
పుక్కిటితావికప్పురపీడె మిచ్చుట
 యనురాగమున కది యవధియేమొ?
కోరినపని కియ్యకొను టది కరుణాప్ర
 బంధమునకు ఫలగ్రంథమేమొ?

మోము మోమునఁ గదియించి ముద్దుగొనుట
యదియె మోహంపుఁబనికిఁ దీఱుదలయేమొ?
యెలనగవు దేరఁ జూచి, లోపలి కనుచుట
మేలుచిన్నల కది పొలిమేరయేమొ.''

అని దుఃఖించు, నపప్రథన్ దెలుప కాహో భూవిభుం డింత వం
చనగావించునె యంచు విన్నసగు, నేచందంబునన్ దెల్పి పొ
మ్మను మోమోడక యంచునెంచుఁ,బతిఁబాయం జేసి తేదైవమా
యను, నింకెవ్వరు దిక్కనుం, దొలఁగ వీప్రాణంబు లారాయనున్

(ఉత్తరరామాయణమునుండి)

## గోగులపాటి కూర్మనాథకవి

[18-వ శతాబ్ది]

### దుష్టులవధింపు నరసింహా!

కాంతలఁ జెఱబట్టఁ గనుఁగొనుచుంటివి
  పాంచాలివెత యెట్లు వాపినావు?
గోవధసేయఁ గన్గొనుచుంటి విప్పుడు
  కరుణతోఁ గరి నెట్లు కాచినావు?
ద్విజులు బాధలుపడఁ దిలకించుచుంటివి
  భువిఁ గుచేలుని నెట్లు ప్రోచినావు?
సత్ప్రభు రాజ్యనాశనమొందఁ గంటివి
  ధ్రువుని కెట్లిచ్చితో దొడ్డపదవి?

దుష్టశిక్షణమొనరించి శిష్టరక్ష
జేయకుండినఁ బూర్వప్రసిద్ధి చెడును,
ఆర్తరక్షణబిరుదంబు హానిజెందు
వైరిహరరంహా! సింహాద్రి నారసింహా!

గ్రామంబు లన్నియుఁ గాల్చి దీపారాధ
  నలుచేసి ఘోర యానందముగను
వడి సాధుజనుల సర్వస్వమ్ముఁ గొని శర
  గోపంబుబెట్టిరి గురుతరముగఁ
బటుఘటాదులు వోవ బ్రతిమాలువారి కే
  మియ్యక ఘంటవాయించి రహహా
పెద్దలకడ దుడ్డుపెట్టి ప్రసాదంబు
  వడ్డించి తగఁ బరవశులఁజేసి

రవుర! యవనార్చకులు నీకు నాప్తులైరి
భూసురులుసేయు పూజలు పోసఁగవొక్కొ?
అకట! యిదియేమి పాపమునకు వెఱవవు? వైరిహరరంహ...

జడవిప్పి జునపాలు సవరింపు మిరువంక
  బలుకిటికీదారు పాగ జుట్టు
బొట్టు నెన్నుదుటిపై బొత్తిగాఁ దుడుచుకో
  పోఁగు లూడ్పుము చెవు లూప్పడవిడువు
వడిగ నంగీయిజా ర్దొడుగు దట్టీజుట్టు
  కైజారుదోపు డాల్కత్తిబట్టు
బీబినాంచారును బిలిపింపు వేగమే
  తుద కభ్యసింపుమీ తురకభాష

శక్తిలేకున్న నిట్టివేషంబు పూను
మన్న! మఱి లోకవంద్యుఁడవైన నీవు
నీచులకును సలాంసేయ నే సహింప, వైరిహరరంహ!

నిదురించినావొ నిర్నిద్రభద్రాకార
  కలితభోగీంద్రభోగంబుమీఁద?
శయనించినావొ శైశవమూర్తితోఁ బయః
  పాథోధిఁ బటువటపత్రసీమ?

పవళించినావా శ్రీభామినీదోర్మృణాల
  కూలంకష స్తనకుంభయుగళి ?
పడుకగావించితో భక్తసద్వ్రాణ్మాన
  స్సంకల్పితానల్పశయ్యయందు ?
నిబిడపాశ్చాత్యభీతులై నిఖిలజనులు
కలసి మొఱపెట్ట నీకెట్లు నిదురపట్టె ?
లెమ్ము, నాసామి ! జాగేల చిమ్ము రిపుల, వైరిహాతరంహా !

( సింహాద్రి నారసింహాశతకమునుండి )

## కాసుల పురుషోత్తముఁడు

[ 18-వ శతాబ్ది ]

### చిత్రచిత్రప్రభావ !

ఆలు నిర్వాహకురాలు భూదేవియై
  యఖిలభారకుఁడను నాఖ్య దెచ్చె
నిష్టసంపన్నురా లిందిర భార్యయై
  కామితార్థదుఁడన్న ఘనత దెచ్చె
కమలగర్భుఁడు సృష్టికర్త తనూజుఁడై
  బహుకుటుంబకుఁడన్న బలిమి దెచ్చెఁ
గలుషవిధ్వంసియౌ గంగ కుమారియై
  పతితపావనుఁడన్న ప్రతిభ దెచ్చె
నాంధ్రుబిడ్డలు దెచ్చు ప్రఖ్యాతిగాని
మొదటినుండియు నీవు దామోదరుఁడవె
చిత్రచిత్రప్రభావ ! దాక్షిణ్యభావ !
హతవిమతజీవ ! శ్రీకాకుళాంధ్రదేవ !

కులగురుద్వేషి నొజ్జలుగ నెన్నుకొని కాచి
  నిష్ఠురమంత్రముల్ నేర్చినావు
పూర్వదేవతలు కాఁపురమున్న పురియందు
  వంచించి యగ్గి బెట్టించినావు
తాతల తరమునఁ ద్రక్షించిన పయోష్ణ
  పేరుగాఁ గొంత పూడ్పించినావు
మునియాజ్ఞ లెఱుంగక మోహించి వచ్చిన
  మెలనాఁగ ముక్కు గోయించినావు
బళిర! నీవంటి ధార్మికుఁ బ్రస్తుతింపఁ
గొదవ లింకేమి కైవల్య మెదుట వచ్చు! చిత్రచిత్ర.

నాఁగలి రోఁకలన్నకు నిచ్చి, శంఖాది
  పంచాయుధము లీవు పట్టినావు
తాటిటెక్కెంబు కోత్తల పెద్ద కెత్తించి
  గరుడధ్వజం బీవు గట్టినావు
మద్య మగ్రజునకు మత్తిలఁ ద్రావించి
  జున్ను బాల్పెరు గీవు జుర్రినావు
వెలరాని కరబోని వలువ జ్యేష్ఠున కిచ్చి
  కనకాంబరం బీవు గట్టినావు
తగవరివె యన్నదమ్ముల ధర్మ మీవె
తీర్పవలెఁగాని మఱియొండు తీర్పఁగలఁడె? చిత్రచిత్ర...

(ఆంధ్రనాయక శతకమునుండి)

## అడిదము సూరకవి
[18-వ శతాబ్ది]

### రామలింగేశ!

కన్నంబుద్రవ్వుతస్కరుఁ డింటివారికి
  వాడలేదని మ్రుంత వైచి చనునె?
తెరవాటుకాఁడు చింతించునే కట్టిన
  బట్ట దుల్చిన మానభంగమనుచు
వలబడ్డ మెకము చూల్వహియించె ననుచును
  విడువంగఁజూచునే వేఁటకాఁడు?
జారుండు పరకాంత శయ్యకుఁ దారిచి
  వావిగాదని పల్కి వదలిచనునె?
ఆత్మజను గుత్తరూకల కమ్మునాతఁ
డరణము లొసంగఁజూచునే యల్లునకును
ఎఱుఁగ రింతియకాక పరేంగితంబు
రామలింగేశ! రామచంద్రపురవాస!

సారమేయం బుట్టిచేరు ద్రెంపునుగాని
  పడకుండఁబట్టునే పాలకుండ
కోతి కొబ్బరికాయ కొనకెక్కి పడద్రోయు
  దానిజలంబులు ద్రావఁగలదె?
ముదుసలి పెండ్లాడి ముదితయౌవనము వ్య
  ర్థముజేయుఁగా, కేమి దానఁ గాంచు?
కాకి ముంగఱ నోరఁ గఱచి డొంకలపాలు
  గావించుఁగా కేమి గాంచు దానఁ?
జెడుగునరుఁ డొరుసంపద జెఱచుఁగాని
తనకు ఫల మేమి గలుగును తథ్య మరయ
నిందమాత్రంబు వానికి నిల్చు జగతి రామలింగేశ!

పదుగురు కోఁతివెంబడి సంచరింపరే
  వాహకు ల్లేరె శవంబులకును
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్
  కలిమి గల్గదె వారకామినులకుఁ
బులి గోవుఁజంపి నక్కలను బోషింపదే
  స్థూలకాయము లేదె దున్నలకును
పుప్పిపంటికి లేదె పుట్టంబుగట్టుట
  వేణుధరుం డెద్దువెంట రాఁడె
న్యాయపద్ధతి నడువనియవనిపతికి
నెన్ని చిన్నెలు గలిగిన నెందుకొఱకు?
అంతమునఁ జూడనలయు నా యయ్యసుఖము రామ...

శ్రీమంతు నాజ్ఞప్తి సేయఁ డొకండును
  బడుగునేరము లెన్నఁ బరుగులెత్తుఁ
దోఁటలు నఱికిన దోస మెన్నఁ డొకండు
  నడవిగొట్టకు మని యాజ్ఞ వెట్టు
సరదిగో ర్మంచినఁ జాటిచెప్పఁ డొకండు (?)
  తుప్పఁ గంటినవాని దోసమెన్ను
నమ్మగొల్చినవాని న్యాయ మెన్నఁడొకండు
  తప్పఁగొల్చినవాని తప్పుజెప్పు
నిట్టి పెద్దల కథికార మిచ్చినట్టి
రాజు ననవలెఁగాక దుర్ణయుల ననఁగ
నేమి పనియున్నయది సత్కవీంద్రులకును, రామలిం...

(రామలింగేశ శతకమునుండి)

# క్షేత్రయ్య

[17-వ శతాబ్ది]

## మువ్వగోపాల

**నాదనామక్రియ — త్రిపుట**

అయ్యయ్యో, వెగటాయెనే!
పయ్యెదమీఁదఁజేరి పవ్వళించియుండేసామికి॥ పల్లవి

వెలఁది నామోము తెప్పవేయక కనుగొన
కలయ నిండుసంజచీకటి గ్రమ్మితే
కలికి! నీముద్దుమోము కానరాకయుండునని
తెలిపి ప్రొద్దుండగానే దీపము తెమ్మనేసామికి॥ అయ్యయ్యో.

ననబోఁడి! వినుమమ్మ. నాపై చాలప్రేమచే
దనదంతమున నాయధరము నొక్కి—
మొనసి మాటాడితే మోవి విడువవలెనని
అనువ చేసైగ లాడుచుండే సామికి॥ అయ్యయ్యో.

మదిరాక్షి! వినుమమ్మ, మువ్వగోపాలుడు
నిదురించిన గాఁగిలి వదలీనని
పదరి శయ్యమీఁద దుప్పటికొంగులు నాలుగు
ముదముతో గట్టిగా ముడిగొనుమనుసామికి॥ అయ్యయ్యో.

**కాంభోజి — ఝంపె**

ఏమిసేయుదు, మోహమెటువలె దీరును?
భామినీమణిని ఎవ్వరు తోడితెచ్చేరు॥ పల్లవి

వెలయ నీదుముఖారవిందంబు లిఖియించి
అలరువాసనలు వ్రాయగనేరనైతి

కళలొల్కు—నీమోవి గడిసి వ్రాసితిగాని
నెలత తేనియలుంచ నే నేరనైతి ఏమిసేయుదు.

కలికి సొగసైన నీకనులు వ్రాసితిగాని
బెళుకుజూపులు వ్రాయ నిక మెఱుగనైతి
గళము రేఖలు దెలియగాను వ్రాసితిగాని
చెలగి కోకిలవంటి పలుకు వ్రాయగనైతి! ఏమిసేయుదు

తరుణిరో! నాగబంధమురీతి గలచుటలు
గరిమ వ్రాసితిగాని పరవశముచేత
పరగ మామువ్వగోపాల రారాయని
తిరుగ రతులకు బిలుచు కేలిక వ్రాయగనైతి! ఏమి...

(మువ్వగోపాలపదములనుండి)

## త్యాగరాజు

[18-వ శతాబ్ది]

## రామనామామృతము

**ముఖారి — రూపక**

ఎంతని నే వర్ణింతును శబరీభాగ్య — మెంతని । వే
దాంతలు వరకాంతలు జగ — మంత నిండియుండగ
ఎంతని నే వర్ణింతును.

కనులార సేవించి — కమ్మనిఫలముల నొసగి
తనువు పులకరించ పా — దయుగములకు మ్రొక్కి
ఇనకులపతిసముఖంబున — పునరావృత్తిరహితపద
మును బొందిన త్యాగరా — జనుతురాలిపుణ్యంబును
ఎంతని నే వర్ణింతును.

**కన్నడగౌళ — దేశాది**

సొగసుజూడ తరమా ? నీసొగసుజూడ తరమా ?
నిగనిగమను సుకపోలయుగముచే మెఱయు మోము
సొగసు జూడతరమా ?

అమరార్చితపదయుగము — అభయప్రదకరయుగము
కమనీయతనునిందిత — కామ ! కామరిపునుత నీ — సొగసు...

వరబింబసమాధరము — వకుళసుమంబులయురము
కరధృతశరకోదండ — మరకతాంగ వరమైన — సొగసు...

చిఱునవ్వులు ముంగురులు — మఱి కన్నుల తేటో !
వరత్యాగరాజ — వందనీయ ! యిటువంటి
సొగసుజూడ తరమా ? నీ...

(కృతులనుండి)

## దాసు శ్రీరాములు

[19, 20-వ శతాబ్దులు]

### స్మార్తులు

మోఁకాళ్లుదాఁటని మొరటుగావంచాల
  నందియందనిగోఁచి యంటఁదోఁపి
పిల్లగాలికిఁ దూఁగియల్లాడు చిన్నసే
  రెడుకాయవలె జుట్టు ముడియవైచి
నడునెత్తి పెడచెంప లెడనెడఁ గాన్పింపఁ
  దల నొక్కయంగవస్త్రంబుఁ జుట్టి
గీఱుగందపురేఖ తీరైననొసటిపై
  పసుపక్షతలచుక్క యెసఁగనునిచి
బెదరిచూచుచుఁ, బెఱవారి కొదిగికొనుచు
జందెపోఁగులు చిక్కువోఁ జమిరికొనుచు
నోట నొకబుక్క ముమ్మాఱు నొక్కియనుచు
శ్రోత్రియక్షితిదేవతాసుతుఁడు వెడలు.

ఉదయించుచున్న సూర్యునివంటి గుండ్రని
  ముతకకుంకుమబొట్టు మొగమునిండ
కొయ్యకరాటానఁ గొని వ్రేల మెదిపి రా
  చిన నూనెకాటుక కనులనిండ
అట్టిట్టు గదలాడునట్టి మేల్ముత్యాల
  ముక్కుపోఁ గొకప్రక్క మూతినిండ
గోటంచుతో బొద్దుకుట్టుకుట్టిన గట్టి
  పైఠిణీ మోఁచేతిపట్లనిండ
మాలనూలును చీరేల సాలెనేఁత
మూరగలిగిన దళముగాఁ బుంజమిడిన

మేలికమ్మె సొగసుచీరె మేనునిండఁ
బ్రియుఁ గదియుఁ దెల్గునాఁటి శ్రోత్రియవధూటి.

## నియోగులు

మెలిబెట్టి విడిచిన మీసాలపై గొప్ప
నిమ్మకాయలు రెండు నిలుపవచ్చుఁ
దేటగాఁ దెల్లగాఁ దెగగాలు లంకాకు
పొగచుట్ట జుంజురు బోల్పవచ్చు
నడువీధి రెడ్డిగాలిడి రచ్చదీర్పుచో
సివిలుజడ్జీలని చెప్పవచ్చు
నసదుగాఁ బొసఁగించి నొసటఁ బెట్టినబొట్టు
లొక్కమా ఉప్పని యూఁదవచ్చు
వడివడిగఁ జిన్ననాఁడైన వడుగునాఁడు
తడబడుచుఁ జెప్పికొన్నట్టి తప్పుసందె
ముక్క లొక నాల్గునిముసాల ముగియవచ్చు
బళిర యనవచ్చు లౌకికబ్రాహ్మణులను.

జ్ఞానాధిక్యము, శాంతి, యర్థిజనరక్షాదీక్ష, భూపాలకా
స్థానప్రాపితవైభవంబు, పటుమంత్రప్రజ్ఞయుఁ సంతతా
క్షీణం బుగ్గునఁబెట్టుఁ దల్లియె నియోగిబ్రాహ్మణశ్రేణికిన్
మానంబే నగ, మాటలే కవచముల్, మర్యాదలే భాగ్యముల్

## వైష్ణవులు

చీటికి మాటికి శ్రీమతే రామాను
జాయ నమో యంచుఁ జదువుసొగసు
నిరుపమభక్తిచేఁ బెరుమాళ్లను ఫిరాట్టు
దిరువడిఘుళ్ గొల్చి యెఱఁగు సొగసు
సారెసారెకుఁ దిరువారాధనంబులఁ
దిరువాయిమొడి నోటఁ దెలుపు సొగసు

జ్ఞానులఁ గని 'యడియే నడియేను దా
 సోహ'మ్మనుచుఁ బల్కునట్టి సొగసు
పరగఁ బన్నిద్దఱాళ్వార్లఁ బరమభక్తి
మించి తిరుమంత్ర మొసర సాయించు సొగసు
పొగడుచో వేయునోళ్లకు మిగులుఁ గొంత
వైష్ణవబ్రాహ్మణులదె దైవప్రపత్తి.

తిన్నని సన్నని తిరుచూర్ణరేఖ
తీరుగాసొరుగా దిద్దినమోము
మిన్నగానున్నగామెఱుగారదువ్వి
మేలుగావీలుగామెలచినకొప్పు
చిన్నారిపొన్నారిచెమరెత్తుచున్న
సిరిగుల్కునెఱిదళ్కుచెక్కుటద్దములు
వన్నెతోఁజిన్నెతో వరునిమెప్పించు
వాసిగాదాసిగా వైష్ణవయువతి.

సారణి మీటుఁ గిన్నెరలసాటిగ సన్ననిగొంతులెత్తి శృం
గారముమీఱ రాగములుగాసరిగాఁ బెరుమాళ్ళసన్నిధిన్
హారతులిచ్చువేళల యొయారము వైష్ణవపమ్మవారలం
గారలదేసుమీ మధురగానము దమ్మిళపేశితోడ్పడన్.

## మాధ్వులు

కడుఁ జెల్వమగుబెండకాయబొట్టు మొగానఁ
 దతగంధముద్రాంకితములు మేన
మడచితీర్చిన జరీమధిరయోణి బుజాన
 వెలగలయుంగరాల్ వ్రేళ్లపైన
నపరంజివిడికడియము మణిబంధాన
 పగడాలసరము చొప్పడు గళానఁ
బట్టంచుదట్టంపుఁ బలుతీకు పుట్టాన
 మేలుముత్యాలతమ్మెట్లుతోన

దస్త్ర మపసవ్యమునఁ, గలందాను సవ్య
భాగమున నుంచి, కలము చేపట్టి గోవ
కాగితంబులపొతక ప్రోఁకాల నునిచి
ఫరదు బరపర వ్రాయు వేపారిఁ గంటె?

ఒఱపైన వలిపెంపుఁజెఱఁగుగోచీకట్టు
తాటిముచ్చికవంటి తాళిబొట్టు
చేతుల నపరంజి చిన్నారిపోచీలు
మేలైనమెడఁ బిరికీలసజ్జ
కడుఁదీవినడుమున గంటలమొలనూలు
నెఱిగుల్కుదమ్మోలఁ గరణిపూలు
పదయుగంబున వెండిపాంజేబులందెలు
బటువుగుబ్బల బిగిపైఁటిణీయు
కలిగి బంగారుకీల్బొమ్మవలెనె హంస
గమనమున మెల్లఁగఁ బడకగదికిఁజేరి
యలరి పతితోడఁ జెండ్లాటలాడి యిష్ట
భోగములఁ దేల్చు వ్యాపారిపూవుఁబోఁడి.

## గోల్కొండ వ్యాపారులు

ఎలమిఁ జీపురువట్టి యిల్లూడ్చునపుడైనఁ
బోసీరు తలఁజుట్టుపూలమెఱుఁగు
అసదుగా జలకంబు లాడువేళలనైనఁ
బోసీరు నునుగొప్పునూనెమెఱుఁగు
మడిగట్టి వంటకా ల్కడతేర్చునపుడైనఁ
బోసీరు తోడవుకడానిమెఱుఁగు
నాయకాలింగనోన్నతసౌఖ్యమందైనఁ
బోసీరు కొంతైన మేనిమెఱుఁగు
తనులతాచారుతాశుచితావిభూష
ణాంచితాంగవిలాసతావాప్తి నతుల

మతుల సుకృతుల కృతచమత్కృతుల గోల
కొండవ్యాపారిసతులఁ జేర్కొనఁగఁజనదె.

## శైవులు

కాయము భూతిభూషితము, కర్మము తీక్ష్ణము, దుర్గమంబు న
త్యాయతి, నంతరంగగుణ మద్భుతమైన శిలం గరంగఁగాఁ
జేయు, జగత్తమంబుపసఁ జించు మహామహిమంబు భాను లె
క్కాయనుఁ; గంటిరే నివురుగప్పినవిప్పులు శైవభూసురుల్.

సూత్రమ్మునకు లింగసూత్రమ్ము సహకారి
  పొసఁగు కుంకుమకు విభూతితోడు
కరకంకణములసంగాతముల్ దోరముల్
  ధూపగంధము గంధలేపసఖము
అవతంసభూషాసహాయంబు తొగరేకు
  రహిపదంబులకుఁ బారాణి నేస్తి
కొనచెవిబొగడల కనుఁగు మారేడుపత్రి
  గోళ్లకు గాదిలి గోరటాకు
భక్తిమహిమకు నఱచూపు ప్రాపుసుమ్ము
శాంతభావంబు మందహాసంబు ప్రియము
ఉక్తిమృదుతకు శివనామ ముపపదంబు
వాసిగను లింగధారమ్మవారలకును.

( తెలుగునాడునుండి )

## దేవులపల్లి సుబ్బరాయశాస్త్రి

[19, 20 శతాబ్దులు]

### గ్రీష్మర్తువర్ణనము

అట్టియెడ నెట్టకాలము
బెట్టిదముగఁ దోఁచె మన్ను బిట్టగసి చదల్
ముట్టఁగ వడి సుడిగాడ్పులు
నెట్టన నెట్టుకొని వీవ నిఖిలావనిపై.

పూఁట కొక్కొక నూఁతినీట డప్పియడంచు
కొనె దవ్వుచని దెచ్చికొని జనంబు
వెలఁబెంచి పానీయవిక్రేత లింటిబా
వుల క్షారనీరముల్ గలిపిదెచ్చి
రనుదినంబు మడుంగులను దెచ్చియిడు చాకి
నాలుగైదాఱేడునాళ్ళ కొసఁగెఁ
గ్రుంకులాడఁ గొలంకు లింకఁ బాఱుట శ్రోత్రి
యులకు వేళలఁ దాన మొదవకుండెఁ

గరటచటకాదికంబైన గ్రామ్యపక్షి
జాల మిలుసొచ్చి బెదరక జనులనడుమ
కుంభసంభృతజలములఁ గ్రోలఁజొచ్చెఁ
బుడమి నొదవిన నీటియెద్దడికి నపుడు.

తొలుత వ్రాల్చినప్రక్క నులివెచ్చఁదన మెక్క
నొండొకప్రక్కకు నొత్తిగిలుచు
వ్యజనసమాకర్షకజనంబు సెయిమార్చు
కొనినంత హుంకృతిఁ గినుకవడుచు
వారియంత్రపుసూక్ష్మధార లిట్టటు గాలిఁ
దెరలిన నఱచూడ్కిఁ దెఱచికనుచు

నిదురఁదోఁగె నటంచు పదములొత్తు భుజిష్యు
  లూరకుండిన నంఘ్రు లూఁపుకొనుచు
వలపుఁబన్నీరు చిలికిన చలువవలువ
సెజ్జ, లామజ్జకప్రతిసీర లెసఁగు
నిడుదగుమ్రాల చుట్టుపందిళ్ళయిండ్లఁ
బవలు పొరలాడు సామంతనివహ మపుడు.

వాతూలతూలతల్పము పొల్పుసవరించి
  శౌరిఁ జొక్కించు దాసేరకుండు
ఘనఘటావళినీటఁ గర్షకుల్ దనియంగఁ
  గలమాంకురము వెంచు పొలముకాఁపు
హరిపదంబునఁ గాఁపు దిరుగు కల్వాలదాయ
  వంతుమార్చెడు దళవాయిపెద్ద
కడలియింటికి ధునీకన్యలఁ గై సేసి
  తొలిసారి యంపించుఁ గులగురుండు

తోఁచె గ్రీష్మావసాన ముత్తుంగసౌధ
జాలబహిరంగణాప్రదోషప్రభాత
విచరదూష్మార్తదంపతీవిస్తృతాతి
దృఢపరీరంభపునరుపదేష్టయగుచు.

(మహేంద్రవిజయమునుండి)

## వడ్డాది సుబ్బారాయుడు

[1౮, 20 శతాబ్దులు]

## భక్తచింతామణి

జననీగర్భములోన నుండఁగ విదేశం బేగి, పెక్కేండ్లకున్
జనుదేఁ దండ్రినిగాంచుబిడ్డవలె నీసంబంధమున్ ముందు నే
గన కీవేళ నెఱింగి, స్నేహభయశంకాముత్త్రపాశ్చర్యభా
జనమై నిల్చితిఁ జేరదీసికొనవే సద్భక్తచింతామణీ!

క్షేత్రస్వామిని జూడ కుబ్బి పశువుల్ చేన్మేయఁబడ్డట్లు మా
నేత్రాదీంద్రియముల్ దురాశలను దుర్నీతిం బ్రవర్తించు, వి
శ్వత్రాణుం బరమాణురూపు నిను గాంచన్ లేక నిర్దోషచా
రిత్రా! నన్ జెఱబెట్టకే కరుణఁ దండ్రీ! భక్తచింతామణీ!

పిన్నం గారడివాఁడు వింతగ మహావేణ్వగ్ర మెక్కించులా
గెన్నన్ మానవజన్మ ముత్తమము న న్నెత్తింపి తీ వజ్ఞ; న
న్నన్నా! హానికరంబు సుమ్మిది మహాత్మా! కాచి యెట్లుం జెదో
నిన్నే నమ్మికయున్నవాఁడఁజుమి తండ్రీ! భక్తచింతామణీ!

అన్నంబం, దుదకంబునందు, గృహాశయ్యాయానపీఠంబులం
దు, స్నానాపిధలీలలం, దఖిలమందున్ మృత్యువే తోఁచు నో
యన్నా! మాకు నిమేషమున్ బ్రదుకశక్యం బే స్వశక్తిన్ భువిన్
న న్నీవే బ్రతికింతు రేవగ లనంతా! భక్తచింతామణీ!

గూటం బిచ్చుకకందు వెల్లపు డనుంగుందల్లి ధ్యానించుచున్
బ్రోటి న్విచ్చు న దేమి తెచ్చినను సంతోషంబు విశ్వాసమున్
బాటిల్లంగను; నట్లు నీయెడల మద్భావంబు గావింప ని
ష్కౌటిల్యాత్మతఁ గొల్తు నిన్నుదయ మీశా! భక్తచింతామణీ!

ఎరకుం బిల్లలఁ దల్లికోడివలె మ మ్మొందేఁ బగల్ ద్రిప్పు దీ
శ్వర! మేలోర్వక మాయగ్రద్ద యెడబాపంజూచెడిన్నమ్ముఁ;ద
త్ఖరపాదాహతి సోఁకకుండ నను ఱెక్కల్ గప్పి కాపాడ నీ
చరణద్వంద్వము నాశ్రయింతును సదా సద్భక్తచింతామణీ!

పరదేశంబున కేగుచుం జనుఁడు యావద్వస్తుసామగ్రియుం
బరమస్నేహితుచేతి కిచ్చిచను విశ్వాసంబుచే; నట్లు ని
ద్దురవోనుండిన నేను నా తెలివియున్ స్థూలంబు సూక్ష్మంబు నీ
కరమం దుంచితిఁ జింత లేదు మది కింకం భక్తచింతామణీ!

తెలివిం వీనిని వాడుకొమ్మనుచుఁ బ్రీతి న్నీవు నాకిచ్చు వ
స్తుల నే నిద్దురవోవుచుం మరల నిచ్చో నీకు నర్పించితిన్
వెలహెచ్చైనవి పాడుచేసితని వాని న్నీవె కైకొందొ? వ
త్సలతం వెండియు బాగుచేసి యిడుదో సద్భక్తచింతామణీ!

బడలెన్ మే,నఖిలేంద్రియంబు లలసెం, బ్రాణంబు లాయాసముం
బడె, గొండంతలు బర్వులై నిలక ఱెప్పల్ వాలెడుం, రేణువుల్
పడినట్లాఁ గనులుం, జగంబు మఱచుం స్వాంతంబు, వాకుల్ తడం
బడెడుం, బూనెడు నిద్ర నం శరణు దేవా భక్తచింతామణీ!

నాలోనాకె మహాద్భుతంబగు జగన్నాథా! త్వదీయక్రియల్
నేల న్నూతనసూక్ష్మబీజమువలెన్ నీ వూహ నాయందు నుం;
తేలాగౌనది ముం దెఱుంగ,_నది యట్టే నీకృపం బద్యమై
వ్రాలుం జక్కనిపూలమొక్కవలె దేవా! భక్తచింతామణీ!

( భక్తచింతామణినుండి )

## గురుజాడ వేంకట అప్పారావు

[19, 20 శతాబ్దులు]

### క న్య క

తగటు బంగరు చీరె కట్టి
కురుల పువ్వుల సరులు జుట్టి
నుదుట కుంకుమబొట్టు పెట్టి – సొంపుపెంపారన్

తొగలకాంతులు కనులు పరపగ
మించుతళుకులు నగలు నెరపగ
నడక లంచకు నడలు కరపగ
కన్నె పరతెంచెన్ – రాజవీధిని.

పసిడి కడవల పాలుపెరుగులు
పల్లెరమ్ముల పళ్లుపువ్వులు
మోములందున మొలకనవ్వులు
చెలగి చెలికత్తెల్ – వెంటనడిచిరి.

అంత పట్టపురాజు ఎదురై
కన్నెసొగసుకు కన్నుచెదురై
మరునివాడికి గుండెబెదురై – ఇట్లు తలపోసెన్.

‘ఔర! చుక్కలనడుమ చందురు
నట్లు వెలిగెడు కన్నెముందర
వన్నెగాంచిన నగరిసుందరు – లంద రొకలెక్కా ?

పట్టవలెరా దీని బలిమిని
కొట్టవలెరా మరునిరాజ్యం
కట్టవలెరా గండపెండెం – రసికమండలిలో.’’

నాల నడామను నట్టి వీధిని
దుష్టమంత్రులు తాను పెంచెం
గట్టి కన్నెను చుట్టి నరపతి – పట్టనుంకించెన్.

ముట్టివచ్చిన దైవగతి కిక
దైవమే గతియని తలంచుక
దిట్టతనమునుబూని కన్నియ – నెట్ట నిటు పలికెన్.

"ముట్టబోకుడు, దేవకార్యం
తీర్చి వచ్చెద, నీవు పట్నం
యేలురాజువు, సెట్టికూతుర, నెటకు పోనేర్తున్"

చుట్టములు తనచుట్టు నిలువగ
భృత్యవర్గం కాచికొలవగ
సెట్టి కరములుమోడ్చి రాజుకు – ఇట్లు వినిపించెన్.

"పట్టమేలేరాజ! బలిమిని
పట్టవలెనా? నీదు సొమ్మే
కాద కన్నియ? నీవు కోరుట
కన్న మరి కలదా? – వైశ్యజాతికి వన్నె?

కాని మన్నన జేసి మమ్ముల
బంధువర్గం, కులంపెద్దల
ధర్మమన్నది అరసి కొంచెం – దారి కనపడితే.

అగ్నిసాక్షిగ కన్నెగైకొని
ఆదరించుము మమ్ము, కానుక
లందుకొమ్మంతెంత వలసిన – మనుచు మాజాతిన్".

నవ్వి హేళన నవ్వు, నరపతి
పల్కె– "నోహో! ధర్మమార్గం
పట్టమేలే రాచబిడ్డకు - సెట్టి గరపడమా!

రాజు తలచిందేను ధర్మం,
రాజు చెప్పిం దెల్ల శాస్త్రం,
రాజులకు పేరైనపద్ధతి—కాద గాంధర్వం ?

తడవుచెయ్యక తల్లడిల్లక
నేడురేపని, గడువుపెట్టక,
నెమ్మిగోరితివేని, కన్నియ
నిమ్మ !— లేకుంటే, పొమ్మ !

డేగ, పిట్టనుపట్టి విడుచున ?
కన్నె, యింటికి మరలినడుచున ?
తెమ్మ, కానుకలిమ్మ, నీవిటు—వచ్చినందాకన్.

కదల'' – నంతట సెట్టి పలికెను,
దేవకార్యం ముందు, ఆవల
రాచకార్యం కాద రాజా !— సెలవు నీ విస్తే—

యింటిదైవం వీరభద్రుడి
దేవళానికి పోయి యిప్పుడె
పళ్లెరంసాగించి వత్తును— పైని తమచిత్తం !''

''మంచిదే, మరి నడువు, మేమును
తోడవత్తుము, దేవళంలో
అగ్నిసాక్షిగ కన్యకను మే– మందుకొనగలము.''

నాడు గుడిలో మండెగుండం
మంట మింటిని ముట్టియాడగ
కన్న నరపతిగుండె దిగులై– పట్టువిడజొచ్చెన్.

భక్తిపరవశమైన మనసున
దుర్గ నప్పుడు కొలిచి, కన్యక,
ముక్తి వేడుచు వూడ్చి నగలను— శక్తి కర్పించెన్.

దుర్గకోలనున గ్రుంకి పిమ్మట
రక్తగంధం రక్తమాల్యం
దాల్చి, గుండంచుట్టు నిలిచిన— జనుల కిట్లనియెన్
"అన్నలారా, తంద్రులారా!
ఆలకించం డొక్కవిన్నప
మాలుబిడ్డల కాసుకొనుటకు
ఆశలేదొక్కొ— కులములోపల?
పట్నమేలేరాజు అయితే
రాజునేలే దైవ ముండడొ?
పరువునిలపను పౌరుషము మీ – కేల కలుగదొకో?
విద్యనేర్చినవాడు విప్రుడు
వీర్యముండినవాడు క్షత్రియు
డన్న పెద్దల ధర్మపద్ధతి – మరచి, పదవులకై
ఆశచేయక, కాసువీసం
కలిగివుంటే చాలుననుకొని
వీర్యమెరగక, విద్యనేర్చక,— బుద్ధిమాలినచో
కలగవా యిక్కట్లు? మేల్కొని
బుద్ధిబలమును బాహుబలమును
పెంచి, దైవమునందు భారం – వుంచి రాజులలో
రాజులై మనుడయ్య!" ఇట్లని
కన్య నరపతి కప్పు డెదురై
నాలుగడుగులు నడచి ముందుకు – పలికె నీరీతిఁ.
"పట్టపగలే నట్టవీధిని
పట్టబోరే జారచోరులు
పట్టదలచితి వింక నీ వొక – పట్నమేలేరాజువట!
కండకావర మెక్కి నీ వీ
దుండగము తలపెట్టినందుకు
వుండడా వొకదైవమంటూ – వుండి వూర్కొనునా?

కులంపెద్దలు కూడిరదుగో!
అగ్నిసాక్షికి అగ్ని అదుగో
కన్నుగోరిన కన్నె యిదుగో! — జాలమేలొక్కో ?

పట్నమేలేరాజు వై తే
పట్టు నన్నిపు'' డనుచు కన్యక
చుట్టి ముట్టిన మంటలోనికి — మట్టి తా జనియెన్.

పట్నమేలే రాజుగర్వం
మట్టిగలిసెను, కోటపేటలు
కూలి, నక్కల కాటపట్లై — అమరె.

యెక్కడై తే కన్య మానం
కాచుకొనుటకు మంటగలిసెనొ,
అక్క డొక్కటి లేచె సౌధము — ఆకసముపొడుగై .

పట్నమేలేరాజు పోయెను,
మట్టికలిసెను కోటపేటలు,
పదం పద్యం పట్టినిలిచెను — కీర్తులపకీర్తుల్.

( ముత్యాల సరాలనుండి )

## పానుగంటి లక్ష్మీనరసింహరావు

[ 19, 20 శతాబ్దులు ]

### రాధ

మెఱుగుగుండలముల మిసమిసల్ గండభా
  గములపై నట్టిట్టు గంతులిడఁగ
రంగారుకటినుండు బంగారుపుట్టంబు
  చిఱుబొజ్జనుండి కొంచెముగ జాఱ
పవనపూరణమున జవుజవ్వమని లేఁత
  బుగలు బూరెలై పూరటిల్ల

నిగనిగల్గల గుజ్జుసిగనున్న శిఖిపింఛ
  మొయ్యారమునఁ దలయూఁపుచుండ
ఉత్తమోత్తమజన్మమై యొప్పుమురళి
నధరమున మోపి జలుజల్లుమనఁగ జగతి
గానమును జేయు కల్యాణకాంతులొలుకు
నీదువదనంబు జూపింపు నీరజాక్ష!

వ్రేతలుగ్రుచ్చిన వివిధప్రసవమాలి
  కాతతి సిగజుట్టుగలుగువాఁడు
ఒకచేత మురళి, వేఱొకచేత నవనీత
  కబళ మింపులుగుల్కఁ గలుగువాఁడు
మీఁగడజిడ్డుల మెఱుగారు లేఁతచె
  క్కుల మందహాసంబు మొలచువాఁడు
జ్ఞానికైనను నందగారాని చిఱుపాద
  ములను బంగరుగజ్జె లలరువాఁడు
పుట్టతేనె, రాధమోవియు నొకరీతి
నొడిసి బళియని తలయూఁపువాఁడు
నిట్టి లేఁతవాఁడు బృందాధినాథుండు
ప్రభుఁడు గురుఁడు ప్రాణపతియు నాకు.

ఆత్మతోడుత నాదేహ మర్పణంబు
నీకుఁ జేసితి; నాయాత్మఁ జేకొని, యొడ
లిచట విడిచితి; వార్తిఁ గృశించునాఁడు
తనువు బరువయ్యె నో అగోద్ధరణదక్ష!

కడువడి నడచుచోఁ గాళ్ల కడ్డంబైన
  కుచ్చి ళ్లెడమచేతఁ గూర్చిపట్టి
వలెవాటుపైఁట శాఖలఁ దాఁకునని సువ
ర్ణోత్తరీయము కటి నొత్తిచుట్టి

సర్వలోకాభయచణమైన కర ‘‘మాగు మే
వత్తు’’ ననినట్టు లిటులు చాఁపి
చెవినున్న చెంగల్వఁ జేరి ఝుమ్మనుభృంగ
మును శిరఃపరికంపమున నదల్చి
ఘల్లుమనఁగను మొలనూలుఘంటికలును
కాళ్ల గజ్జెలు మొఱయ భక్తప్రలాప
సంశ్రవణసంభ్రమచ్ఛన్నసస్మితుఁడయి
దివ్యమంగళమూర్తి యేతెంచు నదిగో!

(రాధాకృష్ణ నాటకమునుండి)

## శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

[19, 20 శతాబ్దులు]

### వసంతోద్యానవనము

చిరకాలాప్తవనాంగనావిరహముం జిత్తంబునన్ సైపలే
కురుసంతాపమునున్ వెలార్చుటకునై యొండొక్కచోనుండి స
త్వరుఁడై సర్వవరూథినీసహితుఁడై ప్రద్యుమ్నుడుం దోడురా
సరగన్ మాధవుఁ డేగుదెంచి కదిసెన్ క్ష్మామండలంబంతటన్

మావిపూఁదేనెల మత్తిల్లి యలిగాయ
కాళి సుస్వరముల నోలిఁబాడె
శుకశారికాదిసచ్ఛకునసంతానమై
తాళికాళి ఘనశబ్దములఁ బలికెఁ
జివురాని జివగల్గి చిరరవంబున వన
ప్రియకోటి కాహళిఁ బ్రీతిఁబట్టె
ఱెక్కలల్లార్చుచు నొక్కొటఁ గొలఁకుల
హంసకాంతాళి నాట్యంబులాడె

అట్టి యామని సంతసమావహిల్ల
మన్మథోత్సాహజనకుండు మాధవుండు
సొగసులకునెల్లఁ దానకమగుచు నెపుడు
వెలయుచున్నట్టి వనలక్ష్మిఁ బెండ్లియాడె...

పసపుంబయ్యెద లొప్పు పుష్పాడిగముల్, పాలిండ్లు పూగుత్తు,లు
ల్లసదంగంబులు ప్రాఁకుదీవలు,కురుల్ పైనాడు తేం,ట్లంఘ్రులుఁ
గిసలంబుల్, నగవుల్ సుమంబులగుచుం గీర్తింపనై యొప్పుచుఁ
బసమీఱు న్వనలక్ష్ములు న్వనితలు న్వార్తింతు రేకాకృతిఁ.

తమగాత్రములఁ గావఁదగు పత్రముల దుల్చె
  నని కారుపై నీసునాని వనఁగఁ
దమమనోహరునితోఁ దమిఁ గూడుకొనఁగల్గె
  నని కెంపుజీరలు గొనియె వనఁగఁ
దమకు నొండొరుల కుత్సవసమయంబని
  కొని కుంకుమముఁ జల్లుకొనె వనంగఁ
దమకు నాథునితోడ సమయకేళిలభించు
  నని సీధురసము ద్రావిన వనంగ

నఖిలధరణీతలంబున నావరించి
లేఁజిగురు జొంపములతోడఁ దేజరిల్లి
కన్నుపండువు గావించుచున్న వెన్న
వివిధతరుగుల్మములతోడఁ దవిలి వనులు.

వానకాళ్లకు దీటువచ్చి చక్కఁగనున్న
  పోఁక ప్రూఁకులతోడ జోక మిగిలి
కుతపవేళల సూర్యు నతిథింబలె న్మెత్తిఁ
  గొను నారికెడముల గొనబు మిగిలి
అతను తూఁపులప్రోవు లన నాఁకు గనరాక
  పూచిన మావుల పొలుపు మిగిలి

అమృతసోయను విమలామృతంబున నొప్పు
  కేళాకుళులతోడ లీల మిగిలి
మల్లెలును మొల్లలును జాజు లెల్లకడలఁ
బొదలఁ, బొగడలుఁ బొన్నలుఁ బొలుపు మిగుల
నందనోద్యాన మిదియను చందమునను
బరగుఁ బ్రమదావనము కన్నుపండువగుచు.

( మధుకరవిజయమునుండి )

## తిరుపతి వేంకటేశ్వరులు

[ 19, 20 శతాబ్దులు ]

### నదీతీర సమాగమము

ద్రాఙ్నదీతరణతంద్రాళుపాంథాహూత
  నావికప్రతివచోరావకంబు
ఆనీయమానమీనాకులీభవదనే
  కానాయకరధీవరాకులంబు
అంతరీపాగతానంతగోగోపాల
  కాయస్రవద్వారికణగణంబు
వికసత్కుసుమపుంజవిహారమాణనవీన
  మలయమారుతపోతమానితంబు
అపరరోధోవిహారాగతాసమాన
హంసమిథునావలోకనాహూయమాన
హాలికాన్యోన్యభాషణవ్యాకులంబు
చేతము గరంచు నొక్క ధునీతటంబు...

అన్నదీతీరసౌభాగ్య మరసికొనుచు
మోదమందుచు నమ్మధుసూదనుండు

తా నొకఁడ యేఁగుచున్నయత్తతిని బాల
వెనుకఁ జనసాగె నిది వేళయనితలంచి.

తననవ్వుకన్నఁ జక్కని తెల్పుగల చల్వ
  కండువా బుజము చక్కటి నటింపఁ
దనమేనికన్న మెత్తనిక్రొత్తమల్లెపూ
  వులు వేణినుండి జల్లులనిరాలఁ
దనకాంతికన్న హెచ్చననొప్పు బంగారు
  మొలనూలు కటిమీఁద మొనసియాడఁ
దనమోవికన్న నెఱ్ఱనిరంగుగలగాఁగ
  రా పదమ్ములమీఁద రంగులీన

వలపుచిగురింపఁ, గోర్కెలుతొలకరింప
మనము పెనఁగొన, సందియంబినుమడింప
నతని గనుఁగొను వేడుక లలవరింప
దత్క్షణమ యేగె నంతికోద్యానమునకు.

అట్లు చనుదెంచిన బాలవేశ్యంగాంచి మధుసూదనుండు.

"ప్రొద్దుక్రుంకెను చీకటుల్ పొసఁగనాయెఁ
బొలుపుమీఱఁగ భూషణభూషితాంగి
వగుచుఁ దోడింతలేక యుద్యానమునకు
నేలవచ్చితి? పనిబూని బాలసాని!"

ఇట్లు స్మితపూర్వకమ్ముగా నడిగిన నాకన్నెయు,

"వెండియు రేపె వత్తుమని వేగిరపాటున గంటయైనఁ గూ
ర్చుండక యల్లనాఁడు పనియున్నదటంచును నేగి, మీరు రా
కుండుటఁ జేసి మిమ్ము గన నొయ్యన నొంటిగ నేగుదెంచితిన్
పండితులైనవారల కబద్ధములాడుట భావ్యమేకదా!
నాఁడు మాయమ్మతోడ మీరాడు యుక్తు
లకు సదుత్తరములు చెప్పుటకు నొకింత

దలఁచియును మిన్నకుంటి మాతల్లిఁజూచి
వెలవెలందులపోం దంత వెక్కసంబె ?

సంపెంగబోలు పుష్పము గల్గునే యొక్క
  తేఁటి కయ్యది వెనుపోటుగాక
తుహినాంశుబోలు వస్తువు గల్గునే
  పద్మలతలకు నైధనతారగాక
మొగలిబోలెడి దళమ్ములు గల్గునే
  కాలగళునకు షష్టాష్టకంబుగాక
గానమ్మువంటి సత్కల గల్గునే వేద
  విదుల కయ్యదియుఁ జుక్కెదురుగాక

వలచి వలపింపఁగల్గిన వారముఖ్య
వంటి వగలాఁడి కల్గునే వనితలందుఁ
దమమదికి వేఱురీతిగాఁ దట్టెఁగాక
భూమిసురరాజ ! కవితాసతీమనోజ !

అతికఠినప్రయాసమున నార్జనచేసిన కామశాస్త్ర మే
గతిఁ జరితార్థమౌను ? కులకాంతలయం దది కూడదంచు నా
రతికలయే వచించుఁ, బరరామల కంతటికాల మబ్బునే ?
వితయగుఁగాదె లక్షణవివేకము లక్ష్య మెఱుంగకుండినన్.

అడియ నని కోరుచున్న
ప్పుడు కాదనఁబోరు వైష్ణవులు; తొండరడి
ప్పొడి యాళ్వా రొక మా వెల
పడఁతిం గొన బ్రహ్మరథము పట్టరె జియ్యల్ ?

సిద్ధమయినట్టి యన్నంబు, చేతికంది
నట్టి పరిపక్వఫలమును, అంగనామ
ణిప్రథమయౌవనంబు పండితు లుపేక్ష
సేయఁగారాదు, చేసినఁ జెడును మీఁద.''

అనుచు నొకమాట కొకమాట కతుకకుండఁ
బల్కు, దరహాస మొనరించుఁ బైఁట జార్చు
మనములోఁ గోర్కె వెలిజేయుమనుచు మరుఁడు
ప్రేరణము సేయ నాపఁగా నేరితరము.

(శ్రవణానందము నుండి)

## యశోధరావిలాపము

ఇట్లు చెన్నుండు రాజగృహంబుం బ్రవేశించి, కంటకంబు న్నిజాధిష్ఠానంబునం గట్టిపెట్టించినంత నదియుం బృష్ఠదేశం బదల్చుచు రాజపుత్రవిరహవేదనాసూచకంబుగ బిట్టు సకిలించినఁ దదారావంబునకు,

తొలకరివారివాహములతోయము వెల్వడి యేగుదెంచుచం
చలలతెఱంగునన్ గృహము చయ్యన వెల్వడి చెల్వలందఱున్
బిలబిల నేగుదెంచి ధరణీవరసూనునిరామి మోములున్
వెలవెలఁబాఱ మూర్ఛిలిరి వేఁడికిఁ గందినతీవ లట్లుగన్...

జననిం బాసిననాఁటఁగోలెఁ గడువాత్సల్యంబుతో నెత్తిపెం
చిన యారెండవరాజపత్నియు శితాసిచ్ఛిన్నమైపడ్డ లే
యనఁటింబోలెఁ బడెం గుమారవిరహాయాసంబుచే, లేఁగకుం
దనకుం గూడికలేని యావుగతి వత్సాయంచు వాపోవుచున్.

తొలఁకుగన్నీరుగల వెలందుకల యాన
నములకతమున నారాచనగర మపుడు
వానచినుకులు రేకులపైన జాఱు
తమ్మిపూలున్న కొలనుచందమునఁ బొలిచె.

ఎడమఱి చందిరంబులయి వృత్తములై పొలకండగట్టి క
న్పడనినరంబులున్, నగలుబాసినవ్రేళులు గల్గుచేతులం
దడబడ ఱొమ్ము బాదుకొను తామరసాక్షులకీతి జూడఁజొ
ప్పడెఁ బవమానధూతనిజపల్లవతాడితవల్లికాకృతిన్.

మారుతాహాలకములకట్లలశవాన
చక్రమిథునంబులైన నిర్ఝరిణులట్లు
పరగి రిరుగేల ఱొమ్ముల బాముకొనుచుఁ
గదలు చన్గవగల్గిన కాంత లపుడు.

ఇట్లు మందురకడ కరుదెంచి; రంత యశోధరయు,

కుచములమీఁదికుంకుమపూఁత బురదగాఁ
  గరఁగించి కన్నీరు కాల్వగట్ట
నిష్కారణక్రోధనిర్వాహకములైన
  కొలికికన్నుల నల్లగుమ్మరింప
వెనుదీయఁగారాని వేఁడినిట్టూర్పుల
  వలుఁదచన్నుందోయి వాడుదోఁప
పొంగుపొంగునవచ్చి పొరలు వల్వానివంత
  గదియించి కంఠగద్గదిక జూపఁ
గంపమునఁ గాలుచేయు గడ్డడవణంక
నిముషమైనను నొకచోట నిలువలేక
కాంత లందఱు విలపించుకడకు వచ్చి
కంటకముఁ గాంచి యిట్లనెఁ గరుణ మొలుక.

"ఒడలెఱుంగని నిద్రలో నున్నవేళఁ
జనియె నాప్రాణనాథుండు నను మొఱంగి
యీవుఁ జెన్నుండు వచ్చితి; రేల రాఁడు
నాప్రియుఁడు? చెప్పుమమ్మ కంటకముకాన!

నడునిశ బాన్పుమీఁదఁ గరుణామయుఁడై నిదురించువాని, రా
బుడుతను బుద్ధిలే కడవిమోకలపా లొనరించివచ్చియుం
బుడిబుడియేడ్పు లేడ్చుచును బొంపిరివోవువిచారమున్న త
త్తడివలె నిత్తఱిం బ్రతిపదంబునఁ బొత్తున మోసపుత్తువే.

సకిలింపకు, కన్నీరిఁకఁ
బ్రకటింపకు, నీదుకోర్కె పండెంగద, నా

యకు నెడపితి వింతటికం
టకమా నామీఁద నక్కటా కంటకమా!

మగటిమిలేని యీ తెలివిమాలినకృత్యము జేసి, యిప్పు డి
ప్పగిది నరేంద్రసద్మ మద్రువన్ సకిలించిన నేమిలాభ? మ
మ్మంగలవిభూషణంబు ధృతిమంతుని దోడ్కొనిపోవువేళ నీ
మొగమున ముల్లునాటెనె? ప్రబోధమొనర్పకపోతి మమ్ములన్.

తెలివలు బరిచారిక లం
దాఱు గూర్కినవేళ నామనోరథమును నొ
ప్పరికించి మ్రుచ్చిలఁగ నే
ర్తైఱ నీమది కెట్లు సంఘటిల్లెను బాబా!"

అంతఁ జిరకాలపరిపోషణానుయాత్రప్రేమావేశంబు మరల్పలేక గౌతమియనురాజపత్ని యిట్లు విలపింపఁదొడఁగె.

నీలములై, సమంబులయి, నిగ్గులుదేఱి, దళంబులై, పృథ
ఙ్మూలములైన నీకురులకున్ నృపనందన! మంచిగందపుం
దైలమురాచి దువ్వి, పువుదండలు దారిచి, మేలుసేయఁగాఁ
బోలునుగాని యిప్పగిది ముండనముం బొనరింపఁబోలునే?

మేలుకడానిబోని నునుమేనిసొగంగు, వెడందఱొమ్ము, మోఁ
కాళుల కంటుచేతులచొకారము, సింగమువంటిలావునుం
గీల నడంచుకుత్తుకయు, గిత్తకనుంగవవంటి కన్నులుం
గ్రాలునరేంద్రసూతి కటరా! విధి వ్రాసె వనప్రచారముల్.

నీవు ప్రోవంగఁదగినపున్నెంబు లేమి
వసుధ నిక్కము దురదృష్టవంతురాలు
జగతి నెంతటిపున్నెంబు సలుపకున్నఁ
బ్రజకు దొరకునె నీవంటిరాజు కొడుక!..."

అనుచు నెల్గెత్తి బిట్టురోదనముసేయు
గౌతమిం గని తక్కినకాంత లెల్లఁ

మందానిలచ్యవమానమరందబిందు
భరితకుసుమంబులై నట్టి వ్రతతులైరి.

(కృష్ణచరితము)

## కామేశ్వరీ!

గృహశృంగారము చేసిచేసి, గృహిణీశృంగారముం జేసిచే
సి. హృదంతఃప్రతిబింబితమ్ములగు నిస్సీమంపుఁగోర్కుల్ [illegible]
బహుళత్వమ్మునుబొందఁ, దన్మయత సంభావింపలేఁ డెన్న; డీ
యిహమే శాశ్వతమంచు నెంచు కుజనుం డెందేని కామేశ్వరీ!

సమపుత్రుల్ స్వమతేతరమ్ములగు విద్యల్ నేర్చి పోషింతురం
చు మతభ్రష్టులఁ జేయు పండితులు నీచుల్గారె, వేరింక ప్ర
స్వామికై కాంతుల రోవెలందులుగఁ జేయన్ లేరె యెవ్వారి దూ
ఱ మరేమా, కలికాలపున్మహిమ వార్యంబౌనె కామేశ్వరీ!

తచ్చాచ్ఛీసులటంచు, హూణుల కుపాధ్యాయత్వమంచున్ మఱిన్
నెచ్చెంబిచ్చెడి బచ్చుటిండులకడ న్వేదాంతమంచున్ మహా
స్వేచ్ఛాచారిత్రులు పండితు ల్మెలఁగఁగా నయ్యెంగదా, యిస్సిరో
చచ్చుంగాలము వచ్చె, గౌరవము నాశంబయ్యెఁ గామేశ్వరీ!

జననాభావ మనుగ్రహింపు, మది నీశక్యంబుకాదేని పై
జననంబందును నా కొసంగు మెటులో సంగీతసాహిత్యముల్
పసితే దీయుదరంపుఁబోషణకునై భాషాంతరమ్ముల్ ; జగ
జ్జననీ! దీనికి నింత వ్యర్థపుఁబ్రయాసం బేల కామేశ్వరీ!

గతలేఖస్వవధానము జేయవా, వచస్సాహిత్యము [illegible]
ప్రతిలేరే తెలికన్న పేరిడవా, ద్రవ్యం బీయవో. [illegible]
[illegible]తుంచేయవా. ఎన్నియేన్నతుల నానందమ్ము [illegible]
గని నీవే యనువారి కేమి కొదవో కామాక్షి! కామేశ్వరీ!

(కామేశ్వరీశతకమునుండి)

# జనమంచి వేంకటరామయ్య

[ 19, 20 శతాబ్దులు ]

## కుసుమాంజలి

తృణకల్పుండను నేను, నాదుమతియుం దేజోనిధీ! వానిపై
నణుమాత్రంబగు మంచుబొ, ట్టయిన నీ యవ్యాజకారుణ్యవీ
క్షణసంపర్క మహార్మ్ఖంబులను గల్గన్ వెల్గి సుశ్లోకస
న్మణికాంతిన్ వెదజల్లుఁగాక జగదానందానుసంధాత్రియై.

నిలిచెదు నాహృదాలయము నెక్కొని కోరిక పుట్టినప్పు డేఁ
గొలుచుట కందుబాటుగను, గ్రుంకెద భక్తిరసంపుముంపునన్
దలపఁగ నాకు క్షేత్రమవు, దైవతమున్ మఱి పుణ్యతీర్థమున్
వలసినదెల్ల నీవ, యిఁక భావనయే ఫలదాత్రి యీశ్వరా!

నేలం బ్రాఁకెడి పూవుదీఁగవలెనే నే నుందు నో దేవ! న
న్నీ లోకంబున కేల తెచ్చితివో? నా కేచోటు నేమించితో?
పూలా పూవను, మొగ్గలా తొడువనున్, మ్రోడైనగానుం; బసు
ల్కాలం ద్రొక్కఁగ స్రుక్కుచుందు నిది నాకర్మంబె సర్వేశ్వరా!

నీ యౌన్నత్యము నన్ సృజించుకతన్ విఖ్యాతమైయొప్పెడున్
నా యాధిక్యము నిన్నుఁ జేర్చికొని యన్వర్థంబగున్ లోకమం
దో యీశా! మణికాంచనంబుల మిథోయోగంబునుంబోలె నెం
తో యేపారును నీవు నేను నొకటౌ యోగంబు సర్వేశ్వరా!

ఎన్నోచోటుల నిల్చికాని యొకమై నెక్కంగ నే నోప నీ
యౌన్నత్యంబున కో జగద్గురుఁడ! దివ్యంబైన నీ తేజముం
గన్నుల్ మోడిచికాని చూడఁదగనుం గాకుండ మిర్మిట్లు; నా
యన్నా! నాకడ కీవ రావలయు న న్నర్థిం గనంగావలెన్.

మక్కువమీఱఁ గోరికొన మాటుమణంగి, తలంచుకోకపో
నెక్కడనుండి వ్రాలెదవో యిట్టె ననుం బయికొందు నిద్రయ;

ట్లక్కజమయ్యెడుం, దెలివి యక్కఱలే దీఁక ని న్గనంగ, నో
తెక్కలికాఁడ! నీవరుగుదెంతువు చీఁకటిలోనె యీశ్వరా!

ఒడలన్ డగ్గఱి యంటినట్టులగు, వాయుస్పర్శముం గాదు; న
ల్గడలం జేర్చెదు నొక్కచోటి, కయినం గా దంధకారంబునన్
గడెయుంగంటయుజామునుం దెలియ, వైనన్ నిద్రయుంగాదు; బ
ల్విడిమై వృత్తివిశేష మొండు హృదయావిర్భూతమైయీశ్వరా!

హృదయాకాశము మీఁదిమీఁదికిని నీవెక్కంగ నెక్కంగఁ జి
న్నది కాఁజొచ్చెదు, నాదు నీడవలెనే నాచిత్తసంకల్పమున్
గుదురై నిల్వఁగ నీవు నట్టనడుమన్ శూన్యంబగున్ హేవిభో!
పొదలున్వెండియు నీవు డిగ్గినఁ దమఃపుంజాకృతిం దాల్చుచున్.

ఈవున్నే నొకతల్లిబిడ్డలమెసుమ్మీ! యొక్క పెన్ దివ్వటీ
నే వెల్గించిన జోడుదివ్వెలమెసుమ్మీ యీశ్వరా! నా కిఁకన్
నీవే పెద్దవు ముందు పుట్టుకతనన్, నీక్రింద నేనుందు; ఆ
హా! వింతౌ నిఁక నీవునేను నొకటే యాదివ్వటీవెల్గులో.

మౌనమ! చంచలేంద్రియసమాజకవాటపిధానమా! నినున్
ధ్యానముసేతు, నాపయిని నల్లన వ్రాలుము; శాంతిదేవికిన్
మానుగ నీవు నాల్కవఁట, నా చెవి నూఁదవె తద్రహస్యమో
మానితభావరత్నఖని! మాటలు వేయునునేల నాకిఁకన్.

## సోదర స్మృతి

అరుదగు మర్త్యజీవితరహస్యముపేరిటి కజ్జ మేదొ నీ
కరమునఁ బెట్టి మూసి, కనుగప్పి, వెస న్నిను దోఁడికొంచు నే
మఱుఁగున కేగెనో సురిఁగి మాయపుమృత్యువు, చిన్నిబాలుఁ ద
స్కరుఁడునుబోలె నీయిహము సంగ్రహియింపఁదలంచి తమ్ముఁడా!

మనగోదావరిమీఁదివంతెనగ సంభావింతు నోతమ్ముఁడా!
అనుభూతం బది నీ, కయోమయము నా కామృత్యు;వాసేతువ

ట్లనువై యుండునె రాకపోకలకు భూమ్యాకాశసీమంబులన్ ?
జనుచుండ్రే పటువాసనావశు లటన్ సంసారయాత్రాపరుల్.

ఆ తెఱిదివ్య కాంతివలయం బెటు డిందుఁ గ్రమక్రమంబుగన్
బ్రాతెఱియేటివెల్లి నడుమం జిఱులంక యెటుల్మునుంగు న
ట్లారయ నేత్రవైద్యుఁడగు నల్లసదాశివు మత్తుమందు చే
కూరుచుమబ్బులోఁ దెలివి గ్రుంకఁగ నే నఱసాపు సూచితిన్.

ఈయింటం గుడుతుము మన
మాయింటం బండుకొందు మనుజ! తలఁపుమీ
యీ యుభయకార్యసదృశము
లే యగునో జీవితంబు నీమరణంబున్.

ఇంతన్ గ్రంథసమాప్తియంద్రు,తరువా యేమాత్రమున్ లేదటం
ద్రంతర్వేదికిఁబోలె నూళ్లవల లేవం డ్రయ్యయో ఆత్మకున్;
సంతప్తాంబుధి బాష్పమట్లది యదృశ్యంబై దివింజేరి, ఆ
సంతాపంబు శమింప వెండి చినుకై జాఱున్ భువిం దమ్ముఁడా!

కడుపునఁ గొన్ని డిందెదు నకాలపుమృత్యువె చాతకంబుగాఁ
బుడమిని రాలుఁ గొన్ని, తడుపుం బయిపై నటుకొన్ని, కంటినీ
ళ్లుడుచును కొన్ని,నించుఁబరితుష్టిగఁ జిన్కులుకొన్ని,శుక్తిలోఁ
బడినవి ముత్తియంబులయి స్వామికి హారముగూర్చుఁదమ్ముఁడా!

ఆవలియొడ్డుఁ జేరి కుతియాఱఁగఁ గ్రోలుము స్వచ్ఛజీవనం
బీవలియొడ్డునం బసులమెక్కుడుద్రొక్కుడుచే జలంబు పం
కావిలమయ్యె; నైన నదె యంబరగంగ యటన్న పూర్ణ సం
భావన జేసి త్రాఁగుదుము, వాస్తవ మిట్టిదికాదె తమ్ముఁడా!

ఒకచన్నిదరి తల్లి గౌతమికి, నీ యున్నట్టియాయొడ్డు వే
ఱొకచన్నై యెసఁగన్ సహోదరులమై యుప్పొంగుజీవామృతం
బకలంకస్థితి గ్రోలుచుంద మిఁక, దాహం బగ్గలం బౌటనా
సుకృతీ! నీ వధికంబు గ్రోలుదు విదేసుమ్మా విభేదంబనన్.

( నవకుసుమాంజలినుండి )

## వేంకట పార్వతీశ్వరులు

[19, 20 శతాబ్దులు]

### ఏకాంత సేవ

అలసివచ్చితివేమొ యని జాలినొంది
చలువపన్నీటిచే జరణము లడిగి
యలరు దువ్వలువచే నడుగుల నొత్తి
యరవిరిగద్దెపై నాసీను జేసి
ఫలరసంబులతోడ బాసీయ మొసగి
చక్కనినెమ్మేన జందనంబలది
తనివార గర్పూరతాంబూల మిచ్చి
శ్రమవాయ జేయగా సరసను జేరి
విరజాజిసురటీల విసరుచునుండ
నామేను మఱపించి నాకన్నుగప్పి
ఇంద్రజాలముచేసి యేగుట నీకు
న్యాయమైతోచెనే నాజీవితేశ!

* * *

విరిదండ మెడలోన వేయుటే కాని
కన్నార నీమూర్తి గాంచనే లేదు
ప్రణమిల్లి యడుగులబడుటయే కాని
చేతులారగ సేవచేయనే లేదు
నినుగాంచి ముగ్ధనై నిలుచుటే కాని
ప్రేమదీరగ బల్కరింపనే లేదు
ఏమేమొ మనసులో నెంచుటే కాని
తిన్నగా నాకోర్కె తెలుపనే లేదు
బోధంబులో సుప్తి పొడసూపబోలు
కనులలో జూపులో గావిరుల్ గ్రమ్మె...
వెలుగులో జీకటి విరిసెగాబోలు
మనసులో దెలివిలో మఱపులుద్దోచె;

ఆనందమందుఁ జే యపచారమనుచు
అవశనై యుండుఁ జే అపరాధమనుచు
మది నెంచి యీరీతి మాయలుసేయ
భావ్యమై తోఁచెనే ప్రాణేశ నీకు!

*  *  *

కల్యాణవిభుసేవ గావించువేళ
యేమిచేయఁగఁబోయి యేమిచేసితినో?
ప్రాణనాయకునితో భాషించువేళ
నేమిచెప్పఁగఁబోయి యేమిచెప్పితినో?
విశ్వమోహనమూర్తి వినుతించువేళ
నేమిపాడఁగఁబోయి యేమిపాడితినో?...

కట్టినపూదండ కట్టినట్లుండ
పట్టినహారతి పట్టినట్లుండ...
వెడలిపోయినయట్టి విజ్ఞానమూర్తి
మది నేమియెంచెనో మరలిరాఁడాయె.

ఆవేళమొదలుగా ననునిమిషంబు
నేరీతినుంటినో యెఱుఁగవటమ్మ!
అవశనై చేసినయపచారమునకు
గుణనిధానుం డిట్లు కోపింపఁదగునె?...

సాక్షాత్కరించినస్వామిని గాంచి
నిలువెల్ల బులకింప నిలుచుటకంటె
కల్యాణనిలయమా కాంతునిమూర్తి
నిలువుటద్దంబులో నిలుపుటకంటె
అదరిపాటునఁదోఁచు నాత్మేశు జూచి
వెఱ్ఱినై వెనుకంజవేయుటకంటె...
ప్రేమగీతాలలో బ్రియునిపేరెత్తి
గద్గదస్వరమును గాంచుటకంటె...
దాసి చేసినయట్టి తప్పేమికలదో

ఆనతిమ్మని స్వామి నడుగుదుగాని
ప్రణయవనంబులోపలి పుష్పరథము
తుమ్మెదా! వేవేగ తోలితేవమ్మ!...

*　　　　*　　　　*

ప్రణయసౌధంబులో బతియుండువేళ
ప్రేమతో మనసిచ్చి పిలిచెడివేళ
ఆనందమూర్తియై యాడెడివేళ
చిత్తమా! చిత్తమా చెదరబోకమ్మ!
ప్రేమాలయంబులో బ్రియు డాడువేళ
ప్రేమడోలికలలో బ్రియు డూగువేళ...
ఆనందసామ్రాజ్య మందెడివేళ...
చిత్తమా! చిత్తమా! చెదరబోకమ్మ!

*　　　　*　　　　*

ఈమొగ్గ విరియించి యిన్నాళ్ళదాక
దండగూర్చుట కింత తడయుటయేల?
ఈపండు పండించి యిన్నాళ్ళదాక
ఆరగించుట కింత యాలస్యమేల?...

ఏమైన నెటులైన నిప్పటికైన
నిఖలేశ! నీకృపాన్వితకటాక్షమున...
కరుణావనములోని కల్యాణవీచి...

కన్నులుచల్లగా గనుగొనగంటి
హృదయేశ! నా భాగ్యమే భాగ్యమయ్య
సర్వలోకేశ! యీసాలభంజికను
నీకేళిగృహమందు నిలువగానిమ్ము
భువనసంత్రాణ! యీ పుష్పవల్లికను
నీపూలతోటలో నిలువగానిమ్ము
కల్యాణధామ! యీ కనకపీఠికను
నీ పాదములపొంత నిలువగానిమ్ము...

దయతోడ దిలకించి దాస్యంబొసంగి
నన్నేలుకొనుమయ్య నాజీవితేశ!

(ఏకాంత సేవనుండి)

## వేంకట రామకృష్ణకవులు

[19, 20 శతాబ్దులు]

### పాణిగృహీతి

శ్రీలంబాల్చువివాహవేళ శుభలక్ష్మీవీక్షణావ్యగ్రలై
చాలన్నిల్చిన పేరటాండ్రు తనయుత్సాహంబు హెచ్చింపఁగాఁ
గేలుందమ్ముల కంద వంగుమగనిం గెల్వంగ వేవేఁ దలం
బ్రాలంబోసెడు పెండ్లికూఁతునకు సౌభాగ్యంబు నిండారుతన్.

పేరుల్ చెప్పెడివేళలన్ వరుఁడు "నా పెండ్లాము నే"నంచు సా
ధారణ్యంబుగఁ బల్కు, నల్లనగుచుం దా నట్టులే "నేను మా
వా"రంచున్ గడుసుందనంబు వెలయన్ వాక్రుచ్చు దారం,గులా
ధారం బెండ్లికుమారుఁ డాదరముచేతం జూచెడుంగావుతన్.

అనుజన్మల్ జనకుండుభర్తయును మధ్యాహ్నంబునందన్నముల్
దినుచోఁ దాఁ దెలనాకులం జిలుక లెంతే నేర్పుగాఁజుట్టి, భో
జనమైవచ్చి మగండు పండుకొనుసెజ్జం బెట్టి, పొంచుండి యా
తనియాశ్చర్యముహర్షముంగనెడుకాంతన్ సంతసంబొందెదున్

"రమణం బొంగినపాల నీరుజిలుకన్ రానొల్ల దిన్నాళ్లు మా
యమ, నీ వచ్చినగోలె నింటిపనిసేయంజొచ్చె నీ కేమి లో
పముగాకుండఁగ"నంచు మాత వచియింపన్, నవ్వ జామాత,కో
పముతో "నందులకా?"యటన్నసుత సంపల్లబ్ధి హర్షించుతన్

తలినీళ్లన్నియుఁదోడి కాచి, యటుమీఁదం గుంకుళుల్గొట్టి, చె
తలఁ బొంచుండిన కూఁతు నల్లుతలరుద్దన్ బుల్సుపైబోయున

దులకున్ రమ్మన, సిగ్గుచే గునియ, ''కన్నుల్మూసికొన్నాఁడు లే
యలు కేలా'' యన, వచ్చుముగ్ధవరివస్యన్ భర్త కీర్తించుతన్.

ఒకసాయ మ్మసివారు కేగినవరుం డొక్కింత కేతెంచి, పి
ల్వక యే తల్పును దట్టఁగా, దయిత ''యెవ్వార్వా''రనన్, లజ్జమి
న్నక యుండన్ బతి, ''పల్కవే''మని కృతన్యక్కారయై తల్పుదీ
సి కడున్ వెల్వెలబాఱి పర్విడుమృగాక్షిన్ భర్త మన్నించుతన్

అయిదార్నాళ్లిటులుండఁ గట్టనిడి, యొయ్యన్నామగారంపఁగాఁ
బయనంబై పతి గుమ్మముం దిగినవెంటన్ మూపుపై నీళ్లబిం
దియతో నవ్వుమొగమ్ముతోడ నెదురై, తృష్ణాత్రపార్థస్ఫుర
న్నయనాబ్జంబులఁ జూచుజాయ శకునానందమ్ములం జేయుతన్.

చెలికారమ్మున నాథు నెయ్యదియొ యాక్షేపమ్ముగాపించి, న
వ్వాలయం జేసియు నాతఁడల్కఁగొనెనేమోయంచు వెన్వెంట ను
త్తలపాటుంగని, చేరవచ్చి, యతివాల్లభ్యమ్ముతో ''నాదుప
ల్కులకుం గోపమురాదుగా'' యనుమృగీలోలాక్షికిన్ క్షేమముల్.

ఆయాకార్యములన్ శ్రమమ్మునకు లోనై భర్త యిల్ సేర, నా
యాయాస మ్మఖిలమ్ము దవ్వులకుఁ బాయన్ నవ్వునెమ్మోముతో
డాయంగాఁ జనుదెంచి, యేదొపలుకాడం జొచ్చి యెంతెంత యో
హాయిం జేసెడిజాయకంటెఁ గలదే యన్యంబు మాన్యం బిలన్.

ప్రాణేశుం డెటుకోరు నట్లె తనయావచ్ఛక్తి వర్తించుచున్
గానం గాఁపురమున్న నద్ది యొక స్వర్గంబట్లు తోఁపించి, య
త్యానందంబొడఁగూర్చుచుండెడి ద్వితీయంబోలు తీయంబు లో
కానన్ వేఱొకఁ డున్నదంచు నొడువంగా నేర రెవ్వారలున్.

సంతోషార్థము వింతవారు 'తమకున్ సంతానమా?' నావుడున్
సుంతౌ సిగ్గున 'నిష్టుగర్భిణి' యటంచుం బల్కు ప్రాణేశుతీ
రంతన్ సోరణనుండి కన్గొనుచు నొయ్యారంబుగా నవ్వుకొ
న్నంతర్వత్నికిఁ బత్ని కూడిగము సేయన్ సేగి లేదేమియున్.

పోలయుల్కా న్మగఁ డున్నఁ డాఁ బురిటికై పుట్టింటికింబో నిఁకం
దెలవారంగఁ బ్రయాణమన్నపుడు వెండి న్మిమ్ము నేఁజూడఁగాఁ
గలనో, లేనోయటంచు బెగ్గిలి నమస్కారంబుగావించి, క
న్నులనీర్వొట్టెడి యన్ను పుత్రవతివై నూరేండ్లు వర్ధిల్లుతన్.

నవమాసంబులు నిండియుండియు మనోనాథుండు విచ్చేయఁగా
భువిఁ గెంగేలుఘటించి యెట్టులో కృతాభ్యర్థానవై లేవ, "మా
నవుగా, యెన్నివిధాలఁ జెప్ప"నని కిన్కన్ భర్తచూడంగ, నే
యవియో సాకులుపన్ని తప్పుకొను నిల్లా లెప్డ వర్ధిల్లుతన్.

పసుపుందావియు, నుల్లివాసనయు నొప్పంగాయపుంగంపు ముం
వెసఁగం; బుక్కిటితమ్ములంపుసాగ సెంతే నింపుపుట్టింపఁగా
వసివాళ్వారినబాహువల్లికలతో వాల్లభ్యసంపూర్ణయై
బసికూనం బ్రియుఁ డెత్తికోనొసఁగు లేబాలెంత మేలొందుతన్.

(గ్రంథమాలనుండి)

## డి. రాజశేఖర శతావధాని

[19, 20 శతాబ్దులు]

### రాజగురువు హరభట్టు

ముడుచుకొని పంది పుడమిని
బడి నీల్గెఁ; బ్రతాపసింహవసుధావరుఁ డ
య్యెడఁ జేరెఁ; దత్క్షణమ సూ
త్తుఁడు దూఁకెను "బంది నాది, తొలఁగు" మటంచున్.

"పనికిమాలినపందికై యనృతమాడె
దిలయుఁ గ్రుంగెనె! యంభోధు లింకిచనెనె!
వెలగలుగు వస్తువేయైన వెనుకఁబడెదె
కోటియనృతములేని బల్కుటకుఁగాని"

అని నిలుచున్న ప్రతాపునిఁ
గని సూక్తుఁడు "పంది నేమిగాఁ దలఁచితివో!
మును దానికై కదా పా
ర్థునితోఁ బోరాడె శంకరుఁడు ఘోరముగన్!
తలఁపు లొకఁడైన లవము భేదమును రాదు
కౌస్తుభంబైనఁ జనుఁ జిల్లిగవ్వమాడ్కిఁ
బౌరుషము, మాటపట్టింపు వచ్చినపుడు
గడ్డిపోఁచయె మేరువై గణుతిగాంచు.
విశ్వస్తుతాఖండవిక్రమక్రముని సా
మ్మవని రాజ్యవిభూతి యంద్రు బుధులు
మనలోన విక్రమమహిమఁ బూజ్యుం డెవఁ
డతఁడె మేవాడ్లక్ష్మి కర్తభర్త;
కాని నీవొకఁడవే గళమునఁ దాళిఁగూ
ర్చిన భర్తగావు; నిన్ గ్రిందఁగలుగు
పోటరు లుండకపోరు; నీనెత్తిని
బాడవైన యొకకొమ్ము పుట్టెనొక్కొ!
యేనుదప్పిన నీ రాజ్యమేలుఘనుఁడు
పుట్టఁడని యెంచినావు, నీముఖమునందె
ప్రొద్దు పొడిచెనె! యిటు లేనిపోని దురభి
మాన మూనితి; వీఁకనైన మానుటొప్పు!
పదికోట్ల మాటలేటికిఁ!
గుదురుగ వాదంబుమాని క్రోడంబు నొసం
గుదువో!నాతో మార్కొని
కదనముచేసెదవో! తెల్పఁగావలె" ననినన్...

(సలుంబ్రాధీశుండగు కృష్ణుని దెసనందఱుం గాంచుటయు,)
అతఁడులేచి, సూక్తు దరియఁజనుదెంచి "శిశోదియాకులో
ద్భూతులు పూర్వజుంగనిన | మొక్కఁగనేర్తురుకానియెన్నఁడు

స్నితితొలంగి తిట్టఁగను నేరరు; క్రొత్తలు తెచ్చిపెట్టి మా
చేతములన్ దహించితివి; చెప్పెడిదేమిఁక నీ ప్రవర్తనల్.

అనురాగాంబుధి స్వామికాళ్లఁబడుచుం బ్రార్థించి, మూన్నాళ్లు నీ
వనుతాపమ్మునఁ గ్రాఁగి పస్తువడి ప్రాయశ్చిత్తమున్ జేయకుం
డిన మేవాడధరిత్రి నెందరిగినన్ 'నీవిందు రా, కూరుచుం'
డనువా రుందురె! యెవ్వరోర్చెదరు కట్టా! స్వామిధిక్కారమున్

మనవంశమ్మున నెన్నఁడున్ గలుగ దీమర్యాద; యన్నన్న! నే
మనియున్నప్పుడె నా సమక్షమున నస్మత్స్వామి నిందించు నీ
వనుకంపార్హుఁడవౌదె! వధ్యుఁడవు, బాల్యంబందు నిన్నెత్తి పెం
చినదోషంబున నోర్చుకొంటిఁ! గడునొచ్చెన్ జేతమిప్పట్టునన్''

అని వాత్సల్యముఁ ద్రుంపలేక యిటు న్యాయంబాడు నాకృష్ణునిన్
గని సూక్తుండును ''బల్లికిన్ జ్వరమనంగాఁ జెల్లె, నీ మాటలన్
వినఁగా నోపను, నీప్రతాపవిభునిన్ నే మ్రొక్కఁగా నోపఁ, బం
ది నెటుల్ వీడఁగ నోప, నోప రణ మెంతేనిన్ విసర్జింపఁగన్.

సిరి వీరున్ వెదకున్; ఘనుల్ బెదరియున్నీ! మూలలన్ దాఁగఁబో
రురుశౌర్యోజ్జ్వలు లిందుఁగల్గు మగలం దొక్కొక్క మా యొక్క రె
వ్వరినేఁ బూన్పుము, చెండివై చెదఁ బ్రతాపస్వామి మద్విక్రమం
బెఱుఁగుంబైఁబడఁ; డీవు సాయమయిరమ్మా! చూతునా యుద్ధతిన్''

అని గర్వించెడు సూక్తునిన్ గని సలుంబ్రాధీశుఁ ''డేమంటివి? ని
న్ననఁ బాపం, బిసుమంత యోర్వ గురుధిక్కారాఘమున్! నిన్నుఁ బెం
చినవాత్సల్యమునైనఁ జూడక శిరచ్ఛేదంబు గావింతు ని''
ష్టని ఖడ్గంబుఁ గొనం బ్రతాపుఁడు రయంబారన్ సమీపించుచున్

గురుతుల్యుండవు మాకు వంద్యుఁడవు సూక్తుండాడు గర్వోక్తులం
దరుణాబ్జాతదళాతికోమలము స్వాంతం బెంతగా నొచ్చెనో
స్థిరకారుణ్యసముద్ర! వానిబదు లర్థింతున్ క్షమాభిక్ష, యే
కొఱలేకుండఁ బ్రసన్నమూర్తివయి నాకున్ దర్శనంబీయవే!

చెప్పనగుమాట లూఁకొట్ట, మొప్పఁబోవ
మేమిటికిఁ గష్టపడఁగ? నింకేల వగవ?
తనవాశక్తికి మీఱు కార్యములకుం దార్కొన్నచో ముప్పువ
చ్చును;మాయిర్వురలోననొక్కఁడురణక్షోణిన్ మృతింగన్నమీ
రును రావచ్చును, నేడ్వవచ్చు,మఱిఁ బౌరోహిత్యమున్ జేయవ
చ్చును, లబ్ధింగొనవచ్చు,నిష్ఠచనవచ్చున్ దాఁటిదూరమ్ముగన్''
అనిన హరభట్టు నిలువె
ల్లను నీరయి యడుగు నవ్వలన్ వైచి, ప్రతా
పునివంకను దీనముగాఁ
దన దృష్టులు వఱపె; నా ప్రతాపుండంతన్.
''మలినమును జలముకై వడి
నిల నలమినపాపసమితి నింకించు రణం
బు లవశ్యము కరణీయం
బులు నృపవంశమునఁ బుట్టుపురుషులకెల్లన్.
ఏవేళ కేది వచ్చునొ
యే వెరవునఁ బరిణమించు నెవ రెఱుఁగఁగలా;
రీ వేళ మమ్ముఁగూటిచి
భావమునను నొవ్వ'' కనుచుఁ బలుకుచు వెడలెన్...
మెఱుపు తటాలున న్మెఱయుమెల్పున నాహరభట్టు తత్క్షణ
స్ఫురితమనోవికాసమున భూరికృపాణము నెత్తి వక్షమున్
బఱియలుగాఁగఁ జీల్చుకొని వారలమధ్యను నేలవ్రాలుచున్
బొరిపొరిఁ బ్రాణముల్ విడిచె ముక్కున నోరను నెత్తురొల్కఁగన్.
వనధిధ్వానగభీరఘోషము రహింపన్ బ్రక్కకున్ వచ్చి సూ
క్ష్మునివీక్షించిప్రతాపుఁడు 'న్నినుగనుంగొన్నం గడుంబాపముల్
జనియించున్, గలుగంగరాని యిడుమల్ సంధిల్లె, క్షీరాబ్ధిఁబో
లిన సూర్యాన్వయమొందె నీకతన మాలిన్యంబు లీనాఁటికిన్.
సమరంబున్ బొనరింపనుండఁగ వసిష్ఠప్రాభవాఢ్యుండు పు
ణ్యామయుం డీ హరభట్టు తా నుదయసింహాత్మోతలాధీశుచం

దమున న్వాంద్యుఁడు ముందుదూఁకి, మనమధ్యంబందునన్ వ్రాలి, జీ
వములర్పించి, త్యజించె దేహము దృణప్రాయంబుగా నెంచుచున్
గురురుధిరంబుదాఁటఁగనుగూడదు; కావున నిప్డు నేను సం
గరమును మానుటన్ బ్రదుకఁగల్గితి, నీకిఁక నాదు రాజ్యముల్
ద్వరగఁ ద్యజించి యిష్టమగు తావునకున్ జను; మాలసించినన్
శిరము నిమేషమాత్ర ధరణింబడు'' నంచు వచింపసూక్తుఁడున్

''హరభట్టారకమూర్తి పుణ్యాత్ముఁ డయ్యాచార్యుఁడిట్లాటకున్
నెరియున్ నామది; కాన నేఁడు రణమున్ నేఁ గోరఁ భీతిల్లి నే
నరుగంబూనితినంచు నెంచకుము; నీ యౌద్ధత్య బాహాబల
స్ఫురణన్ వమ్మొనరింపకుండినను నే సూక్తుండనే కాదుపో!
ఇరువుర నెవ్వరో యొకరుఁ డీ జగతిన్ విడునంతకున్ బర
స్పరముఖదర్శనంబు కొనసాఁగకయుండెడుఁ గాత, ఘోరసం
గరములఁదప్పఁ బ్రాణమును గాచి మెలంగు''మటంచుఁ బల్కి, తా
నరిగెను ఢిల్లి త్రోవకుఁ, గులాంతకు లందఱు పోవు తావుకున్.

(రాణాప్రతాపసింహచరిత్రనుండి)

## త్రిపురనేని రామస్వామి

[19, 20 శతాబ్దులు]

### నందనోద్యానము

నందనముజూచుకోర్కెలు సందడింపఁ
బారిజాతపరిమళంబు దారిజూపఁ
గమ్మతావులగొజ్జంగి కాల్వదాఁటి
నందనోద్యానవనసీమయందుఁజొచ్చి...
కొమ్మకే న్నాకపాదరిల్లు గ్రుమ్మ వైవ
నంగమొలతో సురాంగన యంగవైచె
నంగదట్టము విడివడ్డ, నంగరాగ
మంగహారముచేఁ జాల నంగవింప.

గుబ్బలిమాటునన్ సురలకోసము పెట్టినయొక్కయంగడిన్
గబ్బిలికన్నె చెన్నుగని కైవశఁకన్, సురచింది ముంగిటన్
జొబ్బిలఁ ద్రాగుబోతు లట సోలుచుఁదూలుచునుండ, దారి పె
న్నుబ్బలియైన నందనము నొక్కెడఁ గంటిని రిచ్చపాటుతో.

జాఱుసిగలోన గేదంగిసరులు తుఱిమి
జాఱుపయ్యంటలోన మందార ముంచి
సీటుతో నెలకట్టుపై నిక్కి నడువ
జారిణీస్త్రీ యొకత కాలుజాఱిపడియె.

తీఁగతూఁగుటుయ్యాలలో దీఁగబోఁడి
గూడి జోడుగ నొకవేల్పుకోడెకాఁడు
కౌఁగిలింతలపొంగులోఁ గాలుజాఱఁ
గేకిసల్గొట్ట నెడకాండ్రు క్రిందఁబడియె...

పారిజాతసంతానపుష్పముల నేరి
తెచ్చి, మేలిగేదఁగులతోఁ దెప్పగట్టి
పజ్జఁ బాఱాడు గొజ్జంగివాఁక విడిచి
తెప్పమీఁద నచ్చరలేమ తేలిపోయె.

కాతరభావ మేమియును గన్పడనీక, యథేప్సితంబుగాఁ
గేతకికుంజపుంజముల క్రేవల నాకల సంచరించుచున్
జేతులుచేతులుం గలిపి. చిక్కుపడంబోకుండఁగ స్త్రీలతోఁ
బాతగలాడుచున్న మగవారలఁ గాంచితి నాకతోఁటలో...

విరులతేనెసోనలు వెల్లివిరియుచుండఁ
[illegible] త్రాగుచుండి
[illegible]
[illegible] సంపసంబు...
[illegible] నకుఁ బ్రొద్దు చాలఁ గ్రైవ్రాలుటయు.
[illegible] మును
[illegible] యొక్కచెట్టుకడ కేగంగాఁ

బొంచి లతాంగి యొకత నా
వంచకు రా, నామెతోడఁ బల్కితి నిటులన్

‘‘ఇందఱు యువతీయువకులు
క్రందుగ నున్నట్టిచోటఁ గన్పించ రహో
చిందులు తెగద్రొక్కెడి కసి
గందులు వచియింపుమమ్మ కారణ’’మున్నన్.

‘‘స్వైరవిహారనిష్ఠమెయి సర్వదిగంతరదివ్యదేశసం
చారము జేయు మాకు గ్రహచారము చాలక సంతుగల్గినన్
వారల నెల్లఁ గన్నమగవారికి నిత్తుముకాని పెంచు నా
చారము లేదు స్వర్గమున, సత్యము జెప్పితి’’నంచునామెయున్.

‘‘ఆలకింపుము స్వర్లోకమందున్న
మానినులయందుఁ బెండ్లిండ్లులేనికార
ణమున మరులెత్తి మర్త్యలోకమున దేశ
దేశములపయింబడి వారు తిరుగుచుంద్రు.

మగనాం డ్రిచ్చట నుండరు
మగనాం డ్రన్నన్ దెలియదు మాబోటులకున్
మగవాం డ్రనుచు మాపై
మగబీరము జూపరారు మా మగవారల్.’’

అని నిష్కపటంబుగా వచియింప, స్వర్గలోకనాగరికంబునకు నాలో నే నేవపడి...మెల్లన లేచి, ప్రక్క కొదిగిపోవుచుండ సురాంగన నన్ను జూచి, కేరింతలాడ నిట్టు దలపోయందొడంగితి.

కల్లునిచ్చెడిచెట్లకుఁ గల్లుగౌర
వంబు పెఱవానికిని లేదు, వజ్రిమ్రోల
గజ్జెకట్టెడిభోగంపుగరిత కున్న
పలుకుబడి కానరా దెట్టివారి కిందు.

ఇండ్లో యున్నవికాని పెండ్లిండ్లు లేవు
ఆండ్రో యున్నారు కాని యిల్లాండ్రు లేరు
బాగు! శివశివా! యిది వట్టి భోగభూమి
ఉండరా దిందు మావంటి యోగులకును.

అని...కక్షపాలనున్న భస్మంబును దీసి అన్యమనస్కుండనై, మై నలందికొని చూచుడు భస్మలేపనంబు పుప్పొడిపూఁత యయ్యె. నేను దిగులుపడి, నాకంబు విటవిటీభోగ్యంబు కాని మానిజనవాసయోగ్యంబు కాదని, వైళమ భరతఖండప్రయాణోన్ముఖుండ నైతి.

(సూతపురాణమునుండి)

## వేలూరి శివరామశాస్త్రి

[19, 20 శతాబ్దులు]

### నాఁగటిచాలు

నిను జగదీశ్వరేశ్వరుని నెమ్మి నుపాసనమాచరింపఁగా
మనము తదేకతానమయి మన్నడ, దానికినంతరాయముల్
కనబడకుండనుండుటకుగా నొగిఁ గోరినడబ్బు నిచ్చి కొం
టిని నొకతోఁట నీవలరు నిక్కపుఁ గోటను నొక్కచోటునన్.

తోఁటయుత్తరమునుదూర్పుదక్షిణమును
బశ్చిమప్రాంతంబు పాఱఁజూచి
దిగుడుబావినెసంగు తేటతీయనినీరు
కుత్తుకబంటిగాఁ గ్రోలిక్రోలి
కంచెకాల్దరియేటికట్టపైఁ గలపూల
మొక్కల నొకకొన్ని పూలు గోసి
క్రొమ్మావిగున్నపైఁ గొమరారునొకశాఖ
యాసనంబీయఁగా నధివసించి

...ఇంతడబ్బిడి కొన్నా, మీఁకింతనుండి
దీనివెల లాగఁగాఁ బోలదే యటంచు...

దొడ్డమ్మపేటలో దొరకెడుదానిలో
విమలమగా తియతుంటవిత్తనంబు
గంగలకుర్తిలో గాలించిగాలించి
మోపుజేసిన పోఁకమోకగములు
పెదవడ్లపూఁడిలోఁ బేరుమోసినయట్టి
తీయనారింజబత్తాయియంట్లు
కడియమ్ముననుఁ గలతోఁట లన్నిక్ర
మ్మఱఁగ్రమ్మఱనురోసి మావియంట్లు

...చిత్తవిత్తుగఁ గడఁగి. వేసికొనివచ్చి
నాల్గుచోటులఁ దోఁటలో నాటినాఁడ.

రేయియనుసాగరంబున
నీయోడయెఱుంగరాని ద్వీపంబునకుం
బోయి, యట నాఁగి, ప్రొద్దుట
నే యలమెడనుండి లంగరెత్తినపిదపన్.

గుజ్జుమామిడిపొదరులోఁ గూరుచుండి
నియతి నీయోడ మరకాని నిన్నుఁ దలఁచి
యెవరొ లోఁదూఱినంతటియేపు గాంచి
ముఖము సుఖకిసలయితమైపోవ లేచి.

వంచినకొమ్మ పట్టుకొని వైళమ లేచుచు, నేల యెల్లెడం
గాంచుచుఁ, దోఁట నెంతయును గాచెడువానిని బిల్చి మోటతో
లించియుఁ, బ్రాఁతమట్టికదిలించియుఁ, బోయినమొక్క లెంచి పాఁ
తించియు, నీరువట్టు గుఱుతించియుఁ గాలము నాకలించితిన్.

మూఁడుఁడు సంజచీఁకటులమాటున ప్రేఁకపుఁబోఁకపొత్తులం
జేరిచి క్రిందనుం బఱచి, చేతికివచ్చినయన్నివన్నెబం

గాఱుమెఱుంగులా చెఱకుకామల నందుల మోపుగట్టి యీ
డేఱినవారి నేఱె యలయింపను నొంపను దొంగిలించెడిన్...

చెఱకుగానుగలాడఁ గొఱముట్లు, వక్కల
 వండఁగాఁదగిన లోహండి గొంటి
మావిపండులను నమ్మఁగఁ బెద్దపెద్ద బ
 స్తీల నంగళ్ల నద్దెలకుఁ గొంటి
వచ్చుబండియుఁ బోవుబండియుఁ, దిరిగెడు
 పనిముట్లు, గ్రాఁగెడు పానకమ్ము
వండెడు పోఁకలు, వ్రచ్చెడు చోడి, త్ర
 వ్వెడు నుల్లి, విత్తెడు విత్తనంబు
నై, నిరంతర మాతోఁట యాసురముగఁ
గర్మదేవి కార్ఖానాగఁ గానుపించె
అప్పు డెల్లరు వచ్చి "మే మనఁగలేదె?
ధనము పొదుగును నీ నేల" యనుచుఁ జనిరి.

అమ్మఁగఁ జేకూరిన రొ
క్కమ్మును లెక్కిడి, యదెల్ల ఘటములలో భ
ద్రమ్ముగ నిడి, యల భూగ
ర్తమ్ములలో వాని నెల్ల దాఁచితి నెలమిన్.

మఱుసటియేఁటితొల్దొలుత మాలి వనస్థలమందు ముందుగా
గుఱుముల నెల్లఁ జల్ల నెదఁగోరియు దున్నుచునుండునంత, నే
నఱవఱలై నమన్ను విరియంబడు కుంకుమవోలె లేవఁగా
వెఱగొని ముచ్చటంబడుచు వెళ్ళితి నాఁగటిచాలువెంబడిన్.

ఏ మావిక్రిందఁ దొలుతన్
నేమముతో నిలిచి నిన్ను నేఁ దలఁచితినో
యా మావి మ్రోకక్రిందటి
సీమల నాఁగేటికఱ్ఱు చీల్చుచుఁబోయెన్.

దాలఁ బటత్పటధ్వనులు దార్కొనఁ గజ్జుతలంబెకాక గ్రోలువడంగ నాహృదయకుండలి బ్రల్లనఁ బెల్లగిల్లఁగాఁ
జీలుచుచున్ గమించె నొగి నిప్పులకొండలు బ్రద్దలౌచు నా
చాలుననుండి లేచెఁ బరుషద్రవధారలు కీల లొల్కఁగాఁ.

కొండొకవేళనుండి నెఱి గోల్పడి, చుట్టలుచుట్టుకొన్న నా
కుండలికిం బ్రబోధ మొనగూడుచు, నెందుల కేను వచ్చి యుం
దుండితి? నేమిచేయఁగను యోజనచేసి మఱేమిచేసితిన్ ?
దండుగతోఁట తా ధనరణస్థలిగాఁగను మాఱిపోయెనా?

ఎంచఁగలేక యీపయిరునెల్లెడ నుండెడునిన్ను గానుగా
డించితిఁ, బిళ్ల చేతఁ బురుడించెడు పెన్గొడవళ్ల చేతఁ గో
యించితి, భూమిగర్భమున నెంతయు దాఁగిన వేళ్ల నెల్లఁ బీ
కించితి ధ్యానమున్ మఱచి, కేవలమున్ ధనలోలుపుండనై...

నా యాస్యం బది యెల్ల సాంద్రగతులా నాఁగేటిపెంజాళ్ల చే
గీయంగాఁబడెఁ; దోఁటమాలి నను లక్షింపంగ నిట్లంటి "సి
వాయూద్రిక్తజవంబుకల్గు వృషభద్వంద్వంబు నిం కాపు, నా
కాయంబుం బగిలించి, గుండియలనుం గజ్జుచ్చిపోయెంజుమీ"

అన విని యాతఁడు కొంచెమ
యిన నర్థ మెఱుంగలేక 'యేమియిదిదొరా!'
యని బిట్టువెఱగుపడి ని
ల్చెను దాఁ బ్రశ్నార్థకంపుఁజిహ్న మనంగన్...

పారావారమునందు నొక్కమధురావర్తం బుదాత్తంబుగా
నారంభింపుడు, నందుఁ దియ్యయలయొం డాకాశసీమాంతరా
పూరంబై, యెదబీటిపట్టు లఖిలమ్ములన్ ముంచి యివ్వాసనన్
దూరం బశ్రుతపూర్వమైన యెడకుం ద్రోసెన్ ద్వరాక్రాంతమై.

మేరల్ మిన్మ్రాఱి పెరింగిపోవు నల యూర్మిం గొట్టుకొపోయి, త
దారానీరమమైకయష్టి నయి, నిద్రాదేవియంకంబునన్

వీరావేశముమధ్యమం దమృతనాభిన్ స్వచ్ఛమూర్ఛామహా
గారంపున్ గుహయందు నెంతవఱకో కానిమ్ము నే నుండితిన్.

ఈయది కలదు, తా నీయది లే దని
యనఁగ శక్యముకాని దల్లభూమి
ఈవలనావల నెల్లెడఁ గిరణసం
చయము లంకూరించి లయముగాంచు
ఒక్కనావయు నేని యుండఁబోవని మహా
తేజస్సముద్రంబు తేజరిల్లు
అమృతపత్తనవిహారాగారతటములఁ
దటతటమని యది తాఁచుచుండు
దానిచే నామనస్సరస్తటయుగంబు
త్రుళ్ళికూలెడువేళలఁ దూముమోము
దాల్చి జాగ్రదవస్థ తత్కాంతివారి
ఒక్కచుక్కని దాన లేకుండఁజేసె.

అంతం గన్నులువిచ్చి చూచితి, నహో! యానందరాజ్యంబునన్
గంతుల్ వైచితి, భూతసృష్టిబహిరాకారంబునుంగాంచుచున్
వింతల్వోయితిఁ, జేతులెత్తి గురుగంభీరస్వరంబొప్ప 'మీ
రంతా రం డిట దేవదేవసుతులారా!' యంచు ఘోషించితిన్.

ద్రాఘిష్ఠంబై సాగిన
నాఘోష యదొక్క శైలనాథోరుగుహా
శ్లాఘాపాత్రంబగుటన్
మేఘమువలె నచటి కే గమించితి వేగన్.

కోనల్ దేలిన గండశైలములు, ద్యోగోళాంతభాగంబుతో
మేనిన్ రాచెడుశృంగముల్, బలముచే మిన్నెత్తువృక్షాగ్రముల్
గానంబుం బచరించి నెత్తములలోఁ గార్కొన్నపిట్టల్ నినుం
గానంగాఁ దలలెత్తె నయ్యెడల నేకంబైన భావంబునన్.

పరమపవిత్రమైన యలపర్వతమందులఁ గూరుచుంటిఁ, బై
దిరుగుచునుంటి, నెంతయును దిగ్భ్రమ జెందుచునుంటి నే నసం

తరమొకతృప్తి, కొండొకముదంబునుబొందుచునుంటి,మింటిరా
సిరి గనుచుంటి, నుంటిఁ దొలిసృష్టిని దొల్తటిజీవియట్టులన్.

అచటఁ గాకులుగూడ నలవోక మరణముల్
జననముల్ 'కావుకా' వనుచునఱచె
అచట నక్కలుగూడ నల కర్మకాండ తా
'నూలయూల' యటంచు నూలవెట్టె
అటఁ గుక్కలుంగూడ నతిమనోహరసుస్వ
రంబుగా సామగానంబొనర్చె
అటఁ దుమ్మిమొక్కయు నలరుగుత్తుల నలం
కృతిజేసి నా కొక యిల్లుగట్టె
శాద్వలం బొందు నాకు నాసన మొసంగె
మందమలయానిలంబు సమాధిగూర్చె
ఈశ! నీకడ నుంటినా? యింక నెంత
నడక చెప్పవె? మనసుసూ నాదుపేరు.

(ఏకావళినుండి)

## రాయప్రోలు వేంకట సుబ్బారావు

[19, 20 శతాబ్దులు]

### అమలినప్రేమము

చెలియా! ఎన్నడొ చేరదీసె మనలం జిన్నారినేస్తంబు, ము
గ్ధులమైయుంట నెఱుంగమైతి మపు డేఘోషన్ రవంతైన, కం
దళితస్నిగ్ధరసోదయంబగుట చేతం బిప్పు డల్లాడి యా
కులుమేయున్ బలవద్వియోగము లనుంగుంబ్రేమలంద్రెంపగన్

తనగుణలతలు పూచినశోభలో యన
చిఱునవ్వు వెన్నెలచెండ్లు విసర
తనమనోలీల కాంచిన రాగమధువన
పలుకుకొమ్మలు పూలపాలు పిదుక

తనభావబంధ మందిన విభ్రమం బన
  చూపులు వలపుటుచ్చులను పన్న
తనప్రేమభావనల్ గను నూత్నకళ లన
  నడలు ప్రాయంపుమన్ననలు సూప
కనుల నజువాల్చి పాతితాక్షములతోడ
గాంచియునుకాంచలేని క్రీగంటికొసలు
పెడలవాలికల్ రాల నిల్చెడు త్వదీయ
మౌగ్ధ్య మెడబాయలేదు నామది లతాంగి!
నాయనుగుంజెలీ! చెలిమినాటినచిత్తమె యార్ద్రి. మందు నా
శాయతరంజనంబయి ప్రియం బెనయించిన యాదశల్ కడుఁ
దీయము లేమిచెప్ప! విడదీసిన రేకులపూవుచందమై
పోయినమైత్రి కేగతులుపో వలవంతలుదక్క నీభువిన్.
పొరఁపెఱుంగక ఒకకంచమున భుజించి
మనసునాటిన మమతల ననగిపెనగి
వలచుజతలను విడదీయదలచునేని
ప్రేమ నలయించుసృష్టి దైవికముగాదు.
నష్టమైనట్టిప్రేమఖండముల కొక్క
సుకవియక్షరజీవగీతికయ చాలు;
సకియ విశ్వాసబాష్పముల్ చాలు నాకు
లేదు వేఱాస ప్రణయవల్లీమతల్లి!''...

ఆమె: ''తగునోయీ? మిత్రుడ! నె
వ్వగలన్ దురపిల్ల, ప్రేమబంధము లకటా
తెగవోయీ తెగద్రెంపిన
మిగులగనిత్తురె మనంబు మిథ్యాభ్రమలన్?
దైవికంబగు సుకృతినిదక్క నవని
జతలప్రేమోదయంబు సంగతముకాదు
అందు నస్ఖలితప్రణయానురక్తి
చిరతపశ్శుద్ధిచేగాని దొరకబోదు.

బొంది నటించుప్రాణి వలపుల్ సుడియించినవేళ నింద్రియా
ళిః దనియింప కౌతుకమలీమసమా, నటబద్ధ ధర్మపుం
బందము లీడ్చియీడ్చి అనపత్యముఖాదికమైన భూతర
క్తిం దగులూని ప్రేమరుచికి న్వొలియాట తెలుంగవో చెలీ

చైత్రుతో వచ్చు పల్లవసముదయంబు
హిమవదాగమమున నశియించినట్లె
పడుచుదనముతో చిగురించు వలపులెల్ల
కళుకెడలి కృశించును జరాక్రాంతదశల.

కలిసినయంతమాత్రమున కాదుసుమీ చెలికార, మంతరం
బుల నతుకంగజాలిన అపూర్వపులంకెయె స్నేహమా, తద
స్ఖలితసమస్తసాధనము జ్ఞానవిదగ్ధుల మార్గసూత్ర, మే
వలతియునైన ప్రేమపరిపాకము లిట్టులె యన్వయించెడిన్.

పరమధర్మార్థమైన దాంపత్యభక్తి
స్తన్యమోహనమైన వాత్సల్యరక్తి
సాక్షిమాత్రసుందరమైన సఖ్యసక్తి
పొందు నాదిమమగుప్రేమయందె ముక్తి.

వలపుల పూలసంకెలలు బందములేయగ గువ్వజంట, ని
ర్మలమగు వత్సలత్వ మెద రాగిల ఆవులతల్లిబిడ్డ, లే
కలుషములేని సత్ప్రణయకాంక్షలు మేళనజేయ మిత్రముల్
మెలగుదు రీరహస్యమె సుమీ కనిపించెడు సృష్టియందునన్.

మనసుచే వాక్కుచేత కర్మంబుచేత
కలుషితములు కాదగిన వీ వలపు లవని;
తపసుచే, తాల్మిచే, ధ్యానధారచేత
లీనమై యైక్యమీయజాలినది ప్రేమ.

శాంతియు ప్రేమయు న్మధురసంబులు, పేశలరాగలాలిత
స్వాంతదళీపుటంబులను అయ్యవి అస్ఖలితంబులై మనున్

అంతరముల్ పెనంచిన ప్రియప్రణయంబులు మాయబోవు, వి
భ్రాంతియకాక ప్రేమ గలుపన్ విడదీయ నిమిత్తసాధ్యమే!

కామము లేనిమేళనసుఖంబున గ్రాలు లతాసుమంబు లా
రామములందునుండియు బరస్పరము స్విడనాడ; వెట్టు లీ
ప్రేమతపఃఫలంబును లవింపదెగించితి విప్పు డోచెలీ!
ఏమిటి కీచిరప్రణయవృంతనికృంతనపాపకర్మముల్!...

వలపులె రహస్యములు, తద్విఫలదశలు ని
గూఢములు, తదర్థములును గోప్యములు, వి
దగ్ధుల కనుభవైకవేద్యంబు లివియె
ఏల మాతృగర్భవిమర్శ యిపుడు సఖుడ!

కనుల నొండొరులను జూచుకొనుటకన్న
మనసు లన్యోన్యరంజనల్ గొనుటకన్న
కొసరి 'యేమోయి' యని పిల్చుకొనుటకన్న
చెలుల కిలమీద నేమికావలయు సఖుడ?

భావబంధంబుగా మణిబంధమందు
తొలుత గట్టితి నీపట్టుతోర మీవు
విప్పెదవె యిప్పు" డనుచు జూపించి, కనుల
నశ్రువులు నిండ బలుకలేదయ్యె నామె.

నిలిచిరి కొండొకవడి ని
ట్టుల నాయిరువురును బెనవడుందమి, పిదపన్
జెలియకరంబున తోరము
వెలివఱిచె నతండు మనము వెడలింప వెతన్.

చెంత లవంగవల్లికలచే కడలల్లి, కిశోరశాద్వలా
క్రాంతములైనపాదులకు గట్టెడు చల్లనినీరువాఱుకు
ల్యాంతముల్లన్ పెఱుంగు తరుణార్ద్రితృణాంకురపాళి గిల్లి, ఆ
కాంతుడు వింతమెన యొకకంకణముల్ రచియించె నింపుగన్

నవకమెడవోని తృణకంకణమును కేల
నందుకొని, యామెపయి నయనాంచలములు
మరలిచి, 'సకియ! మనప్రేమమధురలాంఛ
నం బిదియెసుమ్మి' యనుచు హస్తంబుదొడిగె.
"ఈతృణకంకణంబు భరియింపుము నీ మణిబంధమందు, సం
ప్రీతిని అప్పుడప్డు వలపింపులనెయ్యము జ్ఞప్తిగొన్నప్రా
భాతికవేళ నీప్రణయబాష్పజలాంజలి నింత యిచ్చి, యే
రీతిని వాడకుండ నలరింపు, మిదే తుదివాంఛ నెచ్చెలీ!"
అనుచు మొగ మావలకు ద్రిప్పె, నరుణకిరణు
డాళ మార్చినయట్లు, లాయమృతవతియు
వ్రేలి వలపుటుంగరమును వెడలదీసి
ప్రియసఖునిహస్తము నలంకరించు చనియె.
"వలపు నశియించియును ప్రేమ నిలువగలద
యేని కలనైన గలుషముగాని స్నేహ
మృదుమధురసానుభూతిని బొదలి, మనము
నీడలట్టుల నైక్యమందెదముగాత."
అపు డదృష్టదేవత కర మల్ల సాచి
లలితముగ జల్లు నమృతాక్షతల విధాన
వకుళసుకుమారతరుమతల్లి కలనుండి
జలజలం బూలు రాలె నాజంటమీద.

(తృణకంకణమునుండి)

## జన్మభూమి

ఏదేశమేగినా, ఎందు కాలిడిన,
ఏపీఠమెక్కినా, ఎవ్వ రేమనిన
పొగడరా! నీతల్లి భూమి భారతిని
నిలుపరా! నీజాతి నిండుగౌరవము.
ఏపూర్వపుణ్యమో, ఏయోగబలమొ
జనియించినాడ వీస్వర్గఖండమున

ఏమంచిపూవులన్ ప్రేమించినావో
నిను మోచె నీతల్లి కనకగర్భమున.

లేదురా ఇటువంటిభూదేవి యెందు
లేదురా మనవంటిపౌరు లిం కెందు
సూర్యుని వెలుతురుల్ సోకునందాక
ఓడలజెండాలు ఆడునందాక——

అందాకగల యీ యనంతభూతలిని
మనభూమివంటి చల్లనితల్లి లేదు.
పాడరా! నీతెన్గు బాలగీతములు
పాడరా! నీవీరభావభారతము.

తమతపస్సులు ఋషుల్ ధారపోయంగ
శౌర్యహారము రాజచంద్రు లర్పింప
భావసూత్రము కవిప్రభువు లల్లంగ
రాగదుగ్ధము భక్తరత్నముల్ పిదుక

దిక్కులకెగదన్ను తేజమ్ము వెలుగ
రాళ్ల తేనియలూరురాగాలు సాగ
జగములనూగించు మగతనం బెగయ
సౌందర్య మెగబోయు సాహిత్యమలర

వెలిగిన దీదివ్యవిశ్వంబు పుత్ర!
దీపించె నీపుణ్యదేశంబు పుత్ర!
పొలముల రత్నాలు మొలిచెరా యిచట
వార్థిలో ముత్యాలు పండెరా యిచట
పృథివి దివ్యౌషధుల్ పిదికెరా మనకు
కానల కస్తూరి కాచెరా మనకు
అవమానమేలరా, అనుమానమేల
భారతీయుడనంచు భక్తితోపాడ.

( ఆంధ్రావళినుండి )

## తల్లావజ్ఝల శివశంకరశాస్త్రి

[ 19, 20 శతాబ్దులు ] **విభ్రమము**

దేవి! ఈనేత్రములకు యాదృచ్ఛికముగ
త్వన్మనోహరరూపసందర్శనాభి
సిద్ధికై యెన్నిసార్లు నిల్చితినొ తెలియ
దహహ! వాతాయనమ్ముల కభిముఖముగ.

విమలకమనీయవదనారవిందమధుర
వీక్షణాక్షణరక్తి దేవీ! త్వదీయ
సౌధసవిధమ్మునకు నెన్నిసార్లు తీర్థ
యాత్రసల్పితినో దెల్ప నలవికాదు.

అమలసంజీవనౌషధంబౌ త్వదీయ
శాంతరమ్యకృపాకటాక్షమ్ముకొఱకు
చెలగి హర్మ్యమునకు ప్రదక్షిణము లెన్ని
చేసినాడనొ లెక్కించి చెప్పలేను.

హృదయభారఘనధ్వాంతవిదళనాచ్ఛ
చంద్రికాకాంతిపూరయుష్మన్మనోజ్ఞ
దివ్యదరహాసమునకు మందిరములోని
కెన్నిసారులు వచ్చితి నెఱుకలేదు.

* * *

శ్రవణములు సోకినంత, దుస్సహవిషాద
కర్దమక్షాళనము చేయగలిగినట్టి
త్వన్మధురనామధేయామృతమ్ముగాని
ఇతర మేమియు చెవి జేరనీయనొల్ల.

దివ్యగంగాతరంగిణీతీర్థమట్లు
భావితావిలమార్జనపటిమ గల్గి

మధురమధురమైన తావకకథలెగాని
ఇతరమును జిహ్వవెంట రానీయనొల్ల.

చిత్తపద్మాంతరాళసంస్థితవిషాద
గాఢతమసంబు హరియింపగల్గినట్టి
భవ్యభవదీయరూపదీపంబుకన్న
ఇతరమును దృష్టిసరణి రానీయనొల్ల.

చారునిర్మలచంద్రికాపూరమట్లు
హృదయతాపము చల్లార్చి ముదముగూర్చు
త్వన్నిరంతరమధురభావనలెగాని
ఇతరమేమియు మదికి రానీయనొల్ల.

## సందర్శనము

నినుం గనినయంతనే నిఖిలలోకగంభీరతా
మనోజ్ఞమహితాభయే మదికి దోఁచు సీమంతినీ!
జనించు వెనువెంటనే చకితలోచనాంతోల్లస
ద్వినమ్రత ఘనమ్ముగా విమలభావసంశ్లిష్టమై.

చిరమ్ముగ మెలంగు నాస్మృతిపథమ్మునన్ సమ్మద
ప్రరోహమధురమ్ముగా భవదమోఘభూరిప్రభా
పరీవృతశరీరమున్, పరమపాండుకౌశేయమున్
కరేణువరయానమున్, కటకకంకణారావమున్.

ప్రభాతసరసీరుహప్రతిభటప్రభావోల్లసత్
స్వభావరమణీయమౌ వదనబింబ మీప్రొద్దునన్
శుభాంగి! యుదయింపగా సుదృఢమామకాంతర్వ్యథా
విభావరి రయమ్మునన్ వెడలె నేత్రమార్గమ్మునన్.

(శివశంకర కృతులనుండి

## మాధవపెద్ది బుచ్చిసుందరరామశాస్త్రి

[19, 20 శతాబ్దులు]

### సతీస్మృతి

నను వంచించెనుగాని పాడునరజన్మం బిచ్చి దైవంబు, మిం
టను బాఱంగలయట్టి పిట్టనయియున్నన్ నా బహిఃప్రాణ ముం
డినలోకంబున కట్టె నే నెగిరిపోనే యెన్నఁడో! యింకఁబా
ఱిన యీ వ్యర్థపుజీవనంబను నెడారిన్ యాత్రసాగింతునే.

నిరుడేఁ గన్నులఁ జూచుచుండఁగఁ జితాగ్నిజ్వాలికామాలికాం
తరతప్తం బొనరించి నీ తనుసువర్ణంబందుఁ జెన్నొందు సుం
దర తేజంబు హరించి దైవము, శ్మశానక్షోణిలో నిల్పె నా
కొఱకై బూది, హరించె వాయు వదియున్ గోరంత లేకుండఁగన్.

అధికప్రయాసజిహ్వానీతమందమం
  దాంత్యకాలనివేదనాక్షరములు
పరివేదనాముహుర్భవబాష్పధారావి
  లోలసాకూతావలోకనములు
జ్వరతీవ్రతీవ్రతాత్వరమాణహృద్యంత్ర
  చరమనాడీహతాస్తంభనములు
ఇహనిరాశానిస్పృహైకసూచకముఖ
  చంద్రాస్తమయతిరశ్చలనములు
విషమఘటనావిభిన్నవిభిన్నమైన
నాహృదయదర్పణమున ననంతములుగఁ
బ్రతిఫలింపుచు నొనరించు బ్రళయతాండ
వార్భటి భయంకరాతిభయంకరంబు.

కడుపుందీపియు, గాఢమైన యనురాగం బేకమై మాటికిన్
విడుప్రత్యగ్రశ్రుకణంబునందుఁ బ్రతిబింబింపంగ సంతానము
న్నెడకున్, నా యెడ కక్షిగోళములు నీ విట్టట్టులం ద్రిప్పిచూ
చెడి నీ యా కడసారిచూపె నను మంచె న్నేఁటిపర్యంతమున్

అతిశీఘ్రంబుగ నస్తమించె నొక సంధ్యాకాలపుం జుక్కకుం
బ్రతిమై కన్నులపండువైన మనదాంపత్యంబు, కానీ-భవ
త్ప్రతినన్ బైపొరయెల్ల నూడిపడిపోవంజేసి నీయట్లు భి
న్నత లేకుండుననంతమం దెపుడు లీనంబౌదు నాత్మేశ్వరీ!

కుడిచను బాలుఁ ద్రావు పసికూనను వానియనుంగుదల్లి తా
నెడమకుఁ ద్రిప్పి చన్గుడువనిచ్చెడు నంతటిలోన బిడ్డ యె
వ్వడువునఁ బోరువెట్టుఁ బ్రతిప్రాణియు నట్టులె యీప్రపంచమున్
విడి పరమేగునానడుమ వేదనపాలగుఁ గాదె ప్రేయసీ!

(బృందావనమునుండి)

## మృత్యుంజయా!

మెడనాగన్నకు నొక్కటే బుసబుసల్, మేనన్ సగంబైన యా
బిడతో నీ కెపు డొక్కటే గుసగుసల్, వీక్షించి మీచంద మె
క్కడ లేనంతగ నెత్తిపై రుసరుసల్ గంగమ్మకున్, నీచెవిం
బడుటేలాగునొ మామొఱల్ తెలియదప్పా మాకు మృత్యుంజయా

పెద్దంజేయ మనస్కరింపదు నినున్, బిడ్డంబలెం జూచుచున్
ముద్దుంజేయుచు ముచ్చటాడుకొనుచున్మూపందునన్మోయుచున్
సుద్దుల్సెప్పుచుఁ జెప్పినన్వినుచు నిన్ జోక్కించుచుం జొక్కుచున్
బ్రొద్దుల్పుచ్చుట లున్నఁ జాలు నితరంబు ల్గోర మృత్యుంజయా!

ఇగ నే నొక్కకణమ్ము ముట్టనుసుమీ యీ వల్లకైలాసముం
దిగి, నాయింటికివచ్చి, నాయెదుటఁ దండ్రింబోలె గన్పించి, త
ల్లిగ నన్నుం దినిపించి, నాపలుకుఁ జెల్లింపన్వలెన్; గోరుకొం
ద్రుగదా బిడ్డలచేఁ బరాజయము తండ్రుల్ దేవ, మృత్యుంజయా

చూడంజూడ మహాశ్మశాన మనిపించున్ నాకు నీలోక, మిం
దేడన్ గాలిడఁబోవ నేరిపయినో యే వేయుచున్నట్టులే
లో డక్కయ్యెడిగాని నీమహిమ యాలోనే నివారించి, నీ
క్రీడారంగ మటన్నమాట స్మృతికిం గీలించు మృత్యుంజయా!

నాలోఁ గొన్ని దినాలనుండి యెవఁడో నాగస్వరం బూఁదుచున్
మూలాధారమునే కదల్చెడిని, తన్మూలమ్మునం జేసి కాఁ
బోలున్ శ్వాసయె యాడఁగాఁ బోడఁగు నెప్డున్ దేవతాసర్పమై
పోలంజూడఁగ నీవె యింపకుఁ గతంబో యేమొ మృత్యుంజయా

నీనామమ్ము జపమ్మొనర్చినకొలందిన్ విశ్వగానమ్ముగా
నానాఁటం బరిణామ మంది యటుపైనన్ బ్రహ్మగానమ్ముగా
రానున్ రాను ధ్వనించి లోన నిపు డుఱ్ఱూఁగు, నింకెందునన్
లీనంబౌటకొ! తృప్తియాత్మకెటులున్ లేదయ్య, మృత్యుంజయా!

ఎల్లన్ నీ వయిపోయి, నీవు తలపై నేచిన్నిపువ్వట్లో జా
బిల్లిం దాలిచియుండ, వెన్నెలలుగా విశ్వాన నీకాంతులే
వెల్లింగొల్పెడునట్టు లున్నయవి, యీ వేళావిశేషమ్ముచే
వెళ్లంబుచ్చుకు మింక దీని మనసే వేఱయ్యె మృత్యుంజయా!

లోకమ్మందునఁగాక వెన్నెలలు లోలోఁ గాయునట్లుండె, న
య్యాకాశమ్మున నున్న జాబిలియు, నాయం దున్న డెందమ్ము ని
శ్శోకాకారత నొంద నేమికతమో! యీ యాత్మసంబంధమున్
నీకారుణ్యముచేత నేర్పడుటగానే తోఁచు మృత్యుంజయా!

నావంబోలి ప్రయాణమైనది మహానందప్రవాహమ్ములో
భావం బెచ్చటికో, కను ల్వగిలిపోవం జొచ్చు ధావళ్యమే!
లావణ్యం బతిగణ్యమే! యెటులు కైలాసమ్మొకో బొందినే!
కైవల్యంబొకొ జీవముండఁగ నె! నిక్కమ్మొకో మృత్యుంజయా

ఏరో వెన్నెల చీఁకటు ల్గలసిన ట్లీ పర్వతాగ్రాన ను
న్నారే! యొక్కరిలోన నింకొకరు లీనంబౌచు నున్నట్టులున్
వేఱౌచున్నటు కానుపించెదరె! కానీ, వారికే వారు ప
ట్టేరే! యాదిపురాణదంపతులు కారే వారు! మృత్యుంజయా!

(మృత్యుంజయ శతకమునుండి)

## ఉమరు ఖయ్యాము

తలపై నొక్కొకపూవె రాలిపడుచుండన్, బైడిలేయెండచు
క్కల నెమ్మనులఁ గమ్మతెమ్మెరలమొల్కల్ నీటిపన్నీటిచు
క్కలఁ జిల్కన్, సరసీతటి న్వకుళవృక్షచ్ఛాయలోఁ గెంపుఁజా
యల ద్రాక్షారస మారగింతము వయస్యా! భుక్తశేషమ్ముగన్.

ఇం దీస్నేహలతాకుడుంగమున నేనే నీవునై యుండి, నీ
సౌందర్యమ్మును విప్పెదన్ నెమలిపింఛంబట్లు, లోఁజూపులో
నందింతున్ హృదయమ్ముకున్ హృదయమత్యంతమ్ము నర్తింతునా
నందాశ్రుల్ హావణిల్లి కన్గొనల నీనాతృష్ణ చల్లారఁగన్.

అదియు న్నీకు ననిష్టమైనయెడ సంధ్యాస్వర్ణవర్ణమ్ముచేఁ
బొదువంగాఁబడినట్టిచంద్రకళవై పో మిమ్మవు, దివ్యోదక
హ్రదమై పోదును నేను, నా యుదకమధ్యంబందుబింబించి, నేఁ
గదలన్ గాలికి, నీవునుం గదలి యాఁగన్వచ్చు నాలోపలన్.

కలకుం బ్రాణమువచ్చినట్లు, మది ఱెక్కల్ దెచ్చుకొన్నట్లు, మ
బ్బులతో మంతనముండియుండి మనచూపుల్చుక్కలంగప్పి పు
వ్వులజల్లుల్దవుదవ్వులం బొలయఁగాఁ బోరాని యే యంచు లం
చులలోనో విహరించుచుంటిమనిపించుంగోర్కెలూరించుచున్.

పోఁకలు పూచుచున్నపుడె, పోఁకలఁదమ్ములపాకు తీఁగియల్
ప్రాఁకుచుఁ బ్రాఁకుచున్నపుడె, పైపయివచ్చి లవంగవాయువుల్
సోకుచుసోకుచున్నపుడె సుందరి! యీలవలీనికుంజమం
దేకతముండి యిందు సుఖియింతము రేపటిమాట కేమిలే.

నీయభిలాషలెల్లఁ దుదనెగ్గవు, పూచినపూవు లన్నియున్
కాయలుగావు, సౌఖ్యమునఁ గష్టమటన్నది దాఁగి, రుచ్యమున్
జేయును గ్రొత్తగ్రొత్తగను సీధువునం జిఱుచేఁదువోలె; నె
న్నో యటుచూడు! కంటకము లొక్కపువుంబడయన్గులాబికిన్.

పడసినయట్టి యీయొడలు ప్రాఁతవడెన్, గడుగ్రొత్తక్రొత్తదా
నొడలికి సంబరాలుపడుచున్నది లోపలియాత్మ; ఉన్నయీ
తొడుగిదిగూడ నాశమయి తోడుగ నేనును మాయమౌదునో?
కడ కెదిఖాయమో? ఉమరుఖాయము కెవ్వఁడెఱుంగఁ జెప్పెడిన్
అమృతప్రాయముప్రాయమేగినది యీ యారామమందున్ వసం
తముచందంబున, రాలినా రిచటఁ బత్రమ్ముల్వలెన్ బ్రాణమి
త్రములున్, జీవిక వట్టిపోయినది పాత్రంబోలి, యీశూన్యలో
కమునన్ రోజులరాకపోక లాకలాగై పోయె నీనాఁటికిన్.
చెలి! దూరంబయిపోయె నీచరణమంజీరస్వనం బల్లబు
ల్బులుపాటంబలె, నాశరీర మిఁక దొర్లున్ బాత్రచందాన నీ
యిలపైనన్ రసహీనమౌచు, నరుగో! యెవ్వారొ రానున్నవా
రలు కాఁబోలును గోచరించెదరు తారల్వోలెఁ గంజీఁకటన్.
పుడమి సమస్తమున్ విడచిపోవుచునుంటి నటం చెఱింగితిన్
పడఁతిరొ! నిన్నుసైత మెడబాయుచునుంటి నటం చెఱింగితిన్
కడకు రవంతయేని యెఱుఁగన్వల నన్నదె లేక నాకునే
నెడమయి పోవనుంటి నిపు డెన్నఁ డెఱుంగని పెద్దనిద్దురన్.
(ఉమరు ఖయ్యామునుండి)

## కవికొండల వేంకటరావు

[19, 20 శతాబ్దులు]

### శివరాత్రి ప్రభ

కాలకంఠుని నాగసర్పము కుబుసమూడ్చి పడగబుస్సంది,
రెండునాల్కలు గండుమీసా లట్లు దూసింది
చెవులు మోసింది ;
నాగసారమూదేది ఎవరోయి,
రాగ మొలికించేది ఎవరోయి?
కాఱునల్లని కాళరాత్రి!
నొసట గొసరిన మూడోకన్ను
నివురులూదిన కొలిమి తెగడి

నెగడిఁద్రిప్పింది, పొగలుగప్పింది ;
కమ్మరయితే యినుము కరగ,
సోమరయితే చలినికాగ,
ఎవరు వచ్చేరోయ్ ? ఎవరు మెచ్చేరోయ్ ?
కాఱునల్లని కాళరాత్రి!

అర్ధరాత్రపు మహాంకాళీ కర్థమది కాలేదో, ఏమో ?
పునుకలా గలగలలు వింటూ కునుకుగన్నాదో ?
నాథునీ వద్దనదు నాట్యము, నాథునీ కద్దనదు—
అరరే ఆడిపోతున్నాయ్ !

వాడిముమ్మొనవాలు, హుతభుక్ ;
అజకపాలం ఢక్కడుబుడుక్
నాల్గుసేతుల నాడులాతున్నాయ్
అశ్శరభ ! శరభ ! ఆడిపోతున్నాయ్ !
పందెమువేసేది యెవరోయ్ ?
కుందనముకాసేది యెవరోయి ?
కాఱునల్లని కాళరాత్రి !

చంద్రమకుటము జటాజూటము
సాంద్రనీలపుజడలపాపట సురిగిపోతున్నాయ్ !
చక్కనీ మువ్వన్నెచర్మము అక్కళించినపొట్టపైని
అంటియుండీ అంటకున్నాదోయ్ !
'ఆకలా ?' అని అనేదెవరు ? సోకులాఅని అనేదెవరు ?
కాఱునల్లని కాళరాత్రి !

మోకరింపులుగావు, అది మరి బూకరింపులనిలువుగాదు ;
ఆకడకుబడు నొక్కయంజ, ఈకడకుబడు నొక్కయంజ
ఏకముగ జేయుచును నడు మొక
రేకగా దా వంచికొంచు;
సందియం లే కెంచువా రెవరు ?

చిందు అని తోతెంచువా రెవరు?
కాఱునల్లని కాళరాత్రి.

అహంకారము లేదు లోలో,
మహార్ణటనము మొగముచాటదు,
మహాదేవా! అభయమిడుమన
అభినయానకు హ స్తమే లేదు!
రభసమున దన ముందువెనుకల
ప్రభల గలిపించు!
ప్రభలలో ప్రభ నిలుప నెవరోయ్?
ప్రభలలో ప్రభ గలుప నెవరోయ్?
కాఱునల్లని కాళరాత్రి!

## దాక్కొని ఉంటాయ్

దాక్కొని ఉంటాయ్! దారంట గడ్డి ని
రుక్కొని వుంటాయి!
తలపగరానిపూలు, పిలువగబోనిపూలు,
నిలుపగలేని పూలు—దాక్కొని వుంటాయ్.
గ్రుక్కెడు వాననీళ్లకు పక్కొననవ్వుతాయి
లెక్కకు రావో లక్షే, చిక్కవు మాలనుగ్రుచ్చ
ఇక్కడ నక్కడ బచ్చ, జక్కనపూస్తాయి.

దాక్కొని చూస్తాయి! దారంటగడ్డి నిరుక్కొని కూస్తాయి!
ఒక్కడ నడుస్తువుంటే, చుక్కలు పొడుస్తూవుంటే
మక్కువ కూర్చోమంటాయి; ఎక్కడో, ఎందుకో! చెప్పవు.
దాక్కొనివుంటాయి, దారంట గడ్డి నిరుక్కొని ఉంటాయి.
మంచుబింధువు పడిన, ఎంచిబాష్పము విడిన
అంచుల గాస్తాయి, వంచకమోస్తాయి
దాక్కొనివుంటాయి, దారంట గడ్డి ని
రుక్కొనివుంటాయి!

## రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ
[ 19, 20 శతాబ్దులు ]

### పెనుగొండ

పెనుగొండకొండ – ఈపెనుగొండ కొండ——(పల్లవి)
చనిననాళుల దెనుగుకత్తులు సానబెట్టినబండ ॥ఈపెను
రంధ్రముల బ్రవహించుతురకల
రక్తధారలు త్రాగి త్రేచిన
ఆంధ్ర కన్నడ రాజ్యలక్ష్ముల
అరితి నీలపుదండ – ఈపెనుగొండ కొండ॥
వెరపు లెరుగని బిరుదునడకల
విజయనగరపు రాచకొడుకులు
పోరలబోయగ కరడుగట్టిన – పచ్చినెత్తురుకండ ఈపెను॥
తిరుమలేంద్రుని కీర్తి తేనెలు
బెరసిదించిన కాపుకవనపు
నిరుపమద్రాక్షారసంబులు
నిండుతొలకెడుకుండ ॥ఈపెనుగొండ కొండ॥

## బసవరాజు అప్పారావు
[ 19, 20 శతాబ్దులు ]

### వటపత్రశాయి

ఒంటిగా నుయ్యాల లూగితివా
నా ముద్దుకృష్ణా!
జంటగా నను పిల్వదగదోయీ!
కంటి కంతా జలమయమ్మై
మింటివరకూ యేకరాశై
జంటదొరకని మహాప్రళయపు
టింటిలో వటపత్రడోలిక ॥ ఒంటిగా ॥

జగము లన్ని కాలయోనిలో
మొగము లెరగక నిదురబోవగ
నగుమొగముగల ముద్దుబాలుడ
వగుచు జోలలబాడుకొంటూ ॥ ఒంటిగా ॥

## నా ము క్తి

బతుకుబరువు మోయలేక
చితికి చివికి డస్సి వాడి
పికరుపుట్టి పారిపోయి
ఒకడనె యేతోటలోనో

పాటబాడుతుండగ నాప్రాణి దాటియేగేనా?
ప్రాణి దాటియేగుతుండ పాట నోటమోగేనా?

పాపఫలము నెత్తణచగ
బతుకు తెరువు వేరులేక
దాసుడనై దాంపత్యపు
తళుకులోలక చిట్టితో స

య్యాటలాడుతుండగ నా ఆయువు ముగిసేనా?
ఆయువు ముగిసేలదునుకు ఆటలలో ఎగసేనా?

కత్తిపోట్లు తినితిని కడు
గాయమైన పేదగుండె
బీతువోవ పరవశాన
ప్రియమారగ నాచిట్టిని

కౌగిలించుకుండగ నా కాయము సురిగేనా?
కాయము సురిగేవేళకు కౌగిలిలో కరిగేనా?

(గీతాలనుండి)

# దువ్వూరి రామిరెడ్డి

[19, 20 శతాబ్దములు]

## భవిష్యద్దర్శనము

సత్యమో, భ్రాంతియో, స్వప్నంబొ గాని
ఇంద్రజాలమువోలె నెదుటఁ గన్పట్టె.
అది సత్యమైయున్న నాశ్చర్యకరము
అది కలయేయైన నానందమయము...
మావితోఁటను బర్ణ మంటపమందు
జనరంజకంబైన సభయొండు జరగె
మొగలిరేకులు దమ్మిపూదోరణంబు
లందంబు నెత్తావి నర్పించుచుండె.
రారాజు క్రొంబచ్చరాగద్దె డిగ్గి
అందఱితోఁ పాటు యవని గూర్చుండె;
పనిపాటులేనట్టి బంటు సిపాయి
తుప్పువట్టినకత్తి తుంటిపై రాయఁ
దనపూర్వజయములఁ దలపోయుచుండె;
బురదచిట్టలుపడ్డ పుట్టముల గాఁపు
వర్తించె నృపపరివారంబు గలసి;
కూలినాలి యొనర్చి కుడుచు నిరుపేద
యజమాని సరిబంతి నాసీనుఁడయ్యె;
సకలమానవజాతి సంతతుల్ స్వకుల
వర్ణభేదంబులఁ బాటింపఁబోక
ఒక్కకడుపున బుట్టి యొకచన్ను బాలు
ద్రావినరీతి సౌదర్యంబు గలిగి
యన్యోన్యసాహాయ్య మర్థించువారు.
స్ఫటికపాత్రంబున శాంత్యాసవంబు
ధర్మదేవత తెచ్చి తనిపె నందఱిని;

ఏకకుటుంబమై యీ ప్రపంచంబు,
స్వర్గంబు భూమిపై స్థాపింపఁబడియె.
అభ్యుదయాంశువు లన్ని మూలలను
నవనవోజ్జ్వలజీవనంపుదీపముల
వెలిగించుచుండె; నీవిశ్వమంతయును
మానవకల్యాణమందిరంబయ్యె.
అంతలో లౌకికయాథార్థ్యములను
భావంబు వ్రాలెను బక్షివిధాన
బొగ్గుకంబములట్లు పొడకట్టుచుండెఁ
దత్ప్రాంతముల నున్న తాళవృక్షములు
చిమ్మచీఁకటి నొంటిఁ జిక్కుకొనియుంటి.

## అనార్కలి

అతిలోకసుందరీ, యవనకుమారి!
ఓ మోహమాధురీ, ఓ యనార్కలి!
ఏలొకో ఈవేళ నిహలోకరంభ
వేషంబు ధరియించి, వీక్షణంబులకు
అవ్యక్తమధురదివ్యానందలాభ
మొనగూర్చెదవు నర్తనోన్మత్తగతుల?...
ఏభావనస్పర్శ, మేరసావేశ
మీ యపూర్వపురాగ, మీ మూర్ఛనంబు
రేపెనోగాని నీహృదయవిపంచి,
నానందమదిరాబ్ధి యపరపారమునఁ
గనకసైకతమునఁ గాలుమెట్టెదవు.
గాలిలోఁ దేలినలీల భూతలము
నడుగు లంటీయంట కమరనాట్యంబు
నొనరింతు వరరె! నీ వూర్చినయపుడు
పైకిక్రిందికిబోవు పాలిండ్లతోడ
సభ్యులభావంబు స్వర్గమర్త్యముల

నడుమఁ ద్రిమ్మరుచుండె నాడెవిధాన ;
మంజీరకింకిణీమధుర రావముల
జంగమవీణలై చరణముల్ మ్రోసె ;...
చాలింపు మింక నా స్వర్గమునదక్క-
నింతసంతసమున కిలఁ దావులేదు ;
చావైనఁ దీపె యీసమయంబునందు.
ఓ యనార్కాలి ! రాగోజ్జ్వలపాద
పల్లవంబుల నేల మెల్లగా నిడుము
మాచిత్తచంపకమాల లచ్చోట
స్పర్శసుఖాపేక్ష బడియున్న వవిగో !
ఈ విలాసంబున కిం కేది హద్దు ?
ఈ రసోన్మత్తత కేది యంతంబు ?

* * *

ఓ యనార్కాలి ! మాయుల్లంబులందు
నీకాలిగుర్తుల రేక లగుపట్టు ;
ఈర్ష్యామయంబైన యీ లోకమందు
నిలువనీడైనను నీకు లేదమ్మ !
కల్పసుమంబవై గంగాతరంగ
శీతలశీకరాసేచనం బంది
చల్లగా బ్రదుకు నీసౌఖ్యంబు మాన్పి
ఏ పాడుగాలి ని న్నీ వల్లకాటి
దుమ్ములోఁ బడవైచె ? తుద కెండ వాడి
ధారుణీగర్భగంధంబు సొంపెక్క-
నీదు నెత్తావుల నింపుచున్నావె ! ...
పన్నీరు పూబొదల్ ప్రక్కల బలిసి
నీగోరిపైఁ జల్లు నిత్యమ్ము బూలు ;
కవులు కన్నీటిబిందువుల నీగోరి
తరతరంబులనుండి తడుపుచున్నారు...

( నైవేద్యమునుండి )

## దీపాల పిచ్చయ్యశాస్త్రి

[19, 20 శతాబ్దులు]

### నెల్లూరి గాలివాన

ప్రభవకార్తికశుద్ధసప్తమిని, భౌమ
వాసరోదయవేళఁ జూపట్టె సింహ
పట్టనంబున నొకకొంతవర్ష రేఖ;
చిటుకుపాటుకునఁ జిటిపొటిచినుకు సాఁగె.

వర్షమున కెదురుచూచెడు
కర్షకసంతాన మాత్మఁ గడుఁగడుఁ బ్రమదో
త్కర్షము నెనయఁగ ఘనసం
ఘర్షణ మపు డడరె గాఢగర్జాస్ఫూర్తిఁ...
ఆలక్రొన్నేతితో ననువైన పెరువుతో
  నులివెచ్చ యోగిరంబులు భుజించి
కుఱుచయంగీలపైఁ గుప్పసంబులు దొడ్గి
  బాగైన యున్నిదుప్పటులు గప్పి
నింగితో రాచెడు నిలువు మేడలలోని
  నాణెంపు మృదులాసనమ్ములందు
చేరి, యనుంగు నెచ్చెలులతో నుబుసుగా
  నాయాయిముచ్చట లాడుకొనుచుఁ
గరము సుఖముండె ధనికనికాయ మప్పు;
డనుభవింపఁగఁ గలిగిన యట్టివారి
కరయ వర్షాగమంబు సౌఖ్యదమ కాదె
యొడుదొడుకులేక కాలము కడచునేని.

అట్టుల సుఖకరమై కను
పట్టినముసు రంత మాఱె, ప్రబలానిలసం
ఘట్టనమున నెట్టనఁ బ్రజ
యిట్టట్టయి బెదర విసరె నిం డ్లూటాడన్.

తాటియాకులగుడిసెలు దారిచూపఁ
దోన పయనమ్ముగట్టెను తుంగకొంప
లవలఁ బెంకుగృహమ్ములు నరుగఁ దొడఁగెఁ
దలపడియె గీము లెల్లను వలసవోవ.

అతిమాత్రపృథులమ్ము లగు దేవరథములు
గుల్లగుల్లగ దొరగల్లువడియె
నభ్రంలిహమ్ములై యలరారు తద్ధ్వజ
స్తంభముల్ జడిసి సాష్టాంగ మెఱఁగె
నవదృషన్నిర్మితోన్నతదివ్యమండప
ప్రాకారములు సొక్కి పడుక వెట్టె
గోపురశిఖరసంస్థాపితగాంగేయ
కలశముల్ వెఱచి దిక్కులకుఁ బఱచెఁ
జటులఝంఝామరుజ్ఝంప చాల నొంప
దేవగృహములగతు లిట్లు తెల్లవాఱె
ననఁగ శుష్కసమిన్నిర్మితాల్పమాన
వాలయమ్ములగతు లింక నడుగవలెనె?...

పచ్చిబాలెంతతోఁ బసికందుతో జడి
నెటువోవఁ దోఁపక యేడ్చువారు
నిండుచూలాలితో నిసుఁగుతండంబుతో
నడువీధి సుడిగొని పడెడువారు
వలిగొని వడఁకెడు పశువుల శిశువుల
విడిచిపోవఁగలేక మిడుకువారు
మంచానఁ జివికెడుమాతకుం దాతకు
నెఱిఁగింపకయె పర్వులెత్తువారు
నిండు లుఱియంగ మూలల కీఁగువారు
నెదియుఁ బాల్పోక యెటకేని యేగువారు
నైరి జను లెల్ల రా ఘోరమారుతప్ర
కలితదుర్దాంతవర్షాభిఘాతభీతి...

జగదవసానసూచకముగా శమనుండు
  చఱపించు తమ్మటస్వానమేమొ!
నటరాజు ప్రళయతాండవముకై ముందుగా
  మ్రోయించు పటహనిర్ఘోషమేమొ!
ఉప్పొంగి జగతిపై కుఱుకుమహోదధి
  భంగసంఘర్షణార్భటియొయేమొ!
ఝంఝానిలుండు ప్రజ్ఞాస్ఫూర్తి వ్రేయించు
  జయఢిండిమోచ్చండశబ్దమేమొ!
అనుచు మే మెల్ల బెగడున నడలి వెగడు
పడఁగ బడెబడె గుభగుభధ్వనులు వెడలె
జీవితాశాలతాంకురచ్ఛేదకముగ
నమ్మహారావ మంతంత కతిశయిల్లె....
"నిలువుదోఁపిచ్చెద మదార్తిఁ దొలఁచు" మనుచు,
"వెండితో నిల్లు చేయించి వేడ్క నీకు
నే సమర్పింతు మా యిల్లు నిలుపు" మనుచు
వేంకటేశునిఁ గొందఱు వేఁడుకొనిరి....

తరతరాలుగనున్న దట్టపుమామిడి
  తోఁపులు గడియలో రూపుమాసె
పండ్లతోఁ గన్నులపండువుగావించు
  నంటుమామిడి మొదలంట మడిసె
నవనవలాడు పల్లవముల శోభిల్లు
  నాకుతోఁటలయంద మంతరించె
తునియలై టెంకాయతోఁటలు చేటందెఁ
  బోఁకనునోమ్మకలు పొడవడంగెఁ
జింత లుడివోయెఁ; బనసలు చిద్రుపలయ్యె
జీడిమామిడిపొలకువ చెడియె; నార
దబ్బ తబ్బిబ్బుపడి మ్రందె; నబ్బ! పండ్ల
చెట్టు లేదయ్యె నెల్లూరిసీమలోన.

పవనదుష్టప్రవృత్తిచే భంగమొంది
ఆత్మసౌభాగ్య మడఁగారి యసురుసురయి
చెల్లచెదరయి చెడిపోయె సింహపురము
రాక్షసుఁడు పట్టివిడిచిన రంభవోలె.

## వేలూరి చంద్రశేఖరం

[ 19, 20 శతాబ్దులు ]

### ఆహ్వానము

తెలియికలయెల్ల లెల్ల గతించు నేడ
ఎడఁద నిలుపోపలేక తోడుడుగు నేడ
గళితభేదబంధము మహామిళన మేడ
అయ్యెడలనుండి నీరవాహ్వాన మొందు
మ్రోఁగె లోనెల్ల వేదనబూరటిల్ల.
'నడునడుపు' మంచు దఱుముసందడియెకాని
గమ్యమున కేగుమార్గము కానరాదు.
కడ లెఱుంగమిచేత నెల్లెడల విరిసి
తూలియత్తాడు పూదావివోలె నాదు
గమనరణరణకమ్ము వ్యర్థమునఁబోయె.
మెఱపుచబుకుల చఱపులకఱపు కతన
లోనడలుసెంది యంతర్విలీనబాష్ప
మైన వర్షాంబరంబువిధాన తీవ్ర
భావనాకశాఘాతల వలనఁజేసి
అడలుగొనియెడి నాహృదయాంబరంబు.
ఓయి పరపారవాసి! అయ్యోడ్డునుండి
నీ వనుపు పిల్పులు ధనుర్వినిర్గతమ్ము
లైన యమ్ములవలె గమనాంకములను
బాటయందున గోచరింపంగనీక
తగిలి మర్మమ్ములందు వేధలనొనర్చు.

నీదు నాహ్వానవాణిచే నిండి నాదు
హృదయ మాధ్మాతశంఖమురీతి క్షుభిత
మగుట, వ్యగ్రస్వనాలాపియయ్యెఁగాని
నీవినికిదాఁక నెగయు నిరావిలస్వ
రాళియైనట్టిగీతి యుద్యతముకాదు.

(శారదనుండి)

## పింగళి లక్ష్మీకాంతం
## కాటూరి వేంకటేశ్వరరావు

[19, 20 శతాబ్దులు]

### అనుజ్ఞ

(భర్తయగు నందుడు బౌద్ధభిక్షువుకాఁగా, సుందరి—)

బాల్యమాదిగ నేర్చి పతిమెప్పు లందిన
 గానవిద్యాప్రసంగములు మఱచి
నందుఁ డేగినదారియందె కన్నుంచి వా
 పోవురాచిల్కను బుజ్జగించి
తనకోసమై యనుదినము క్రొత్తగఁబూచు
 నారామలతలనెయ్యమ్ము మాని
చెక్కుచెక్కునురాయ చిత్రించుకొన్నట్టి
 ప్రణయచిత్రముల వస్త్రమునఁగప్పి
చాయకగ్గిన చిత్రమ్ము, సౌరభమ్ము
గోలుపోయిన సుమమునై, గుర్తుపట్ట
రానివిధమున నంతిపురమ్మునందు
కాల మొకరీతి సుందరి గడపుచుండె.

వన్నెగలట్టి యానగరవాసిను లొక్కొక రేగుదెంచుచుఁ
మన్ననమై పరామరికమాటలు పల్కుచు, నూరడించుచోఁ

గన్నులనీరు నింపదు, ముఖమ్మున దైన్యము చేరనీయ, దే
మన్నఁ దటస్థభావపరయై బదులాడదు నిర్వికారయై.
'మనసు మరలించుకొనె' నంచు, 'మఱచె' నంచు
'కాలమే మాన్పు సర్వదుఃఖముల' నంచు
'మానవతి'యంచు, 'వైరాగ్యమూనె' నంచు
నోటి కొకమాట వీట నాబోటిగూర్చి.
ఆదటఁ బ్రత్యహమ్ము శుద్ధోదనుండు
శాక్యమునినూత్నధర్మసంస్థాపనమ్ము
వివరముగఁ దెల్ప, శ్రద్ధమై వినుచు, దాని
మననముం జేయు నొంటిపాటునఁగృశాంగి...
చిత్రాంబరములు దాల్చెడి విలాసిని క్రొత్త
 తెలుపులు, నీరుకావులు ధరించు
నెఱికురుల్ ముడిచెడినేరుపుల్, పూసరుల్
 విడనాడి చెలి యేకవేణిదాల్చు
బుద్ధదేవుని-ధర్మబోధనల్ కూరిమి
 చెలులకు వివరించి చెప్పుచుండు
భిక్షుకుండై నట్టి ప్రియునసత్త్వరూపమ్ము
 భావించి యంజలిపట్టుచుండు
దినదినమ్ము యశోధరాదేవి నగరి
కరిగి, యటఁ బ్రొద్దుపుచ్చు; నా యన్నదమ్ము
లిరువురఁ దలంచి నిట్టూర్చు; నింటనున్న
తమ్ముఁ దలపోసి యుత్కంఠ నుమ్మలించు.
నరవిఁ రెండవజామునన్ 'భవతిభిక్షాం దేహి' యన్ వాక్యము
చ్చరితంబై నపు డా లతాంగి చకితస్వాంతమ్మునం బుట్టు ని
ర్భరముల్, బాష్పజలప్రవర్షణసమర్థంబుల్, భవిష్యత్ప్రథ
స్ఫురణమ్ముల్,కరుణాప్రమోదభరితమ్ముల్, భావసంఘాతముల్.
ఆదరమాఱ భిక్షుకుల కర్చలొనర్చి, విహారవృత్తముల్
సోదెగొనున్, 'సుధాకలశసుందరపాణులు, వేల్పువెజ్జు లా

సోదరు లిందునందు భవశోకమహామయముల్ హరించుచో
నీదెస రారుగావలయు నెన్నఁడు' నంచు వచించుఁ గొంకుచున్.

పరిచారిక లెల్లరు ని
ద్దురవోవగఁ బ్రోదిచిల్కతో నొంటిగ సుం
దరనందుని ప్రియవృత్తాం
తరహశ్చింతనము చెప్పి తలఁపులు ద్రవ్వన్.

"మూఁడులోకమ్ము లొక్కట ముంచియెత్తు
ప్రణయమందాకినీ గృహోపవనసరసి
నిలిపికొని, యోలలాడఁగాఁ దలఁచుటెల్ల
వీఱిడిదనమ్ము గాదటే వెఱ్ఱిచిలుక!

సారము లేని తన్మధురభావసమర్పితపుష్పపీఠిపై
తీరుపుఁగత్తెనై నిలిచి, 'దేహి' యన న్వరమిచ్చు వేల్పనై
కూరిమి దేవినై మెలపుకొన్న ననున్ బడద్రోసి విశ్వసం
సారము రాజ్యమేలుకొనసాగెఁగదే తుదిఁ జిల్కనెచ్చెలీ!

కాంతుమదిలోఁతు గనక, మోఁకాలిబంటి
గాఁదలంచి యుప్పొంగితి, గౌతమర్షి
యంతరాంతరమున నిధు లరసియెత్తి
శుభ్రమణు లెల్లరకు నెఱచూఱలిచ్చె.

కారుక్రమ్మిన నామనోగహ్వరమున
వెలుఁగు మంగళదీపిక విశ్వమెల్ల
నేఁడు వెలిఁగించుఁగదె చెలీ! స్నేహపూర
నిర్వికలనిత్యశుభకాంతి పర్విగొనఁగ.

జగముపున్నెము ఫలియించి, స్వామిసేవ
లందుకొనుఁగాక నేను గాదంటినటవె
ఈ యభాగినికింగూడ నించుకంత
పాలొసఁగ కిట్లు వెలిపెట్టనేల చిలుక!

కాంతుఁ డేతెంచు మార్గము క్రొత్తకై సేసి
అడుగుదోయికిఁ జల్వమడుగులెత్త
ఆతఁ డొనర్చు లోకారాధనమునకు
ఉదకమై పుష్పమై యుపచరింప
ఆర్తసేవాశ్రాంతుఁడగు దయారాశికి
సురఁటినై చెమ్మటల్ సురుఁగఁజేయ
అతఁడు విహారకుడ్యములఁ జిత్రించు భా
వములకుఁ బ్రాణార్పణము నొనర్ప
తగనటే నేను నెచ్చెలీ! తనకుఁగాని
భాగ్య మిది నాకుమాత్రము భోగ్యమటవె?
అడవులకు నేగి, యిల్లు నా కడవిజేసె;
నయ్యడవి దేవళమ్ము సేయనటె నేను?''
అనుచు న్నంతనమాడుఁ జిల్కచెలితో, ''నార్తావనమ్మే కదా
తనకున్ ధర్మము, ప్రాణిపీడనముపొంతం బోరుగా భిక్షుకుల్
మనమందున్ దను నమ్మికొన్న నను నిమ్మాడ్కిన్ విసర్జింపరా
దని బోధింపఁగరాదె నీ వరిగి చిల్కా!'' యంచు దీనాస్యయై,
బుద్ధదేవుని శ్రీపాదమూలమునకు
నరిగి, శరణమ్ము వేఁడఁగా నాససేయు;
నంత తెగుదారితనము మేలాయటంచు
నుడుగు నమ్మానవతి; యంత నొక్కనాఁడు.
శరణము బుద్ధదైవము, ప్రశస్తపథమ్మగు బౌద్ధధర్మమే
శరణ మటంచు భిక్షుకుఁడు సౌధపురస్థలి నిల్వఁ గాంచి, సుం
దరి వడిఁ జేరవచ్చి శరణమ్మనె; అంత నతండు వల్కె ''నో
పరమదయామతీ! గురునిపంపున నేఁ డిట కేగుదెంచితిన్.''
అనుడు నాయింతి మోమింతయై ''భదంత!
ఎంతసుదినమ్ము నేఁడు! నీకేమి పనిచె?
గురున కీమందభాగ్యపైఁ గరుణవచ్చెఁ
గావలయు నేఁటి, కిఁక ధన్యగానె యేను!''

అనవుడు భిక్షుకప్రవరుఁ డాయమతోడ వచించు, "సోదరీ!
వినుము, గురుండు నీహృదయవేదన గన్గొని, బౌద్ధధర్మముల్
గొన మతియించు నీచరితకుల్ మదిమెచ్చి, యనుగ్రహమ్మునన్
నిను నిజశిష్యగాఁ బరిగణించెె, నిదే కొనుమమ్మ దీక్షలన్.

భద్రమిడుఁగాక బుద్ధదైవమ్ము నీకు,
బౌద్ధధర్మము నిను శోకవార్ధి గడవ
జేయుఁగావుత, నిన్ను రక్షించుఁగాత
భిక్షుసంఘమ్ము, శరణమ్ము వేఁడుమమ్మ!

వలపుతెప్ప నెక్కి, భవవారిరాశిలో
మునుఁగనున్నమిమ్ము మనుచుపొంటె
వేఱుసేసె గురుఁడు విశ్వదయాహార
తరళయుగము జేయఁదలఁచికాదె!

నీకయి పొక్కి, నిన్ దలఁచి నీరయిపోయెను, రాగవృంతమున్
జేకొని త్రుంపలేక కడుజేడ్పడె, భిక్షుకధర్మమూన క
ట్టాఁకలువెట్టె నందసుతుఁ, డానెన రేమనిచెప్ప! నింతకున్
సాకిరు లెల్లభిక్షుకగణమ్ము, గురుండు, విహారభూమియున్.

సత్యసంకల్పుఁడు గురుండు, సాధుహృదయుఁ
డింతకున్ నందుఁ; డీవృత్త మెల్లగతులఁ
గాంచె శుభపరిణామమ్ము; కడమ కింక
నీ మనస్వితవేఱ వర్ణింపవలెనె?

అమ్మ! విషమోపరాగమ్ము నందుఁ బొనుగు
వడిన మీప్రేమకణమును భద్రమూర్తి
దేశికుఁడు వెలికిం దీసి, దివ్యదీప
కళికగావించి, విశ్వమ్ము వెలుఁగఁజేసె.

బ్రహ్మచర్యవ్రతము, సత్యవాఙ్నియమము
జీవకారుణ్యము వహించి, చింతదొఱఁగి

భర్తృసహధర్మము చరించు భాగ్యమునకు
యోగ్యవగుమమ్మ! గురుఁడు ని న్నోముఁగాత!''
అనవుడు, రాగరంజితములౌ నయనమ్ముల మోదబాష్పముల్
దోనదోన జాలువాఱఁ, దఱితో నతినిర్మలశాంతభావమున్
గని,పులువాయుము త్తియముకై వడిమోము వెలుంగఁ,గ్రొత్తచె
ల్వాన మెయిదోఁగఁ,గేలుగవ మోడిచి యాచెలి నిల్చె నమ్రమై.
(సౌందరనందమునుండి)

## విశ్వనాథ సత్యనారాయణ
[19, 20 శతాబ్దులు]
### కొండవీటి పొగమబ్బులు

దగ్ధాంధ్రరాజ్యనిత్యవిధూతధూమమ్ము
 వలెఁ గొండబురుజులకెలన లేచి
బురుజుకొమ్ముల వీడిపోలేని రెడ్లకీ
 రితివోలెఁ బెనురాళ్ల నతుకులువడి
రెడ్లకందావెన్క రేగు వంటింటిపొ
 గ్గొగవోలె గుమ్మురులై ముందుసాగి
ద్రాఘావదాంధ్రస్వతంత్రతారమవోలెఁ
 గొండ లంటీయంటకుండఁ బోయి
శ్యామలీభవద్గ్రాసఘాసాదనార్థ
మొలయు వెల్లావులకదంబములుగ నిలిచి
కొండకొమ్ములు లో దాఁచుకొన్న క్రొత్త
క్రొత్త పొగమబ్బు లలమె నీకొండకొనల...
ఒకసారి వలిపమ్ము చికిలిముత్యాల యం
 చుల పోలిక నుపత్యకలఁ జరించు
ఒకసారి జఘనభాగోపరిస్రస్తచే
 లవిధాన గిరిమొదళ్లఁ బడిపోవు

ఒకసారి గిరిలక్ష్మి మొకముపై మొగలిపు
  ష్పాళ్లుఁదుకొన్నట్లు చెల్ల రేగు
ఒకసారి స్వేదబిందుకములు రత్యంత
  వేళాకుచావృతి విస్తరించు
చిఱుతపొగమబ్బు లీకొండసీమఁ బలుచ
బడి, విశీర్ణమై, ధూతమై, తడిసి, రాచ
సిరి యుడిగిపోయినట్టి యీ శిథిలదుర్గ
లక్ష్మి కొనగూర్చు వెట్టియలంకృతులను.

ఇడుపుల విలిఖించిరేమొనా ముక్తాక్ష
  రములుగా దుర్గకుడ్యముల నొలసి
ఇచట ముగ్గులుపెట్టిరేమొనాఁ గ్లప్తము
  క్తారేఖగా గిరిస్థలము మెఱసి
ఇట వితాన మమర్చిరేమొనా మృదుమరు
  చ్చాలితమధ్యమై చదలఁ దీర్చి
ఇట కేళకుళివెట్టిరేమొనాఁ దుదల శీ
  తలపృషత్పరిషించితములఁ గదలి

ప్రాతరనతిక్రమితయామభానురోచి
రాసమాత్తధావళ్యమర్యాదమైన
లేత యీపొగమబ్బు పురాతనంబు
త్రవ్వుచున్నది రెడ్లయాంధ్రప్రశస్తి.

ఇవి రెడ్లరాజుల యెదలలోఁ బూరించు
  కోరాని కోర్కెలు గుములుకట్టి
ఇవి తెల్గుబంటుల యిందుపగింజలై
  నాత్మలు వీడలే కఱుగుదెంచి
ఇవియు శ్రీనాథుని యెఱ్ఱప్రెగ్గడ కావ్య
  తకు రాని భావముల్ తరకగట్టి
అవచితిప్పయసెట్టి వివి రత్నరాశిగా

కొండవీటిపొలాల క్రీడికోసులేక
ఆశబలమున మగుడు ప్రేతాత్మలవలె
సారిది నీగిరికొమ్ములఁ జుట్టుపట్లు
నిట్టి పొగమబ్బులై భ్రమియించుఁగాక.

నా ప్రాణమునకును నీపొగమబ్బుల
కేమి సంబంధమో, యేనుగూడ
పొగమబ్బునై కొండచిగురుకోసలపైన
బురుజులపైనఁ గొమ్ములకుఁబైన
ప్రాలిపోనో, మధ్య వ్రీలిపోనో, నేల
రాలిపోనో, గాలి తేలిపోనో ?
నాయూహ చక్రసుందరపరిభ్రమణమై
యీపొగమబ్బులనే వరించె

ఎన్ని పొగమబ్బు లెత్తెఁగిలే నేను మున్ను
తూర్పుకనుమలు విడుచు నిట్టూర్పులట్టి,
విచటి యీపొగమబ్బులే యెడఁదలోని
లలితము మదీయగీతి నేలా వెలార్చు ?

(ఆంధ్ర ప్రశస్తినుండి

## రాధస్వప్నము

ఓచెలి! రాత్రి నేను గల యొక్కటి గంటిని, దానిలోఁ జిరం
టీచతురాంగణందు మననెయ్యపుఁబ్రోవు యశోదకన్నవాఁ
డాచరణంబొనర్చె నొక యద్భుత-మస్మదురోజముల్ మృదు
శ్రీచరణాంకితంబులుగ నృత్యముచేసె సకింకిణీధ్వనిన్.

అదియొక మాయగా హృదయమందున స్వామి నటించుచుండె న
న్నది తెలియంగవచ్చు, నయినన్ బలిరూపము గానుపించ, దా
పదములు కానుపించుఁ, బలిపాదతలంబులు చిల్కముక్కుపూ
లెద వెదజల్లినట్లయి సమృద్ధిగఁ బుల్కలపంట యేర్పడెన్.

నే నిదురించుచుంటినని నేను నెఱుంగుదుఁగాని, మేలుకొ
న్నా నను నొక్క జ్ఞానకలనంబున దీపితమై, విచిత్రరే
ఖానటనాభిరామపదకంజములన్ గుచసీమ కాంతిపా
థోనిధి మెట్టతామరలతోడి గిరిద్వయిపోల్కి కిం జనెన్.

ప్రణతిపరంబుగా నెదురుబళ్లుగ వంచిన కాళియాహిచి
క్కని పడగల్ హసించుచనుకట్టున గజ్జెలు మువ్వలున్ గల
స్వనములు పల్కఁగా నటనసల్పెను, గొమ్మలనుండి రాలు వం
పున బిగువాఱు క్రొత్తవిసెపూవులువోనిపదమ్ము లుంచుచున్.

చివురులఁ గొట్టినట్లు పతి చిన్నిపదమ్ము లనుక్షణమ్మునన్
దవులు సరోజమాళి, ప్రతితాఁకున నూతనమా సుఖానుభూ
తి వెలయు, నిట్లుగా నిరవధిన్ తరగంబడి క్రొత్తరంగగాఁ
గవిసినవాహినింబలె సుఖానుభవం బొకఁ డేచె దీర్ఘమై.

నాకిపు డింత సిగ్గు నగు, నాథుని యా పసికాలు నొచ్చునో
నాక, సుఖానుభూతిబడి నాయెద పుల్కలుగ్రమ్ము జాఱునో
నాక చెమర్చెఁబో; అసలుకన్నను వడ్డియె ముద్దటందు, రా
యాకృతి నాథహేతువగు నాసుఖ మాతనికన్న నిష్టమై.

వ్రాలిన నాథుపాదనఖబంధురదీప్తిఁ గుచద్వయంబు దీ
పాలిడికొన్న దేవళముపైని విమానములట్లు తోఁచి, సే
వాలసహస్తముల్ మొగుడ నాతని వెన్క నటత్పయోధరాం
దోళితమూర్తికిన్ మకరతోరణవైఖరి దాల్చె స్వామికిన్

ఆ లలితంబులౌ నడుగు లందము దెచ్చెనొ? ము న్నెఱుంగఁగాఁ
జాలనొ వానియందము? కుచద్వయి స్త్రీతరమైన మోహమై
కేల గదించి కౌఁగిట లగించగ నేనె తలంతు; స్త్రీలయున్
స్త్రీలయుమధ్యగా యని వచించితి వే అనుకోకవే చెలీ!

నిదురను మేలుకొంటినని నిశ్చయమైనది, యద్ది స్వప్నమ
న్నది నిజమైన, దింక నయినన్ బులకించుటమైన నాయెదన్

గదలుచునున్నయట్లు పసికాళులు తోఁచెడి మేలుకొన్ననా
మెద; యిది మేలుకొన్న దనుటే నిజమా, కలయే యిదా చెలీ!

(శృంగారవీథినుండి)

## శివధనుర్భంగము

శ్రీరామచంద్రుండు తత్సభాభవననికషప్రాగ్దిశాసౌధంబు పై
యంతస్తున నంతఃపురస్త్రీల కదలిక గుర్తుపట్టి తలయెత్తిన,

ఇదమిత్థమని నిర్ణయింపఁగారాని దే
  కోర్కెయో రూపుగైకొన్నయట్లు
జన్మజన్మాంతరసంగతమైన యా
  శాబలం బవధికి సాగినట్లు
ప్రాణముల్ బయటికి వచ్చి ముగ్ధాకార
  మెనయించి దర్శనమిచ్చినట్లు
తన సృష్టిలోని యుత్తమభావ మానంద
  ముగఁ బొంగి బింబమై పొడిచినట్లు
అల యరుంధతియును నహల్యయును గోస
లాత్మజాతయు మువ్వురియాననముల
కన్నను బవిత్రమగుచు శృంగారభావ
మొడిసిపట్టిన ముఖచంద్రుఁ డొకఁడు తోఁచె.

పునరుద్భవద్దంతముగ్ధమోహానరుచి
  ప్రకటరేఖాహాసభావపరిధి
బాల్యయౌవనదశాపరిణాహసంధిత్ర
  పాముగ్ధనేత్రశోభాపయోధి
పుష్కలాభివ్యక్తముగ్ధచిక్కణకపో
  లశ్రీరకాంతివేలాసుధాబ్ధి
శతసహస్రమనోజచాపలస్తకమహా
  భావపుంజీభూతఫాలవీధి

మై, దృగింద్రియగతపరమార్థమగుచు
హృదయదఘ్నమై, రక్తధునీనిలీన
వేగమాధుర్యపరసీమమై, గవేషి
తార్థసంప్రాప్తియై దర్శనార్థ్వ మొదిగె.

శ్రీరఘురామచంద్రునకుఁ జిత్తము జానకిపైఁ, గరంబు వి
స్ఫారశరాసనస్తకముపై యుగపత్క్రియఁ జిత్రమయ్యె; సం
ధారతిఁ గోటి కెక్కిన గుణంబు బిగించుట, లాగు టింతయున్
నేరఁ, డెఱుంగఁ డొక్కసడి నిండినశబ్దము కల్గునంతకున్.

మంజూషలోనె యమర్చి కోణంబందు
  నొక్కి త్రాటం గొప్పు నెక్కవెట్టెఁ
గాఁబోలు, మంజూషికావినిర్గమనంబు
  వేళకే జ్యావల్లి బిగిసియుండెఁ
దాళప్రమాణమౌ ధనువు జానకిదృష్టి
  కడ్డమ్ముగా వచ్చునంచు నెంచెఁ
గాఁబోలు, నడ్డంబుగా ధనుస్సును బూని
  పిడిబాకువలెఁ ద్రాడు ప్రీలలాగె
నతనిదృష్టికి జానకి యాగలేదు
అతనికృష్టికి శివధను స్సాగలేదు
సీత పూజడవెన్నుగా శిరసువంచెఁ
జెఱకుగడవోలె నడిమికి విఱిగె ధనువు.

నిష్ఠావర్షదమోఘమేఘపటలీనిర్గచ్ఛదుద్యోతిత
స్పష్టేరమ్మదమాలికాయుగపదుజ్జృంభన్మహాఘోరబం
హిష్ఠస్ఫూర్జథుమండఘుర్ఘురరవాహీనక్రియాప్రౌఢి ద్రా
ఘిష్ఠంబై యొక రావ మంతట నెసంగెన్ భిన్నచాపంబునన్.

హేరంబోన్నతశూర్పకర్ణవివరప్రీంకారియై, షణ్ముఖ
స్ఫారద్వాదశనేత్రగోళ వివృతిప్రాకారమై, శైలక
న్యారాజన్నవఫాలమండలవిభుగ్నక్రీడమై, యాఁశ్చల
ద్గిరుగ్రప్రమథంబుగా ధనువు ద్రోఁగెన్ శైవలోకంబులన్.

నృత్యన్మంజులతారహారకబరీనిష్యందిముక్తామణి
ప్రత్యగ్రప్రసవాక్షిసంకలనదీవ్యత్కంధరాభేదసా
హిత్యప్రౌఢనవాప్సరోనటనసాహిత్యప్రశస్తాచ్ఛదృ
గ్గీత్యాకారమనోజ్ఞమై ధనువు ప్రమోగెన్ స్వర్గలోకంబులన్.

దర్పస్వీకృతహాసవిశ్లథనరుంధద్దుష్టవాగ్ధోరణీ
సర్పద్వీరచమూపథశ్లథనమై, ప్రసంసత్కటీశాటికా
కూర్పాసప్రకటోగ్రసాధ్వసవధూగుర్విణ్యాభద్రాధ్వమై
దర్పాడంబరమై ధనుస్సు మొఱసెన్ దైతేయలోకంబులన్.

స్ఫీతాష్టాపదవిద్యుదుజ్జ్వలపయఃపీయూషధారాధునీ
నీతాస్వాద్యతరప్రగల్భవచనస్నిగ్ధానానాంభోజసం
ధాత్రీర్ధంకరమాగధోల్బణము, నానామేదినీరాట్సభా
గీతిస్వాదుమనోజ్ఞమై ధనువు ప్రమోగెన్ రాజలోకంబులన్.

(రామాయణకల్పవృక్షమునుండి)

## నండూరి వెంకట సుబ్బారావు

[19, 20 శతాబ్దులు]

### దీపం

ఆరిపోయవె దీపమూ
యెలుగులో నీమీద నిలుపలేనే మనసు॥ ఆరిపోయవె...

జిమ్మ్మంటా తోట నీకళ్ళైపోవాలి
నీకట్లో సూడాలి నీకళ్ళతళతళలు॥ ఆరిపోయవె...

తళుకుతో నీరూపు తెలుసుకోనితెలుసుకోని
నీకట్లో నాకళ్ళు సిల్లులడ సూడాలి॥ ఆరిపోయవె...

సూపులే ఆపేసి రూపువూసే మరసి
వొక రెఱుగ కింకొకరు వొరిగి నిదరోదాము
ఆరిపోయవె దీపమూ...

## ఆనాటి నావోడు

ఆనాటి నావోడు సెందురూడా!
అలిగి రాలేదోయి సెందురూడా!
ఎంకి మన మిద్దరమె, యెవ్వరొద్దన్నాడు
యీసేలు యీతోట, యింక నీవన్నాడు
మాటాడుతుండంగ సెందురూడా
మంచిదా పోయేవు సెందురూడా! ఆనాటి...
కలకాల మీదినమె నిలుసు మన కన్నాడు
గాలికైనా తాను కవుగిలీ నన్నాడు
ననుసూసి నవ్వేవు సెందురూడా!
నాయమా నాముద్దుసెందురూడా! ఆనాటి...
నాకాసి సూశాడు నీకాసిసూశాడు
మద్దె సెంద్రుడె మనకు పెద్దమని సన్నాడు
కన్నీరు నీకేల సెందురూడా!
కనికారమే శాన సెందురూడా! ఆనాటి...

## తబ్బిబ్బు

రవలవెలుగులగంగ రమ్మందిరా – యెంకి
శివమెత్తి తానాలుచేసిందిరా
సిరులతో ముత్యాలసరుల చెల్లాటతో
సిరిసిరీమువ్వలా చిందులా గంతులా రవలవెలుగుల...
సికలోన సిక కలిపి మొకముమొకమూ కలిపి
వెలుగుదేవతకు చక్కిలిగింతపెట్టింది రవలవెలుగుల...
నీలలో మునిగింది తేలింది వెలుగుతో
మబ్బుసెందురుడల్లె మనిసిలో మనసల్లె రవలవెలుగుల...
కాసీదేవునియెదట గరవాన నిలిసింది
తలతడుముకొని తానె తబ్బిబ్బులైనాడు రవలవెలుగుల...

(యెంకిపాటలనుండి)

## జి. జాషువా

[19, 20 శతాబ్దులు]

## స్మశానవాటి

ఎన్నో యేండ్లు గతించిపోయినవిగానీ యీ శ్మశానస్థలిన్
గన్నుల్మోడ్చిన మందభాగ్యుఁ డొకఁడైనన్ లేచిరాఁ డక్కటా
యెన్నాళ్లీ చలనంబులేని శయనం? బేతల్లు లల్లాడిరో!
కన్నీటంబడి క్రాఁగిపోయినవి నిక్కం బిందు పాషాణముల్.

ఆకాశంబునఁ గాఱుమబ్బుగము లాహారించె, దయ్యాలతో
ఘూకంబుల్ చెరలాడసాగినవి, వ్యాఘోషించె నల్దిక్కులన్
గాకోలంబులు గుండెఝల్లుమనుచున్నంగాని యిక్కాటిలో
నాకల్లాడినజాడలే దిచట సౌఖ్యంబెంత క్రీడించునో!...

ఇది పిశాచులతో నిటాలేక్షణుండు
గజ్జెగదలించి యాడు రంగస్థలంబు
ఇది మరణదూత తీక్ష్ణమౌ దృష్టులొలయ
నవని బాలించు భస్మసింహాసనంబు.

ముదురుతమస్సులో మునిఁగిపోయిన క్రొత్తసమాధిమీఁదఁ బై
బొదలు మిణుంగురుంబురువుపోలిక వెల్గుచునున్న దివ్వె, ఆ
ముద ముడివోయినన్ సమసిపోవుటలే; దది దీపమందువా,
హృదయముసుమ్మి నిల్పిచనియెన్ గతపుత్రక యేయభాగ్యయో
కవులకలాలు, గాయకుల కమ్మనికంఠము లీశ్మశానపుం
గవనుల ద్రొక్కిచూచెడి నాకానొకనాఁ; డలకాళిదాసభా
రవుల శరీరముల్ ప్రకృతిరంగమునం దిపు డెంతలేసి రే
ణువులయి మృత్తికం గలిసెనో కద కుమ్మరివానిసారెపై!
ఆలోకించిన గుండియ ల్గరగు నాయా పిల్లగోరీలలో
నే లేబుగ్గలసౌరు రూపఱియెనో! యే ముద్దు నిద్రించెనో!
యే లీలావతి గర్భగోళమున వహ్నిజ్వాల జీవించునో!
యీ లోకంబున వృద్ధిగాదగిన యేయే విద్య లల్లాడునో!

ఇట నస్పృశ్యత సంచరించుటకుఁ దావే లేదు, విశ్వంభరా
నటనంబుల్ గబళించి, గర్భమున విన్యస్తంబుగావించి, యు
త్కటపుం బెబ్బులితోడ మేఁక నొకప్రక్కం జేర్చి జోకొట్టి యా
ఱట గల్పించు నభేదభావమును ధర్మం బిందుఁ గారాడెడిన్.

(భారతినుండి)

## అడివి బాపిరాజు

[ 19, 20 శతాబ్దులు ]

## చెరువు మెట్లు

చక్కని చిన్నది చుక్కలరాణై
పాటపాడుతూ పడతి నిలిచినది.
తెల్లనిచీరా మెల్లని నడకా
మెళ్లోహారం తెల్లనిపూవులు ॥చక్కనిచిన్నది॥

బిందె బుజాన సందెనీటికై
చెర్లోకలువలు నల్లనికన్నులు ॥చక్కనిచిన్నది॥

కంఠమెత్తినది కలచుపాటలవి
పాటలుపాడుతు పడతి నిలిచినది ॥చక్కనిచిన్నది॥

చెరువు మెట్లపై చెలియ నిలిచినది
బంగరునీటిలో ప్రతిఫలించినది ॥చక్కనిచిన్నది॥

సందెచీకటిలో చుక్కలుకలిసెను
ఎట్టని పడమట ఇంతివెనుకనే ॥చక్కనిచిన్నది॥

పాటేభామై భామేపాటై
పాటా భామా పడమటిరంగై
బంగరునీరై పొంగెడిప్రేమై
చెరువుమెట్లపై చిత్రాలైరీ ॥చక్కనిచిన్నది॥

## వరద గోదావరి

ఉప్పొంగిపోయింది గోదావరి తాను
తెప్పున్న యెగసింది గోదావరీ
కొండల్లో ఉరికింది కోనల్లు నిండింది
ఆకాశగంగతో హస్తాలు కలిపింది ॥ఉప్పొంగి॥

అడవిచెట్లన్నీని జడలలో తురిమింది
ఊళ్లు దండలుగుచ్చి మెళ్లోన తాల్చింది ॥ఉప్పొంగి॥

వడులతో సుడులతో గరువాల నడలతో
పరవళ్లు తొక్కుతూ ప్రవహిస్తువచ్చింది ॥ఉప్పొంగి॥

శంఖాలుపూరించి కిన్నెర్లు మీటించి
శంకరాభరణరాగాలాపకంఠియై ॥ఉప్పొంగి॥

నరమానవుడి పనులు శిరమొగ్గి వణికాయి
కరమెత్తిదీవించి కడలికే నడిచింది
ఉప్పొంగిపోయింది గోదావరి తాను
తెప్పున్న ఎగసింది గోదావరి.

(గోధూళినుండి)

## అబ్బూరి రామకృష్ణరావు

[19, 20 శతాబ్దులు]

### ఏ త్రోవల పయనించెదవు?

ఏ త్రోవల పయనించెద? వే నిశీథశయ్యలపై
శయనించెద? వే యెలదోటలలో నీ యావాసము?
ఏ కరాళపన్నగీసమూహము నీసావాసము?
తరుశాఖాలంబితమై తూగు వెలుగుటుయ్యేలపై
చంచలించు నీరూపము పరిమళములు కదంబించు;
నీ విలోలమందహాససౌదామని యొక్కసారి

నా యంతస్సీమలందు వెల్లువమై వరదవారి
ఏ జన్మాంతరసౌహృదమో నాలో మేళవించు.

మఱి వేఱొకవేళ ముక్తకేశివై దిశాపిశాల
వీధీవేదిక లదరగ విక్రమించి విలపింతువు ;
విషమవేషధారిణివై జ్వాలామాలికలు వ్రేల
భూనభోంతరాళమ్ములు కొందలింప విహరింతువు ;
నా జీవనపాతాళము పెల్లు వెల్లివిరిసెనేమొ ?
నాకధునీజలదమాల జడివానలు కురిసెనేమొ ?

## ఈ శ్మశానభూమిఖండము

ఈ శ్మశానభూమిఖండ, మీ కాలినసీలినేల
కాలము కన్నీళ్లు కార్చి క్షాళించిన బూదిప్రోవు,
జీవనబాధాపీడితులు చేరిన విశ్రామశాల,
నీరవనిబిడాంధకారనిర్వాణమ్మునకు తావు
ఈ వసంతవేళ నే డిదేమో చివురులమంటలు
రేపిరేపి యెదయెదలో మేలుకొల్పి కలరవములు
వల్లకాట పండించిన దెన్నో పూవులపంటలు.

చిందించిన వల్లవివో, సురభిళమధురాసవములు
అవ్వాలి పెంజీకటిలో నవరోధము లెల్ల చీల్చి
కటికనేలపై శ్యామలకోమలరాంకవము మడిచి
దగ్ధులైన ప్రాణులు తరులతావేషములను దాల్చి
తరలివచ్చి నిల్చిరేమొ మృత్యురాజధాని విడచి ?
ఏ యశాంతిన ర్తకి యీ సింగారము లాలికించెనో ?
ఏ పురాణశోకరేఖ లీయామని పులకించెనో ?

( కవితసంధి )

## గుడిపాటి వెంకటచలం
[19, 20 శతాబ్దులు]

## విన్నపాలు

ఏమిటి అట్లా బిక్క మొహంవేసుకొని చూస్తావు ఏమీ ఎరగ నట్టు? రాత్రంతా కళ్లు వాచేట్టు ఏడిపించి పైగా!
నేనా? నేనా? నిజంచెప్పు, నేనా! ఏడిపించింది?
నలుగురు ఏమంటారో అడుగు. ఎవరికి తెలీదనుకున్నావు నీసంగతి? నీకఠినత్వం అనాదిగా అందరు ఎరుగుదురు. ఎందర్ని నమ్మించి, వంచించి చేరావో నాపాలిటికి. నాప్రాణాలు పిండ టానికి! రాత్రిరాత్రీ నీకోసం వేయికళ్లతో వెతికే నక్షత్రాలనడుగు. ఏడుస్తో ఏళ్లకిఏళ్లు ప్రవహించే నదుల్ని అడుగు. ప్రతిమూలా వెతుకుతో పరుగులెత్తే గాలి నడుగు. నీద్రోహాన్ని నమ్మలేక వెలవెలబోయే చందమామ నడుగు.
పైగా ఏ మెరగనట్టు బిక్క మొహంవేసుకొని నామనస్సుకరిగేట్టు చూస్తున్నావా? ఎక్కడకువెళ్లావు ఇన్నాళ్లు?
ఏం అపరాధం చేసాను నేను, నన్నింత మోసంచెయ్యడానికి?
అవును.
నీచూపులు నమ్మి, నిన్ను పొగడిన నీదొంగమిత్రులమాటలు నమ్మి, నిన్ను పిలిచిందే నాతప్పు.
అయినా నేను పిలిచింది ఏముంది?
అదేపనిగా రాత్రింబవళ్లు–వుత్తరాలు, కేకలు, కబుర్లు, కన్నీళ్లు– పడలేక సరేనన్నాను.
నామనసిచ్చిందాకా, ప్రతిదిక్కునా నీచూపులే, ప్రతిశబ్దంలోనూ నీకంఠమే, ప్రతిఆశలోనూ నీసహాయమే. చీకట్లో ప్రతిమూలా నీచేతులే. ఇంక చాతకాక సరేనన్నాను. అదా నాతప్పు?
ఈ ప్రపంచాన్నే ఎత్తి నా చేతుల్లో పెడతానన్నావు, నక్షత్రా లనే గుచ్చి నామెళ్ళో వేస్తానన్నావు. 'నేనే నీవాడనైనప్పుడు నీ కింకేం కావాలి' అన్నావు. మరచిపోయినావు.
నే నెట్లా మరవను నిన్ను? పువ్వులవెనకనుంచి నీ నవ్వులు, మబ్బులవెనకనుంచి నీ దోబూచులు, నాకన్నీళ్లలో నీనీడలు,

నా సుఖాలలో నీ స్పర్శలు, నా నిద్దట్లో నీ రహస్యాలు.
ఎట్లా మరవను నిన్ను ?
'నేనే నువ్వు, నిన్నెట్లా విడుస్తాను? హృదయంలోనే కట్టేసుకున్నావుగా, ఎట్లా వెడతాను?' అంటే నమ్మాను నీ దొంగ మాటలు. ఎక్కడ ఉన్నావు?
నామల్లే మోసపోయిన నిర్భాగ్యు లందరు — వాళ్లీ ఏడుపులోంచి తలెత్తి నవ్వుతున్నారు నన్ను చూచి.
ఎవరిది తప్పు భగవాన్, నువ్వు చెప్పు పోనీ. అంటాడు చెలం.

*   *   *   *

ఏమిటి నీ వుద్దేశం, ఇట్లా వెంటపడి వేధిస్తావు? నలుగురిలో నాకు నవుటాలై పోయింది. 'ఎప్పుడూ కళ్లువాల్చి ఏమాలోచిస్తా' వంటారు. 'నాల్గుదిక్కులు ఎవరికోసం అట్లా వెతుకుతా'వని వెక్కిరిస్తారు. 'ఏ ముందా చీకట్లో? నీకేం వెర్రా?' అని అడుగుతారు.
'ఎవరు నిన్నింత సీరసపెట్టారు, కారణంలేకుండా ఆ కన్నీళ్లేమిటి, ఏం జరిగింది' అని గాబరాపడతారు.
ఏం చెప్పను? నీపేరన్నా తెలీదు నాకు. ఎక్కణ్ణించి వస్తున్నావో ఎరగను. ఎప్పటినుంచి నిన్ను తలుచుకొని ఎదురుచూస్తున్నానో మరచిపోయినాను.
ఎక్కడికి పోయినా 'ఎవరు?' అంటారు. ఏం చెప్పను, ఎట్లా చెప్పను? వొదలవేం, ఇకనైనా?
పరధ్యాన్నం. ఒకటే ధ్యానం నీమీద.
కాని, పరుడివా నువ్వు? ఒకటే నన్ను బెల్లించి, మరిపించి, నా హృదయా న్నధిష్ఠించావు. ఇంకా పరుడివని ఎట్లా అనను, ఎట్లావొదుల్చుకోను?
నలుగురూ కూచున్న సమయంలోకూడా కిటికీలోంచి తొంగి చూచి పిలుస్తావు. నామాటలు తడబడతాయి, నాకళ్లు నీళ్ళతో నిండుతాయి. వొణుకుపుడుతుంది.
'ఏమి'టంటే ఏం చెప్పాలో తెలీదు. బావిలో నాముఖాని

కడ్డంగా నీముఖం కనపరిస్తే, అమ్మోవాళ్ల అరపుల్లో నీఆశ విన
పడితే. భోజనానికిబదులు నీపెదవులు తగిలితే.– చీకట్లో,
వెన్నెట్లో, మబ్బులో, ఎండలో, ఇంట, బైటా– ఎక్కడా నువ్వే
దాగుడుమూతలాడితే ఎట్లా బతుకను? బతుకు నీరసమైతే!
అర్ధరాత్రి ఎవరికోసమో ఎదురుచూస్తోవున్నప్పుడూ నువ్వే
వస్తే! నాసిగ్గు తీసేశావు, నావాళ్లని కాకుండాచేశావు.
ప్రతీపనికీ అడ్డం నువ్వే. పొమ్మంటేపోవు. చీవాట్లు, ఏడుపు,
రోషం—— ఏవీ లక్ష్యంలేవు నీకు. తిట్టినకొద్దీ మీదిమీది
కొస్తావు. సిగ్గులేదు నీకు.
ఇంత ప్రపంచం ఉండగా నాతాళం ఎందుకుపట్టావు ఇట్లా?
ఎన్నో గొప్పపనులు చెయ్యాలని, ఎంతో గౌరవం సంపా
యించాలని, ఘనతకెక్కాలని– నాయత్నాలన్నీ ఏమైనాయి!
ప్రపంచమంతా నాకేసి తలెత్తి చూసేట్టు చేద్దామనుకున్నాను.
ఇప్పుడు సిగ్గు, పేరు, వూరు, రూపం, గుణంలేని ఇది ఎవరని
అడుగుతారనీ, ఏంచెప్పాలో నాకు తెలీదనీ, అందరూ
నవ్వుతారనీ భయం.
'నువ్వే–నువ్వుకూడా, చివరకి నువ్వూ ఈవలలో, ఈపిచ్చిలో
పడ్డావా?' అంటారని అనుమానం. ఇంకేం మిగిలింది నాకు?
నువ్వా? నువ్వు నా కెందుకు?
ప్రతిమూలా దుమ్ములో, వారిలో, బిచ్చగాళ్లలో కూలి
వాళ్లల్లో, పిల్లలతో, పిట్టలతో తిరిగి, చవకబడ్డ నువ్వు
నాకెందుకు? ఏం గొప్ప నువ్వు?
ప్రపంచం నాకు కనబడకుండా, ప్రపంచానికి నేను కాకుండా
చెయ్యాలని నీవుద్దేశం. కానీ తప్పించుకోడం నాచాతకావడం
లేదు. వొదలిపోరాదూ నువ్వు!
'నిన్ను నేను వొదులుతానా, నీఅంతం చూడంది?' అంటు
న్నాడు, చూడు భగవాన్ అంటాడు చెలం.

(ప్రతిభనుండి)

## దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి
[19, 20 శతాబ్దులు]

### పల్లకీ

ప్రాణసఖుడె నాకోసమై పంపినాడు
పల్లకీ అన హృదయమ్ము జల్లుమనియె;
పీడనివియోగమున వేగు ప్రోడుమేను
తలిరుతోరణమై సుమదామమాయె.

చెదరుచేతుల నెటో కయిసేసికొంటి
మొయిలువసనమ్ములో, ప్రొద్దుపొడుపునగలొ
ఏదో కాలుచుపోయియో, ఏదో తేల్చు
భారమో యేమొ సైరింపనేరనైతి!

కొసరునడల తూగాడుచు గూరుచుంటి
పూలపల్లకిలో పూలమాల నేను!
'ఓ'యనగ 'నోహొహో'యన బోయవాండ్రు
దారిబడి నిల్చిచూచె నూరూరు నాడు!

'ఓ' యనగ, 'నోహొహో'యన బోయవాండ్రు
పీటివెలుపల మేల్కొనె తోటతెరవు!
'ఓ' యనగ 'నోహొహో' యన బోయవాండ్రు
తోటపాలిమేరకాలువ తొనకె నిదుర!

ప్రణయవల్లకి పల్లకీ! ప్రసవభరవ
సంతవల్లిక పల్లకీ! శక్రచాప
వక్రరేఖ పల్లకీ! మధుస్వప్న శాఖ
పల్లకీ!

### ఓహో వసంతా!

ఓహో వసంతా! ఓయివసంతా!
నీహారాంచలనిభృతనిశాంతా ఓహో వసంతా.

వేణుపు:

ఈ దారికెలకులం దేను వేణువునోయి
నాదాలకోవ! ఆనందాలపెనుప్రోవ!
స్వాదుమృదులములు నీపాదాలసవ్వడులు
ఏదవ్వులందైన ఏ నెఱుంగగ లేన?

బెదరు నీపెదవియూరుపుగాలి కదలేన
చెదరు నీచీరెకుచ్చెల సుంత మెదలేన
ఆగికోలేనోయి! అణగియున్నవి వేలు
ప్రోగిపోయేనోయి! మూగరహస్యాలు.

పూవులు:

ఘుసృణరసాలకిసాలరసాసవకషాయవికచగళా వసంతా!
మసృణకుసుమహృద్గళన్మరందస్నపితచరణయుగళావసంతా
ఓహోవసంతా! ఓయివసంతా
చిరతరపథికప్రియతమప్రేమిక ఓహో వసంతా...

కోకిల:

ఈపర్ణశాలలో ఏను కోయిలనోయి
నాపున్నె మీనాటికేని పండెగదోయి
ఒక్కరెమ్మ గవాయి. ఒకకొమ్మ సన్నాయి
దిక్కుదిక్కుల నేడు తోట ఒకటేహాయి!

ఎవరు తగిలించారొ ఈతీపిలో వగరు
ఎవరు రగిలించారొ ఈగొంతులో పొగరు
నాగుండె మెఱుపో, నానాథు పెదవులయొరపో
మైగదించిన దెవరు మావియిగురుకు తొగరు?

పూవులు:

మల్లీవల్లీమరకతకాంచీవేల్లితతనుమధ్యా వసంతా
ఫుల్లమాలతీపులకితవ్రతతీ పల్లవమృదురధ్యా వసంతా

ఓహో వసంతా! ఓయి వసంతా
అరవిందసిత కుందదరస్మిత ఓహో వసంతా, ఓయివసంతా!

తుమ్మెద:

ఎలదేటినోయి స్వామీ! నేను సెలయేటి
యలలలో కదలేటి కలువపూపడవలో
ఊయేల నీలీల ఊగేను తూగేను
నీయోలగము వేళనే ఇంత మఱపేల?

తరపి తేనియసోన తొరిపి మంచుజలాన
కురిపించి రెవరు క్రొవ్విరిగుండెలోలోన?
తగిలించి పలపుపుప్పొడిబూది నామేన
బిగియించి రెవరో మోదుగుపూవు చాపాన?

పూవులు:

నీలనీలకజ్జలసమగరుదంచలమధుకరచికురా వసంతా
లోలమనోహరపీచీవిచలితబాలమృణాళకరా వసంతా!
ఓహో వసంతా! ఓయి వసంతా!
శిశిరకుమారా కుసుమమనోహర ఓహో వసంతా...

గాలి:

దుడుకు రెక్కలజోడు తొడిగించుకొన్నాను
కడిమిపుప్పొడిజీను గదియించుకొన్నాను
దక్షిణప్రాంగణద్వాఃకవాటము పీడ
తెరచినావా తోట తెరువు మాధవదేవ!

కూర్చినావా సుందరీకోమలాలస
శ్యామలాలకల నవమల్లికల డోలికల?
పేర్చినారా దారి కురవకాశోకాలు?
ఓర్చికోనేలేవు స్వామి మృదుచరణాలు.

పూవులు:

ప్రతివిభాతహారీకృతరజతప్రాలేయాంబుకణా వసంత
ప్రతివిభావరీ విరహహృదయనిశ్వసనమలయపవనా వసంతా
ఓహో వసంతా! ఓయివసంతా!

వసంతుడు:

ఇటురావే ఇటురావే నవమల్లీ మాగధిమాధవి శేఫాలీ!
ఇటురావే ఓకురవకమా మాకందా ఓకింశుకమా!
కురియుమంచు నునుజడుల నడగుతెలి
యిసుకనుసుల బయళులపై
తొరగుపుష్పాదుల దొరయు తేనెయస
లొలయుచివురు తెరవులపై
చలితహిమానీలలితతుషారము దులిపికొనుడు మెయినంటెనులే.

పూవులు:

మధురమధురమధుమైరేయము మా
మరుగుటెదలలో నిండెనులే
ఓహో వసంతా! ఓయివసంతా!
నీహారాంచల నిభృతనిశాంతా!

## స్వస్తి

చిననాటిభావవల్లిని పూచినది, వాడ
 నిది, వాసనలువీడనిది యొకండు
కోరిక—నాల్గుదిక్కుల భూభువనమంత
 లవలేశమును వదలకయె తిరిగి
ప్రతిగేహదేహళి పదమూగి, ప్రతిహృద
 యద్వారతోరణ మట్టెత్రోసి
లోనికి జొచ్చి, నాలోనిస్నేహక్షీర
 మొక్కింతయొక్కింత యొలకబోసి

'అనుగు సోదర! మరలిరానా?' యటంచు
సెలవడిగి సాగిపోయెడు చిరపథికుడ
గావలయునంచు; నాశ యాకాశమంత,
పటిమ క్షుద్రవిహంగ; మిప్పటికి నంతె.

ఘర్మగంగాఝరీ ధర్మగోదావరీ
సిక్త సహజీవనాసక్త భారతభూమి
నొక్కపరి హిమశిఖరి నెక్కి, సేతువుదాక
దృక్కుసారించి, పూరించి గళకాహళిక–

విధురప్రియశ్రవోవీథుల మంగళ
  స్వాదువాక్యమ్ముల నూదగలను
నిలుపగాగలను నిర్నిద్రదీపావళి
  నంధమనోమందిరాంతరముల
కర్క శహృదయజాంగలముల శీతల
  స్నేహదుగ్ధమ్ము వర్షింపగలను
విరచింపగలను విద్వేషవైతరణికి
  నడ్డుగా గాఢసౌహార్ద సేతు

విటనె నిలిచి, సమస్తదిక్తటుల బిలిచి
సారెసారె జీవత్స్వరస్వాతిని మలచి
కవిని నేనై, పురాణవైణవికు నటుల–
నూహ లున్న, జగమ్మంత స్నేహమున్న.

నిన్న మొన్నదాక మన్నులో మన్నయి
యున్న ప్రాణశంఖ మెత్తినాడు
మానవుండు, గర్వమాణిక్యకోటీర
ధారి నేడు, విజయహారి నేడు.

ఈనా డీభువి జానిసీడు మఱి లేనేలేడు, ఒక్కొక్క ఫా
లానన్ పావకనేత్ర మున్నది పగ ల్గాల్పంగ, ఒక్కొక్క డెం

దానన్ క్షీరసముద్ర మున్న దవధుల్ దాటంగ, ఈ మానవుం
డే నిర్మాత విధాత నేత, యిక తానే భోక్త లోకమ్మునన్.

స్వస్తి జగత్తున కగు శ్రీ
రస్తు, సదాశాంతిర స్తటంచు వెలయు వి
శ్వస్తుత భారతవాణి సు
మ స్తబకమువోలె లోకమ స్తకముపయిన్.

## కొడాలి ఆంజనేయులు

[ 19, 20 శతాబ్దులు ]

### జైలులో చందమామ

చింత శల్యావశిష్టయై చిక్కి చివికి
నవసినమ్మృగాక్షి స్విన్నానమ్ము దోచు
కృష్ణపక్షమ్మున న్నీ వోకింత మాగ
వాక్షముల తొంగిచూచెదు పక్షమునను.

రాతిగుండెలు గలిగిన రాచభటుల
కర్కశాఘాతముల మేను కందిపోయె
శీతలహిమాంబుకణముల చిల్కరించు
అమృతకిరణాల స్పృశియింపుమయ్య మమ్ము.

ఆఁకట మరింత కృశియించినట్టి మేను
సాంధ్యపవనమ్ములు స్పృశించి చాలనాళ్లు
గడచె, జ్యోత్స్నాప్రసాదశీకరపరంప
రాభిషేకమ్ము చేయింపుమయ్య మాకు.

తెల్లమబ్బులకెరటాల తేలిపోవు
నట్టి భవదంతరిక్షప్రయాణము గన
ఇనుపతలుపులనడుమ వసించుమాకు,
నుల్ల మూహాతరంగాల నూగుచుండె!...

బంధనాలయ బాహ్యప్రపంచవార్త
లితరములు మాకు రాకున్న నేమి, సురవ
ధూకపోలకర్పూరమధురపరిమళ
పులకితరహస్యముల నెల్ల దెలిపిపొమ్ము!

ముకుళితములైన కలువపూవులదళాలు
నీ కరస్పర్శ పుల్కరించినవిధాన
ఎన్నడో మూగవడిన నాహృదయవీణ
తీగ లొకసారి కదలి నదింపదొడగె---

# గడియారం వేంకటశేషశాస్త్రి

[ 19, 20 శతాబ్దులు ]

## దాసబోధ

దళసంతానవితానశీతలవటాధచ్ఛాయఁ గంజోదర
స్థలి దర్భాస్తరణస్థుడై, గటికపోఁచల్ రెండుమూడంది, పొ
త్తిలిసెజ్జంబొరలాడు లేడిసిసుగుం దిన్పించుచున్, దాని చేఁ
తల కుప్పొంగెడు రామదాసు భవబంధగ్రాసు నీక్షించుచున్.

కన్నులఁ దొంగలించు కుతుకంబున మోము దుఱంగలింపఁ, బై
కొన్న సముత్సుకత్వమునఁ గుత్తుకయై మదిచెంగలింప, న
భ్యున్నతపాణులెత్తి శిరమున్ గదియన్ గొని దోయిలించి "సం
విన్నిధయే నమోఽస్తు గురవే" యని తత్పదపీఠి వ్రాలినన్.

బెదరెడి లేడికూన మఱపించుచు నక్కునఁ జేర్చి, కన్నులన్
బ్రిదిలెడు తేనెతెప్పలను బ్రమింగి, దయామృదులాంకురంబులన్
బెదవిగదల్చి, దీవనలఁ బెట్టిన వల్వలి కేలఁ జెమ్మటల్
బ్రిదులగఁ దాఁకి 'లెమ్ము శివజీ' యని యల్లన లేవనెత్తుచున్--

మానవజీవితంబు సుకుమారము; స్వార్థపరార్థసౌఖ్యసం
ధానముతో మదిన్ దనుపు తత్పరమార్థము; స్వార్థవృత్తియం

దైనను సేవలైహికసమాహృతి రాజసతామసాంక: మా
మానులు ముక్తికై నడచుమార్గము స్వార్థము, సాత్త్వికంబగున్.

గుడిసెలోఁ గన్నుమూసి, పైఁదొడరుభూత
ములకు మేనిచ్చి, లోనిశత్రులనె యడఁచి
జగమునంటని ముని తపశ్చర్య స్వార్థ;
మట్లు పోనిరాజర్షి పరార్థపరుఁడు.

తన్నుబోలిన సకలభూతములు దనియ
దాను మురియుటే మానవత్వంపుగుఱుతు;
దాని సాధించుటే పరార్థమగు; నందు
తెరువు లివి, రాజసంబు సాత్త్వికమనంగ...

రాజతపస్వియై భువనరంజకతన్ వెలయించుటే సుధా
భాజన ముద్ధరించుట, యపారపయోధి మథించునాఁటి వి
ద్యాజటిలత్వ మబ్బినఁగదా సకలమ్ము దమింపుచున్ బయో
భోజనమిచ్చు! పెత్తనముబొందుటనన్ బయిపైనియున్నదే.

వేఁడిమి సూపరా, దొరలవేఁడినచో బలహీనవృత్తి. బొం
కాడుట కానికార్యము, యథార్థత లోకవిరోధి; మేలునన్
గీడునుబోలెఁ గీడుపరికించు జగంబున నెల్లవారు 'మా
వాఁ'డన— రాజనీతి నడుపందరమే యొకపాటివానికిన్!...

ఇంతయురవడి కెదురీఁది, యింతకంత
కులికిపడక, యెడంద కాయువునుబోసి
పరహితము బెంపవలెఁగాక బమ్మరింపఁ
దగదు; తగ వెల్ల సృష్టితత్త్వమునఁ గలదు.

సృష్టి పరస్పరాశ్రయపరీతమయయ్యు, స్వతస్స్వతంత్రతా
పుష్పము; భిన్నమార్గముల పోకడ నైజము న్యాయ్యమయ్యు, న
త్కృష్టము తన్నికృష్టమడగించెడి; ధర్మపదార్థ మిట్లు సం
సృష్టము సంకరంబగుట జేసి సమన్వయశక్తి కావలెన్.

ఆ సమన్వయమకరంద మందుకొఱకు
మధుకరము పూవుబోదరిండ్ల మలయునట్లు
ప్రకృతి యంతట సృష్టిమర్మముల నెమకి
తరచి, పొరలెత్తి, చవులంటు వెరవువలయు,...

ఉన్నది దైవరక్ష, సకలోపకృతుల్ ప్రకృతిన్ ఫలించియే
యున్నవి; భూతశక్తి జగమోముచునున్నది; కాని— లోక మా
యున్నతికోసమై పెనఁగి యొండొకటిం గబళించుచున్న; దీ
చెన్నఁటి చీఁకటిన్ బొడుగుచేతులు పైకొని విక్రమించెడున్.

అట్టి ప్రజాపకారము బయల్పడ ధీరుఁడు సైపఁగూడ; ద
ప్పట్టున సామదానములు పాఱనియప్పుడు భేదదండముల్
ముట్టకతీఱ; దందు రణముల్ మరణంబులు నోర్చి, కత్తులన్
గట్టుచు నెత్తురుల్గురిసి కాక తొలంగునె దుర్విహారముల్ ?

ఇంతలు సేయకున్న ఫలియింప దొకప్పుడు లోకమంగళం
బింతలు సేత హింసయగునే మొయటం చొక జంకు దోఁచు,నా
స్వాంతమునందు లోకహితయజ్ఞముగా నిదియెంతు; వేదసి
ద్ధాంతము యజ్ఞముత్తమమటం;చదియుంబరులంద్రుహింసగన్.

ఇది దరిలేనిసాగర, మహింసయుహింసయు నిర్ణయింపఁ; నె
య్యదనునఁ బ్రాణికోటి కహితాచరణంబది హింస; యైన స్వా
భ్యుదయముగోరిగాక జగదున్నతికై యొనరించు కార్యమం
దొదవినహింసయున్ ఫలశతోన్నతమౌచు నహింసనాఁబడున్.

'నా' యనునదిలేని జగ
చ్ఛ్రేయంబ పరార్థ; మది భరించుటయందే
నాయకుఁ డొకఁడు సమస్తో
పాయవిదుఁడు వలయు; నతఁడె ప్రభువన నొప్పున్.

ఆ చతురుండొనర్చు జగదాదృతి రాచఱికంబు నాఁబడున్
'రాచఱికంబునం గలదు ఱాగతనంబు, కసాయిచేఁత, మా

యాచరణంబు' నంటివికదా– యది స్వార్థముగొన్న దృష్టి; ధ
ర్మాచరణంబునం దతని కంటవు తద్గతపాపపంకముల్.

పాపములంటబోని గునపంబునఁ బువ్వులతోఁటఁబెంచి, న
ల్వైపులవిచ్చు పూలపొలపంబులకున్ దలయూఁచి, కన్నులన్
జేపిన తోఁటకాఁపువలెఁ జేకొను ధన్యత; దేవపూజకున్
బ్రాపగు, లోకనిర్వృతికిఁ బట్టగు నాతఁడు ధర్మకర్తయై.

కావున భూపతీ! ప్రజలగాచుట నీవిధి; నేలదున్నుచో,
నావులఁగాచుచోఁ, బ్రజలనారయుచోఁ బ్రతికూలశిక్ష హిం
సావిధి గా; దుపేక్ష బలశాలికిఁ బాపముగూర్చు; నీకు నే
లా వెనుదీయ? నీశ్వరవిలాసము నీకరమందుఁ బండెడున్.

అఱమదిమాని ధర్మవిజయధ్వజమెత్తి, పరాధికారజ
ర్జరితము దేశము న్మతము జక్కనొనర్పుము; భారమెల్ల నీ
యఱకడఁ బూనుచో సమయమారసి నీవెనువెంటఁ దామ వ
త్తురు మన హైందవప్రజలు, తోడ్పడెడున్ మముబోంట్లదీవనల్.

అవును లేఁగయున్ బరులయాఁకటి కమ్ముడు వోవఁ, దీవలున్
బూవులువోని స్త్రీచరితముల్ కడునాఱడిఁబొంద, దేవుఁడున్
గోవెల రూపుమాసి వెడకోఁతల రోఁతల బుగ్గిఁదేల వ
త్సా! వెనుదీసి పోవిడుతువా భరతావనిభాగ్యసంపదల్?

ఆరవినుండి నేటివఱ కానికబూని బుజమ్ము లొడ్డి, భూ
భారము మోయు వంగడముపాదునఁబుట్టిన మొక్క తప్పి భన్
మీఱకయున్నె? పంబినయమిత్రకులంబులు దానిపెంపునన్
దీఱకపోవునే? శివపతీ! తెరదీయుము వీరలక్ష్మికిన్.

వేసముల మాఱు ధర్మజిజ్ఞాస నీకు
వలదు, వలవదు పుణ్యాపాపముల గొడవ;
రాచబిడ్డవు, ధర్మశాస్త్రమున దున్ని
పంటగొలుపుమీ యిహపరభాగ్యలక్ష్మి.

కాపరిలేనిగోగణముకై వడి భారతభూమి ధర్మర
క్షాపరులైన క్షత్రియులఁ గానక, ముష్కరతస్కరాళిచే
నేపఱి, నీపయిన్ బరువులెత్తెడు నాసల వేచియుండె; బా
హాపరిణాహధూర్వహుడవై శివరాజ! భరింపు మీధరన్.

చివురుం జెక్కులు చెమ్మరింప విజయశ్రీ నీవు సాధించుచోఁ
గవియుం జిక్కులు పెక్కు; లొక్క మొగి లోకంబెల్ల లోఁగొన్న యా
యవనాధీశు లెదుర్తు, రబ్ధిమథనంబౌ; నేటి పోరాటలో
శివజీ! యంగిటఁ జేఁదు నాఁపి, యమృతశ్రీ యిమ్ము నీవారికిన్...

కూరిమివోయుచున్ నుదుటఁగుంకుము వెట్టి, సఖడ్గపాణికిన్
దోరముకట్టి, వెన్నొరయు దూణమునన్ జయలక్ష్మి వెట్టి, హృ
న్నీరజమందుఁ దా నిలిచి నిన్ నడిపించు భవాని; యెందుఁ బో
స్వారికి నీపటాణిగొరిజన్ దడియంటగనీక త్రిప్పెదున్.

శివజీ! లె, మ్మిది దాసబోధ, మిదియే శ్రీచక్రపూజాస్రజం,
బివి నాదీవన-లిన్నిటిన్ గరశిరోహృత్సీమలన్ నిల్పి, యు
త్సవముత్సాహముదోహలింప, భరతస్వాతంత్ర్య దీక్షాంతమా
సవనంబున్ జరగింపు; మాభువనరక్షాకర్త్రి నిన్నోమెడున్.

(శివభారతమునుండి)

## చావలి బంగారమ్మ

[19, 20 శతాబ్దులు]

### నీడ

అందాలు తానె చూసింది, నీటిలో
చందాలు తానె చెప్పింది, నాతోటి
వొడ్డున్న మందార వొంగి బొట్టెట్టుకొని
అందాలు తానె చూసింది.
సొగసెల్ల చూసేను, సొమ్మసిలిపోయేను
చెట్లంటిపాములే చెరువెల్ల పాకేయి
అందాలు తానె చూసింది.

ఆవింతల్ని చూసింది
అప్పుడే ఆకాశ మడలిపోయింది
గజగజా వాణికి తా గట్లపై కొరిగింది
సూర్యుడే చెట్టెక్కి చూడ భయపడ్డాడు
అందాలు తానె చూసింది.

జూట్లల్ల విరియబోసింది, మందార
బొట్టెట్టు చెదిరి రాలింది
గట్లగుండెలు కలగ, మెట్లకన్నులు చెదర
వొంగున్న మందార వొంగియే ఉండి, ఆ
అందాలు తానె చూసింది. నాతోటి
మందార మాటలాడింది.

## నోరి నరసింహశాస్త్రి

[19, 20 శతాబ్దులు]

### తల్లి

తల్లి! అసహాయవై నీవు ధరణిమీద
పడితి వెప్పుడు నాదుగర్భంబు జీల్చి
ప్రకృతియంతయు నూత్నశోభల వెలింగె
ప్రాణనాథుడు నా నిజప్రాణమయ్యె.

ఎప్పుడేడ్చితి వీవు నోరెత్తి, యెడఁద
తత్క్షణంబ కృపాక్షీరధార లుబికె
చిన్నినవ్వొప్పు నీమూర్తి చిందులాడి
హృదయము కలంచె, ఎఱిగితి ప్రేమబాధ,

చిగురుపెదవుల ముద్దులు చిల్కనెపుడు
'తల్లి'యని పిల్చి నన్నీవు దరిసినావొ
అపుడు శ్రుతమయ్యె సృష్టిరహస్యమెల్ల
'తల్లి'యని మాఱుపిల్చి నిస్తబ్ధనైతి.

ఆత్మయేకాక నాదు దేహమ్ముకూడ
కొల్లగొట్టి మాధుర్యంపు గుప్పవగుచు
తల్లి! నిశ్చింత సనువీడి తరలిపోతె?
'తల్లి'యను నాదు ఆర్తనాదమె మిగిల్చి.

## నా యు ని  సు బ్బా రా వు

[19, 20 శతాబ్దులు]

### ఈ ప్సి త లే శ ము

అది నడచువేళ నేల జీరాడుకుచ్చె
రేపు దుమ్మున నొక త్రసరేణువునయి
దాని తనువున బుట్టు స్వేదమున గలసి
కరగిపోదును రూపమేర్పరుపరాక.

అది యుషస్స్నాన మొనరించి యంత గట్టు
కొనిన పచ్చనిపట్టు దుకూలమందు
ఆర్ద్రిమగు లేజరీయంచునై తదీయ
దేహమున గగుర్పాటులు దిద్దుకొందు.

అది శుచిర్భూతయై దేవతాళి పూజ
లైన వెనువెంట తన పూతహస్తమంటి
హారతికి వెలిగించు కర్పూరమునయి
వాసనలు చిమ్ముదును దాని వదనమందు.

అది సుధారసమొలుక మాటాడునపుడు
దాని నాభిమూలమున నుద్గతమనోజ్ఞ
ఫణితులం దొక్క ప్రణయభాషణము నగుచు
త్రోవలో దాని రసన కంటుకొనిపోదు.

ప్రణయునీవదనాంచలభాగమందు
నొక్క చిఱునవ్వుతరగనై యూగుచుందు,

ప్రణయినీ శీతలదృగంతపాతమందు
కరడుగట్టిన యొక సుధాకణమ నగుదు.

ప్రణయినీప్రసూనాంగసంస్పర్శ తగిలి
తగులనివిధాన కలిగినంతనె యనంత
దివ్యరాగస్రవంతిలో తేలిపోదు.

## పడవ పగిలిన

ఇది పగిలిపోవు ననుభయ మ్మింతవఱకు
ఈ తలంపున నానంద మిపుడు పొంగు ;
పగిలిపోయిన చెక్కలపట్టు విడువ
కీవు పాథోనిధానమ్ము నీదెద వని.

ఇది పగిలిపోవు ననుభయ మ్మింతవఱకు
ఈ తలంపున నిపు డుల్ల మిగురులొత్తు ;
తునిగిపోయిన చెక్కలతో పయోధి
గర్భమున రత్నరథ మీవు కట్టెదవని.

ఇది పగిలిపోవు ననుభయ మ్మింతవఱకు
ఈతలంపున నిపు డాత్మ కింతశాంతి ;
విఱిగిపోయిన చెక్కల దరికిజేర్చి
నీ చితికి కాష్టములుగ మన్నించెదవని.

## శుక్రవారము

ప్రేమపరిపూర్ణమైన నా హృదయపాత్ర
ఈదినము నీపెదవుల కందింతు ననెడు
నాసలో కన్నువిచ్చితి నమృతసరసి
ప్రాతరున్మిషితమ్మైన పద్మమట్లు.

ఆత్రిలోకైకజనని పాదాబ్జసవిధ
భూమి మీలితనేత్రవై మోకరిల్లి

నీవు పూజాసుమమ్మ వైనావు, హృదయ
కర్ణికామూలమున భక్తి కందళించి
అడరు పారవశ్యమ్మున దోడిమయూడి
నేను పూవునై పడితిని నీదుచెంత
జంటపూవుల అమృతనిశ్వాససౌర
భమున రోదసి శుక్రవారము నదించె.

( సౌభద్రుని ప్రణయయాత్రనుండి )

## వేదుల సత్యనారాయణశాస్త్రి
[ 19, 20 శతాబ్దులు ]
### శరదుత్సవము

నాహృదయ మిప్పు డరమూతనగవులందె
కనెను శాంతిదేవత కడగంటిచూపు
బ్రతికినన్నాళ్ళ కీముహూర్తమున విరిసెఁ
దొలివలపు దొల్కు జీవమాధుర్యరుచులు.

మిగులఁ గంపించు నా పేదమేని నిపుడు
సుమమృదులహస్త మేదియో నిమురుచుండె
కన్నతల్లిదీవనతోడి కౌఁగిలింత
జారు తీయని కన్నీటిచలువ లొలయ.

విరిసెఁగాఁబోలు! జగదధీశ్వరుశిఖావ
తంసకుసుమమ్ము, దిగ్దిగంతమ్ములందు
సౌరభోచ్ఛ్వాసముల వెదజల్లుచున్న
దానుకూల్యమ్ముతో శారదానిలమ్ము.

ఇంత లేమబ్బు చిఱుతువక్కయేని లేదు
విప్పిరేమొ నిశారాజ్ఞి వెల్లగొడుగు;

ఏమి శ్రవణోత్సవ మ్మిపుడీ విశాల
గగనమున కోటివిజయశంఖములు మ్రోగు.

చంద్రికావసనాంచలోచ్చాలనములఁ
జిరవిరహావాసనల నెగఁజిమ్ముకొనుచుఁ
దాండవించెడు నమృతసౌందర్యలక్ష్మి;
యుర్వి కీనాఁడె తొలి శరదుత్సవమ్ము.

నరకలోకపుఁజీకటితెరలవంటి
వెన్ని నిశలేగ నొక స్వప్నమేని లేక
ఇంత సౌందర్య, మింత ప్రశాంతిసౌఖ్య
మింత మాధుర్య మెటదాగె నింతవఱకు ?

ఎంతస్వేచ్ఛయొ ! నేఁడీ యనంతసృష్టి
గాన మొనరించుఁ బ్రతిజీవకణముగూడ
శైలగర్భాంతరాళనిర్ఝరమువోలె
నెదియొ కళపెళలాడుఁ బైకెగయ నెడఁద.

బాష్పకుంఠితకంఠానఁ బాడలేక
నాయెడఁద నింపుకొందు సౌందర్యరసము
నిలుపుకోలేన, నాలోన నేన విరిసి
రాలిపోదు వృంతచ్యుతపుష్పమట్లు.

ఓసఖి ! ఓసుహాసినీ ! ఓశరద్వి
భావరీనర్తకీ ! కవిభావనావి
లాసినీ ! నిత్యసైరంధ్రి ! ఓసమస్త
లోకమోహిని ! ఓస్వప్నలోకరాజ్ఞి !

ఈ యమృతశాంతియే చాలు నెపుడు నీ క
టాక్షభిక్షున కాజీవితాంత మింక
శ్రీచరణలాక్షతోడ నాహృదయకుసుమ
దళము లనురాగరసరంజిత మ్మొనర్తు,

## ఆరాధన

ఆమె నవనీతహృదయ, నా యంతరంగ
శాంతిదేవత, ఆశాపథాంతరాళ
పారిజాతమ్ము, ప్రేమజీవనవిభాత
కైశికీగీతి, నాతపఃకల్పవల్లి!

ఆమె జగదీశమకుటాగ్రసీమనుండి
ఉర్విపై జారిన సుధామయూఖరేఖ,
ఆమె మూడులోకాల కల్యాణమునకు
అవతరించిన యొక పవిత్రానుభావ,
మామె నాజన్మజన్మపుణ్యములు పండి
ప్రాప్తమైన కేళీపరిత్యాగలీల.

ఆమె పదసన్నిధాన దివ్యస్థలాన
భక్తినమ్రుడనై నిలంబడిన యపుడు
తలపునకు వచ్చు నాపేదతనము నాకు.

''చెలియ! ఏ దేవి మంగళాశీస్సుమములు
పరిమళించినవో మనశిరములందు
ఒక తపస్సిద్ధివోలె నేటికి లభించె
నిరువురి మనోరథమ్ముల కేకఫలము''

అనిన తారళ్యవిస్తారితాక్షియగుచు
''స్వామి! మన తోటలో ఈవసంతవేళ
పూచిన సుమమ్ము లాదేవి పూజకొఱకె''

అనుచు నాచేయి తనచేత నదుముకొన్న
యామె పదసన్నిధానదివ్యస్థలాన
నాకకల్లోలినీపదన్యాసమునకు
దరవినతమైన హరజటాభరమువోలె
నతుడనయ్యు మహామహోన్నతి వహింతు.

## ఆవృత్తి

ఆ ప్రశాంతనిశాజఠరాంతమందు
కలతనిద్దురలో కల గ్గాంచుచున్న
గౌతమీనది నా మనోగతవిషాద
తమము నంతయు తనలోన దాచుకొనియె.

ఆనదీసైకతముల నా యడుగుజాడ
చెరిపివేయగ వెనువెంట నరుగుదెంచు
గాలితరగల చల్లని కడుపులోన
కన్నుమూసెను నాయూర్పుగాడ్పులెల్ల.

చెడ్డయో మంచియో మహాసృష్టియందు
జరుగు విషయంబులను తటస్థముగ నా య
నంతగగనమునందుండి యరయుచుండు
తారలె మదశ్రుకణముల నేరుకొనియె.

నేనె మిగిలితి నీగౌతమీనదీప
విత్రగర్భంబులో ప్రోతపెట్టుచున్న
యుగయుగాంతరవిశ్వమహోగ్రదుఃఖ
జీవగీతాల కావృత్తి చెప్పికొనగ.

( దీపావళి నుండి )

# ఏటుకూరి వేంకటనరసయ్య

[ 19, 20 శతాబ్దులు ]

## క్షేత్రలక్ష్మి

ముదురాకుగట్టులమొదట - జాఱిన నీటి
  బిందు లింకిన గుంటలందు సొబగు
పూలమొక్కలమీఁదఁ బుణికిలాడెడిచిన్క-
  తుంపురుముత్యాల సొంపుదనము

పిల్లకాలువగట్లు ప్రిదిలిపోఁ బ్రవహించు
  జలవేణిమలుపులోఁ జక్కఁదనము
నెమ్మిపై నడయాడు నిప్పుతునకలవంటి
  యారుద్రపురువ్వుల యందగింపు

ఎరువుదెచ్చి కవీశ్వరు లింద్రజాల
కుంచికం ద్రిప్పుదురు వాక్ప్రపంచమందు
వర్షకాలమ్ము, మాక్షేత్రవైభవమ్ము
భిక్షవెట్టక జరుగునా పెద్దలకును ?

దూదిపింజలవంటి తోయదపంక్తులన్
  సవరించి వెన్నెలచలువజేసి
హానున్నరాజనములవెన్నుపైఁ బాల్వోసి
  పూటపూటకు సుంకుపుట్ట మూడ్చి
కలకదేటిన నదీగర్భమ్మునన్ దేలి
  నింగిపైన గళాయిరంగు పులిమి
గోమాతృదుగ్ధముల్ కుండలాదిగఁ బిండి
  చైత్రయాత్రార్థమై శంఖమూఁది

తెల్లపూలసమర్తకు వెల్లిపొడిచి
భసితమూర్తి శరల్లక్ష్మి పైకొనంగ
బైరుపసపాడి విజయోత్సవమ్ముజరపి
సాగనంపించు గార్తికసంయుతముగ.

హేమంతవేళ నూతన
సీమంతపువధువువోలె సింగారముగా
భూమిపయిగుల్కు సస్య
శ్యామలసంధ్యాతపమున జలకమ్మాడున్.

పచ్చికబంగారుపావడా దిగజాఱి
  నీరెండ మైచాయ తీరుగేర

మబ్బుపాయలకురుల్ మలసి నీలాలాడఁ
 బరిగెపిట్టలపల్కు లొరపుసూప
మంచుముత్యాలదామంబులు దూగాడఁ
 జలిగాలియూర్పులు సందడింప
విరిమల్లెనవ్వులు గరగరల్పచరింప
 బంతిదుద్దులకాంతి గంతులిడగ
పుష్యలక్ష్మి వచ్చి పుక్కిలించిన తమ్మ
రసమువోలె మిరెపరాసులొప్పఁ
గనకగర్భమందు ననురాగసంపత్తి
పట్టిచూపె ననఁగఁ బంటవలతి.

(క్షేత్రలక్ష్మినుండి)

## శిష్ట్లా ఉమామహేశం

[19, 20 శతాబ్దులు]

## మహాలయ అమావాస్య

ఇటువెన్నెల అటువెన్నెల
నడిశిరసుకు శ్రీవెన్నెల
ఇటువెన్నెల అటువెన్నెల
చిరునవ్వుల కలవెన్నెల
ఇటువెన్నెల అటువెన్నెల
విరులల్లిన జడవెన్నెల
ఇటువెన్నెల అటువెన్నెల
చెంగల్వల జిగివెన్నెల
ఇటువెన్నెల అటువెన్నెల
ఈశ్వరునికి తలవెన్నెల
ఇటువెన్నెల అటువెన్నెల

ఆకాశము మొలవెన్నెల
ఇటువెన్నెల అటువెన్నెల
మనసుల్లో మరువెన్నెల
ఇటువెన్నెల అటువెన్నెల
ఎటుచూచిన కనువెన్నెల
ఇటువెన్నెల అటువెన్నెల—

పిచ్చెత్తే వళ్లంతా
వెర్రెత్తే దిక్కులకై
పరుగెత్తె నామనసున
వెన్నెల్లో ప్రేయసిలేక
అమావాస్య అమావాస్య అమావాస్య!
మహాలయఅమావాస్య!

## పెనుమెచ్చ సత్యనారాయణరాజు

[19, 20 శతాబ్దులు]

### అలసవీక్షణము

ముంగిటవేసి పెంచితిని ముద్దులుగుల్కెడు పూలమొక్క 'డే
కింగు'; సుమించుచుండునది కేవలముగ్ మరుచేతివిందులం
చంగనలెల్ల మెచ్చుకొని యద్దుకొనం దమకన్నులందు స
ర్వాంగములందునూత్న పులకాంకురముల్ పొడసూపుచుండగన్

తొల్లిటిపూంత కాయలయి దోరగదోరగ బండియుండ సం
ఫుల్లమనస్సులం బికిలిపుల్గులు రెక్కలనార్చి వ్రాలి ఆ
ఫుల్లమహీజశాఖల నపూర్వగతింజరియించుచుండు సం
పల్లలితాంగి కొమ్మల కుపాయనమిచ్చినమానికాలునాన్.

కొమ్మలువంచి పుష్పములుకోసెడుకొమ్మల చీరచెంగు లా
కొమ్మలరెమ్మలం దగిలికో నది గానక యేగుచుండగన్

కొమ్మలయూఁపునన్ దెగి యనోకహమంతట ముక్కలంటెనాఁ
గ్రమ్మను సీతకోకచిలుకల్ పలురంగుల నింగినింపుచున్.

పూవులతావు లంటి, మధుపూరమునం దగ నోలలాడి, సం
భావనచేయు చొండొరులఁ బక్షములందలి వింతవింత వ
ర్ణావళితోడఁ బ్రేక్షకులయక్షులు దన్పుచు సంచరించు సీ
తావరచీరకీరములు స్థావరజంగమముల్ ముదంపడన్.

పూవునఁ గాలుమోపకయ పుప్పొడి నోటికిఁదాకకుండఁగాఁ
బావనమౌ మధూళిరసపాయులు చిల్కలు రెక్కలార్చుచుం
ద్రావుచుఁ దన్మయత్వమునఁ దాండవమాడుచునుండ తొండొకం
డీవలనావలం గనుచు నెక్కె మహీజము మెల్లమెల్లగన్.

పూలనుగాంచుచున్ బికిలిపుల్గులఁ గాంచుచుఁ జిల్లమొత్తముల్
లీలలగాంచుచుం బ్రకృతిలీలకు నబ్బురపాటుచెందుచున్
గాలముబుచ్చుచుండ క్షణకాలములోపల మొండితొండ యా
భీలకరాళవక్త్రమునఁ బెట్టుకొనెం బలువన్నెచిల్కలన్.

ఆఁకటి కాఁగలేక దినమంతయు నెంతయు నోగిరానకే
యేకరి క్షున్నివారణము నించుకగాంచెడు తొండ నాఁగి య
ట్టాఁకలిపెట్టుటో, చిలుకప్రాణమునిల్పుటొ చేయలేని నా
యూఁకువ, చూచుచూపులనయొక్కట నక్కట! డించెనెందుకో.

(రసాలమునుండి)

## తుమ్మల సీతారామమూర్తిచౌదరి

[20 శతాబ్ది]

### సంక్రాంతి

కొసరి నూఱినపచ్చిపసపుబూఁత మొగాన
గుమ్మడిపూదుమారమ్ము నద్ది
కండరేగడ నారబండి కన్పండువై
పొలుచు మిర్యపుబండు బొట్టువెట్టి

పలిపెమ్మనకు నొక్కవాసి హెచ్చయినట్టి
  నునుమంచు తెరచీర నూలుకొల్పి
బంతిపూవులకుఁ జేమంతినెయ్యముగూర్చి
  కబరీభరమ్ము చక్కనకుదిర్చి

పంటకళ్లాలు మును బరాబరులుసేయ
గూడుకట్టిన తెలిమబ్బుగొడుగుసీడ
కదలివచ్చెను భాగ్యాలకడలిబోలె
మకరసంక్రాంతిలక్ష్మి హేమంతవీధి.

నెలదప్పినట్టి కోడలిచేత నొకయత్త
  భోగిపొంగలిపూజ పూర్తిచేసె
పుట్టినింటికి వచ్చినట్టి కూఁతుగులాబి
  చెక్కిళ్ళ నొకతల్లి చెనకిపుణికె
మాఱువడ్డించెడి మరదలికెంగేలు
  పిసికి వల్దనె నొక్క పెంకెబావ
వంగి ముగ్గులుదిద్దు వధువుపై నీర్చల్లె
  గదిపీడిచను నొక్క గడుసుమగడు

అపుడె వచ్చినప్రియుని సోయగముగనుచు
దలుపుచాటున నొక్కపైదలి చెమర్చె
మధురమధురానురాగసామ్రాజ్యపీఠి
జగము కొలువుండె మకరధ్వజంబు నెత్తి.

లేగటిపాలలోఁ గ్రాగి మాగిన తీయ
  తీయ కప్పురభోగిపాయసంబు
చవులూరు కరివేపచివురాకుతో గమ
  గమలాడు పైరవంకాయకూర
తరుణకుస్తుంబరీదళమైత్రిమై నాల్క
  త్రుప్పుడుల్చెడు నక్కదోసబజ్జి

క్రొత్తబెల్లపుదోడికోడలై మరిగిన
 మదురుగుమ్మడిపండుముదురుపులుసు
జిడ్డుదేటినవెన్నెల గడ్డపెరుగు
గరగరికజాటు ముంగారుజెఱకురసము
సంతరించితి విందుభోజనముసేయ
రండురండని పిలిచె సంక్రమణలక్ష్మి.

లేబొట్టతోఁ బిసాళించునాముసకు న
 క్కోరుదూడలు వెండికొండలయ్యె
నిముసాన కొకసారి నిండునక్షయపాత్ర
 గాసిచే సాతాని గజ్జె విప్పె
కల్లుపెల్లాని రంగముపెట్టెఁ గాకలీ
 నాదమ్ముపంట యేనాదిజంట
ప్రాజీర విడి మాలపడతి క్రొత్తలుదాల్చి
 సూచించె శిశిరర్తుసుదతిరాక

క్రొత్తకుసుమకూడు కుత్తుకబంటిగా
బిచ్చగాని కుక్క పెచ్చరిల్లె
చేవ తనివి వేడ్క చెలువంబు కావరం
బగ్గలించె నుత్తరాయనమున.

( పరిగపంటనుండి )

## జోహారు

తెలుగుతల్లి నీకు జోహారు! దేశమాతా నీకు జేజేలు!
నినుజూచి నినుబాడి నినుగొల్చువేళ నా
కను లాణిముత్యాల గనులుగానగు నహో ॥ తెలుగు...

నీపాలు జుంటితేనియ తేటలో, గోస్త
నీపక్వరసమో, సుధాపూరమో యాట
నాపల్కు లీతీయనకు నోచి విశ్వవా
ణీ ప్రపంచప్రశంసాపూరితములాయె ॥ తెలుగు...

ఎల్లోరకొండ నీ యల్లారుగీమటే
కొల్లారి కోహినూరు కొప్పులోబూవటే
కొల్లూరు గనులు నీకోశంబటే పండ్లు
పుల్లనైపోవు నీభోగమ్ము కన్నచో ॥ తెలుగు...

గౌతమీ కృష్ణానదీ తుంగభద్రాది
పూతస్రవంతికాపుంజమ్ము నీముద్దు
గూతులై నీచేను నీతోట పండింప
నీతనూజులు పైడిపాతర లగ్పిరే ॥ తెలుగు...

ఏపుణ్యలేశమ్ము నాపాలిదాయెనో
నాపూజ కేలోకనాథుండు పొంగెనో
నీపావనోదర(శ్రీ) పరంపరలలో
నీ పదార్చకులలో నేను నొక్కడనైతి ॥ తెలుగుతల్లీ...

(రాష్ట్రగానమునుండి)

## మంగిపూడి పురుషోత్తమశర్మ

[20-వ శతాబ్ది]

### స్వేచ్ఛాగానము

నాతనువు కర్కశోపలనద్ధకుడ్య
రాజిపరివృతాయఃపంజరాంతరమున
శృంఖలాబద్ధమై కృశియించుచుండు;
నామది విహాయసపథమ్ము నధిగమించి
దిక్కగమి దాటి యశ్రుతద్వీపములను
నిత్యస్వేచ్ఛావిహారియై నెగడుచుండు.

నాకనులు తారకాకిరణప్రసార
మును చొరగరాని గాఢతమోవృతములు;
కాని మాహాత్మ్యదివ్యప్రకాశపుంజ
నవనవోన్మేషమై వెల్గు నాహృదయము.

నేను యమభటులంబోని నీచదండ
నాధికారితిరస్కరణాభిఘాత
ముల కనుక్షణమును శిర మొగ్గవలయు;
ఐన విశ్వజనని కరుణార్ద్రమధుర
లోలదృజ్మాలికాజాలలాలితుండ.

కొలచి దినమును నాకిడు కూడు కుక్క
లైన ముట్టని హేయపదార్థచయము;
నా రసన చవిచూచెడునది నితాంత
షడ్రసాతీతమధురరసాయనమ్ము.

నాశిరము క్రూరనిశితకంటకకిరీట
పరినిపీడిత; మైన శ్రీ భరతధాత్రి
తరుణచరణాబ్జసంస్పర్శ ధన్యతమము.

నాయొడలు డస్సి క్రుస్సి నానాట శల్య
శేషమైనను లోన విశిష్టవిమల
దివ్యకాంతిమయామరదేహ మొండు
దినదినప్రవర్థమానమై తేజరిల్లు.

## పులవర్తి శరభాచార్య

[ 20 వ శతాబ్ది ]

### కారాగారబద్ధుఁడైన శిల్పి

"అంచితమైన యొక్క యమృతాశనయోగము దప్పి యీయవి
ద్యాంచితభూమిఁ బడ్డ విరహాతురజీవిని, ఆత్మయాత్ర సా
గించెడి త్రోవరిఁ నవయుగీమతి శిల్పఘనిష్ఠనిష్ఠ మే
ల్కాంచి సుఖింపగఁ ముడుపుగట్టితి నాసకలాయురర్థముల్.

ఎంత కల్యాణశిల్పమో యెంచియుంటి
స్వేచ్ఛ దప్పైన నే నేమిచేయువాఁడ?

భావకీరమ! అందనిపండ్లకొఱకు
వెఱ్ఱికలలనుగనుచుఁ బర్వెత్తవలదు...

ఇటుల నాద్యంతములులేని యీ నభఃప
థమ్ములను దూసికొనిపోవఁ దరముకాదు
వెడఁదఱెక్కలు స్వాతంత్ర్యవిరహవేద
నలను రెపరెపఁగొట్టుకొన్న ఫలమేమి?

ఇనుపచువ్వలసందులం దెల్ల విశ్వ
దృశ్యములు తొంగిచూచుచు, దివులుకూటి
నింత మెసవుచు, నిందు నిద్రింత యింక
నెచ్చెలీ! జీవనముల కింతె శివరాత్రి...

సృష్టిబృందావనమ్ము పుష్పించి దెసల
బుప్పొడిదుమారములు గుప్పుగుప్పుమన్న
యామనులు లే, వఖండచండాతపమ్ము
సెగలుచెరుగుచు నిలను వ్రేల్చెడిని నేఁడు.

పాపము పండెనేమొ, విషభాండకరండము నిండుచుండెనే
మో, పృథులాగ్నిపర్వతము లూఁగి ఫటాలునఁబద్దలౌనొ యే
మో, పరమేశ్వరుండు ప్రళయోగ్రశిఖల్ తనకంటికుంపటిన్
రేఁపునొయేమొ భారతధరిత్రికిఁ గీడులుమూఁడనయ్యెడిన్...

ఔర! ముక్కంటిక్రొమ్మంట లగ్గలించి
చిటపటలుపాడి విలయంపుఁజిందుద్రొక్కి
నింగినేలల యీపెద్దమంగలమున
క్షేమబీజమ్ము లెల్ల మాడ్చి చనుచుండె...

ఆత్మగోళమ్ములోఁ బ్రభ లాఱిపోయి
చిమ్మచీకటు లిట్టులఁ గ్రమ్మె నవని
శిల్పభారతి యశ్రువుల్ చిందుచుండె
విలయజీమూతములు తాండవించుచుండె.

వేదవీధుల శిల్పదేవీజయోత్స
వములు సలిపిన ఋషులగర్భములఁ బొడమి
ఆయురర్థము లాఱుమూఁడైన జాతిఁ
దీర్చిదిద్దఁగఁ ద్రష్ట నర్థించువాఁడ...

దాటితి దశాబ్దములు కాలకూటగుళిక
లెన్నొ మ్రింగితి; నీరాక కెదురుచూచి
నిలబడితిఁ బాద్యపాత్రతో, నీసహస్ర
విశ్వమంగళచరణదీప్తికిరణమ్ము
లీ నిరీక్షణాలం దనియింపనిమ్ము!
దేవ......

సాహితీవీణ నాపాట జాఱవిడిచెఁ
బ్రజకు నావేదనలగాథ పట్టదయ్యె...
నా నిరీక్షణఫలిత మెన్నటికి నాథ!"

ఈ నివేదనమును విన్న యీశ్వరునకు
హృదయ మిసుమంత గరఁగెనో యేమొకాని
శాపఘుండగు నృపతికిఁ గలను దోఁచి
సంస్క్రియాశంఖ మూఁదెఁ బ్రశ్నముల నిటుల.

"ఇది కళోదయమహము సాహిత్యదేవిఁ
గ్రొత్తతొడవులఁ గైసేసి కొలువవలయు
నింక సౌమనసశ్రీల నిటకు రమ్ము
రససముద్రునిచరణతీర్థములకడకు...

తూర్పుగట్టునఁ గూర్చుండి తోఁచినటుల
రంగురంగులబొమ్మలు వ్రాసిపోయి
పడమటిపటమ్ముపైఁ గుంచెఁ గడిగివేయు
జిత్తరువుకానిజాడ కాంచితివె నీవు?...

కన్నియలరెప్ప లెత్తి రాగరస మలఁది
వటులచూపులఁ గ్రొంగ్రొత్తవలపు లూఁది
ఏడడుగు లల్లి మిథునత్వ మేర్పడంగ
ముడులువెట్టెడి యాపుణ్యమూర్తి యెవరు?...

జవ్వనంపుఫలముఁ జవిగొన్న సతులందు
నొక్కయణువు బెంచి, యూపిరి నిడి
కొన్ని నెలల చిన్నిచిన్నారిపాపాయి
మలఁచిపోవువానిఁ దెలిసినావె?

ద్విజగళస్వనకింకిణీవితతిఁ గదిపి
ఘనహిరణ్మయసాంధ్యచక్రములు ద్రిప్పి
తారకాధవళాతపత్రంబు విప్పి
చకచకలు జిమ్ము వానిహస్తమ్ము గనుము!

అణుమహత్తులందు నవ్యక్తశక్తియై
విశ్వకర్మసృష్టివృత్తమెల్ల
నడపునట్టి చిత్రనైపుణ్యనిధి కీ య
ఖండజగముసూవె కర్మశాల!

ఆ వాని చరణరేఖా
పావనముద్రాంకఫాలభాగులు శిల్పుల్
భావింపుము యాథార్థ్యము
సేవింపుము తత్కళాదశేఖరుపదముల్."

(కర్మభూమినుండి)

## బొడ్డు బాపిరాజు

[20-వ శతాబ్ది]

## వీణావతి

( బేలూరి చెన్నకేశవాలయ శిల్పములలో )

ఇటులే ఎన్నిశతాబ్దముల్ గడిచె తన్వీ! నీవు మందాకినీ
నటదూర్మిస్వనమోహనం బయిన వీణాదండముంబూని? చె
క్కిట లేయెండ చెమర్చె, నద్దుకొనబోకే కేశవస్వామి కే
మటు విన్పింతువు–ఏసఖీప్రణయమిథ్యాకోపసందేశముల్ ?

భవతీ! యుష్మదతీంద్రియాద్భుతసుఖప్రస్తావివీణాసము
ద్భవసంగీతసుధాప్రవాహముల నార్ద్రస్వాంతులౌ వేల్పులే
అవికల్పస్థితి శిల్పమూర్తులయి యున్నా రిందు కాకున్న, ఈ
పవనాంకూరములందు నెచ్చటి వపూర్వస్వర్గసౌరభ్యముల్ !

సకలకళాజగద్విభవశారదవో ? వికసద్వసంతచం
పకసుకుమారి ఏ నృపకుమారికవో ? స్థిరశిల్పయోగసా
ధకుని హృదంతరామృతనిధానమునం దుదయించినట్టి మే
నకవొకొ ? కానిచో నిజము నాకవితారసరాజ్యలక్ష్మివే !

ఏ లలితస్వరమ్ము నినదించిన దా చిరుమోవి, సోగకై
వ్రాలినచూడ్కి నే సొగసు పండిన, దా మృదులాంగుళీకసం
స్ఖాలనమందు ఏ మధురభావము తోఁచిన దప్పుడా కళా
శాలి పసిండిపోగరకు–శాశ్వతమై అది నిల్చె మాయెదన్ !

స్పందింపన్ రసహృద్విపంచిక పురావాల్లభ్యవిస్ఫూర్తి, ఆ
క్రందింపన్ పరతంత్రమై బ్రదుకు ; కర్ణాటాంధ్రకన్యామణీ
సౌందర్యమ్ములు సంగమించిన భవత్సాన్నిథ్యమం దెవ్వఁడా
నందోన్మాదవిషాదభావనలలోనై అశ్రువుల్ రాల్పఁడో !

నీకు శిలాప్రవాసినికి నిద్దుర దెల్పి, అనంతయౌవన
శ్రీకమనీయమూర్తిగ రచించిన శిల్పిమహేంద్రు డిప్పు డే

లోకము లేలునో మఱి యెఱుంగముగాని, తదీయకీర్తిగా
థాకృతు లాలకింతు మనుతాపభరమ్మున నీవిపంచికన్.

ఎన్నా ళ్లెంతతపస్సు చేసితివొ శిల్పీ! ఇట్టి పాషాణముల్
వెన్నామీఁగడలౌచు నీకరములన్ విన్నాణముల్ సూపె; మా
కన్నే యాననియంతసన్నసనరేఖల్ ఎట్లు కైసేసినా
వన్నా! వీణియపైని తంత్రులవి యల్లల్లాడునో గాలికే!

కలగీతిన్ ప్రవహించు నెంతదనుకన్ కావేరి, గోదావరీ
జలముల్ తేనెలసోన లెంతదనుకన్ సర్వప్రపంచమ్మునం
దల ఏ యొక్కఁడె కాని యుండినను సౌందర్యార్చకుం, డీ మహో
జ్జ్వలసృష్టిం గని నీకు పల్కఁడె నమోవాకమ్ము శిల్పిప్రభూ!

మా తెలుంగుశిల్పుల యశోమహతి మొరయు
నీ పవిత్రకళాక్షేత్ర; మిచట నిలిచి
పాడుకొందువొ దేవి! తత్ప్రీతిభ జగజ
గాలకు వినంబడ యుగయుగాలవరకు.

## కొంపెల్ల జనార్దనరావు

[ 20-వ శతాబ్ది ]

### ప్రకృతిలాస్యము

సతతనూతనమృదువిలాసప్రభూత
తావకమనోజ్ఞలాస్యసందర్శనమున
నాదుభావాలు మధురగానమ్ము సలిపెఁ
బ్రకృతి! ఆనందతన్మయత్వమున మునిగి.

క్షణములో దుఃఖచయ మెల్ల సమసిపోయె
నెన్నియో లాలసలు హరియించిపోయె
స్మృతులు మెల్లమెల్లన సొమ్మసిల్లిపోయె
నీయెదుట నిశ్చలత నేన నిలిచిపోతి.

ఆదయాశీకరాసార, మాపవిత్ర
విశ్వమోహనమైత్రి, ఆప్రేమమధుర
మంగళాకార, మాతపోమహితముద్ర–

అహాహా ఎంతేసికానుక లబ్బె నాకు!
నీ జగన్మోహనంబైన నృత్యమందు–
మెప్పు లలసిపో, నేత్రనిమీలనమున
దవ్వులను వినవచ్చె నెంతయు బునీత
విశ్వసందేశతతుల గంభీరరుతులు.

ఎవరికొఱకు నీ నాట్యంబు, లీ ప్రపూత
గానసంచారఫణితు లేకాంత కాంత
నృత్యవైదగ్ధ్యమును బ్రసాదించె నీకు?
అనుచు ధ్యానించినా నప్రయత్నముగను.

ధ్యాన మది గానమైపోయెఁ; దావకీన
ప్రణయసౌభాగ్యమహిమ, నా ప్రశ్నములకు
నేన చూపట్టితిని సమాధానమునయి
నీవలన నాయనంతత నేర్చికొంటి.

( భారతినుండి )

## శ్రీరంగం నారాయణబాబు

[20-వ శతాబ్ది]

### గడ్డిపరక

నడవండి! నడవండి! నామీంచి నడవండి
గడ్డిపరకను గడ్డిపరకను!
పూజాసమయాల పూవును,
దూర్వాంకురాన్ని, అవసరం తీరాక
అవతల కనబడితే చులకనగ చూచేటి
గడ్డిపరకను గడ్డిపరకను!

నడవండి! నడవండి! నామీంచి నడవండి!
పల్లకీ దిగినట్టి పెళ్ళికొడుకులు మీరు
పట్టుతివాసీని నేను
నడవండి! నడవండి! నామీంచు నడవండి!
పశువులనోటికి పాయసాన్ని
మీసుకుమారపాదాల మకరికను
నడవండి! నడవండి!

మీపైడిపాదాల మృదురజోలేశాలె
నాహృత్కుశేశయములో ఉల్కాపాతాలు
నడవండి! నడవండి! నామీంచి నడవండి!

మాతృవర్గంవాడు, మాఅన్న పన్నగమ్మలరసన
లుత్తరించిన మిన్న, నేటికి మీ పితృకార్యాన
పారణమీద మీచేతిమీద
మరకతఅంగుళీయకమ్మ!
గతులుకల్పించేటి గడ్డిపరకలము
నడవండి! నడవండి! మామీంచి నడవండి!
గడ్డిపరకలం! గడ్డిపరకలం!
మిన్నువిప్పిన రక్తపతాకం!
మన్నుసత్తువే తెలిపింది!
ప్రాభాతపశ్చిమానిలము పాడినపాట
కాకాసురునికథ జ్ఞాపకంతెచ్చింది.
నన్ను నే తెలిసికొన్నాను
ఆగండి! ఆగండి!

## రంగ మెళితేనేటి ?

రంగ మెళితే నేటి రంగైనవోడ! నే
        రంగ మెళితేనేటి ?

అచ్చరాల నీపేరె పచ్చపొడుసుకొన్నాను
సాటుమాటుగ దాన్ని సదివించుకొన్నాను
        రంగ మెళితేనేటి ?

రయికమీద నీపేరె రాపించుకొన్నాను
కొంగోరనే దాన్ని కూడబలుక్కొన్నాను
        రంగ మెళితేనేటి ?

ముంగిట్లో నీపేరె ముగ్గెట్టుకొన్నాను
కళ్లన్ని మెట్టి దాన్ని కాసుకూక్కొన్నాను
        రంగ మెళితేనేటి రంగైనవోడ!

## ఆకిలి శ్రీరామశర్మ

[20-వ శతాబ్ది]

## దుర్దిన సంధ్య

వ్రయ్యవాఱెడు నగ్నిపర్వతములట్టు
లంబుధరములు ప్రాంతరక్తంబులయ్యె
క్షుబ్ధశోభలఁ గవిమనస్సుబలెఁ బొల్చె
మృత్యుశాంతి వెలార్చు దుర్దినపుసంధ్య.

సుడివడ ధూళి రేపి వినుచూలి కలంచె జగంబుకన్ను, వెన్
మడగిన సందెరక్కసులు మబ్బుతెర ల్విడఁద్రోసి బైటకిన్
వెడలెదరో యనన్ బ్రకృతిభీకరమై యడరారె నెల్లెడన్
పడమటిదిఙ్ముఖంబు కనుపట్టెను మృత్యువునావులింతనాన్.

విగతసూర్యాప్తి మందేహవిహృతి సెలగ
కర్బురచ్ఛాయ లొలసె నాకసముతుదల
కాళరాత్రి తమఃకైశికంబు విప్పి
యాడువేళ సమీపించె నసురసంధ్య.

నెత్తురు లోకిలించినది నింగి, నిశీధపుజోగి మూకుటన్
గొత్తుగ బెక్కు రిక్కమెతుకుల్వోలరారెను, బెక్కుగొన్నటుల్
కుత్తుకబంటిగా నిరులు గ్రోలి నిశాటకి గ్రాసె మింట, ను
ద్వృత్తత గ్రోష్టువుల్ సభలుతీరెను ప్రేతలపెత్తనంబునన్.

హిక్కుమను నారవంబుతో నెక్కిలించు
నొక్కొ నాఁ దళ్కుమెఱుముతో నుఱిమె నభము
చిన్నసన్ననిజల్లులు చిన్కి చిన్కి
గండుకొననయ్యె నటు పెద్దగాలివాన.

చీకటి కాఱుకొన్న అల చిన్కులచిత్తడి వానతేడు మై
దూకొన విద్యుదంకుశముతో బాడిచెన్వడి నభ్రదంతి, బెన్
కాక యెసంగ నయ్యదియు గర్జితఘీంకృతులన్ వెలారిచెన్
ప్రేకన నెల్ల శ్రోత్రములు ప్రీలిచె భేకరుతప్రతిధ్వనుల్.

బలితమైన ఆచీకటి వానరేయి
విద్యుదాడంబరపు దళ్కువెల్గులోన
గునుకుటీలల బ్రాకిచన్ కొండచిలువ
లనగ వీథుల బార్శ్వకుల్యాలు దనర్చె.

మలగిపోయెను వీథిదివ్వెల వెలుంగు
కూత లార్భాటమైనట్టి కుక్కపోతు
లెట ముడింగినవో యేమొ యెఱుగబడదు
గీఁయిమని కూయిడంజొచ్చె కీచురాయి.

చీకటికి ద్రోవచూపుట
కై కాబోలు నొక దీపకళిక, మినుకు మం

చే కడపలికొోననుండియు
నోఁ కునుకుచు గానుపట్టుచుండెఁ దెరువునఁ.
తంత్రు లెడసి నితాంతని స్తబ్ధమైన
మహతిపోలిక బ్రోలెల్ల మాటుమణఁగె.

(శర్వరినుండి)

# శ్రీరంగం శ్రీనివాసరావు

[20 వ శతాబ్ది]

## శైశవగీతి

పాపం, పుణ్యాం, ప్రపంచమార్గం
కష్టం, సౌఖ్యం, శ్లేషార్థాలూ
ఏమీ ఎరుగని పూవుల్లారా!
అయిదారేడుల పాపల్లారా!
మెరుపుమెరిస్తే, వానకురిస్తే
ఆకసమున హరివిల్లు విరిస్తే
అవి మీకే అని ఆనందించే
కూనల్లారా!
అచ్చటి కిచ్చటి కనుకోకుండా
ఎచ్చటెచటికో ఎగురుతుపోయే
ఈలలు వేస్తూ ఎగురుతుపోయే
పిట్టల్లారా! పిల్లల్లారా!
గరికపచ్చమైదానాల్లోనూ,
తామరపూవుల కోనేరులలో
పంటచేలలో, బొమ్మరిళ్ళలో
తండ్రిసందిటా, తల్లి కౌగిటా
దేహధూళితో, కచభారంతో
నోళులవ్రేళులు, పాలబుగ్గలూ

ఎక్కడ చూస్తే అక్కడ మీరై
విశ్వరూపమున విహరిస్తుండే
పరమాత్మలు ఓ చరుతల్లారా!
మీదేమీదే సమస్తవిశ్వం!
మీరే లోకపు భాగ్యవిధాతలు!
మీహాసంలో మెరుగులు తీరను
వచ్చేనాళ్ల విభాప్రభాతములు!
ఋతువులరాణీ వసంతకాలం
మంత్రకవాటం తెరుచుకొనీ
కంచువృషభముల అగ్నిశ్వాసం
క్రక్కేగ్రీష్మం కదలాడీ
పల్లు, బయళ్ళూ ఊళ్ళూ, బీళ్ళూ
ఏకంచేసే వర్షాకాలం
స్వచ్ఛకౌముదుల శరన్నిశీథినులు
హిమానీనిబిడహేమంతములు
చలివడకించే శైశిరకాలం
వస్తూపోతూ దాగుడుమూతల
క్రీడలాడుతవి మీ నిమిత్తమే!
ఇవాళలాగే ఎప్పుడుకూడా
ఇనబింబం పయనించు నింగిపై!
ఎప్పుడుకూడా ఇవాళలాగే
గాలులు వీచును, పూవులు పూచును.
నాకు కనంబడు నానాతారక
లనేకవర్ణా, లనంతరోచులు
దిక్కుదిక్కులా దివ్యగీతములు
మీరూ వీటికి వారసులే! ఇవి
మీలోకూడా మిలమిలలాడును!
నా గతశైశవరాగమాలికల ప్రతిధ్వనులకై
పోయినబాల్యపు చెరిగినపదముల చిహ్నాలకోసం.

ఒంటరిగా కూర్చుండి ఊరుపులు
కదలేగాలికి కబళమునిస్తూ!
ప్రమాదవీణలు కమాచిపాడగ
సెలయేళ్లను లేళ్లను లాలిస్తూ
పాతాళానికి పట్టీ కొట్టీ
వైతరణీనది లోతులుచూస్తూ
శాంతములేక, కేకాంతముగా, ది
గ్భ్రాంతిలో మునిగి గుటకలువేస్తూ
మెటికవిరుస్తూ ఇట కూర్చుండిన
నను చూస్తూంటే నవ్వొస్తోందా?
ఉడుతల్లారా! బుడుతల్లారా!
ఇది నాగీతం, వింటారా?

## మహాప్రస్థానం

మరోప్రపంచం మరోప్రపంచం
మరోప్రపంచం పిలిచింది!
పదండి ముందుకు, పదండి త్రోసుకు
పోదాం, పోదాం, పైపైకి!
కదంత్రొక్కుతూ, పదంపాడుతూ, హృదంతరాళం గర్జిస్తూ—
పదండి పోదాం, వినబడలేదా
మరోప్రపంచపు జలపాతం?
దారిపొడుగునా గుండెనెత్తురులు
తర్పణచేస్తూ పదండి ముందుకు!
బాటలు నడచీ, పేటలుగడచీ
కోటలన్నిటిని దాటండి!
నదీనదాలూ, అడవులు, కొండలు,
ఎడారులా మన కడ్డంకి?
పదండి ముందుకు! పదండి త్రోసుకు!
పోదాం, పోదాం, పైపైకి!

ఎముకలు క్రుళ్ళిన, వయస్సు మళ్ళిన
సోమరులారా! చావండి!
నెత్తురుమండే, శక్తులునిండే
సైనికులారా! రారండీ!
హరోం! హరోంహర! హరహర! హరహర!
హరోం హరా! అని కదలండి!
మరోప్రపంచం, మహాప్రపంచం
ధరిత్రినిండా నిండింది!
పదండి ముందుకు, పదండి త్రోసుకు!

ప్రభంజనంవలె హోరెత్తండీ!
భావవేగమున ప్రసరించండీ!
వర్షుకాభ్రముల ప్రళయఘోషవలె
పెళ పెళ పెళ పెళ విరుచుకు పడండి!
పదండి పదండి పదండి ముందుకు!

కనబడలేదా మరోప్రపంచపు
కణకణమండే త్రేతాగ్ని?
ఎగిరి, ఎగిరి, ఎగిరి పడుతున్నవి
ఎనభై లక్షల మేరువులు!
తిరిగి, తిరిగి, తిరిగి సముద్రాల్
జలప్రళయ నాట్యం చేస్తున్నవి!
సలసల క్రాగే చమురా? కాదిది, ఉష్ణరక్తకాసారం!
శివసముద్రమూ, నయాగరావలె
ఉరకండీ! ఉరకండీ ముందుకు!
పదండి ముందుకు! పదండి త్రోసుకు!

మరోప్రపంచపు కంచునగారా
విరామ మెరుగక మ్రోగింది!

త్రాచులవలెనూ, రేచులవలెనూ,
ధనంజయునిలా సాగండి!

కనబడలేదా మరో ప్రపంచపు
అగ్నికిరీటపు ధగధగలు,
ఎఱ్ఱబావుటా నిగనిగలు,
హోమజ్వాలల భుగభుగలు?

## భిక్షువర్షీయసి

దారిపక్క చెట్టుకింద, ఆరినకుంపటి విధాన
కూర్చున్నది ముసిల్దొకతె
మూలుగుతూ—ముసురుతున్న ఈగలతో వేగలేక.
ముగ్గుబుట్టవంటి తలా, ముడుతలు తేరిన దేహం,
కాంతిలేని గాజుకళ్లు—తనకన్నా శవం నయం.
పడిపోయెను జబ్బుచేసి, అడుక్కొనే శక్తిలేదు,
రానున్నది చలికాలం, దిక్కులేని దీనురాలు,
ఏళ్లు ముదిరి, కీళ్లు కదిలి, బతుకంటే కోర్కెసడలి—
పక్కనున్న బండరాతి పగిదిగనే పడిఉన్నది.

"ఆ అవ్వే మరణిస్తే ఆపాపం ఎవ్వరి"దని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ వెళిపోయింది!
ఎముకముక్క కొరుక్కొంటు ఏమీ అనలేదు కుక్క,
ఒక ఈగను పడవేసుక తొందరగా తొలగె తొండ;
క్రమ్మె చిమ్మచీకట్లూ, దుమ్మురేగె నంతలోన
"ఇది నా పాపం కా"దనె ఎగిరివచ్చి ఎంగిలాకు.

(మహాప్రస్థానము

# కొనకళ్ల వెంకటరత్నం

[20-వ శతాబ్ది]

## మొక్కజొన్నతోటలో

సుక్కలన్ని కొండమీద సోకుజేసుకొనేవేళ
పంటబోదె వరిమడితో పకపకనవ్వేవేళ
సల్లగాలి తోట కంత సక్కలగిలిపెట్టేవేళ
    మొక్కజొన్నతోటలో, ముసిరినచీకట్లలో
    మంచెకాడ కలుసుకో, మరవకు మామయ్యా!
చీకటి మిణుగురుజోతుల చిటిలిచిల్లులడకమునే
సుద్దులరాగాలు చెవుల నిద్దరతీయకమునుపే
ఆకాశపుటొడిని తోట ఆవలింతగొనకమునే
    పొద్దువాలుగంటనే, పుంతదారివెంటనే
    సద్దుమణగనిచ్చి రా, ముద్దులమామయ్యా!
గొడ్డుగోద మళ్లేసే, కుఱ్ఱకుంకలకుగానీ
కలుపుతీతలయి మళ్లే కన్నెపడుచులకుగానీ
బుగ్గమీస మొడివేసే భూకామందుకుగానీ
    తోవ కెదురువస్తివా, దొంగచూపుచూస్తివా
    తంటా మన యిద్దరికీ తప్పదుమామయ్యా!
కంచెమీద గుమ్మడిపువు పొంచిపొంచి చూస్తాది
విరబారిన జొన్నపొట్ట వెకిలినవ్వునవుతాది
తమలపుదీగెలకు కాళ్లు తగిలి మొరాయిస్తాయి
    చెదిరిపోకు మామయా, బెదరిపోకు మామయా
    సదురుకో నీ పదునుగుండె, సక్కనిమామయ్య
పనలుకట్టె నన్ను పలకరించబోయినపుడు
మోటబావివెనక నాతొ మోటసరసమాడినపుడు
చెరకుతోట మలుపుకాడ చిటికెవేసి నవ్వినపుడు
    కసిరితిట్టినాననీ, విసిరికొట్టినాననీ
    చిన్నబోకు, నలుగురిలో సిగ్గది మామయ్యా!

## పిలకా గణపతిశాస్త్రి
[20-వ శతాబ్ది]
### పాపాయికి

శ్రీఉషసిచరణమంజీరాల విడివడిన
చిన్నిబంగరు మువ్వలారా! గలగలను
చిట్టిబంగరు పిచుకలారా!

వీధిచూరులదిగువ వేలాడురాజనపు
వరిజాలరులమీద వాలిపోదురుగాని
మెరిసేటి బంగారు చిరువన్నెలే తెచ్చి
మోగేటి బంగారు చిరుమువ్వలై వచ్చి
పాపచుట్టూ తిరిగి పలకరించండీ!
పాప నొకమారైన ఆడించిపొండీ!

చిట్టి ఈవేళేమొ పట్టింది పోరు
ఉయ్యాల ఊపగా చెయ్యూరుకోదు
శ్రీఉషసి చరణమంజీరాల విడివడిన
చిట్టిబంగరుపిచుకలారా! గలగలను
చిన్నిబంగరుపిచుకలారా!

## ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి
[20-వ శతాబ్ది]
### దక్షారామ దర్శనము

ఈసప్తాపగచెంత నిల్చి కనవోయీ! భీమనాథేశ్వర
ప్రాసాదాంచితసాంధ్యరాగకనకప్రస్ఫీతశోభావళుల్
న్యాసీభూతమహత్త్వరూపములు, వప్రౌఘమ్ము లిచ్చోట నే
వో సందేశము లిచ్చి నీమదిని ద్రిప్పున్ దివ్యలోకమ్ములన్.

వెలిగింపంబడె సాంధ్యదీపికలు శ్రీభీమేశసద్మాంతర
స్థలి; నే తెల్గుపురాణ పూరుషుల యాత్మల్ శైవభక్త్యున్నతిఀ
జ్వలియింపందొరకొన్నవో యిటశతాబ్దమ్ముల్ ప్రయాణింపగఀ
శిలలుఀ జీవమువచ్చి కాంతులను పూచెఀ పుచ్చపూలట్లుగా.

ఓహో! ఈ ఘనగోపురమ్ము లిటు లొండొంటి న్విలోకించుచుఀ
స్నేహాంకమ్ముగ నే పురాస్మృతుల వాసింగూర్చి భాషించునో!
ఊహావీథులలో జలుక్యయుగ భాగ్యోద్యత్ప్రభావమ్ములఀ
బాహాటమ్ముగ సంచరించెడిని; అబ్బా! చిత్తముఱ్ఱూపుచుఀ.

నందీశా! నిను నెన్నిసార్లు గని యానందింతునో-యిట్టినీ
యందమ్ముఀ జెయిచాచి తాక మనసౌనయ్యా, యథార్థభ్రమఀ
ముందు న్నిల్వగ గుండెలాడ; విట గొమ్ముల్ చిమ్మి యేవేళనో
యిందూత్తంసునియాజ్ఞపై గదలి యిట్టే లేతువం చెంచెదఀ.

మెడలో ఘంటిక నేల కొత్తుకొన, గంభీరమ్ముగా పట్టు ప
ట్టెడలో మువ్వలు గంట లెన్నొ కనుపట్టెఀ మ్రోయుచున్నట్టులే
ముడుల న్నేర్పులు చెక్కి- వింతపదకమ్ముల్ తీర్చె; ఆనాటి యాం
ధ్రుడు చేయెత్తిన ఱాళ్లుగూడ దమకన్నుల్ విప్పి భాషించెనో!

ఈపరిపూతభూమిపయి నించుక పాదము నూని యేగగా
నోపదు చిత్త, మే ప్రతిమ లున్నవొ, దైవతమూర్తు లున్నవో
లోపల నంచు, మండపములున్ శివలింగము లెన్నియెన్ని శి
ల్పోపలముల్ కనంబడినవో కద! మున్నిట ద్రవ్విచూచినన్.

ఈ దేవాలయసౌధకుడ్యముల నేయే పూర్వకంఠమ్ములో
బోధాతీతములై వినంబడుచు నేవో చెప్ప నుంకించు, భా
షాదారిద్ర్యము లింత యడ్డమయి, యాశల్ రిత్తలై పోవ మా
కా దివ్యాత్ములభావ మందదు శతాబ్ద్యంతమ్ము వీక్షించినఀ.

ఏవయ్యా! కవిసార్వభౌమ! మును నీ విక్షుస్ఫురన్మాధురీ
కైవల్యమ్ములు చింద చెప్పినవి- దక్షారామ సౌభాగ్యముల్ ఏ

ఆ విఖ్యాతరసజ్ఞతల్, శివపదధ్యానైకవైవశ్యముల్
లేవయ్యా! పరికింపగా నిపుడు నిల్చెన్ గ్రామ మేదో యిటన్.

దక్షారామపురమ్ములో నిపుడు గంధర్వాప్సరోభామినీ
సాక్షాత్కారము లేదు; హృద్యతరతత్సంగీతసాహిత్య కా
లక్షేపమ్ములు, మంజునూపురచలల్లాస్యప్రసంగస్ఫురత్
విక్షేపక్రమ విభ్రమమ్ము లవి యన్వేషించినన్ లేవిటన్.

## నార్ల వెంకటేశ్వరరావు

[20-వ శతాబ్ది]

### కాకసప్తకం

అనగనగ ఒక కాకి, అరింద ఆకాకి—
తెలతెల్లవారకనె తేటగా లేచింది;
''కాక కాకా'' యనుచు లోకాన్ని లేపింది;
ఇల్లిల్లు చుట్టింది, ఎంగిళ్లు మెక్కింది;
గుట్టుమట్టుగ తిరిగి గూటిలో చేరింది! అనగనగ...

కలదండి ఒక కాకి, గజదొంగ ఆకాకి
పిల్లలకు దాపులో చల్లగా చేరింది;
ఒక గంతు వేసింది, ఒక్కింత జరిగింది;
మలిగంతు వేసింది, మరికొంత జరిగింది;
తాయమ్ము తన్నింది, తా నెగిరిపోయింది! కలదండి...

వచ్చింది ఒక కాకి, వయ్యారి ఆకాకి
తక్కుతూ తారుతూ దిక్కులను చూచింది;
ముక్కు దువ్వెనకాగ ముస్తాబుచేసింది;
మెడ సుంత వంచింది, మెల్లగా కూసింది;
ఎందుకో లేచింది, ఎగిరెగిరిపోయింది! వచ్చింది ఒక కాకి...

వాలింది ఒక కాకి, వగలాడి ఆ కాకి
ము త్తయిదువటు ముందు ముద్దుగా కూర్చుంది;
పలుకరిస్తున్నట్లు పలుమారు కూసింది;
చనువుగా వంటింటి చాయలకు చేరింది;
చేతితో విదలింప చెంగునే పోయింది! వాలింది ఒక...

చేరింది ఒక కాకి, చెల్లాయి ఆ కాకి
చిరుగజ్జె కాళ్లతో చిందులను తొక్కింది;
మెరసిపోయే కళ్ల మురిపెమ్ము చూపింది;
కన్నవారింటిలో కలరూపు తెల్పింది;
అన్న వచ్చేవార్త అందించిపోయింది! చేరింది ఒక...

అయ్యయ్యో ఒక కాకి గయ్యాళి ఆ కాకి
కారణము లేకనే వైరమ్ము పూనింది;
కారాలుమిరియాలు కలగలిపి నూరింది;
కవ్వించికవ్వించి కయ్యమ్ములాడింది;
తరుముకుంటూ వచ్చి తలదన్ని పోయింది! అయ్యయ్యో ఒక...

రచ్చలో ఒక కాకి రాకాసి ఆ కాకి
ఆరబోసినపిండి తేరగా బొక్కింది;
నెత్తిబుట్టలవారి నిలువునా దోచింది;
ఇనుపముక్కును పెట్టి ఎద్దులను పొడిచింది;
కొట్టి కారాడంగ తిట్టుతూపోయింది!
రచ్చలో ఒక కాకి.

( జగన్నాటకమునుండి )

## పైడిపాటి సుబ్బరామశాస్త్రి

[20-వ శతాబ్ది]

## గండపెండేరము

(కృష్ణరాయలు అలసాని పెద్దన కవికి గండపెండార మొసగుట)

గొజ్జంగితోటలో మజ్జనంబాడి, జ
  రీముద్దవల్వ ధరించి, యుల్లి
పొర మించు పల్చనంగరఖా బిగింపించి,
  పటురాజసపు కోరపాగ జుట్టి
గమగమవలచు చొక్కపుజవాది నలంది
  సిందూరతిలకము చికిలిచేసి
బుగబుగ ల్ముసరు కప్పూరపువీడెము సేసి
  రంగుగా రత్నహారములు దాల్చి

పచ్చ కాశ్మీరసేలువ వల్లెవేసి
పసిడిపల్లకి హొరాంబట్టుపరుపుమీద
ముసిముసిపసందునవ్వుల రసికమౌళి
తరలె సభ కాంధ్రకవితాపితామహుండు.

ఆ కవిరాజురాకకు మహాంబుధి పొంగినయట్టులై సభా
లోకము లోకమే మరచె, రూపయి నిల్చిన వాగ్విదగ్ధతా
ప్రాకటమందహాసములు పార్థివసత్తము కేలుమోడ్పులై
శ్రీకమనీయగానరససేవధి నృత్యము లూగి యాగెపో...

కృష్ణభూధవు డొక్క క్రేగంట జూచెను
  తిమ్మరుసు నొకవంక తేరిచూచె
గండపెండెర మొక్క గజయాన తెచ్చెను
  పసమించు బంగారుబళ్లెరమున...

'ఓ కవిసింహులార! వినరో' యని మంత్రియు నూరకుండె, హే
వాకముగా నధీశుడు సభాముఖ మంతయు బాఱజూచె, 'మం

దాకినివోలె సాగు కవితాసుధ యంతయు నింకిపోయెనా
ఓకవిరాజులార! వినరో' యనె తిమ్మరుసయ్య వెండియున్,

...అంతట నాంధ్రవిభుడు
సరసదృక్కులు మందహాసములు కొసరి,

కవితా పితామహా! గండపెండేరమ్ము
మీసొమ్మ్మె' యనియె నమ్మిక వెలార్చి...

'బిరుదు లివి యేల, కవిత చెప్పెదను వినుడు'
అనుచు బెద్దన మొదలిడె నాశుఫణితి

తేటు లానని విరితేనెయంచున పొంగి
పొరలుచు ధారగా గురియుసొరు
నిలువుదారాలుగా నిండుపున్నమనాటి
వెన్నెలల్ చలువలన్ బిందుతీరు
అంటు బిగియునాటి జంటమల్లియ కొస
రేక విచ్చియు గుబాళించుసొగసు
ఎద మెత్తనయిన తుమ్మెదపాట యూటగా
జాలుగా వాగుగా సాగువాసు

ఒక్క గాలికి పొదవెదు రూపుమురువు
కలికిచేతుల కిన్నెర పలుకుహారువు
కోయిల యొకండు కోయని కూయుకులుకు
ఆశుకవితాస్రవంతి పొంగారిపోయె...

జయజయధ్వానములు మింటిచాయ కెగసె
నతడు కూర్చుండె; కృష్ణరాయలును లేచె...

హేమాంగి యొక్కతె హేమకలశ మెత్తి
నిలువుధారలను పన్నీరు కురిసె
పద్మగంధి యొకర్తె పట్టువస్త్రము తీసి
తడియొత్తె కవికి పాదద్వయమ్ము

గండపెండేరమ్ము కౌతుకమ్మున జేని
  కందిచ్చె నతడు తిమ్మయ్యమంత్రి
సర్వసర్వంసహా సాహిత్యనిధి కవి
  తల్లజుం డతడు పాదమున దొడిగె

చిరునగవుతోడ సుకవి యాశీర్వదించె
సభయు సభ యెల్ల పూవులజల్లు కురిసె
ఆముహూర్తమ్ము దివ్యశోభావసథము
కొలువుకొలు వెల్ల నపుడు వైకుంఠమయ్యె

(ఆంధ్రశ్రీనుండి)

# పాలగుమ్మి పద్మరాజు
[20-వ శతాబ్ది]

## మన మైత్రి

గుండెమీదొక రాయిలా కూర్చుండీ తమస్సు
అండ విరిగిపడిం దీ అంధలోకంలో మనస్సు
ఆకాశమయినా నా కగుపడ్డంలేదు
నాకోసం వెలిగించు ప్రియా! నీకళ్లలో ఈరాత్రి—మనమైత్రి—

ఊపిరందని కౌగిలిలో ఉప్పొంగిన ఉద్రేకం
నీ పరువంలో లయించిన పాపమెఱుగని వివేకం
మృతినందిన నాకు రావు; మేఘగర్భంలోకంటా
ప్రతిధ్వనించేలాగ పాడు ప్రియా! జీవదాత్రి—మనమైత్రి—

ఏమీ యెరగని అమాయికత్వం ప్రేమే అని అనుకున్నాం
ఆమనులు పుష్పించినప్పుడు అంతులేని కలలు గన్నాం
అప్పుడు మన నిద్దరినీ అతివాత్సల్యంతోటి
కప్పి కాపాడింది కరుణామయి, ఆజనయిత్రి,—మనమైత్రి—

ఒకరి కొకరం దూరంగా ఒత్తిగిలిపోనేలేదు
వెకిలి-ఈసు మనమధ్య వెక్కిరించిపోబోదు
ఏది లోపించింది మనలో, ఎందుకో ఈ దారిద్ర్యం?
ఈ దురవస్థను బాపగలదా? ఈ మహాజ్ఞానదాత్రి, మనమైత్రి?

అనుక్షణం కలిసి ఉన్నా, కనబడదు ఆ ఆనందం
మనం ఎంత వినబోయినా వినబడదు ఆ నినాదం
మనలో ఏ తత్వమో-మరణించిందేమో!
ప్రణయచైతన్యం మనలో రగిలించగలదా? అనలనేత్రి
మనమైత్రి?

(ప్రతిభనుండి)

## మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

[20-వ శతాబ్ది]

### కావ్య హోమము

ధూర్జటివోలె పెన్ జడలతో బెడగారుగుణాఢ్యుఁ డొక్కెడన్
నిర్జనమైన యద్రిధరణీస్థలి కేగి వెసన్ బృహత్కథా
భూర్జరపత్రపాళి మునుముందర శిష్యులు చేర్చ, దుఃఖబా
ష్పార్జితభుగ్నభావమున నుండి యిడెం గృతికిన్ జలాంజలిన్.

"ఇదె యాచార్యుఁడు మీకిదు
తుదియాఁనగ నెంచి తోడుతోడుత నిచటన్
సొదపేర్పుఁ" డనఁగ, నెందుల
కిది యనుజిజ్ఞాస లేకయే యటు సేయన్.

వలగా వచ్చి త్రివారవందనకృతిన్ బాటించి ప్రమొక్కెన్ జితా
జ్వాలనజ్వాలకు, శిష్యు లిర్వురను నాచార్యాంఘ్రులన్ గన్నుగ
ల్వాల నర్చించుచు వెంటనంటుకొని నిల్వన్ ముప్వురున్మర్త్యమూ
ర్తుల ముచ్చిచ్చనుబోలెబొల్చిరపు డెంతో ముచ్చటల్గొల్పుచున్

తొనకి తొరగెడి కనుఱెప్పదొప్పనీరు
నిండుదోసిళ్ల ముంచి మంత్రించి యగ్ని
కాజ్యహోమ మొనర్చె గుణాఢ్యయజ్వ
శిష్యయుగళము చూచి యచ్చెరువునంద.

సమిధ లొండొండు నించి, కృశానుశిఖలు
పెంచి యక్కావ్యహోత పఠించుచున్న
సామిధేనిమంత్రంబుల సార మిటులు
బయటఁబడియెఁ గవిత్వరూపమ్ము నంది,

"దాఁచితి, నేండ్లుగా బహువిధంబుల నోఁచితి, రక్తమాంసముల్
వేఁచితిఁ, గమ్మనై రుచులపెల్లగు నీయుపహారభుక్తి నీ
వాచవి తిండికంచుఁ గొనివచ్చితిఁ బావక! వాఁడినాలుకల్
చాఁచుము తృప్తిపీక్షణములం దనియింపుము పేదపండితున్.

సౌజన్యంబను మేకతోలు మెయి నాచ్ఛాదించుకొన్నట్టి యీ
రాజుల్ భోజులె? దొంగబెబ్బులులు; వీరా మాత్రశమస్వేదపా
థోజాలంబు హరించువారు; కృతియిత్తు న్మెచ్చి కైకోఁగదే
నీ జిహ్వాగ్రములన్ ధనంజయుఁడ! రాణింపం జిరస్థాయిగన్.

మీసల తేనియల్, విసపుమెచ్చులు, నచ్చముగాని కౌఁగిళుల్
మోసపుఁగానుకల్, మొగముముందరినవ్వులు నొల్కబోసి, వి
శ్వాసకృతజ్ఞతాహృదయభావుకతల్ దిగద్రావి, జీవితో
ల్లాసము దీర్చుకొన్న నృపులా కవితాకళ నుద్ధరించుటల్!

విసివితి, దోసిళుల్ నలిపి వేసరితిన్, మునినయ్యు నేఁటికిన్
విసముల కాసగొంటిఁ బెనువీఱిడినై, యిఁక బాసచేసెదన్
గొసరిన నీశిఖారసనకుం గవితాఘృతధారఁ జూఱగా
నొసఁగెద, బ్రహ్మవర్చసము నొందెదఁ, జెందెద నాత్మనిర్వృతిన్

వెతలొందం బనిలేదు, వేలుకవులు న్వేవేలుకబ్బంబు లా
హుతిమైపోయె హుతాశనా! జగతి నాయుశ్శ్రీలకుం బాసి, నా

కృతివై దేహి పవిత్రదేహమున మూరింబోవ నీజ్వాలికా
తతి చల్లార్చునొ, పేర్చునో త్రిదివగాథాసాధుసంపన్నతన్.

ఇది యేడేండ్లతపస్సు పండినఫలం, బీ నాకృతిన్ జీవసం
పద నిండించితి; సాతవాహనమహీపాలప్రథన్ భూమి ని
ల్ప దలంపారగ మేలునెంచుకొని నే బంపించితిన్; గావ్యశా
రద నాతండు తృణీకరించె నవురౌరా వహ్నిభట్టారకా!

నీలో నాకృతి నిల్చుయోగ మది యుండెన్; గానిచో హాలభూ
పాలగ్రామణి భావనావివశుఁడున్ భాషాబహిర్ద్వేషమే
యాలోచించి తిరస్కరించునె గుణాఢ్యగ్రంథ! మేలా కృతి
శ్రీలున్. రాజుల గాజుచూపులఁ బిశాచీరూపముల్ తాల్చునే!"

అనుచుఁ జిత్యానిలజ్వాల లంబరమ్ము
నంట నెసకొల్పి యాగుణాఢ్యగురుమౌళి
తన బృహత్కథ పత్రపత్రము బఠింప
శిష్యయుగళమునకుఁ బ్రశాసించె నపుడు.

చినుకుబూసలు కన్నుగొనలు కప్పుచుఁ బొంగఁ
దడవి గద్గదిక శిష్యుఁడు పఠించు
నణవంచు మొగముదామర మంచుమూయగాఁ
గృతగభీరత నాలకించు గురుఁడు
కతలు గల్పనములు గరగింప నచ్చెరు
వడి మెచ్చి వినుఁ బశుపక్షివితతి
రసపిపాసను నాల్కకొసలు సాచుకొని వే
చుకొని యుండును జితాప్రకటవహ్ని

చట్టు చదివినయాకు నాచార్యుఁ డంది
యాహుతియొనర్చు నగ్నికుండాంతరమున
అదియె శామిత్రవహ్ని, అల్లతఁడె శమిత!
అవుర పశువగునేమొ కావ్యప్రతిష్ఠ!

చిమచిమారావపావకశిఖలలోనఁ
గబ్బ మొక్కొక యాకుగాఁ గాలుచుండఁ
గవికి వేయిదళాలతమ్మివిరిబోని
హృదయ మొక్కొక రేకుగాఁ బ్రిదులుచుండె.

పులుగుల కూనడెందములు పొక్కెఁ, జెమర్చెను జంతుపాళి క
న్నులు, శిలలుం గరంగినవి, నూల్గొని మ్రోడులు నేడ్చె, నద్భుతో
జ్జ్వలనవకల్పనామహితచారుకథాకృతి యిట్లు గాలినె
చ్చెలి వెడయుచ్చులంబడి కృశించి నశించుచునున్నయయ్యెడన్

నూఱు ల్వేలును గావు, లక్షలుగ దొంతుల్ దొంతులై పావక
క్రూరజ్వాలలు మాసి, కైతకవటాకుల్ పుల్గులై కూసి, భూ
దారన్ హాలుఁ గళారతు న్నిదురమత్తానుండి మేల్కొల్పగా
నా తేడప్పుడు కన్నుల న్నులుముకొం చాలించె భుగ్నశ్రుతుల్.

* * *

సాతవాహన మహారాజు చారులు దారిజూపం జనిచని,

ఒలసినయూరుపుల్ బిగియనూఁది, చితాజ్వాలదగ్ని నిండుగ
న్నులఁగని, విన్నపాటు మదినూల్కొనఁ దానయి దారుణక్రియఁ
దలకొని చేసినట్టులు కనారిలి, తొందర ప్రాలి. ముంగలన్
నిలిచినయంత హాలధరణీపతి యొం డమృతస్మృతింగనెన్.

"ఓహో! గుణాఢ్యమంత్రులె
ద్రోహముద్రోహం బిదేమి దురితంబయ! కా
వ్యాహుతియే, యేమీ! పూ
ర్ణాహుతియే!" యనుచు నఱచి అతిసంభ్రమతన్.

కనదనలమందు సగముసగమ్ము కాలు
నాకు బయటికి లాగి, చల్లారబెట్టి;
శిఖల కందిచ్చునాకు పుచ్చికొని వడకు
కవికరము బట్టెఁ, జరణయుగమ్ము ముట్టె,

"ఏమి మహానుభావ! యిది యేమి కవిత్వవఘూటి నీగతిన్
హోమమొనర్తువే? యొకరుఁడొప్పనిమాత్రన కబ్బముల్ బుధ
స్తోమమునాదృతుల్ గొని రుచుల్ వెలిగక్కవె? చాలుఁజాలున
య్యా! మము నీ కలంకవిలయంబున నంకిలివెట్టి గుంజెదే!"

అనుచు బతిమాలి కవిరాజు నాదరార్ద్రి
మసృణమధుపూర్ణవీక్షణప్రసవములకు,
కాలిమిగులు బృహత్కథాకావ్యమునకు
గేలుగవ దోయిలించె శ్రీహాలరాజు.

(ఆంధ్రపురాణమునుండి)

## వానమామలై వరదాచార్య

[20-వ శతాబ్ది]

### వార్ధకము

మానవీయజీవనదినమార్గమధ్య
గతతృతీయయామమ! వార్ధకమ! తమిస్ర
మిశ్ర సంధ్యాప్రదోషమా? మిత్రవైరి!
స్వతనుపూర్ణేందు కృష్ణపక్షమ! నమోస్తు.

నాదు స్వర్గసామ్రాజ్యము నాశపరచి
త్రోయుచుంటివి నరకంపుగోయిలోన
వెనుక కిటు లొక్కయడుగును వేయనీవు
సఖపునర్దర్శనావకాశమ్ము లేదు.

పండుటాకు తరువునుండి రాలెడువేళ
ఆకసమున నల్లలాడువిధము
కనుల నాడు, మూటగట్టి ప్రయాణమై
యరుగు నాకు నింటి నరసినపుడు.

వేడుక వచ్చినాఁడ పృథివీతలయాత్రకు, జూచుచుండగా
మూడవజాము మించె, తుడముట్టెను తెచ్చినడబ్బులన్ని, నా-

నీడ యదేమొకాని ధరణిం బాడవై నడయాడుచుండె; వే
గూడగబోవునో తిమిరకూటములోని నిశీథమాతృకన్ !

మీఁగడదీసినపాలై
త్రాగగ రుచిదప్పె వృద్ధదశ, తావి సనన్
దీగపయి వాడుపూవటు
లాగిన యభివృద్ధితోడ నలరెడిమేనన్

బిగివీడిననరములవల
తెగిపోయినబంధనాల దేలుశుకమ్మై
ఎగసిచనె నంద మనునది
గగనచలచ్చంచలానుకారిణియగుచున్.

కటికకాలుడు సంసారగహ్వరమున
వచ్చిపడినజీవులకు యౌవనవనస్థ
జీవనగ్రాసములను నిశ్చింత మేపి
పెంచుటలు కోఁతకనుచు భావింపనైతి...

కురిసినమేఘమై యరసికుంబలె తెల్లమొగమ్మువైచె మే
ల్కురులవి, బోసినోటి గుహలో బడి శాశ్వత మస్తమించె సుం
దరదరహాసచంద్రికలు, త్వగ్గతి జోతెలు వ్రేలియాడె, న
స్థిరనవయౌవనద్యుతి గతించెను మేన గళాయిపూతయై...

వయ సొక కోడెత్రాచువలె వచ్చి యిటన్నిముబున్నె మెర్గన
ట్టి యదువబాల్యము న్గని వడి న్నునుమీసల దువ్వి త్రోసెగా
ని, యబల తా నెదుర్కొనగనే వడి వంగి, జయింపజాలకన్
వయిచెను తెల్లమోము నిటు; బాలవిఘాతికి శ్రేయమబ్బునా?

ప్రేతమొగమయ్యె, నడుమున కూఁత గొనమి
కూర్చొనగలేవు, తల ముగ్గుగుల్లయయ్యె
కాళ్లు మూడయ్యె నీచేతికట్టెగూడి
తప్ప దిక తలక్రిందైన తాతపేరు.

(స్రవంతినుండి)

# జంధ్యాల పాపయ్యశాస్త్రి

[20-వ శతాబ్ది]

## కరుణామయి

నీ దరహాసచంద్రికలు నిండిన నాహృదయాంగణమ్ములో
లేదుగదా తమస్సు లవలేశము, ప్రేమసుధానిధాన! నే
డీ దయనీయదాసి భరియింపగలే దిక నీదుప్రేమలో
పేదరికమ్ము; మేను మఱపింపుము మోహనవేణుగీతికన్.

నీ యసితద్యుతుల్ కనుల నింపితి కాటుకచేసి, అల్లదే
తీయనిపాటతో తలుపుదీసెను గుండెకు గున్నమావిపై
కోయిలకన్నె, నావలపుగొండలపై కడకళ్లనుండి వే
ఱే యమునాస్రవంతి ప్రవహించెనురా, అనురాగవార్నిధీ!

శ్రీయుతమూర్తివై కరుణచిందెడి చూపులతోడ స్వామి వేం
చేయును, పాదపూజ దయసేయును మా కను సంబరాన, ఆ
ప్యాయముగా ద్వదీయపథ మారయుచున్నవి నేడు పూచియుం
బూయని పచ్చపట్టుపరపు ల్గొని శ్యామలశాద్వలీస్థలుల్.

నిద్దపుముద్దుమోవి పయనించు భవన్మురళీరవమ్ములో
నిద్దురవోయినట్లు శయనించె సమస్తము; సద్దులేని యీ
యద్దమరేయి ఒంటిగ, రహస్యముగా, తపియించుగుండెపై
నద్దుకొనంగ వచ్చితి దయామయ! నీచరణారుణాబ్జముల్.

ఏది మఱొక్కమాటు హృదయేశ్వర! గుండెలు పుల్కరింపగా
ఊదగదోయి, ఊదగదవోయి! సుధామయ యుష్మదీయవే
ణూదయరాగడోలికల నూగుచు, విస్మృతిలో విలీనమై
పోదును నాదు క్రొవ్వలపుబువ్వుల ముగ్ధపరీమళమ్ములో

నీ చిరునవ్వుపాటలు ధ్వనించెడి మామకమానసమ్ములో
లేచెనురా! ప్రఫుల్లమురళీరవలీరమణీయభావనా

వీచి, దృగంచలమ్ముల ద్రవించి స్రవించు మనోనురాగముల్
దాచుకొనంగలేని పసిదాననురా! విసిగింపబోకురా!

ఇదియదియంచు తేల్చి వచియింపగరాని విషాద మేదియో
హృది గదలించుచున్నది, దహింపగసాగె నిరాశ శుష్కమౌ
బ్రదుకును, స్నిగ్ధశీతలకృపారసధారల దుర్దినమ్మునే
సుదినముచేయరా! యదుకిశోర! కృశాంగి ననుగ్రహింపరా.

నీరసమైన నీప్రణయినీహృదయ మ్మిది చల్లచల్లగా
నీ రసగీతిలో కరగి నీరయిపోవుచునుండె, మోహనా
కార! రవంత వచ్చి కనికారము జూపవయేని, కాలువై
యేరయి, పొంగిపొర్లి ప్రవహింపదొ గోకుల మాకులమ్ముగన్

ఈ కరుణామయీహృదయమే ఒక ప్రేమమహాసముద్రమై
లోకము నిండెరా, కడుపులో బడబాగ్నిని దాచి, కాంక్ష మ
త్తాకయి తేలె, చక్కనిదొరా! శయనింతువుగాని పొంగివ
చ్చేకెరటాలమీద; దయసేయుము గోపకిశోరమూర్తివై.

రాధనురా ప్రభూ! నిరపరాధనురా! అనురాగభావనా
రాధనమగ్నమానసనురా, కనరా, కరుణింపరా, మనో
వీధి పదేపదే కలకవేయుచునున్నవిరా, పురారహో
గాధలు— ఈదలేనిక అగాధతమోమయకాలవాహినిన్.

(ఉదయశ్రీనుండి)

## విద్వాన్ విశ్వం

[20-వ శతాబ్ది]

### రంగడు — గంగమ్మ

కల మెఱుంగడుగాని వలపుతుంపురుల
నిలువెత్తు పోసి చిన్నెలు చూపగలడు
కలకంఠ మెత్త కోయిల లూడిపడును
బళిబళీ రంగన్నగళమె కావ్యమ్ము.

పుట్టుకవి గాయకుడు నటరాట్టు నతడు
కట్ట దెగగొట్టుకొని రస ముట్టిపడగ
ఉట్టిపాటున కన్నీరు లురలిపారల
చెట్టుపుట్టలకే గుండె పుట్టజేయు.

వాని తియ్యనిగొంతుకలోనలోన
తీవసాగుచు నున్న దుద్వేగరవము
వాని చిక్కనిగుండియలోనలోన
పూవుపూయుచునున్న దుద్బుద్ధరసము.

వేకువరేకు లొక్కొకటి విచ్చుచునున్నవి; వేపకొమ్మలన్
కాకులగుంపు లొక్కొకటిగా దొలిమున్కల కేగుచున్న; వా
కోకిల యొక్కటే గుబురుకొమ్మల రెమ్మల వీడలేక కూ
కూకుహు అంచు నొక్కొకట కూయుచునున్నది తెల్లవారగన్.

ఆ ప్రభాతప్రశాంతసంయాతమంద
మందమరుదంకురముల మైమఱచి సొక్కి
కలత లన్నిటి మఱచి రంగన్న కంఠ
మెత్తి పరిసరప్రకృతి మంత్రించి లేపె.

ఆక్షణమ్మున గానలయామృతమున
లీనమైపోయి ప్రకృతికి మానవులకు
నడుమనున్నట్టి యవనిక ముడిచివేసి
మధురనిర్మలపరమసమాధి నిలిచె.

జీవితమ్మున నట్టిరసావబోధ
సిద్ధి ఎన్నడోగాని వాసించబోదు
వేయియుగముల సాధనవిధు లవెల్ల
అట్టి తృటికోసమే తప మ్మాచరించు...

గంగమ్మ పదారేండ్లది
కొంగునిలుచునంత వయసుగూడ లేని. దా

సింగారపుబొమ్మ మన
రంగన్నకు బ్రతుకులో చిరత్నరత్నమా.

అంగమ్ముల నిగనిగ సొ
రంగమ్ముల లగువుబిగువు రంగులసొగసుల్
ఖంగున మ్రోగెడుకంఠము
బంగరుబొంగరము పుణికిపట్టిన దపుడే.

రంగు వెలిసిన నీలిచీర చెఱంగులకు సౌరుంగడించి తు
రంగలించు కురంగనయనాస్నిగ్ధవర్తనముల్
చెంగుచెంగున చెంగలించి బెడంగు సొబగుల రంగలించి వి
హంగభంగుల వింగడించు లతాంగి చందమ్ముల్.

గంగమ్మకు రంగన్నకు
సింగారముజేసి పెండ్లి జేసిననాఁ డా
యంగనకనులఁ మాలిమి
పొంగులు రంగులను సూపి పూర్ణతనందెఁ.

మాలిమి తాలిమిం గొలుచు మానము లేదు; కులాద్రులం దలం
దాలిచి సప్తసాగరవితానము నీదుచు కల్పముల్ తపః
పాలనసేయనీ, ఎడద బాకులపోటుల బ్రువ్వనీ—వసం
తాల వనాల పూలపవనాల విలాసవిహారమే యగుఁ...

రంగన్నగంగమ్మ రంగురక్తిమలు
రంగన్నగంగమ్మ నింగినీలిమలు
రంగన్న గంగమ్మ సింగారములు జిమ్మ
రంగారు బంగారు పొంగారు గోపురాల్.

గంగమ్మ నలనల్ల గాజుల రవళిలో
గంగమ్మ అఱనీలి కన్నుల మగతలో
రంగన్న రుచిచూచు రాగుల అంబలే
హంగైన భక్ష్యభోజ్యాల మఱపించుఁ.

చూపులేగాని మాటల జోలిబోక
వలపులేగాని వాంఛలవంకబోక
పనిత్వరలెగాని సరసాల పాలుగాక
గబగబా ముగియించి రంగన్న వెడలె.

(పెన్నేటి పాటనుండి

## బాలగంగాధర తిలక్
[20-వ శతాబ్ది]
### అద్వితీయం

నామీద నీచూపుచీకట్లు ముసురుకొని
నీమీద నారూపువెన్నెలలు పరచుకొని
నాకలల నీపెన్నెరుల అల లొక్కపరి పొంగి
నీకనుల నాకాంక్ష లాసజ్యధనువులై వొంగి
నాగుండె నీపాట బాడబమ్మై రేగి
నీతనువు నాకౌగిలిని తటిద్గానమై సాగి
అటుకాల మిటువిశ్వ మొక్కత్రుటిలో ఒదిగి
ఇటు నాబ్రదుకుకొసల నీవు, నీ బ్రదుకుమొదల నేను.

నీవు నా ఆశ కవధివై, నేను నీ స్త్రీత్వమున కాహుతినై
నా బ్రతుకుపచ్చనిగట్ల నీవు మిన్నాగువై చుట్టుకొని
నీ స్త్రీత్వంపు నెత్తురుబొట్ల నేను
ఎరుపెరుపురూపమ్ము దాల్చుకొని,
నీ వీ భీకరమధ్యాహ్న ఆతపమ్మున
నాలోని పురుషత్వమ్ము వెదకికొని,
నే నీ శరత్పూర్ణిమల నీ నగ్నలాలసనిమ్నగల నీదుకొని
ఓ ఋతురాజ్ఞి! నా తను వెల్ల నీ అనుకూలపవనములు వీచి
ఓ సురతాణి! నీ క్రతుహోమగుండమున నాజీవితము నే వ్రేల్చి
నీలో కొలదికొలది నశించునాలో తరతరమ్ములు వికసించి

నాలో ఒదిగిఒదిగి ఆక్రమించునీలోపల నే కదలి పునరుద్భవించి
ఇది సృష్టి! ఇది మిథస్సమాశ్లేషచకితతనుయష్టి!
నే నొక్క పరమేష్ఠి!
ఇది నీవు, నిది నేను; ఇరువుర మొకటైన యీ నిమేషమ్ము
విశ్వరహస్యమ్ము.

(భారతినుండి)

## పుట్టపర్తి నారాయణాచార్య

[20-వ శతాబ్ది]

### పాద్యము

తరుణాబ్జతుహినముక్తామాలబోలు నే
  త్రముల దయార్ద్రబాష్పములతోడ
గంభీరభావనిష్కలుషదీప్తులు పర్వ
  యొరపెట్టివిడిచిన పరిధితోడ
నవరసాలకిసాల ప్రవిమలారుణకాంతి
  నొడిగొన్న జుంజురుజడలతోడ
నావంటి పథికు లెందరి నైన రక్షింప
  జాచిన యభయహస్తంబుతోడ

యజ్ఞవేదికవలె బవిత్రారుణములు
నిండుచూపులు దిక్కుల నిండి వెలుగ
మాగురుస్వామి! నాపాలి మధురమూర్తి!
వచ్చినాడమ్మ! మాయింటివఱకు నేడు!

భయముగలిగించు నొక యమావాస్యనాటి
వితథశర్వరిబోలు జీవితము నాది
లోకముల వెలిగించు చంద్రుడవు నీవు
ఎక్కడి ఋణానుబంధమోయీ గురూజి!

వాసనయె లేని క్షుద్రపుష్పమ్ము నెవరు
తలధరింతురు? రాలిపోవలెనెగాని,
బ్రదుకుజీకిన నా శ్వేతహృదయ మెంత
యింపుగా నందుకొంటివోయీ, మహర్షి!

* * *

నేనొక పూలమాలనయి, నీచరణాంబుజసీమ బండి, యు
మ్లానములైన వాసనలు రాలిచిపోవలెనంచు గోరుకొ
న్నాను ప్రభూ! దురంతతమసాంతరితంబగు జీవితంబుతో
గానని కోర్కెకై కనులు కాయలుగాయగ గాచియుండెదన్...

రా! మధుముగ్ధమూర్తి, యిటురార, సుగంధిలకీర్తి! చక్కన
య్యా! మధుమత్తగోపవనితాంతరమానము దోచికొన్నదాం
గా! మిడిమేలపున్ వయసుకల్లరిచేతల మోసపుచ్చి, యే
లా మది దూలబుచ్చెదవురా! అతిలోక : విలాసుందరా!

రాలు జిగిర్చు చూపుల కురంగముపోలిక జూతువేమి? ము
గ్ధాలసమూర్తి! పాటలజటాభరణంబు శిరీషమాల పై
పైలయసూప కన్బొమల వంచుచు నాట్యముదీర్తువేమి? శో
భాలలితాంగ! నీమనసుపజ్జలనే తలపుల్ ఫలించురా!...

నారతనాల పంటవయి, నాకలలోని కడానిమేడవై
కోరిక లిత్తు నీకు గయికొమ్మని పల్కెదవేమొ దేవ! నా
కోరిక దెల్పనా-జలజకుట్మలరూపవిశాలదీప్తమై
కూరిమి నాయెడంద గుడిగోపురముల్ వెలిగించివేయరా!

(సుధాకలశము నుండి)

## ప్రయాగ కోదండరామశాస్త్రి

[ 20-వ శతాబ్ది ]

### బాటసారి

కవి :

ఇంత చింతిలనేల నరుడా, ఈ విషాదం ఎందుకోయీ ?
ఎరుగవో నీ కన్నతల్లిని, ఎరుగవో నీ కలిమిబలిమిని ?
పచ్చలుబంగారు పండిన పచ్చిబాలెంత సీ నేల;
ఇంతకన్నా మిన్నయైనది ఎచటనున్నది అన్నపూర్ణ?
తేనెలుపుప్పొళ్లు కలిసీ, సోనలైన పొలాలు నీవి ;
ఏ పురాకృతపుణ్యముననో ఇచట పుట్టితివోయి నరుడా !

నరుడు :

నాగేలు పన్నికొని రేగ దున్నినవాణ్ణి
పైరుపచ్చలు చూసి భ్రమసిపోయినవాణ్ణి
పుట్టినది బంగారునేలై
పట్టినది మన్నయిన చేలా !

పల్లెపట్టులమాట పలుకకోయీ కవీ !
పైపచ్చనేగాని లోప లున్నది చిచ్చు
కుచ్చితాలే కొంప లన్నీ
మచ్చరాలకు మారుపేళ్లు !

ఈనగాచినపంట ఏ నక్కలో దోచి
కరువుతో ఇంటింట కడుపులో పెనుమంట
నిండుగాదెలు కొండలైనా
తిండిగింజలు తిరిపెమేనే !

పల్లెపట్టును రోసి పట్నవాసానికై
బ్రతుకు లరచేతిలో పట్టుకొనిపోయేము

గతము జ్ఞప్తికి తేకు మోయీ,
బ్రతుకు రోతగ చేయకోయీ!

కవి:

కొడిగట్టిన బ్రతుకులలో క్రొత్తకాంతి వెలుగొందును
చేవచెడిన చేతులలో జీవశక్తి వికసించును
పల్లెవిడిచి పట్నమేగు బ్రతుకుబాటసారులార!
ఆశాదీపాలు వెలుగు అంతులేని పుంత అది.

నారి:

పగలంతా పొగమబ్బులు పట్నమెంత చల్లనిదో!
అన్నిరేలు పున్నమలట పట్నమెంత తెల్లనిదో!
పల్లెటూరిపాట్లు మరచి పట్నంలో బ్రదుకుద మిక
వేకువయేగాని మరల చీకటి లేదోయి మనకు
పగలంతా పొగమబ్బులు
పట్నమెంత చల్లనిదో!

నరుడు:

ఎంతయెత్తున శిరసు ఎంతమెత్తని మనసు
దూరాననే చూచి రారమ్మనే పిలుపు
పట్నమంతా ప్రేమ ప్రవహించునోయేమొ
ప్రతిముఖమ్మున నవ్వు లతికియున్నవి చూడు!

నారి:

ఎగుడుదిగుడూలేని వీథుల నిగనిగల మనసీడ తేలి
వెతలువెలసిన వింతచూపులు ప్రతిఫలించును చూడు నరుడా!

*    *    *

నరుడా! రావోయి తిరిగి, తరతరాల పుట్టిగడ్డ
వదలి పారిపోయెదవో, పిడికి వెన్నదీయుదువో?

మృగతృష్ణల కెగసి మురిసి, ఎంతదూర మేగెదము
ఊరి చెలమనీరు చాలు, బ్రతుకు చివురులెత్తుటకు.

నరుడు :

పదపదవే వెదవెట్టిన పైరుపండి ఒరుగునులే
పసిడివెన్ను లసియాడుచు పయ్యెరలే తోలునులే!
పద పదవే పదనారీ!
పద పదవే!...

కవి :

నరనారీజననయనగోళముల
నవార్కరోచిర్విలాస మల్లదె!
నరనారీజనహృదయకుహరముల
నవోదితాశావికాస మల్లదె!

## మల్లవరపు విశ్వేశ్వరరావు

[20-వ శతాబ్ది]

### ఏనాడు?

ఏనాడు నీమోవి లేనవ్వు పొల్చునో
ఏరేయి చీకట్ల నీచేయి తుడుచునో
ఏప్రొద్దుపొడుపులో నీప్రేమ మొలుచునో
ఆనాడు ఆరేయి ఆప్రొద్దె రేకెత్తు
నా వాడినట్టి గుండెలలోని పూగుత్తి.

మరిగి కష్టపుటలల్ విరిగి తుంపరలౌను
వేగి నిశ్వాసముల్ వీగు తుత్తునియలై
మొయిలుచాటున దాగు మయిలకన్నీరపుడు
అప్పుడో చిరునవ్వ! అప్పుడో చిగురాక!
రెప్పపాటున ముద్దు లప్పగింతును నీకు!

గాలిలో రెపరెపల్ తేలివచ్చున దెపుడు
ఏ తమస్సులకొసల? ఏ యుషస్సులదెసల?
నింగిలో చుక్కలో తొంగిచూచు సువార్త
చెంగుచెంగున వచ్చి మ్రింగు నాదునిరాశ
నెప్పుడో చిరుకన్నె? చెప్పవా చిరుకన్నె!
చెప్పవా చెప్పవా చెప్పవా చిరుకన్నె!

## గడ్డిపువ్వు

తెప్పవోలిక చంద్రబింబం
తేలిపోతోవుంది నింగిని
అందులో. నాముద్దుప్రేయసి
వుందికాబోలు!

లేతచిరునవ్వెందుకో, సిగ
లోన వెన్నెలమల్లె లెందుకొ
చేతిసైగలుచేసి నన్నటు
చేరరమ్మను టెందుకో?

గడ్డిపువ్వుని, నన్ను, ప్రేయసి
గాలితరగల తేలిపోతో
కళ్లలో అద్దాలమెరుగులు
చల్లి కలచెద వెందుకే?

నీకు నేనే కావలిస్తే
నింగి వాదులుకు నీవె సీతా
కోకచిలుకవో, దేనివో అయి
రాగలవు! నే నొద్దుకనకే—

ముత్తెములో, రత్నాలో యేరుతో
చిత్రమా నామబ్బుకడలిని

అర్ధచంద్రుడి దోనెలోనే
ఆడుకుంటావు!

గడ్డిపువ్వని, రేకురెప్పల
కలలుకంటో, కలవరిస్తో
కలతనిద్దురలోనె యెప్పుడో.
కళ్లుమూస్తాను.

(ప్రతిభనుండి)

## 'ఆరుద్ర'

[20-వ శతాబ్ది]

## ఇసుకగడియారం

జనత గాఢనిద్రాలగ్నము
కవిత దీర్ఘస్వప్ననిమగ్నము
ఈ సివిలిజేషను డొల్ల
ఇక భవితవ్యము కల్ల!
తొలి అజ్ఞానపు చైదము
కడతేర్చెను మానవనైజము
లేదు ఇచట ధావళ్యము
లేదు మనకు కైవల్యము!
విడదు శిరోజముల చిక్కు
కడతేరదు మానవభుక్కు
పుడమి ఉర్విత్రాళ్ల వ్రేలును
పడి ఒక్కమ్మడి వ్రేలును!
నేటి అత్యున్నతశిఖరము
రేపు పెన్పల్లము నిఖరము
ఎందులకీ కొలమానమ్ములు
దండుగ మన ఉపమానమ్ములు!

## నీటిగడియారం

నువ్వు ఎక్కదలచుకొన్న రైలు
ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు
ఏళ్ళూ పూళ్ళూ నిరీక్షించలేక
ఎక్కేస్తా వేదో ఒక బండీ.
నీ ఆదర్శాల లగేజీ
ఎక్సె సంటాడు టి. ఐ. సీ.
నీ ఈప్సితాల ట్రంకుపెట్లు
కలల బ్రేకులో పారెయ్యాలి.
నువ్వు తెచ్చుకొన్న వన్నీ ఎక్కించీలోపున
కదిలిపోతుంది బండీ.
అందుకే అందులో కొన్ని
నీ అభిమానహీరోలదగ్గరే ఒదిలెయ్యి.
నువ్వు వెళ్ళదలచుకొన్న ఊరు
నువ్వుబతికుండగా చేరదా రైలు—
దేవుడా! ఇంత చేశావా అని
ఉన్న ఊళ్ళోనే ఉండు!

## ఆఖరి ఆక్రందన

అయ్యా, మృత్యువుగారూ!
పిల్లలవాణ్ణి దయచేసి కనికరించండి.
అద్దెకుంటున్న ఈ జీవితంవాటాకి
నిజమే, ఆదినుంచీ బాడుగ బాకీ.

అయ్యా, మృత్యువుగారూ! పండుక్కి
కోర్కెలగోడలకి వెల్లవేయించండి
పడిపోయిన యౌవనం పెరటిగోడలు
ఈ యేడైనా మరమ్మతుచేయించండి

ఇక మీదట సెకనుపాషాల పిడకలతో
గోడలు ఖరాబుచెయ్యను, ఖరారు.
నిత్యనైమిత్తికాల వంటింట్లో చూరునుంచి
లేమి కారుతోంది చూడండి!
కలలపఁచనుండి కారే సంతృప్తిధార
నిద్దురబిందెలలో పట్టుకోనీండి.
అయ్యా, మృత్యువుగారూ!
పరిస్థితుల పెంకులు తిరగనేయించండి.
ఆశయాలధరలు మండిపోతున్నాయి
అద్దె కొంచెం తగ్గించండి.
దయచేసి, తక్కిన వాటాలవాళ్లని
త్యాగాలముగ్గులు పెట్టమనండి.
నుయ్యి కొంచెం లోతుచేయించండి!
పోనీ బురదైనా తీయించండి,
ఆ భయం మీా కక్కరలేదు——
అందులో మట్టుకు పడిచావను.
జ్ఞాపకాల సందుగులు, అనుభవాల పరుపులు
రోడ్డుమీాద పారేకండి.
బాబ్బాబూ! వచ్చేజన్మలో చూసుకొందాం
ఈసారికి ఊరుకోండి,
అయ్యా, మృత్యువుగారూ!
పిల్లలవాణ్ణి, కనికరించి కనికరించండి.

## శంఖవరం రాఘవాచార్య

[20-వ శతాబ్ది]

### సుధాబాల

ఓ సుధాబాల, ఓ సుధాబాల, ఓ సుధాబాల
ఓహో నాబాల, ఓసుధాబాల!
రా, పూలపల్లకీ నిలిపి స్వర్గాన, స్వప్నమార్గాన
ఘులుఘల్లుమని గజ్జె పలుక, నీ హృదయ మొలుక
నా వలపు గిలక, నా వలపు గిలక.

కర్పూరపాండురకపోల అధరప్రవాళ మధురప్రమీల
హృదయాంతరస్వప్నశీల, ఓ సుధాబాల!
రా, పూలపల్లకీ నిలిపి స్వర్గాన, స్వప్నమార్గాన.
జడలోన ముడిచేను చవితినెలవంక, ఎవరికే శంక?
ఏకాంతచిరమౌనవాణీ, చెరవీడి రానీ
కవనత్రివేణి! కవనత్రివేణి!
వెన్నెలలరేల జలదాల వెలుగుదారాల కట్టి ఉయ్యేల
పాడెదను నావలపుజోల ఓ సుధాబాల!

నీ మనోమకరందమే అమృతభిక్ష, నాకు రసరక్ష,
తెలుసుకో మనసుపొలిమేర నీ వెలుగుజీర
ప్రేమధ్రువతార, ప్రేమధ్రువతార
నురుగులారని మధురహేల ఈవె సుమబాల
హృదయమధుశాల సర్వమిపు డానందలీల ఓ సుధాబాల!

ఎదలోని పదముతో కదలి నీకాలు, కరగె లోకాలు
గంధర్వులే కలసిపాడ, అప్సరసలాడ
పరవశముతోడ పరవశముతోడ
ఈ జగతి నీలాస్యశాల మృదుశాద్వలాల జలధికెరటాల
కనిపించు నీ నృత్యఖేల ఓ సుధాబాల!

ఈ భువనముల మౌనహృదయమే తెరచిచూచి మైమరచి,
మనసుతో మనసు పెనవేసి, రసగంగ పోసి,
చేసెదను కాశి చేసెదను కాశి!
నా అన్నపూర్ణాలయాల వెలిగించవేల నీ సుధాజ్వాల
శతకోటి నీరాజనాల ఓసుధాబాల!

కదలిరావే లోని మాయ కరగింప నాహృదయశంప!
నాకు నీ అభయకర మిచ్చి నా మనసు త్రచ్చి,
చూడవే వచ్చి చూడవే వచ్చి!
నా ముద్దురవల జవరాల, ఆణిముత్యాలలోని రతనాల
చిత్తసాగరమథనలోల ఓసుధాబాల!
కదలిరావే లోనిమాయ కరగింప, నా హృదయశంప!

## పల్లా దుర్గయ్య

[20-వ శతాబ్ది]

### సెలయేరు

కొండపై వా రెవరో వెండికరగిననీరు
కుండతో గుప్పుమని క్రుమ్మరించినభాతి,
స్వర్ధునీవీచికల జల్లులాలెడికరుల్
తొండాలతో ముంచి తూరుపెత్తినరీతి,
పచ్చిమంచు ద్రవించి వచ్చునెడ దానితో
కలిసిపాటె ననంగుగాత్రంపుబూది యన,
మంచుకొలకుల తానమాడిలేచిన దివ్య
వారకామిని యార్ద్రవసనాంచల మనంగ...
తళతళ త్తళతళ త్తళతళత్కాంతితో
జలజలా జలజలా సెలయేరు ప్రవహించె...

సానువుల శిఖరాళితో నేక మొనరించి
ఆసుబోసినరీతి అటునిటుం దిరుగాడి,
పాదరసపుంగుండ పగిలిపాఱె ననంగ
మరకతపుబచ్చికల మళ్లలోపలదూరి
నికటస్థలము లెల్ల నిగనిగన్నిగలాడి
చూచువారలకనుల దోచుకొనునటుచేసి
పంటచేడియ ఆకుపచ్చకోక పయంట
ముత్తెంపుజలతారు మురువుపోతలుపోసి
దోరపూవులు కొన్ని దోసిళ్ల గోసికొని
పరిమళము మైనిండ పట్టించుకొని లేచి
దారి కడ్డుగనున్న తరుల మూలము లొరసి
పక్వఫలముల బుడమి బడ రాలగాగొట్టి
ఫలరసాస్వాదనన్ బల మెసక మెసగగా
పూలసొమ్ముల నొడల్ భూషించుకొని మురిసి
కలనాదముల నెడద పులకితంబగుచుండ
నలుదెసలు వెలుగ చిఱునగవుచూపులు విసరి
ఎందు జూచినగాని ఎదు రెవ్వరును లేక
ఇచ్ఛావిహారమ్ము నిటుకొంత తడి సలిపి
చిటిపొటినడల హంసికవోలె నపుడేగి
చంద్రికాకాంతి వాసకసజ్జపోలికన్
జెలిమితో ప్రకృతి సజ్జితముచేసిన మిసిమి
ఇసుకపాన్పుల బవ్వళించె నా సెలయేరు.

(పాలవెల్లినుండి)

# అనిసెట్టి సుబ్బారావు
[ 20వ శతాబ్ది ]

## పచ్చగ ఈనేలంతా

పచ్చిగ ఈ నేలంతా
ప్రాణ ముబుకుతోం దేమిటి ?
  కార్చిచ్చులలో మండిన,
  కడలి పొంగుతో నిండిన
ప్రాణ గోళమంతా ఈ
పసరు చిమ్ముతోం దేమిటి?

నరచరిత్ర క్రిక్కిరిసిన
ప్రళయసమరసంఘర్షణ
  జారిన వీరులరక్తం
  ఆరని వనితలదుఃఖం
ముంచెత్తిన ఈ గోళం
మొలకెత్తిందా ప్రాణం !

శతసహస్రకాందిశీక
శరణార్థుల శోకయాత్ర,
  వెంటాడిన దోపిడి
  తోడేళ్ల గుంపు హతమార్చిన
చల్లని ప్రాణాలు చిగురు
సాగిన వా గోళంలో !

కరువు దహించిన లోకం,
వ్యాధి జయించిన లోకం,
  తనువు నిరంకుశులు వధిం
  చిన సహించి, పగవహించి

బూడిదగా కాలి పున
ర్జన్మించిందా గోళం!
చెరలో మండే తలపులు
చేపనిరోమ్ముల వలపులు.
అసంతృప్తు లావేదన
అన్నార్తుల కన్నీరూ
పుడమి నావరించి బ్రతుకు
పుష్పిస్తుందా యేమిటి?

నేటి యుగంనిండా
పోటెత్తిన జనచైతన్యం
పూర్వాల తీరనికోర్కెలు
పుట్టనిపాపల ఆశలు
ప్రాణసముజ్జ్వల తేజం
పయనిస్తోం దీగోళం!

ప్రజలంతా పసికన్నుల
పాపలై మెరుస్తారేం?
కార్చిచ్చులలో మండిన
కడలిపొంగుతో నిండిన
ప్రకృతిబాలెంత పచ్చి
పాలగుండెలా గుండేం?

## బోయి భీమన్న

[20-వ శతాబ్ది]

### కొబ్బరితుంట

పాడుగుంటకు రుద్రవాటిక
త్రాడుగట్టిన కూలిపేటది
పెంటకుప్పలమధ్య మిత్తికి
వంటసాల యది!

ఇరుకుసందు లటంచు దోమలె
ఈసడించెడి కశ్మలం బది
ఇంటికంటెను పెంటె మేలని
పించు గూడె మది!

తేళ్లు జెఱ్ఱులు కట్లపాములు
కాళ్లలో కాట్లాడు డొంకది
బాగుపడని మహోభయంకర
రోగముల పుట్టిల్లది!

శ్రితజనాస్థులతో పిశాచులు
జతలుగా కోలాటమాడే
మరణయాత్రామార్గమందే
ర్పరచినట్టి మకా మది!

పేటలోపల నేను పాదము
పెట్టినానో, లేదొ, మృత్యువు
ఝుమ్ముమని శతకోట్లుగా మశ
కమ్ములై నాచుట్టు మూగెన్!

ముఱికిసందుల, నిఱుకుగుడిసెల
మూల్గుచున్న దరిద్రముల్ గన

తగులబెట్టగ బుద్ధిపుట్టెను
తల్లి ! నాకపుడు!

చింతన నెఱుంగు చేతనాచేతనముల
ఇంత లేమి భరించువా రెవరు లేరు
సృష్టికి గిరీటమనుకొన్న శిష్టు డేలొ
క్రుళ్లు బ్రదుకును తొలగించుకోడు తెలిసి!

చేతగానినరుడు సిగ్గునెగ్గును లేక
పాడుగుడిసెలందు బ్రదుకుగాక
చలముగల్గి, చేత బలమున్న చిచ్చేల
ఓగు గాల్చి, బాగు నోమరాదు ?

మెఱుపువలె నీతలం పెద
నొరసిన తక్షణమ, చెంత నొదిగిన కొంపల్
కర మంది పుచ్చుకొని భీ
కరరూపము దాల్చి పేట గాల్చితి నంతన్.

గుడిసెచూఱును నే నంటుకొనెడుదాక
త్రోవ చూపించు ఆకులతుంట నేను
అంతలో తుంటబ్రతు కంతమై, వినూత్న
ధర్మసృష్టికి నాయకత్వమ్ము గొంటి.

( దీపనభనుండి )

# దాశరథి కృష్ణమాచార్య

[ 20-వ శతాబ్ది ]

## శిల్పి

చాగిలదీసి ఈ కఠినశైలశిలావళి పై డిటీవెగా
లాగెద వెట్టులన్న నటులల్; శిలకే గిలిగింతగా ' ఎలో
రా ' గుహల న్మలంచిన విలాసపు నీ ఉలిముక్కులోపలల్
దాగిలిముచ్చులాడె నవతావిలసత్కవితావతారముల్.

రాలు వరాలుచేసెడి విలాసము నీ ఉలిలో కుదించి, దే
వాలయగోపురాగ్రములయందు కళామతి పెంచి, పర్వతా
గ్రాల సురాంగనానటనకై రసశాలలు సంతరించి, కా
వ్యాలకె రూపుదించిన మహామతి! శిల్పకళాపురోగతీ!

నిను గని కొండ లన్ని రమణీకుచపాళికలై, కపోలమో
హనఫలకమ్ములై, భ్రుకుటులై, కుటిలాలకజాలమై, సురాం
గన లయి రూపుదిద్దికొనగా, ఉలిలో అమృతమ్ము చల్లి, జీ
వనములు పోసిపోయెదవు బ్రహ్మవు శిల్పికులావతంసమా!

సుత్తెల దండిదెబ్బలకు స్రుక్కిన కొండలపిండు లెల్ల నో
రెత్తి మెలుంగువెట్టు "నివు డీ వెటువంటి మనోజ్ఞరూపకం
బెత్తు మటన్న నెత్తమటె! ఎందుల కిట్టుల మట్టిమట్టిగా
మొత్తెదవోయి శిల్పికుల భూషణ! శైలశిలాప్రవేషణా!"

చెక్కినరాతికంబములు చిందెడి మంజులసాధుసుస్వరా
లుక్కినరాలపై పలుకు లొత్తినరీతి ధ్వనించునంట, ఏ
లెక్కలతో ఉలిన్ గిలకరించితివో శిలపై కళానిధీ!
అక్కట రాతిలో హృదయ మద్దితివో రసరాగసృష్టికై.

వెన్నవలెన్ కరంగును, స్రవించును వెచ్చని కంటిసీరుగా
ఇన్నగపాళిక్రొమ్మెరుగు లీనుచు శిల్పకళావిలాసనం
పన్నత గుల్కు నీ ఉలినిబట్టిన మోహనబాహుదండమున్
గన్నపు డెల్ల, ఎంత మొనగాడవురా శిలనే కరంచగా!

ప్రతివికారశిలయు ప్రతిమయై కనుపట్టు
పడతివోలె కులికి వలపురేపు,
నీ కరావలంబనిభృత మైనపు డెల్ల
రాతిరాతిలోన నాతి దోచు.

## శ్రీగిరి

నాగరకులు తెలుగునాటివారలు నేడు
శ్రీగిరీంద్రమున వసింపబోరు,
వెనుకబడినవారి పేర వర్తించెడి
చెంచువారలే వసింతు రందు.

వారె నాగరకులొ, వీరె నాగరకులో
సహృదయులె యెఱుంగజాలువారు,
ప్రాజ్ఞనోజ్ఞ విభవపారంపరీ శేష
రక్తులైన బుద్ధభక్తు లెవరు ?...

స్థాణువైన నాగశైలమ్ము పంచల
రేయుబవలు పరుగుదీయు కృష్ణ
ఒకటి నిలిచియుండు, నొకటి నిల్కడలేని
దయ్యు బుజముబుజము నంటి విడవు.

ఎత్తైన నాగశైలేంద్రు మేధావీధి
నేమి యున్నదొ చెప్పలేముగాని
ఆతని సాహచర్యముచేయుచుండిన
కృష్ణమ్మ యెఱుగగాలే దనకుము
నిశ్శబ్దముగ బుద్ధునింబోలె నివసించు
అతని యాలోచన లాకళించి
తనభాషలో పవళ్లును రేలు పాడుచు
ఆమె వీచీవల్లకీమృదంగ
నాదమేళనమున చెప్పగాదొడంగె
బౌద్ధమతరహస్యముః బోధపడదు మనకు;
దాని తెలియుటకై కొంత సానుభూతి
కావలయులెమ్ము పూర్వలోకమ్ముగూర్చి.
గిరి యెంతయెత్తొ ఈఝరి యంతలోతులే
ఒండొంటితో బోలు వ్యత్క్రమముగ

అది నీలశిలలతో నందగించును లెమ్మ
 ఇది నీలజలముతో నింపు నింపు
అది భూజరాజితో నావృతంబై యుండు
 ఇదియు భూజమ్ములనే వహించు
అది సహస్రాబ్దమ్ములైన కంపింపదు
 ఇది సహస్రాబ్దాల కింకిపోదు
ఒకటి స్థాణువైన నొకటి జంగమమౌను
భేద మంతెకాని లేదు వేఱు;
అయినగూడ వీడ వన్యోన్య మెన్నడు
జలశిలానుబంధసరణి గనుడు.

అను కృష్ణాతట సంస్థితం బయిన నాగాద్రి న్విలోకించి, ఆంధ్రునియౌన్నత్య మెఱుంగ రమ్ము; శిలలందుం దా కుశాగ్రీయబుద్ధిని జొప్పించి పవిత్రబుద్ధకథ చిత్రించెఁ మహాశిల్పి; వానిని ఆదర్శముగా గ్రహించి తెలుగింటిఁ జక్కఁగా దిద్దుమా!

( మహాబోధినుండి )

## దొప్పలపూడి అనసూయాదేవి

[20-వ శతాబ్ది]

## మాతృహృదయము

**అంకురార్పణము**

అంకురంబునసె ప్రేమాంకురం బగునో కో!
 నెలదప్పినంతనె నెమ్మనంబు
పొంగారు-వాంఛాతరంగాలతో నిండి
 పోవుచుండె నిదేమి! పూర్వమిట్టి
తీయందనా లూరజేయంగజాలెనె
 సంసారవార్ధి నేసౌఖ్యమైన ?

లోకాల సృష్టించు లోకేశు చిత్రంబు
గాకున్న నిది యేమి కాంతుయొక్కొ?

గర్భవతులైన వారిని గాంచినంత
ప్రసవవేదన నెంచి మానసమునందు
నెంతయో భయమొందు నా కిప్పు డింత
మధురభావన గల్గ నే మాయయొక్కొ!

ఎన్నండు వచ్చునో చిన్నారి కందువుం
గన్నారగాంచు బంగారుగడియ
ముద్దారుమూర్తి యేప్రొద్దు నాప్రక్కలో
బొజ్జుండునో మేనుపుల్కరింప
చక్కందనాలతో జన్మించునో జనుల్
వెక్కిరించెడు పోల్కి చిక్కకుండ
పూర్ణకౌతూహలంబున లోటుగల్గునో
రూపాన నేదేని లోపమొదవి

కానరాని మహాశిల్పి లోన జేరి
రాత్రిపవళులయందు విశ్రాంతిలేక
ఎట్లు సృష్టించుచుండెనోయేమొ! వాని
యిష్టమేకాని నాచేత నేమి యౌను.

నెలలు నిండుచున్నకొలది నిండుచుండు
మానసంబున భయదభావం బటంచు
నిశ్చయించిన నామది నిండుచుండె
మాసముల్ రాగ సంతోషరాశితోడ.

పాలు :
కోమలమైన నీజఠరకోశము జీర్ణముచేయజాలునే
మామకభోజనంబులను, మాధురిచే రుచులూరు క్షీరముక్
స్వామి సృజింపకున్న, నొక పల్లును మొల్వని బోసినోటితో
నేమి తినంగజాల వనియే మునుముందుగ జేసియుంచెరా.

గుప్పున జప్పరించుచును గ్రోలగవీలగు పాత్రలందు నీ
కప్పటికప్పుడే పచనమై ప్రవహించుచు వెచ్చవెచ్చగా
నిప్పును నీళ్లులేక యిట నిల్చెడి నెన్మిదిజాములందు, నీ
కెప్పటి కాకలౌనొ యపు డెల్ల ననుం గడు తొందరించుచున్.

ఆకటిచిచ్చు రేగ నట నర్భకుగర్భములోన, స్తన్యముల్
దూకుచు బొర్లి పోవుటకు దొందర చెందును; దివ్యశక్తియే
కాక మఱేమి యౌను! పసికందువు నేడుపు పాలచేపుతో
నేకముచేసి బిడ్డదరి కేగగ వేగిరపెట్టుచుండెడిన్.

దీపజ్యోతి:

వసుధకున్ నూతనంబుగా వచ్చినట్టి
ముద్దుబిడ్డని దృష్టి మున్ముందుసాగి
మెఱుగులీనెడు దీపంబు మీఁదగాక
వ్రాల దెచ్చోట నొకక్షణకాలమేని.

కనువిచ్చి కనుట నేర్చినదాది దీపమున్
గనునట్లు లితరంబు గాంచడయ్యొ
ఇట రాకపూర్వమం దేకాంతి జూచెనో
యెఱిగినరీతిగా నరయుచుండు
తేజస్స్వరూపుడౌ దేవాదిదేవుగా
భావించునేమొ దీపంబు నితడు
మాయపుచ్చుటకునై మాలిమి చేయునో
తనమాఱుగా దీపమును బ్రభుండు

దినము పైకొన్న దాదిగా దీపకాంతి
కౌతుకంబున గాంచుచు గాలుసేతు
లట్టె యాడించుచుండు నాచిట్టిబాబు
నాకృతిం గాంచ ముచ్చట యౌను నాకు.

(మాతృహృదయమునుండి

## శిష్ట్లా సత్యనారాయణరాజశేఖరం

[20-వ శతాబ్ది]

### చిత్తము-చేతికదురు

జీవితములో ఎన్ని చిందరలో వందరలో
చిత్తమునకే మెఱుక, చేతికదురుకె మెఱుక—జీవితములో...

కోవతప్పని చిలుప కొసకు తేలేవరకు
త్రోవతప్పని నడక తొంగలించేవరకు—జీవితములో...

పోవుపోవున ప్రేమ పొంగిపొరలే ప్రణయ
జీవియై తెలియేకు తీవ లల్లేవరకు
సేవక్రొందేనియలు చింది జగములు తనియ
భావనలు వికసించి పరిమళించేవరకు—జీవితములో...

తొణికిసల కిఱుకిఱ్ఱుధోరణులు సడలంగ
తుమ్మెదయి కదురు ఝుంఝుమ్మ పాడేవరకు
అణువణువు పరమాత్మమయముగా జీవాత్మ
ప్రణవనాదపు జోలపాట పాడేవరకు
జీవితములో ఎన్ని చిందరలో వందరలో
చిత్తమునకే మెఱుక చేతికదురుకె మెఱుక!

## సి. నారాయణరెడ్డి

[20-వ శతాబ్ది]

### మాధవహేల

కష్టాలవలె ముసురు కారుమబ్బుల దాటి
దుఃఖాలవలె జారు తుహినధారల దాటి
పశువాంఛవలె రేగు శిశిరానిలము దాటి
మరల ఏతెంచితివ, మధురమధుమాసమా!

మన్మథధనుర్ముక్త మల్లికాహాసమా!
చూపుతోనే గుండెలో పొగలు రేగించు
గ్రీష్మరాగిణికొరకు కేలుసాచగ లేక
నవ్వుతోనే బ్రతుకునందు మంచులు దించు

హేమంతభామతో జాముగడుపగ లేక
బ్రమోదువడిపోవు నాలో మోదుగుంబూల
కాగడా లెత్తిన జగన్మోహినివి నీవు
రాగమాధ్వీకధారావాహినివి నీవు.

నీ పరిమళస్ఫీతనిశ్వాసలహరితో!
పొగచూరు గుండెలో పొందామరలు పూచు.
నీమరందస్నాత నీలదృఙ్మాలతో
ఇగమువట్టిన యెడద నిగురుమంటలు లేచు.

నీ వగ్ని శీధుపుంజీభూతరూపమవు
ఈవు చల్లనిజ్వాల లెగబోయు దీపమవు,
మావిచిగురులు మేసి మత్తిల్లుకోకిలల
చేదుగొంతుకలందు స్వాదుగీతులు లేపి,
శిశిరవిషమారుతవిశీర్ణవృక్షాంగనల
దిసమొలలలో హరితవసనాల నందించి,
వెన్నుపోటులగాని వినని మానవకోటి
పువ్వులచిరునవ్వులతోడ వశీకృత మొనర్చి,
భువిని నందనవనమ్ముగ మార్చు ఆమనీ!
కవిహృదిని పలికించు గంధర్వభామినీ!

## మల్లంపల్లి శరభయ్య

[ 20-వ శతాబ్ది ]

### ధ్యా న దే హ ళి

నిరవధివియద్విహారేచ్ఛ నీడభూమి
వేగియుంటి పక్షోద్గమవేళదనుక
అలసి నేడు లోకాలోకయాత్ర మరలి
మత్కులాయాంతనిద్రాసమాధి వలతు.

వితతమోహతంద్రాభరానతము లిపుడు
నా గరుద్రేఖ లొరసె ననంతగగన
జలధిభూధరకాననశ్యామరేఖ
లలసపవనాహతస్వనదంచలముల.

శ్రమనిమీలితలోచనసరణి నిరులు
గవిసి క్రమశోవిలుప్తము లవియె మత్పరి
చారవలయాంకభూషితాశాదశాంత
రాళ మాలోకపూర్ణ వేలాపయోధి.

సరవి నిట్టి యాతాయాతపరిధుల బడి
శ్రమవిలులితము ప్రతిదివసపరిణామ
వేళ నీ నీడదేహళి వ్రాలు నాదు
ప్రాణ ముచ్ఛ్వసితపురాణపత్ర మటుల.

బంధురసుషుప్తియోగనిష్పందవృత్తి
పూని నే డిదె గళితదివానిశావి
మోహమతినొచు నాలోకపూర్ణపథము
లంటి చనియెద ననివర్తనాయతనము.

( కృష్ణాపత్రికనుండి )

## దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి

[ 19, 20 శతాబ్దులు ]

### జ య గీ తి

జయజయజయ ప్రియభారత
జనయిత్రీ, దివ్యధాత్రి !

జయజయ సస్యామల సుశ్యామచలచ్చేలాంచల !
జయ వసంతకుసుమలతా చలితలలితచూర్ణకుంతల !
జయ మదీయహృదయాశయలాక్షారుణపదయుగళా !
జయజయజయ ప్రియభారత
జనయిత్రీ! దివ్యధాత్రి !

జయజయజయ ప్రియభారత
జనయిత్రీ! దివ్యధాత్రి !
జయ దిశాంతగతశకుంత దివ్యగానపరితోషణ !
జయ గాయకవైతాళికగళవిశాలపథవిహరణ !
జయ మదీయమధురగేయచుంబితసుందరచరణా !

# కవులను గూర్చి

## ప్రథమ భాగము

### అనంతామాత్యుడు

15-వ శతాబ్దిలోనివాడు. భోజరాజీయమను స్వతంత్రకావ్యమును అన్న దాన మాహాత్మ్యమును తెలుపు చిత్రకథలతో రచించినవాడు. ఈతడు ఛందోదర్పణము, రసాభరణమను అలంకారగ్రంథమును రచించెను.

### అన్నమాచార్యులు తాళ్లపాక (1408 – 1503)

తిరుపతిలో శ్రీ వేంకటేశ్వరుని సేవించుకొనుచు వేలకొలది కీర్తనలు స్వామిపై రచించెను. వేంకటాచలమాహాత్మ్యము, ద్విపదరామాయణము రచించెను. సంకీర్తనలక్షణము సంస్కృతమున రచించుటేకాక దేశి కవితామార్గమున పెక్కురచనలొనర్చిన ప్రథమసంకీర్తనాచార్యుడు.

### ఎఱ్ఱాప్రగ్గడ

14-వ శతాబ్ది పూర్వార్ధముననున్నవాడు. అద్దంకి రాజధానిగా పాక నాటి నేలిన ప్రోలయ వేమారెడ్డి ఆస్థానముననుండెను. ప్రబంధపర మేశ్వరుడని, శంభుదాసుడని ఈతని బిరుదములు. భారతమున ఆరణ్య పర్వశేషమును పూరించి, హరివంశము తెనిగించెను. ఈతని నృసింహ పురాణము స్వతంత్రకావ్యమని చెప్పదగినది. ఈతడు రామాయణమును గూడ తెనిగించెనుగాని అది లభ్యమగుటలేదు.

### తిక్కనసోమయాజి

13-వ శతాబ్ది ఉత్తరార్ధముననున్నవాడు. ఉభయకవిమిత్రుడు. నిర్వచ నోత్తరరామాయణము, విరాటపర్వమాదిగా 15 పర్వముల ఆంధ్ర భారతము రచించెను. నెల్లూరు మనుమసిద్ధికడ మంత్రి. భారతమును హరి హర బ్రహ్మాంకితమొనర్చి ధర్మాద్వైతమునకు స్థితి కల్పించెను.

### నన్నయభట్టు

11-వ శతాబ్ది పూర్వార్ధములో చళుక్యరాజరాజు కోరికపై ఆంధ్రభారత రచనం ఆరంభించి ఆదిసభాపర్వములును, అరణ్యమున కొంతభాగము రచించెను. అష్టభాషావాగనుశాసనుడు. నన్నయ భారతమే మనకు లభించిన ప్రథమాంధ్రకావ్యం. ఆంధ్రశబ్దచింతామణి యను లక్షణ గ్రంథమును నన్నయయే రచించె నందురు.

## నన్నిచోడదేవ

కవిరాజ శిఖామణి. 12-వ శతాబ్దిలోనున్న తెలుగు చోడరాజు. కుమార సంభవ కావ్యకర్త. ఉద్భటారాధ్యుని కావ్యమును, కాళిదాస కావ్యమును మాతృకలుగా గొని తన కావ్యమును స్వతంత్రముగా తీర్చిదిద్దెను. శివపారమ్యమును బోధించు కావ్య మిది. మార్గ దేశి పద్ధతులను మేళవించినవాడు. ఈతడు కళావిలాస మను కావ్యము రచించెనుగాని అది లభ్యమగుటలేదు.

## పినవీరభద్రుడు పిల్లలమఱ్ఱి

15-వ శతాబ్దియందు విజయనగరము నేలిన సాళువ నరసింహరాయని కాలముననున్నవాడు. జైమినీభారతమందలి అశ్వమేధపర్వమును తెనిగించెను. కాళిదాస శాకుంతలమును కొంతవర కనుసరించి శృంగార శాకుంతలమను స్వతంత్రకావ్యరచన చేసినవాడు.

## పెదతిరుమలాచార్య తాళ్లపాక (1460 – 1548)

అన్నమాచార్యుల అనంతర మాతని వంశీయులును పెక్కు సంకీర్తనములు స్వామిపై రచించిరి. వేంకటేశ్వరశతకము, వేంకటేశ్వరవచనములు, ఉదాహరణము మున్నగు పెక్కు కృతులు రచించెను. ఈ వచనములను స్వామిసేవవేళ రాగతాళయుక్తముగా పాడెడివారు. తాళ్లపాక వంశీయులు తాతతండ్రులతరముల రచించిన సంకీర్తనలు వేలకొలది రాగిరేకులపై చెక్కినవి తిరుమలలో స్వామిచెంత నేటికి భద్రపరచి యుంచిరి.

## పోతన బమ్మెర

15-వ శతాబ్దిలో రాచకొండ నేలిన సర్వజ్ఞ సింగమనేని కాలముననున్న భక్తకవిశేఖరుడు. భాగవత పురాణమును అనుపమానంగా తెలిగించిన వాడు. వీరభద్రవిజయ మను కావ్యమునుగూడ రచించెను. భోగినీ దండకమను శృంగార దండకమును పోతనయే రచించె నందురు. రాజుల నాశ్రయింపక కర్షకవృత్తిచే జీవనం గడిపిన స్వతంత్రుడు.

## మల్లయ నంది—సింగన ఘంట

16-వ శతాబ్ది ఆదిలో విజయనగరమును పాలించిన తుళువ నరసరాజునకు కృతిగా వరాహపురాణమును తెనిగించిన జంటకవులు. వీరిలో సింగనకు మలయమారుతకవి యని బిరుదము కలదు. ప్రబోధ చంద్రోదయ నాటకమును వీరు శ్రవ్యకావ్య మొనర్చిరి.

## వేమన

15–వ శతాబ్దిలో కొండవీడు నేలిన రెడ్డిరాజుల వంశములోనివాడు. ఈతడు యోగియై, లోకవృత్తమును, దంభాచారములను, మెట్టవేదాంతములను పరిహసించుచు వేలకొలఁదిగా ఆటవెలదులను రచించిన సహజకవి. వేమన పద్యములు తెలుగునాట ఆబాలగోపాలము నిత్యము సకల సందర్భములలో నుదాహరించుచుందురు.

## శ్రీనాథుఁడు

15–వ శతాబ్దిలో కొండవీటి రెడ్డిరాజుల ఆస్థానకవియై, సకల రాజాస్థానములందు నిరాఘాట సంచారమొనర్చి కవిసార్వభౌమ విఖ్యాతిగన్నవాడు. శ్రీహర్ష నైషధకావ్యమును, స్కాందపురాణాంతర్గత కాశీఖండ భీమఖండములను కావ్యశైలిలో తెలుగున రచించెను. హరవిలాస శివరాత్రిమాహాత్మ్యములు ఈతని ఇతరకృతులు. ఈతని మరుత్తరాట్చరిత్ర శాలివాహనసప్తశతి, పండితారాధ్యచరిత్రము లభించుటలేదు. క్రీడాభిరామ మనే వీథి ఈతని రచనమే యందురు. పల్నాటివీరులచరిత్రను ద్విపదకావ్య మొనర్చెను.

## సోమన నాచన

14–వ శతాబ్దిలో ఆనెగొంది నేలిన బుక్కరాయలకాలమువాడు. సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తినని చెప్పికొన్నవాడు. ఈతని ఉత్తర హరివంశము మాత్ర ముపలభ్యమగుచున్నది. ఈతడుగూడ తన గ్రంథమును హరిహరాంకిత మొనర్చెను. పురాణము కావ్యశైలిని రచించుట కీతడే ఆద్యుడు. ఈతని వసంతవిలాసకావ్యం దొరకుటలేదు.

## సోమనాథుఁడు పాల్కురికి

12–వ శతాబ్ది ఉత్తరార్ధమున నున్నవాడు. బసవపురాణము, పండితారాధ్యచరిత్రమను ఈతని కావ్యములు దేశీయమగు ద్విపదచ్ఛందమును, భాషను, ఇతివృత్తము నాశ్రయించినవి. వీరశైవమతప్రచారమునకై ఈతడు కావ్యమును రచించుటేకాక, తన్మత ప్రాశస్త్యమును స్థాపించుటకనేక సంస్కృత గ్రంథములు రచించినవాడు. ఈతని వృషాధిప శతకమే తెలుగున మొదటి శతకం. ఉదాహరణ మను కావ్యభేదమునకు గూడ ఈతడే ఆద్యుడు. ఈతని గ్రంథములు కన్నడభాషలో అనూదితమైనవి. రుద్రపశుపతి యను ముగ్ధభక్తుడు స్వామి విషమారగించెనే, యేమైపోవునోయని బాధచెంది తాను మరణోద్యుక్తుడగుట యిందు వర్ణితము.

## ద్వితీయ భాగము

### కదిరీపతి పాలవేకరి

18-వ శతాబ్దివాడై యుండునని చరిత్రకారు లూహించుచున్నారు. కదిరి నృసింహభక్తుడు. ఆస్వామి కంకితముగా శుకసప్తతి యను శృంగార కావ్యము రచించెను. ఇవి అరేబియన్ నైట్సు కథలవంటివి. దేశకాలములను, సంఘస్వరూపమును, ప్రజల వేషభాషలను, వృత్తులనుగూర్చిన వర్ణనలిందు స్వభావోక్తిరమణీయములై యున్నవి.

### కూర్మనాథకవి గోగులపాటి

విశాఖపట్టణప్రాంతముల నున్నవాడు. మృత్యుంజయవిలాస మను యక్షగానము, లక్ష్మీనారాయణసంవాదము, సింహాద్రినారసింహా, విజయరామ, సుందరీమణి శతకములు, పెక్కు గేయము లీతడు రచించెను. సింహాచల క్షేత్రమును తురుష్కులు దోచుకొనుట కేతెంచి నపుడు స్వామిని వ్యాజనింద యొనర్చుచు నీత డీ శతకమును చెప్పగా ఆకొండపై తెరలుతెరలుగా కణుదురీగలు పుట్టుకొనివచ్చి తురుష్కులను ముట్టడించి పారద్రోలెనట. ఇది వీరరసప్రధానమగు శతకము.

### క్షేత్రయ్య

కృష్ణా తీరవాసియగు ఈ వాగ్గేయకారుడు తంజావూరు నేలిన రఘునాథ రాయలు, విజయరాఘవనాయకుల కాలమున 17-వ శతాబ్ది ప్రారంభమున నున్నవాడు. 'మువ్వగోపాల' ముద్రతో పెక్కు శృంగార పదములను రచించెను. అమరుకాదులందువలె శృంగార నాయికాభేదములు అతిసూక్ష్మముగ ఈ పదములందు చిత్రితమైనవి. ఈ పదములందు ప్రధానముగా పరకీయా నాయికమగు మధురభక్తి ప్రపంచితమైనది.

### తిమ్మన నంది

ముక్కుతిమ్మనయని నామాంతరముగల ఈతడు రాయల ఆస్థానమున అష్టదిగ్గజాలలోనివాడు. రాయల దేవేరియైన తిరుమలాంబ కీత డరణపుగవి యని చెప్పుదురు. రాయలు తిరుమలాంబ అవినయమునకు కోపింపగా, ఈ కవి సత్యభామాకృష్ణుల ప్రణయకలహకథను పారిజాతాపహరణమను పేర కావ్యమొనర్చి రాయలకంకిత మొనర్చెను. కుపితయగు సత్యకు కృష్ణుడు నమస్కరించడం, అతని శిరస్సును సత్యభామ ఎడమకాలితో తొలగద్రోయడం, ఆ పాదప్రహరణాన్ని కృష్ణుడు పరమానుగ్రహంగా ఎంచుకోవడం మొదలైన కథ నిందు తిమ్మన అతిరసవంతంగా వర్ణించి రాయల కోపాన్ని నివారించెనని చెప్పుదురు. ఈ కథహరివంశమునుండి తిమ్మన గ్రహించెను.

## త్యాగరాజు కాకర్ల

ఈ వాగ్గేయకార సార్వభౌముడు 18-వ శతాబ్ది అంతమున తంజావూరు నేలిన మహారాష్ట్ర ప్రభువు శరభోజి కాలముననుండి వేలకొలది కృతులు రచించిన రామభక్తుడు. నౌకాచరిత్రము, ప్రహ్లాద చరిత్రము అను యక్ష గానములగూడ నీతడు రచించెను. ఈకృతు లన్నియు త్యాగరాజ ముద్రాంకితములు.

## ధూర్జటి

ఈతడును రాయల ఆస్థానమున అష్టదిగ్గజములలోనివాడు. శివభక్తుడు. శ్రీ కాళహస్తీశ్వర మాహాత్మ్య మను కావ్యమును రచించి శ్రీ కాళహస్తీ శ్వరునకే కృతియొసగెను. రాజాశ్రయాన్ని, సంసారమును రోసిన చరమవయస్సున శ్రీ కాళహస్తీశ్వర శతకం రచించి తన కష్టసుఖాల నందు వెళ్లబోసికొనెను. ఏనుగు - పాము కాళహస్తీశ్వరుని పూజించి శివసాయుజ్య మందిన కథ యిది.

## పళని ముద్దు

1740 ప్రాంతమున తంజావూరు నేలిన మహారాష్ట్రపతి ప్రతాపసింహుని ఆశ్రయముననున్న యీ వేశ్యామణి రచించిన రాధికాసాంత్వన మను శృంగారప్రబంధము పేరుగాంచినది. రాధ తన పెంపుడుకూతును కృష్ణున కిచ్చి పెండ్లియొనర్చి, పిమ్మట కృష్ణవిరహమును భరింపలేక విలపించుట మున్నగు ఘట్టము లీ కావ్యమున స్త్రీహృదయ తలస్పర్శిగా వర్ణితములు.

## పాపరాజు కంకంటి

రామాయణోత్తరకాండ నీతడు కావ్యపాకమున రచించెను. విష్ణు మాయావిలాస మను యక్షగాన మీతని రెండవకృతి. నేడు 'పులికాటు' అని పేరందిన ప్రళయకావేరిలో నీతడు రాజనియుక్తుడు. రామాజ్ఞచే లక్ష్మణుడు జానకిని వాల్మీకి ఆశ్రమంచెంత విడిచివచ్చిన ఘట్టమిందు గైకొబడినది.

## పురుషోత్తముడు కాసుల

కృష్ణామండలమున చల్లపల్లి జమీందార్లచెంతనున్న భట్టుకవి. ఆంధ్ర నాయక, హంసలదీవిగోపాల, మానసబోధ, భక్తకల్పద్రుమశతకములు రచించెను. కృష్ణాతీరమందున్న శ్రీకాకుళక్షేత్ర మొకప్పుడు పూజా పురస్కారములు లేక పాడువడియుండగా స్వామిపై ఈ కవిచెప్పిన ఆంధ్రనాయకశతకమందలి వీపద్యములు. వ్యాజనిందలో ఈ శతకమును మించినవి మరి కానరావు.

### పెద్దన అల్లసాని

శ్రీకృష్ణదేవరాయల ఆస్థానమున అష్టదిగ్గజములందు ముఖ్యుడు. రాయలచే అగ్రహారము లందెను. కవిగండపెండేరము గైకొనెను. స్వారోచిషమనుచరిత్రమును రాయలకు కృతియొసగెను. ఆంధ్ర కవితా పితామహుడని పేరందెను. ప్రవరుడను నైష్ఠికబ్రాహ్మణుడు వరణానదీతీరసుడు, ఓషధీమహిమచే హిమవన్నగమున కెగిరిపోయి, అచట మంచునీటిచే పాదలేపము కరగిపోగా, ఆపర్వతముపై చిక్కుపడి అచట వరూధిని అను అచ్చరను గాంచి తన యింటికి త్రోవచెప్పుమని యడుగును. వరూధిని ప్రథమ దర్శనముననే ప్రవరుని వలచి ఆతనిచే నిరాకృత యగును.

ఈ కావ్యవస్తువు మార్కండేయ పురాణములోనిది.

### మొల్ల ఆతుకూరి

16-వ శతాబ్ది అంతమున ఈ కవయిత్రి జీవించియుండునని చరిత్రకారు లూహించుచున్నారు. ఈమె రచించిన సంగ్రహరామాయణం ప్రసిద్ధి నందినది. ఈమె కుమ్మరికొలము చానయట.

### రఘునాథనాయకుడు

1600 నుండి 1631 వరకు తంజావూరు నేలిన ప్రభువు. సంగీతసాహిత్యము లందు గొప్పవిద్వాంసుడు. విజయవిలాసాది గ్రంథములకు కృతిభర్త. కృతులు: రామాయణం, వాల్మీకిచరిత్రం గజేంద్రమోక్షాది యక్ష గానములు. ద్విపదకావ్యములు.

### రామకృష్ణుడు తెనాలి

రాయలకాలమున ఈతడు బాలుడైయున్నట్లు కన్పించును. గుంటూరు మండల మందలి తెనాలి యీతని నివాసము. ఈతడు మొదట శైవుడై రామలింగమను పేరబరగి ఉద్భటారాధ్యచరిత్రమును రచించెననియు, పిమ్మట వైష్ణవంస్వీకరించి పాండురంగమాహాత్మ్యమను ప్రౌఢప్రబంధము గావించెననియు ప్రతీతి. పండరీక్షేత్రమాహాత్మ్యమును వర్ణించే ఈ కావ్య కథ స్కాందపురాణం నుంచి గ్రహింపబడింది. ఈతడు ఘటికాచల మాహాత్మ్యమునుగూడ రచించెనందురు. ఈతడు వికటకవి యనియు ప్రసిద్ధికలదు.

### రామరాజభూషణుడు

కృష్ణరాయల అల్లుడగు రామరాయల సభకు భూషణ మగుటచే ఈతని కీ పేరు వచ్చినది. ఈతని మొదటినామము మూర్తికవి. రాయల సభలోని అష్టదిగ్గజములలో మూర్తి కవియు నున్నట్లు చెప్పుదురు. వసుచరిత్ర

మను ఈతని ప్రౌఢప్రబంధము శ్లేషల కాకరమై తరువాతి కవులకు ఒరవడి యయ్యెను. నరసభూపాలీయ మను అలంకారగ్రంథమును, హరిశ్చంద్రనలోపాఖ్యాన మను ద్వ్యర్థికావ్యము నీతని ఇతర కృతులు. శుక్తిమతి యను నదిని కోలాహలపర్వతమును నాయికానాయకులుగా అభివర్ణించిన ఈ ఘట్టము అద్భుత కల్పనలతో, అనుపమానముగా నడచినది.

## రుద్రయ కందుకూరి

ఈతడును రాయలయాస్థానమందున్నట్లు కొందరి అభిప్రాయం. కృతులు: నిరంకుశోపాఖ్యాన మనే కావ్యం. సుగ్రీవవిజయం అనే మొదటి యక్షగానం ఈ కవియే రచించెను. కందుకూరులోని జనార్దనస్వామిపై చెప్పిన శృంగారాష్టక మిది.

## వేంకటకవి చేమకూర

రఘునాథనాయకుని కంకితముగా విజయవిలాసమను రసవత్కావ్య మొనరించెను. ఈతని రెండవకృతి సారంగధరచరిత్ర. అర్జునుడు యతివేషమున ద్వారకలోనుండి సుభద్రను వివాహమాడినఘట్ట మిందు గైకొనబడినది.

## వేంకటపతి శేషము

18-వ శతాబ్ది ప్రథమపాదమున నున్న శృంగారకవి. ఈతని తారాశశాంకవిజయము ఆకాలమున వెలసిన శృంగార కావ్యములలో ప్రసిద్ధిగన్నది. బృహస్పతి తారాచంద్రుల నడవడిని శంకించి, తారను యథార్థము దెలుపుమని దండింపగా ఆమె ప్రత్యుత్తర మిచ్చినప్పటి జాణతన మీ పద్యముల కానవగును.

## శ్రీకృష్ణదేవరాయలు

16-వ శతాబ్ది ప్రథమపాదమున దక్షిణదేశము నేలిన సార్వభౌముడు. సకలకళాపోషకుడు. కవులెదురైనచో మదకరీంద్రమును దిగి కేలూతనొసగి యెక్కించుకొన్నవాడు. మనుచరిత్ర కృతిగైకొన్నపుడు పెద్దన నూరేగించుటకై పల్లకి దనకేలబట్టి యెత్తినవాడు. ఆము క్తమాల్యద యను పేర గోదాదేవి విష్ణుని పెండ్లియాడినకథను కావ్యమొనర్చెను. అలభ్యములగు ఇతరకృతులు: మదాలసచరిత్ర, సత్యావధూప్రీణనం, సకలకథాసారసంగ్రహం, రసమంజరి మున్నగునవి.

## సూరకవి అడిదము

విజయనగరసంస్థానమందున్న ప్రౌఢకవి. కృతులు: కవిసంశయవిచ్ఛేదము, చంద్రాలోకము అను ఛందోలంకార గ్రంథములు, ఆంధ్రనామ

శేషమను పద్యనిఘంటువు, కవిజనరంజనమను ప్రబంధము, రామలింగేశ శతకము. ఈతని చాటువులు ప్రసిద్ధములు. రామలింగేశశతకమున కవి అనాటి అవినీతిని హాస్యరసప్రధానముగ విమర్శించును.

### సూరన పింగళి

ఈతడును అష్టదిగ్గజములలోనివాడని ప్రతీతియున్నను రాయలకాలమున తరుణవయస్కుడైయుండినట్లు కన్పట్టును. రాఘవపాండవీయమను మొదటి ద్వ్యర్థికావ్యకర్త ఈతడే. ఈతని కళాపూర్ణోదయం అద్భుత కథాకల్పనావిలసితం. ప్రభావతీప్రద్యుమ్నమను కావ్యము శ్రవ్యరూపాన ఉన్న దృశ్యకావ్యము. గరుడపురాణమునుగూడ ఈతడు రచించెను. కృష్ణునికుమారుడు ప్రద్యుమ్నుడు, వజ్రనాభుడను రాక్షసరాజు కూతురు ప్రభావతిని పెండ్లియాడినకథ. శుచిముఖి అనే రాజహంసి పిలువని పేరంటముగా ప్రద్యుమ్నుని దర్శించి, ప్రభావతీ సౌందర్యము నాతనికి పలుగతులవర్ణించిచెప్పి వెడలిపోయినఘట్టమిది.

## తృతీయభాగము

### అనంతకృష్ణశర్మ రాళ్ళపల్లి (జననం 1893)

అనంతపురమండలం. సంగీతసాహిత్యనిష్ణాతులు. ప్రాకృతమునుండి గాథాసప్తశతి తెలిగించిరి. మొదట మైసూరు మహారాజ కళాశాల లోను, ఆ తర్వాత శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యభాషాలయంలోను అధ్యాపకులుగా, పరిశోధకులుగానుండిరి. మంచి విమర్శకులు. అన్నమాచార్య కీర్తనలు స్వరపరచి ప్రచురించిరి.

### అనసూయాదేవి దొప్పలపూడి (జననం 1917)

గుంటూరుమండలం. మాతృహృదయం ఈమె ప్రథమకావ్యం.

### అప్పారావు బసవరాజు (1894–1933)

కృష్ణామండలం. కొంతకాలం ఆంధ్ర పత్రికా కార్యాలయాన ఉప సంపాదకత్వం. పిమ్మట న్యాయవాదవృత్తి. కృతులు : గీతములు, వాయుసందేశం.

### ఆంజనేయులు కొండాలి (జననం 1897)

కృష్ణామండలం. సాహితిపత్రికాసంపాదకత్వం. రాజకీయములలో ప్రవేశం. పలుమార్లు కారాగృహావాసంచేసిన దేశభక్తుడు. కృతులు: కొన్నిగీతములు, కాంగ్రెసుచరిత్ర ఆంధ్రీకరణం.

**ఆరుద్ర (జననం 1922)**

విశాఖమండలవాసి. ఆంగ్లఆంధ్రభాషాప్రవిష్టులు. ప్రస్తుతము సినీమాలలో రచయితగా పనిచేస్తున్నారు. పెక్కుకథలు, గేయములు రచించిరి. సినీవాలీ, త్వమేవాహం మున్నగు కృతులు ప్రసిద్ధములు.

**ఉమామహేశం శిష్ట్లా (జననం 1898)**

గుంటూరుమండలవాసి. ఆంగ్లభాషాపట్టభద్రుడు. 'నవమి చిలుక' మొదలైన స్వచ్ఛంద రచనలను పెక్కింటి నొనర్చెను.

**కృష్ణమాచార్య దాశరథి (జననం 1927)**

నైజాంసంస్థానమందలి గూడూరు జన్మస్థానం. నైజాముపై తిరుగుబాటు ఉద్యమంలో 1947-48 లో కారాగృహవాసం. సంస్కృతాంధ్రాంగ్ల భాషాప్రవిష్టులు. ప్రస్తుతం హైదరాబాదు ఆలిండియారేడియో స్టేషనులో అసిస్టంటు ప్రొడ్యూసరు. కృతులు: అగ్నిధార, రుద్రవీణ, మహాంధ్రోదయం, మహాబోధి, పునర్నవం.

**కృష్ణమూర్తిశాస్త్రి శ్రీపాద (జననం 1866)**

కళాప్రపూర్ణులు, మహామహోపాధ్యాయులు, ఆంధ్రప్రభుత్వాస్థానకవులు నగు వీరు రాజమహేంద్రవర వాస్తవ్యులు. భారత, భాగవత, రామాయణముల నాంధ్రీకరించుటేకాక బొబ్బిలియుద్ధనాటకము మున్నగు రూపకములను, మధుకర విజయమను కల్పితకావ్యమును, పెక్కుస్థలమాహాత్మ్య కావ్యములును రచించిరి. వేణీసంహారము తెలిగించిరి. ఇంకను శంకర విజయము మున్నగు శతాధికకృతులు సల్పిరి. శతావధానులు. ఉభయ భాషా కవీశ్వరులు.

**కోదండరామశాస్త్రి ప్రయాగ (జననం 1921)**

గుంటూరుమండలవాసి. విద్వాన్, బి. ఏ. ఉపాధ్యాయవృత్తి. పెక్కు నాటికలు, గేయములు, ఖండకృతులు రచించిరి. అభ్యుదయ పత్రికకు కొంతకాలం సంపాదకులు.

**గణపతిశాస్త్రి పిలకా (జననం 1911)**

గోదావరీమండలం. సంస్కృతాంధ్రాంగ్లవిద్యాప్రవీణులు. అధ్యాపకత్వం, పత్రికలలో ఉపసంపాదకత్వం. కృతులు: విభ్రాంతామరుకం, ప్రమద్వర, మణిదీపిక, ఇతరగేయములు.

**చంద్రశేఖరం వేలూరి (జననం 1895)**

కృష్ణామండలం. సంస్కృతాంగ్లవిద్యలందు తేరి, శ్రీ అరవిందుల శుశ్రూషించి యోగవేదాంతముల నాకళించుకొనిరి. కాంచనమాల

యను నాటకము, సత్యకామజాబాలి మున్నగు కృతులురచించి, కవితా వ్యవసాయం చాలించి ఇపుడు ఆత్మవిచారమున మునిగియున్న అంతర్ముఖులు. శ్రీ అరవిందుల 'డివైన్ లైఫ్' ను 'దివ్యజీవన' మను పేర తెలుగున రచించిరి.

జనార్దనరావు కొంపెల్ల (1907 – 1937)

గోదావరీమండలవాసి. సంస్కృతాంగ్లములయందు ప్రవేశం. ఉదయనీ పత్రికాసంపాదకత్వం. రచనలు : గ్రంథరూపం తాల్చని లఘుకృతులు.

జాషువా గుర్రం (జననం 1895)

గుంటూరుమండలం. ఉభయభాషాప్రవీణులు. హైస్కూలులో ఆంధ్రోపాధ్యాయులుగా కొంతకాలం పనిచేసిరి. ఫిరదౌసి, గబ్బిలం, కాందిశీకుడు, స్వప్నకథ, నేతాజి మున్నగు కృతులు; అనేక చాటురచనలు సల్పిరి. ప్రస్తుతం మద్రాసు రేడియోస్టేషనులో స్పోకెన్‌వర్డు ప్రొడ్యూసరుగా ఉన్నారు.

తిరుపతి వేంకటేశ్వరులు :

తిరుపతిశాస్త్రి దివాకర్ల (1871 – 1919)

వేంకటశాస్త్రి చెళ్లపిళ్ల (1870 – 1950)

గోదావరీమండలం. తిరుపతివేంకటకవులనుపేర ప్రసిద్ధికెక్కిన వీరు సహాధ్యాయులు. అష్టావధాన శతావధానములు జంటగా నెరపి, సంస్కృతాంధ్రములందు శతాధికముగా కావ్యనాటకాదు లొనర్చిరి. రాజాస్థానముల నిరాఘాట సంచారంచేసి ఆంధ్రకవితకు నూతనోజ్జీవం కల్పించిన స్వతంత్రులు. దేవీభాగవత మాంధ్రీకరించిరి. శ్రవణానంద బుద్ధచరితాది కావ్యములు రచించిరి. మృచ్ఛకటి బాలరామాయణ ముద్రారాక్షసాది నాటకములు, హర్షచరిత్ర విక్రమాంకదేవచరిత్రాదులు తెలుగుచేసిరి. వీరి చాటువులు విశ్రుతి కెక్కినవి. వీరి విద్యాకుటుంబము గొప్పది.

దుర్గయ్య పల్లా (జననం 1915)

నైజాం సంస్థానమందలి మడికొండనివాసి. ఎమ్. ఏ. పట్టభద్రులు. కళాశాలలో అధ్యాపకవృత్తి. కృతులు : పాలవెల్లి, గంగిరెద్దు.

నరసింహశాస్త్రి నోరి (జననం 1900)

గుంటూరుమండలం. పండితవంశం. రేపల్లెలో వకీలువృత్తి. భాగవతావతరణం (పద్యం), సోమనాథవిజయనాటకం, నారాయణభట్టు, రుద్రమదేవి మున్నగు నవలలు రచించిరి. దేవీభాగవతం ఆంధ్రీకరించిరి.

నారాయణాచార్య పుట్టపర్తి (జననం 1915)

అనంతపురమండలవాసి. సంస్కృత వ్యాకరణాలంకారశాస్త్రాధ్యయనము చేసిన బహుభాషావేత్తలు. తిరువాన్కూరు, ఢిల్లీలలో ఉద్యోగాలు. తెనుగులో పెనుకొండలక్ష్మి, షాజీ, అగ్నివీణ, శివతాండవము; సంస్కృతములో శివసహస్రము; మలయాళంలో 'ఏకవీర' (పరివర్తనము); సంగీతం అనే 7000 కృతులు—వీరి రచనలలో కొన్ని.

నారాయణబాబు శ్రీరంగం (జననం 1906)

విజయనగరం. ఆంధ్రాంగ్లములందు, సంగీతమునందు ప్రవేశం. నాట్యకౌశలం. కృతులు: స్వచ్ఛందరచనలు, జానపదగేయములు.

నారాయణరెడ్డి సింగిరెడ్డి (జననం 1930)

నిజాముసంస్థానమందలి హనుమాజీపేట జన్మస్థలం. ఎమ్. ఏ. పట్టభద్రులు. కళాశాలలో అధ్యాపకత్వం. కృతులు: నాగార్జునసాగరం, స్వప్నభంగము, నవ్వనిపువ్వు, అజంతాసుందరి, విశ్వగీతి, నారాయణరెడ్డి గేయాలు.

పద్మరాజు పాలగుమ్మి (జననం 1915)

గోదావరీమండలం. సైన్సుపట్టభద్రత. కళాశాలలలో అధ్యాపకత్వం. ఇపుడు చలనచిత్రములకు మాటలు, పాటలు రచన. అంతర్జాతీయ పోటీలో ద్వితీయ బహుమానం పొంది ప్రసిద్ధిగన్న కథకుడు. రచనలు: గీతములు, నాటికలు, 'కూలిజనం', 'కథావాహిని'.

పాపయ్యశాస్త్రి జంధ్యాల (జననం 1913)

గుంటూరుమండలం. ఉభయభాషాప్రవీణులు. హిందీపండితులు. కళాశాలలో అధ్యాపకత్వం. కృతులు: కరుణశ్రీ, ఉదయశ్రీ, విజయశ్రీ మున్నగునవి.

పిచ్చయ్యశాస్త్రి దీపాల (జననం 1894)

గుంటూరుమండలవాసి. సంస్కృతాంధ్రపండితులు. భాషాపరిశోధకులు. అధ్యాపకవృత్తినుండి విరమించిరి. రచనలు: భక్తకల్పద్రుమశతకం, కాలము, భారతి, సువర్ణమేఖల, ప్రణయ కుసుమము, మేఘదూత అనువాదము, సాహిత్యసమీక్ష అనే విమర్శ గ్రంథము.

పురుషోత్తమశర్మ మంగిపూడి (1893–1946)

పశ్చిమగోదావరీమండలవాసి. బందరు జాతీయ కళాశాలలో, మదనపల్లి థియసాఫికల్ కాలేజీలో విద్యాభ్యాసం. గాంధి ధర్మాభిమానియగు దేశభక్తుడు. సత్యాగ్రహోద్యమముగ కారాగృహ ప్రవేశం. వీరి

రచనలు: 'భీష్ముని చరిత్ర', 'కోయిలపాటలు'. 'స్వేచ్ఛాగానము' కారాబద్ధుడైయున్నపుడు వ్రాసినది.

బంగారమ్మ చావలి (జననం 1897)

గోదావరీ మండలవాసిని. 'ఆకొండ' మొదలగు పెక్కు గేయములను రచించిరి.

బాపిరాజు అడివి (1895–1952)

గోదావరీమండలం. కవి, చిత్రకారుడు, కథకుడు, ఆఖ్యాయికాకర్త, వకీలు, అధ్యాపకుడు, పత్రికాసంపాదకుడు. వక్త. బహుముఖ ప్రజ్ఞాశాలియై హిమబిందు, నారాయణరావు, గోనగన్నారెడ్డి మున్నగు నవలలు, పెక్కు చిన్నకథలు రచించెను. తొలకరి, గోధూళి యను పేర పదకవితలను, శశికళ యనుపేర పద్యకృతులను ప్రకటించెను.

బాపిరాజు బొడ్డు (జననం 1912)

పశ్చిమగోదావరీమండలం. సంస్కృతాంధ్రముల ప్రావీణ్యం. వర్తకవృత్తి. కృతులు: 'విపంచి' (ఖండకావ్యములు) 'కలిక' (కథలు), 'కాత్యాయని' (బాలగేయములు).

బాలగంగాధర తిలక్ (జననం 1921)

గోదావరీమండలం. ఆంధ్రఆంగ్లభాషాప్రావీణ్యం. కృతులు: ఖండకృతులు, గేయములు.

బుచ్చిసుందరరామశాస్త్రి మాధవపెద్ది (1892–1950)

గుంటూరుమండలవాసి. సంస్కృతాంధ్ర పండితుడు. కొంతకాలం స్కూళ్లలో అధ్యాపకవృత్తి. కృతులు: బృందావనం, ఉమర్ ఖయ్యాం, పంచవటి, శబరి, మృత్యుంజయశతకం. వీరి చాటువులు హాస్యరసభరితములై ప్రసిద్ధిగాంచినవి. ఉమరుఖయ్యాం: రుబాయీలసారమును గ్రహించి తెలుగునక్రొత్త వెలయించిన పద్యములు.

భీమన్న బోయి (జననం 1918)

గోదావరీమండలవాసి. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ ప్రభుత్వములో తెలుగు ట్రాన్సులేటరు ఉద్యోగం. దీపసభ మున్నగునవి వీరి కృతులు. 'కొబ్బరి తుంట' దీపసభనుండి కైకొనబడినది. హరిజనవాడలందలి దైన్యము, కశ్మలము, దుర్గంధము కాల్చివేయదగినవని కొబ్బరితుంట ముఖమున కవి పలికించుచున్నాడు.

రాఘవాచార్య శంఖవరం (సంపత్)

అనంతపురమండలవాసి. ఎమ్. ఏ., బి. యిడి. ప్రభుత్వ కళాశాలలో అధ్యాపకవృత్తి. కృతులు: వాల్మీకి, పెక్కుగేయములు, ఖండకావ్యములు. మేఘదూత ఆంధ్రీకరించిరి.

రాజశేఖర శతావధాని దుర్భాక (1888–1957)

కడపమండలం. వీరమతీ చరిత్ర, చండన్నృపాల చరిత్ర, ప్రతాపసింహ చరిత్ర మొదలగు పద్యకావ్యములు; సీతాకళ్యాణ సీతాపహరణ పద్మావతీ విజయాది నాటకములు రచించిరి. ప్రభుత్వోద్యోగమును 1920 లో వదలివేసిన దేశభక్తులు. శతావధానులు. ప్రతాపసింహుని కుమారుల మధ్య యుద్ధమాపగోరి హరభట్టు మరణించిన ఘట్టమిందు కైకొనబడినది.

రామకృష్ణరావు అబ్బూరి (జననం 1896)

గుంటూరుమండలం. ఆంధ్ర విశ్వవిద్యాలయమున అధ్యాపకత్వము, లైబ్రేరియన్. కృతులు: మల్లికాంబ, నెలయేటిగానము మున్నగునవి.

రామస్వామి త్రిపురనేని (జననం 1890)

కృష్ణామండలవాసి. బారిస్టరు, తెనాలి మునిసిపాలిటి కధ్యక్షులు. పూర్వాచారములను, పురాణేతిహాసాలను తీవ్రవిమర్శకు గురిచేసిన స్వతంత్రుడు. శతావధాని. కృతులు: కురుక్షేత్ర సంగ్రామము, గోపీచందు మున్నగు నాటకములు; సూతపురాణము, బ్రహ్మగీత మున్నగు కావ్యములు.

రామిరెడ్డి దువ్వూరి (1895–1917)

నెల్లూరిమండలం. పానశాల, కృషీవలుడు, వనకుమారి, నలజారమ్మ, అగ్నిప్రవేశం మున్నగు కావ్యములు; సీతావనవాసము, కుంభరాణా, మున్నగు నాటకములు రచించెను. పారసీకము నభ్యసించి సాదీకవి గులిస్థాన్ తెలిగించెను.

లక్ష్మీకాంతం పింగళి (జననం 1894)

వేంకటేశ్వరరావు కాటూరి (జననం 1895)

మొదటివారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రాచ్యశాఖాధ్యక్షులుగా నుండి విశ్రాంతిగైకొని ఇపుడు విజయవాడ రేడియోస్టేషనులో స్పోకెను వర్డు ప్రొడ్యూసరుగా నున్నారు. రెండవవారు బందరు ఆంధ్రజాతీయ కళాశాలాధ్యక్షులుగా, కృష్ణాపత్రికా సంపాదకులుగా కొంతకాలం పనిచేసిరి. తొలకరి, సౌందరనందం వీరి ఉభయులకృతులు. ఇరువురు కృష్ణామండలవాసులు, సహాధ్యాయులు.

లక్ష్మీనరసింహారావు పానుగంటి (1865 – 1940)

పిఠాపురాస్థానకవులు. పెక్కుసంస్థానములలో దివానుగా నుండిరి. నర్మదాపురుకుత్సీయము, పాదుకాపట్టాభిషేకము, ప్రచండ చాణక్యము, బుద్ధబోధసుధ, విజయరాఘవము మున్నగు అనేక స్వతంత్ర

రూపకములు రచించిరి. కంఠాభరణమాదిగాగల్గు హాస్యరస ప్రధాన నాటకములును గచించిరి. స్ప్రెక్టేటరు వరవడిగా సాక్షియనుపేర నూర్ల కొలది వ్యాసములు రచించి పేరందిరి.

## వరదాచార్య వానమామలై (జననం 1913)

నిజాం సంస్థానమందలి మడికొండ జన్మస్థలం. సంస్కృతాంధ్ర పండితులు. అధ్యాపకవృత్తి. కృతులు: మణిమాల, పోతన.

## విద్వాన్ విశ్వం (జననం 1915)

అనంతపురమండలవాసి. సంస్కృతాంధ్రఆంగ్లభాషాప్రవిష్టులు. కారావాసంచేసిన దేశభక్తుడు. పత్రికాసంపాదకవృత్తి. కృతులు: మేఘదూత ఆంధ్రీకరణం. పెన్నేటిపాట, దశకుమారచరిత్ర, కాదంబరి ఆంధ్రీకరించిరి. 'ప్రేమించాను' అనే నవల మున్నగునవి. 'రంగడు గంగమ్మ' పెన్నేటి పాటకావ్యమున నాయకనాయికలు. జనపదవాసం చేస్తూ, నిప్పుచ్చర మనుభవించే పామరుల జీవన నైర్మల్యం తెలిపే కావ్యమిది.

## విశ్వేశ్వరరావు మల్లవరపు (జననం 1906)

గోదావరీమండలం. శాంతినికేతనమందు విద్యాభ్యాసం. కొంతకాలం ఆంగ్లఆంధ్రపత్రికాలయములందు ఉపసంపాదక వృత్తి. కృతులు: గేయములు, కల్యాణకింకిణి. టాగోరు కృతుల కనువాదములు.

## వెంకటచలం గుడిపాటి (జననం 1894)

గుంటూరుమండలవాసి. విద్యాశాఖలో పనిచేసిరి. తారాశశాంకము, సారంగధర, హరిశ్చంద్ర మున్నగు వచననాటకములు; పెక్కు చిన్న కథలు; దైవమిచ్చిన భార్య, మైదానము మున్నగు నవలలు వీరి కృతులు. సంఘసంస్కరణాభిమాని, స్త్రీ స్వాతంత్ర్యాభిలాషి. ప్రకృతము రమణాశ్రమమున పరచింతాపరాయణులైయున్నారు. 'విన్నపాలు' భగవాన్ రమణమహర్షిని సంబోధిస్తూ చేసిన భక్తిరచనలు.

## వెంకటరత్నం కొనకళ్ల (జననం 1909)

ఏలూరు. ఆంగ్లవిద్యాభ్యాసం. ప్రభుత్వపు ఉద్యోగం. జానపద జీవన మాధుర్యం వెల్లివిరిసే పెక్కు గేయములు రచించిరి.

## వెంకట సుబ్బారావు నండూరి (1895 — 1957)

కృష్ణామండలం. కొంతకాలం ఉపాధ్యాయవృత్తి, పిమ్మట ప్లీడరువృత్తి. కృతులు: యెంకిపాటలు. పామరజీవన మాధుర్య మీపాటలయందు మనోహరంగా వర్ణితమైనది.

## వెంకటేశ్వరరావు నార్ల

కృష్ణామండలం. బి. ఎ. పట్టమునుపొంది పత్రికాసంపాదకవృత్తి నాశ్రయించి, 'ఆంధ్రప్రభ' దినపత్రికకు సంపాదకులుగా నున్నారు. సాహిత్యాభిమాని, విమర్శకుడు. 'కొత్తగడ్డ' అనే నాటకముల సంపుటి ప్రచురించిరి. జగన్నాటకం, నార్లవారిమాట—వీరి ఇతర రచనలు.

## వేంకట అప్పారావు గురుజాడ (1865–1915)

విజయనగరవాసులు. ఆంగ్లభాషాపట్టభద్రులై విజయనగర సంస్థానోద్యోగిగా నుండిరి. సంఘసంస్కరణాభిలాషులు. వ్యావహారికభాష నాశ్రయించి 'కన్యాశుల్కం' మను స్వతంత్రనాటకం రచించి వన్నెకెక్కిరి. కొండుభట్టీయము, బిల్హణీయము అనునవి వీరి ఇతరనాటక రచనలు. తెలుగున 'చిన్నకథ' లను ప్రథమంగా వీరే రచించారు. 'ముత్యాల సరాలు' అనే క్రొత్త మాత్రాచ్ఛందమున కొన్ని రచనలుచేసి తరువాతి కవులకు మార్గదర్శకులైరి.

## వేంకట కృష్ణశాస్త్రి దేవులపల్లి (జననం 1897)

పిఠాపురం. తండ్రియు పెదతండ్రియు పిఠాపురాస్థానకవులు. సంఘసంస్కార హరిజనోద్ధరణములం దభినివేశం. కృష్ణపక్షం, ఊర్వశి, ప్రవాసం వీరికృతులు. గేయకవిత వీరిసొత్తు. వీరి రేడియోనాటికలు ప్రసిద్ధములు. మంచివక్త. ప్రస్తుతం హైదరాబాదు రేడియోస్టేషనులో స్పోకెన్ వర్డ్ ప్రొడ్యూసరు.

## వేంకటపార్వతీశ్వరులు

### వేంకటరావు బాలాంత్రపు (జననం 1880)

### పార్వతీశం ఓలేటి (1882–1955)

వీరుభయులు పిఠాపురప్రాంతీయులు. జంటకవులు. 'కవిరాజహంస' లని పేరుగాంచిరి. కావ్యకుసుమావళి, బృందావనం, ఏకాంతసేవ మున్నగు పద్యకృతులు రచించుటేకాక పెక్కు నవలలు బెంగాలినుండి తెలిగించిరి. రామాయణ మాంధ్రీకరించుచున్నారు.

## వేంకటనరసయ్య ఏటుకూరి (1899–1950)

గుంటూరుమండలవాసి. ఉభయభాషాప్రవీణులు. అధ్యాపకవృత్తి. పల్నాటివీరగాథలను అనేక పద్యకృతులుగా రచించిరి. కర్షకవృత్తి యందలి స్వేచ్ఛను, మాధుర్యమును, సారళ్యమును వర్ణించు 'క్షేత్రలక్ష్మి' యను గ్రంథమునుండి కైకొన్న పద్యములివి.

వేంకటరామకృష్ణకవులు

వేంకటరామశాస్త్రి ఓలేటి (1883–1939)

రామకృష్ణశాస్త్రి వేదుల (1889–1918)

ఈ జంటకవులు శతావధానులు. పిఠాపురాస్థాన కవీశ్వరులు. వ్యాసాభ్యుదయం, దమయంతీకల్యాణం, విశ్వగుణాదర్శం, మదాలస మున్నగునవి వీరి కృతులు. 'కవిత' అను పత్రికకు సంపాదకులు. పాణిగృహీతి యనగా వివాహితయైన స్త్రీ. అట్టి యిల్లాలి సౌభాగ్యము వివిధావస్థలలో నిందు వర్ణితము.

వేంకటరామయ్య జనమంచి (1872–1933)

రాజమహేంద్రవరం హైస్కూలులో అధ్యాపకులు. మాలతీ మాధవ విద్ధసాల భంజికలను తెలుగు చేసిరి. వీరి ఖండకావ్యములన్నియు 'నవకుసుమాంజలి' యను పేర ప్రకటితములు.

వేంకటరావు కవికొండల (జననం 1892)

రాజమహేంద్రవరమున లాయరువృత్తి. నూర్లకొలది చిన్నకథలు, వేలకొలది జానపదగీతములును రచించెను.

వేంకటశేషశాస్త్రి గడియారం (జననము 1897)

కడపమండలం. ప్రొద్దుటూరు మునిసిపల్ హైస్కూలు పండితులు. అవధాని. రాజశేఖరకవితో జతగూడి కొన్ని కావ్యనాటకాలు రచించి పిమ్మట శివాజీచరిత్రను శివభారతమను పేర కావ్యమొనర్చి వన్నెకెక్కిరి. రామదాసస్వామి శివాజికి చేసిన బోధయే దాసబోధ.

వేంకట సుబ్బారావు రాయప్రోలు (జననం 1892)

గుంటూరుమండలం. ఉస్మానియా యూనివర్సిటీయందు ఆంధ్రసాహిత్యాచార్యులుగా చిరకాలం పనిచేసి, ఇపుడు శ్రీ తిరుపతి వేంకటేశ్వర యూనివర్సిటీలో ఆచార్యత్వము వహించియున్నారు. శాంతినికేతనమున రవీంద్ర కవిసన్నిధిని కొంతకాలముండిరి. తృణకంకణం, కష్టకమల, స్వప్నకుమారం, జడకుచ్చులు, తెనుగుతోట అనుకావ్యాలు; గేయములు; రూపనవనీతమనే నాటకం వీరిరచనలు. కామగంధంలేని శృంగారాన్ని ప్రతిపాదింతురు.

శరభయ్య మల్లంపల్లి (జననం 1928)

కృష్ణామండలం. వీరిది పండితవంశం. సంస్కృతాంధ్ర పండితులు. కొంతకాలం అధ్యాపకవృత్తి. ఇపుడు చెన్నపురి ప్రాచ్యలిఖిత గ్రంథ

భాండాగారంలో పండితులుగా ఉండిరి. మాళవికాగ్నిమిత్రమును ఆంధ్రీకరించిరి. మరికొన్ని ఖండకావ్యములు రచించిరి.

శరభాచార్య పులవర్తి (జననం 1911)

గుంటూరుమండలవాసి. ప్రభుత్వ విద్యాశాఖయం దుద్యోగి. అష్టావధాని. చిత్రలేఖన, స్వర్ణశిల్పాదులందు ప్రవీణులు. కృతులు: కర్మభూమి, కల్హారమాల, రత్నగర్భ, క్రీస్తుశతకము; సుతిమాలా యశోధరాది సంస్కృతకావ్యములు; కావ్యగీత్ అను హిందీ కావ్యము; 'The Petals of Muse' అను ఆంగ్లకృతి రచించిరి.

శివరామశాస్త్రి వేలూరి (జననం 1892)

కృష్ణామండలం. వ్యాకరణ న్యాయ వేదాంత శాస్త్రములు అవగాహించిన పండితకవి. శతావధాని. బహుభాషావేత్త. వీరు రచించిన పెక్కు కావ్యములు, నాటకములు అగ్నికాహుతియై నామావశిష్టములైనవి. కథారచనమున సిద్ధహస్తులు. శరశ్చంద్రుని నవలలు, గాంధిజీ 'ఆత్మకథ' ను తెలిగించిరి. 'కథలు గాథలు' 'ఏకావళి' వీరి పద్య కృతులు. వీరు శతావధానులు.

శివశంకరశాస్త్రి తల్లావఝ్ఝల (జననం 1892)

గుంటూరుమండలం. సాహితీసమితి స్థాపకులు. బహుభాషాకోవిదులు. హృదయేశ్వరి, వకుళమాల, ఆవేదన మున్నగు పెక్కు కావ్యములును, పద్మావతీచరణచారణ చక్రవర్తి, కవిప్రియ, యక్షరాత్రి మున్నగు పెక్కు గీతికానాటికలు రచించిరి. వీరి గ్రంథములు 2 సంపుటములుగా షష్ట్యబ్దపూర్తివేళ ముద్రితమైనవి. సత్యాగ్రహ సమరవేళ 1931 లో కారావాసమొనర్చిన దేశభక్తుడు.

శ్రీనివాసరావు శ్రీరంగం. (శ్రీశ్రీ) (జననం 1910)

విజయనగరం. ఆంగ్లవిద్యాపట్టభద్రత. పత్రికలలో ఉపసంపాదకత్వం కొన్నాళ్ళు. చలనచిత్రములకు మాటలు పాటలు రచించుట. మహాప్రస్థానం మున్నగునవి కృతులు. ఆంధ్రసాహిత్యమున నవీన మార్గము త్రొక్కిన స్వతంత్రులు.

శ్రీరామశర్మ ఆకిలి (జననం 1905)

నెల్లూరుమండలం. సంస్కృతాంధ్రహిందీపండితులు. విద్యారత్న బిరుదాభిరాములు. వైద్యవృత్తి, అధ్యాపకత్వము. ముద్రితకృతులు: శర్వరి, విజయఘోషణ. కుందమాల నాటకము తెలిగించిరి. ఓమరుఖయ్యాము రుబాయీలను 'సురాలయ' అను పేర సంస్కృతీకరించిరి. లలితార్చనాది సంస్కృతకృతులు రచించిరి.

**శ్రీరాములు దాసు (1846 – 1908)**

కృష్ణామండలం. తొలుత ఉపాధ్యాయవృత్తి. పిమ్మట ఏలూరులో వకీలు వృత్తి. దేవీభాగవతాంధ్రీకర్తలు. సంగీత నాట్యాభినయముల ప్రవేశముండి పెక్కు కృతులు, జావళీలు రచించిరి. జానకీపరిణయ శాకుంతలాది నాటకముల వెలిగించిరి. తెలుగునాడు అను పేర ఆంధ్రబ్రాహ్మణుల ఆచార వ్యవహారములను, వేషభాషలను వర్ణించు వీధి రచించిరి.

**సత్యనారాయణ విశ్వనాథ (జననం 1895)**

కృష్ణామండలం. సంస్కృతాంధ్రాంగ్లభాషానిష్ణాతులై ప్రస్తుతం విజయవాడ కళాశాలలో ప్రాచ్యభాషాశాఖాధ్యక్షులుగా నున్నారు. అమృతశర్మిష్ఠం, దేవీత్రిశతి మున్నగు గీర్వాణకృతులు రచియించిరి. ఆంధ్రప్రశస్తి, శృంగారవీధి, వరలక్ష్మీత్రిశతి, ఋతుసంహారం, మున్నగు అనేకపద్యకృతులు, కిన్నెరసానిపాటలు మున్నగు గేయములు రచించిరి. రామాయణకల్పవృక్షమను పేర రామాయణం రచిస్తున్నారు. వేయిపడగలు, ఏకవీర, చెలియలికట్ట, ధర్మచక్రము మున్నగు పెక్కు నవలలు, పెక్కు చిన్నకథలు రచించిరి. వేనరాజు, త్రిశూలం, నర్తనశాల మున్నగు నాటకములు రచించిరి. శతకము, ఉదాహరణ కావ్యము, ఏకాంకికలు మున్నగు శతాధికకృతులు రచించిన సర్వపథీనులు. ఆంధ్రప్రదేశ సాహిత్య అకాడెమీ ఉపాధ్యక్షులు.

**సత్యనారాయణ రాజశేఖరం శిష్ట్లా**

గుంటూరుమండలం. ఆంగ్లేయాంధ్రభాషలలో ప్రవేశం. అణ్ణామలై విశ్వవిద్యాలయంలో సంగీతభూషణ పట్టమునందుకొన్న గాయకులు. గాంధిధర్మాభిమాని. బేసిక్ట్రెయినింగుస్కూలులో కొంతకాల మధ్యాపకవృత్తి. ప్రధానంగా గేయరచనం చేయుదురు.

**సత్యనారాయణరాజు పెనుమెచ్చ (జననం 1899)**

గోదావరీమండలవాసి. సంస్కృతాంధ్రపండితులు. అధ్యాపకవృత్తి. జయపుర సంస్థానకవి. పెక్కు కావ్యములు, వ్యాకరణాది విమర్శలు రచించిరి. వీరికావ్యము లన్నియు 'తెలుగురాజు కృతులు' అను సంపుటమున ప్రచురింపబడినవి.

**సత్యనారాయణశాస్త్రి మధునాపంతుల (జననం 1914)**

తూర్పు గోదావరీమండలం. సంస్కృతాంధ్రసాహిత్యనిష్ణాతులు. సూర్యరాయాంధ్ర నిఘంటు కార్యాలయమున కొంతకాలం పనిచేసిరి. ఇపుడు రాజమహేంద్రవరంలో హైస్కూలు నం దధ్యాపకులు. ఆంధ్రుల చరిత్రను పద్యకావ్యమొనర్చిరి.

సత్యనారాయణశాస్త్రి వేదుల (జననం 1900)

గోదావరీమండలం. సంస్కృతాంధ్ర నిష్ణాతులై హైస్కూలు పండితులుగా నుండి, ఇపుడు కావలి కళాశాలలోనున్నారు. శతావధాని. దీపావళి వీరి ప్రధానకృతి. కొన్ని నాటకములు, కథలు రచించిరి.

సీతారామమూర్తిచౌదరి తుమ్మల (జననం 1901)

గుంటూరుమండలం. ఉభయభాషాప్రవీణులు. హైస్కూలు పండితులుగా నుండి నేడు విశ్రాంతి నందిరి. ధర్మజ్యోతి, రాష్ట్రగానము, పరిగపంట, శబల మున్నగు కావ్యములు రచించిరి. గాంధిజీ ఆత్మకథ పద్యకృతిగా నొనర్చిరి.

సుబ్బరామశాస్త్రి పైడిపాటి (జననం 1918)

కృష్ణామండలవాసి. విద్వాన్ పట్టభద్రులు. ఉషానాటకము, జాతీయ భారతి, తూణీరము మున్నగు పెక్కు కావ్యములు, గేయములు రచించిరి.

సుబ్బరాయశాస్త్రి దేవులపల్లి (1854–1909)

పిఠాపురాస్థానకవులు. శతావధానులు. మహేంద్రవిజయం, రామరాయ విలాసము మున్నగు ఆంధ్ర కావ్యములు; రావువంశ ముక్తావళి, రామపంచాశత్తు అను సంస్కృత కృతులు రచించిరి.

సుబ్బరాయుడు వడ్డాది (1854–1938)

గోదావరీమండలం. కాలేజీలో చిరకాలము ఆంధ్రభాషాధ్యాపకులు. ప్రబోధ చంద్రోదయ వేణీసంహార శాకుంతల మల్లికామారుత విక్రమోర్వశీయాది నాటకములు తెనిగించిరి. భక్తచింతామణి నూక్తివసుప్రకాశిక మున్నగు కృతులు రచించిరి. వీరి చాటువులెల్ల వసురాయ చాటూక్తి ముక్తావళి యనుపేర ప్రకటితములు.

సుబ్బారావు అనిసెట్టి (జననం 1921)

గుంటూరుమండలవాసి. బి. ఎ. పెక్కు ఖండకావ్యములు, గేయములు రచించిరి. ప్రకృతము సినీమాలో రచయితలుగా ఉంటున్నారు.

సుబ్బారావు నాయని (జననం 1899)

గుంటూరుమండలం. హైస్కూలు ప్రధానోపాధ్యాయత్వము. కృతులు: సౌభద్రుని ప్రణయయాత్ర, మాతృగీతములు.

హనుమచ్ఛాస్త్రి ఇంద్రకంటి (జననం 1911)

గోదావరీమండలం. ఉభయభాషాప్రవీణులు. హైస్కూలులో అధ్యాపకత్వం. కృతులు: దక్షారామం, స్వప్నవాసవదత్త, ప్రతిమా నాటకాంధ్రీకరణం. విజయదశమి (కథలు), తెలుగువీణ (గీతములు), వ్యాసావళి (సమీక్షలు).

# కావ్యసూచిక

# కవి నామసూచిక